# జీవనస్రవంతి

పద్యకావ్యము





రచయిత:

చీరాల శ్రీరామశర్మ M.A.,

# జీవనస్రవంతి

పద్యకావ్యము





ఆధ్యాత్మిక, సాంప్రదాయ, సాంఘిక,
శ్రీ వేంకటేశ్వర వైభవ సహితము

రచయిత :

చీరాల శ్రీరామశర్మ M.A.,

ప్రథమ ముద్రణ : 1998 అక్టోబరు
ప్రతులు : 500

మూల్యం : రు. **40/-**

ప్రతులకు :
హరిత నివాస్
23-22-7
హనుమాన్ వీధి
సత్యనారాయణపురం
విజయవాడ-520 011
ఫోన్ 531574

ముద్రణ :
శ్రీ గాయత్రీ ప్రెస్,
సత్యనారాయణపురం
విజయవాడ-11
ఫోన్ : 533064

## కృతి భర్త



కం॥ శ్రీ వైకుంఠ విరక్తుఁడు,<br>
శ్రీ వత్సాంకితుఁడు, శ్రీ పరిచ్యుతుఁడుండౌ<br>
శ్రీ వెంకటాచలపతీ,<br>
శ్రీవాసా, శ్రీనివాస, శేషగిరీశా

# విషయసూచిక

# తామ్ర శాసనం

శ్రీమద్ధాతపురాబ్జా। శాలివాహ శకాబ్దికీ, విజయ
వచ్చరే చైవ। మాఖశుద్ధ తృతీయ్యకే। రుధిరా
త్స్వర్ణ వంశేషు ప్రభవే లింగరాజచ। దత్తత
ద్రంగ్గు బూదాశ్యాం। లిఖ్యం వైభాగ శాసనం॥
భాగత్రయం చ్చగణకైః। స్వర్ణ క్షీరాలయుగ్మచ,
తస్యస్వర్ణచ భోక్తవ్యం। ద్విభాగే మ్లాంచ్ఛసర్వదా।
ఏవం నగరపాగ్భాగైః। యురరాన్విత శ్రీయుతైః।
క్షీరాతైక భాగేషు గణకానాం త్వైభోక్తవే॥
స్వాత్త్వం స్వర్ణస్తితంచైవా। ఖండానాం రత్న
సంఖ్యయేత్। యిదం ప్రకార భోక్తవ్యం భాగా
కాంచ్చ త్రయం చ్చవేత్। ఏతత్క్రమంపుత్రపౌత్రైః।
పారంపర్యం త్తరాయుచ। సుఖాశ్రితాన్వితాయాశ్చ
సర్వదానుభవం భవతి॥ ఏవం విభాగ సాక్షిణం
శాసనం దైవరాయుచ। శ్రీమత్స్వర్ణ పురాధీశం
వల్లభాం ప్రియుగంతథా। శ్రీవల్లభస్వామి సేవగతి॥

శ్రీ॥. రంగరాజ బూదరాజ వ్రాలు శ్రీశ్రీ శుభం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు
౧౩౮౬ అగునేటి విజయనామ సంవరచ్ఛర మాఘ
శు౩లు స్వన్నీ లింగ్గరాజుకు ఆ రంగ్గరాజు బూద
రాజు వ్రాయించ్చి యిచ్చిన విభాగ ప్రశాసనం.

మనమిరాశి గ్రామందులు స్వన్నీక్షీరాల రెండున్ను
స్వన్నీమిరాశి రెండుభాగాలున్ను యిండ్లుకుతూర్పు
దిశనున్న పొలం సహగాను క్షీరాలవక భాగం
వెరశి భాగాలు౩కి స్వన్నీమిరాశి భాగాలు రెండున్ను
మేము యిద్దరమున్ను అనుభవించేటట్టున్ను
క్షీరాలమిరాశి వకభాగం నీవు అనుభవించేటట్టున్ను
స్వన్నీలోవున్న స్వాస్త్యం కుచ్చళ్లు తొమ్మిదిన్ని
యీ ప్రకారమే మూడు భాగాలు వెంబ్బడి వకభాగం
నీవు అనుభవించేటట్టు నిష్కర్ష చేసుకుంట్టిమి.

గన్క యీ ప్రకారం పుత్రపౌత్ర పారంపర్యంత్తరం సుఖ
వైభవాలతోను యెల్లప్పుడు నీవు అక్కడ మేము
యిద్దరం యిక్కడ అనుభవించ్చనౌను।
యీ విభాగపు శాసనకుసాక్షి దైవరాయుడైనటు
వంట్టి స్వన్నీ వల్లభస్వామి పాదారవింద్దములూ॥.

రంగరాజు వ్రాలు బూదరాజు వ్రాలు శ్రీశ్రీ జెయనూ!

దమ్మాలపాటి రామారావు
Ex. M.L.A.

శివాలయం వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ-520 011

ఈ రచయిత నవరసభరితుఁడు. ఇష్టదేవతా అర్చకుడు. శ్రీ వేంకటేశ్వర భక్తుఁడు. భక్తి పారవశ్యమున దైవములో లీనమై తానే దైవముగా, తానే వెంకటేశ్వరునిగా, తానే పద్మావతి, నాంచారమ్మలుగా, ద్వైతమున, అద్వైతము, అద్వైతమున ద్వైతము బహు రూపముల సంసార సారము, మహాయజ్ఞము, త్యాగము, సృష్టికళా నిర్మాణము ప్రతిభలను అనుభవించి తన వ్యక్తిగత జీవితముతో సమన్వయపరచి జీవితమును, కథారూపమున జీవన యాత్రను రైలు పట్టాలుగా నిర్మించి స్వీయ చరిత్రను రైలుగా, ఆ పట్టాలపై నడిపించి, సరళభాషా ప్రయుక్తలో, పద్యశైలిలో, ఛందోబద్ధమైన లయ విన్యాసములతో, ఇష్టదేవతా ప్రార్థనతో, కృతిపతిగా, కృతికర్తగా, విద్యాభ్యాస పోషణ బాధ్యతను దత్త స్థానమున, వివరించి, ఉద్యోగ అవశ్యకతను సంసారముతో జోడించి అంగీరసనామ సంవత్సరమును, ప్రగతి లక్ష్యముగా, శ్రీ వేంకటేశ్వరుని సారధిగా, భక్తినూపిరిగా, శార్దూల, ఉత్పలమాల, మత్తేభ చంపకములును, పద్యములను రథచక్రములుగా, హృద్యముగా నడిపించి రచించిన శ్రీ శర్మగారి కవితా స్రవంతి శ్లాఘనీయము.



—వడ్లా సుబ్రహ్మణ్యం
లెక్చరర్
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
భావఫాల్గుణ
బహుళ—౨లు.

# శ్రీశ దర్శనం

జనన మరణ చక్రబంధం నుంచి ముక్తి పొందాలని జీవుని వేదన. జీవాత్మ పరమాత్మతో మమేకం కావడానికి పడే ఆరాటం, చేసే పోరాటంలో డస్సిపోయిన జీవుడు 'నీవే తప్ప నితః బెరుగ'నని నివేదించుకుంటాడు. ఆర్తితో మొర ఆలించమంటాడు; అనుగ్రహించుమని కోరుకుంటాడు. సుదర్శన చక్రధారి అయిన శ్రీశ దర్శనంకోసం పరితపిస్తాడు. ఇదిగో అచ్చు అలాంటి సన్నివేశమే, అటువంటి ఘట్టమే మన కళ్ళముందు కదలాడుతుంది- ఈ 'జీవన స్రవంతి'లో. అది శ్రీ చీరాల శ్రీరామశర్మగారి జీవితకథా స్రవంతి. స్రవంతి ఎప్పుడూ కుదురుగా నిశ్చలంగా సాగదు. సహజ స్రవంతికే తప్పలేదు ఆటుపోట్లు, దుందుడుకు దూకుళ్ళు, ప్రతిఘటనలు, ఒదిగి ఒదిగి వైదొలగడం, నిశ్చలంగా నిండుగా దరులు ఒరసికొని ప్రవహించడం, బహుముఖంగా సాగి సాగి సాగర గర్భంలో కలిసిపోవడం. ఇవిగో ఇవన్నీ మనం శ్రీ శ్రీరామశర్మగారి జీవన స్రవంతిలో దర్శించవచ్చు.

శ్రీ శర్మగారి కవితా స్రవంతి భక్తకవి, సహజకవి పాండిత్యుడైన పోతన్న కవితను పదేపదే స్ఫురణకు తెస్తుంది. పద్యం హృద్యంగా నడిచింది. సహృదయ హృదయంగమంగా అలవోకగా హత్తుకుపోతుంది. రచన సంస్కృత సమాస భూయిష్ఠమా? అంటే ఔను- కాదు అనడానికి వీలుగా ఉంది. జటిల సంస్కృతంకాదు; సరళ సంస్కృతం చెవిని సోకుతుంది. శ్రవణ శుభగత్వం సొంతం చేసుకుంది. 'అమ్మలగన్నయమ్మ', 'కవిత్వ సంపదన్' వంటి ప్రయోగాలు తటాలున పోతన్నను తలపుకు తెస్తాయి. 'ఛాందస భాష గ్రాంథికము సంస్కృత తత్సమ తద్భవంబు.... అందున వ్రాసెదన్ తెలుగునర్థము నింపొదవంగ కావ్యమున్' (37) అని సవినయంగా చాటిచెప్పుకున్నారు శ్రీ శర్మగారు.

'కలౌ వేంకటనాథాయ'. కలిలో శ్రీ వేంకటేశ్వరుడే అధీశ్వరుడు. జగన్మనోమోహనంగా వెలుగొందే జగత్ప్రభువు. నిండైన భక్తితో, మెండైన ప్రపత్తితో తన 'జీవన స్రవంతి' కావ్య కన్యను శ్రీ వేంకటేశ్వరునికి సమర్పణ చేసి, సమధికంగా సమర్చన చేశారు శ్రీ శర్మగారు. కృతి సమర్పణ చేసి కోరుకున్నది భోగభాగ్యాలా? భవభోగ బంధాలా! కాదు కాదు, 'దైవంబందు నైష్కర్మ్యంబు'. పుణ్య పురుషులు అంతకంటె కోరుకునేది మరేముంటుంది! అవును!

కావూరి పూర్ణచంద్రరావు MABOC
అష్టావధాని, Retired Lecturer
ఆంధ్రా లయోలా కళాశాల

డోర్ నెం. 18-4-51,
2వ లైన్,
కేదారేశ్వరపేట,
విజయవాడ - 3.

# జీవన స్రవంతి - ఒక అభిప్రాయము

## రచన - శ్రీ చీరాల శ్రీరామశర్మగారు

సృష్టిలో నొక విచిత్రమున్నది- అది సహజమే అయినను దానిని గురించి పట్టించుకోనివారికది- అది యట్టిదని తెలియదు వివరంగాఁ జెప్పినచో ఆశ్చర్యము కలుగును. ఒక రసాల వృక్షమున్నది. ఆ వృక్ష లక్షణము లన్నియు అ బీజమునందే అంతర్గర్భితమై యున్నవి. అది మొక్కయై, వృక్ష మగుచున్న స్థితిలో దాని సహజ స్వభావము వ్యక్తమగుచుండును. అట్లే వేప చెట్టునకు దాని విత్తనమునకు చేదు స్వభావము ఆ స్వభావమును మించి మరియొక భావము దానికుండదు. ఇట్టి స్వభావములు వృక్షములకేగాక సకల జీవరాసులకు ప్రసిద్ధమై యున్నవి. అందుచేతనే "స్వభావో దురతి క్రమః" అని యందురు. మానవులకు ఈ స్వభావము పుట్టుకతోనే పూర్వజన్మ సుకృత దుష్కృత పరీపాక కల్పితమై ఆకృతి దాల్చును. మనమే పేరుతో మనుష్యులను పిలిచినను ఆ స్వభావములనేగాని శరీరములనుగాదు. శరీరములు జడములే గదా! తదంతర్గత పూర్వజన్మ సుకృత దుష్కృతఫల సంగతమైన చైతన్య స్వరూపమే మానవుడు. వానికేనామరూపములు కల్పింపబడును.

ఇక కవికి కవిత్వము వ్రాయుట స్వభావము. అనగా ఆ లక్షణము పుట్టుకతోనే ఉండును. పెరిగినకొద్దీ అదియు నెదిగి అనుకూల సమయంలో స్వయం వ్యక్తమగును. శ్రీ చీరాల శ్రీరామశర్మగారు ఒక కవి. లోకంలో ఒక లక్షమందిలో ఒక కవి పుట్టునని యంటారు. అంటే కవులు అరుదుగా పుడతారు. అంటేనే వారికొక ప్రత్యేకతకలదని వేరే చెప్పనక్కఱలేదు.

"కవిని కన్నతల్లి గర్భంబు ధన్యంబు
కృతిని జెందువాడు మృతుడుగాడు
పెరుగుతోటకూర విఖ్యాత పూరుషులు
కవిని వ్యర్థజీవిగాఁ దలంత్రు!"

అని యొక ప్రసిద్ధకవి యన్నారు. అది సత్యము. లోకంలో కోకిల ఉన్నది. అది మధురంగా పాడుతుంది. దాని పంచమస్వరం వినగానే మన

క్షానందం కలుగుతుంది. కాకి ఉన్నది. అదీ అరుస్తుంది. మనకు కర్ణకఠోరంగా ఉంటుంది. కోకిలను మనం పాడమని చెప్పము. దానియంతట అదే పాడుతుంది. అది దాని స్వభావము. దాని ఆనందంకోసమే అది పాడుతుంది. అది యితరులకు కూడ నచ్చుతుంది. కాకి కంఠనాదం యితరులకు నచ్చదు. శ్రీ శ్రీరామశర్మగారు మంచికవి. సహస్రాధికంగా పద్యాలు వ్రాసినారు. పద్యాలన్నీ హృద్యంగా ఉన్నాయి! ఇక్కడ నింకొక చమత్కారమున్నది. ఈయన వ్రాసిన పద్యాలన్నీ తన జీవితానికి సంబంధించినవిగానే వ్రాశారు. జీవన స్రవంతియని పేరుపెట్టారు. ఆ పేరే ఈ గ్రంథస్థ విషయాన్ని వివరిస్తోంది. వీరు పద్యాన్ని హేలగా వ్రాయగలరు. వీరిది సాఫీ అయిన రచన. మచ్చుకు రెండు పద్యాలు చూడండి.

"చెలియలి కట్టదాటెనట సింధువు- ధర్మవిదూరు(డయ్యెవో!
విలయము తాండవించెనన వీచెను గాలియు వేగవంతమై
అలలును నుద్ధృతంబగుచు నంబుధి మంతటపొంగె; భూమియున్
జలమయమై తనర్చెను ప్రజల్ విలపింపగ వెంకటేశ్వరా!"

కలుషిత మార్గమందు నధికారులు నాశ్రిత పక్షపాతులై
విలపిత వార్తనాదములు విన్నపముల్ వినిపించుకోక, తా
తెలివిగ సాక్ష్యమెల్ల సరిదిద్దుచు మార్చి యథేచ్ఛ వ్రాసె కా
వలసిన వారికిన్ మిగులవంచన బుద్ధిని వెంకటేశ్వరా!"

ఇందలి విషయములు వారి జీవితానికి సంబంధించినవైనను సాధారణీకరణ మాహాత్మ్యముచే ఎల్లరకు హృద్యంగానే ఉంటాయి. "జీవన స్రవంతి" ఆంధ్రభాషా సరస్వతికి అమూల్య కంఠాభరణమై అలరారగలదని భావించుచున్నాను. శ్రీ శ్రీరామశర్మగారు, యింకను అనేక గ్రంథాలను రచించి, ఆంధ్ర వాగ్దేవికి, ఇతోధికంగా సేవజేయగలరని, అందులకు కావలసిన- ఆయురారోగ్య సాహిత్య వైభవాలను శ్రీరామచంద్రమూర్తివారి కనుగ్రహించాలని కాంక్షిస్తూ, ప్రార్థిస్తున్నాను. దీనికభిప్రాయం వ్రాయడానికి నాకవకాశం కల్పించిన మిత్రులు శ్రీ చీరాల శ్రీరామశర్మగారికి, నా కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.

# పరిచయము

ఇది సాహిత్యలోకానికొక చిరుకానుక. దేనికీ యాశించని, దేనికీ అందని దేనికీ నోచనిదొక యాడంబర ప్రజ్ఞ.

ఇది రెండు వంశముల ప్రస్తావన. నా జనకస్థానము కర్లపాలెము. జనకులు కర్లపాలెము లక్ష్మీనారాయణప్పగారు. దత్తత స్థానము చీరాల. దత్తత తండ్రి చీరాల హనుమంతరావుగారు. హరితస గోత్రీకులిర్వురవి. మా తాతగారు చీరాల శ్రీరాములుగారు కర్లపాలెము కుటుంబము నుండి శ్రీ వేదయ్యగారికి దత్తత వచ్చి అనపత్యుండ పత్యునిజేసిరి. ఆ కారణాన కర్లపాలెపు కుఱ్ఱవాని, మాతృహీనుని దత్తుకోరిరి వంశవృద్ధిపఱచ.

"మాతృ స్థన్యము పంచవర్షముల ప్రేమన్ నివ్వగ్రోలంగ యా
మాతే దూరమయెన్!"

"బువ్వలేదురకొడక బుద్ధిమంతుడవైతె, చల్లద్రాగిపోయి చదువకోర" అన్న జనకులు జనని తర్వాత కొంతకాలము గడిపారు.

జనకులు రాసక్రీడ నారాయణ తీర్థులవారి తరంగాలలో లీనమై "హే మాధవీ దర్శయా? హే మాలతీ దర్శయా?"యని యుదయం గరుడపక్షి కనపడేవరకు నర్తించేవారు. తర్వాత నీరాజనముతో స్వస్తి. వారు రాసక్రీడ రచించిరని వినికిడి. కాని ప్రతి కనుమరుగైనది. అట్టి రక్తము నా జీవన స్రవంతి కాధారభూతమై పరిఢవిల్లినది.

నాయనదత్తు తల్లియె, యనాదరణీయయు, మాతృవర్గ మా
త్మీయత ప్రేమజూపరయె, మెచ్చరు అన్నలు నుండనివ్వమం
చాయమ చేరదీయదని అగ్నిపరీక్షగనెట్లు నిల్వనా
ధ్యేయము నెట్లు కాతువొ" అన్న దత్తు తండ్రి వాక్యముల బద్ధుఁ
డ వంశవృద్ధియైనది.

స్వర్ణవంశీయులు మూవురన్నదమ్ములు. లింగరాజు, రంగరాజు, బూద రాజు వారలు హరితస గోత్రీకులు. శాలివాహన శకం 1396 విభాగతామ్ర శాసనమున, లింగరాజుగారు క్షీరపురి (నేటి చీరాలకు) తరలివెళ్లి చీరాల వారైనారు. రంగరాజుగారు స్వర్ణవంశీయులైరి. బూదరాజువారు, బూదరాజు వంశీయులై స్థిరపడిరి. శ్రీ అద్దంకి ప్రభువులు లింగరాజుగారిని చీరాలకు ఠాణేదారుగా మడులు మాన్యములిచ్చి సత్కరించిరట. ఆ వంశములో చీరాల రామయ్యగారు, గతించ, వారి సహధర్మిణి యూరంతా పసుపు, కుంకుమ, తాంబూలము పండ్లు పంచి సహగమన మొనర్చిరట. ఆ చోటు రామయ్యతోపు,

ఆ తటాకము రామయ్య తటాకముగా వెలసిల్లినది. అట్టి తోపు నేటి కథకు ప్రభుత్వపరమై, విచారణీయమై, నిమ్నజాతుల కాధారభూతమై ప్రత్యామ్నాయా ఫలదూరమై, యిప్పటికి కోర్టు వ్యాజ్యెములోనున్నది. అట్టి తామ్రశాసనము మా పినతండ్రి చీరాల సుబ్బారావుగారి అధీనములో నుండగా కీ॥ శే॥ అచ్యుతుని బాలకృష్ణగారు తమ చీరాల చరిత్రలో, తమకు చెందవలసిన శాసనము చీరాల సుబ్బారావుగారు తస్కరింపబడినట్లుగా వ్రాయ కడు విచారణీయమైనది.

అన్నదమ్ముల పంపకములో మా దత్తు తండ్రికి ఉత్తర సింహద్వారము మండువా లోగిలిభాగము సంక్రమించినది. మండువాలో తూర్పుగోడలో శ్రీ వెంకటేశ్వరస్వామివారి నామము స్థాపితమై, అనాదరణీయమై, ఇప్పటికి విజయవాడలో పునఃప్రతిష్ఠిత పూజనీయమై, కావ్యకవిత్వ మాధారభూతమైనది అయ్యది మా యిలవేల్పు. కాని మా పినతండ్రిగారు శ్రీ సుబ్రమణ్యస్వామిని యిలవేల్పు జేసికొనినారు. వారు నాకు గార్డియను. ఆ దంపతు (అరుంధతీ) లిర్వుర నాచరణ పుత్రవాత్సల్యత. దత్తునిలిపి, నా యీ స్థితికి కారకులైనారు. వారి ప్రమేయము లేనిచో నా జీవన స్రవంతి మరోమలుపు తిరిగియుండెడిదేమో? వారిరువురకు సర్వదా కృతజ్ఞుఁడను. వారి యాత్మీయతకు ఋణపడియుంటిని. 1933 - 1936 కాలములో బాపట్ల హైస్కూలులో చదువునపుడు, చౌదరి గారు, ఓగిరాల పండితులు సంస్కృతాంధ్రముల టీచర్లు వారి ఒరవడి నా కవిత్వ పోకడలకు నాంది. మా పినతండ్రి సుబ్బారావుగారి అల్లుఁడు గారైన కీ॥ శే॥ దేశిరాజు కృష్ణశర్మగారితో 1937 దాకను తరువాతను యిష్టాగోష్ఠి కవితా ప్రసంగాలు పునాదియైనది. ఆ కాలములోనే మా పినతండ్రి గారు సుబ్బారావుగారు రేపల్లె తాలూకా తహశీలుదారులు. 1936లో నవ్య సాహిత్య కవుల సన్మానము, కృష్ణశర్మగారి పరంగా నిరుద్యోగులమైన మాచే జరుపఁబడినది. శ్రీ విశ్వనాధవారు "రాజులు దీర్ఘకాల నిద్రాణువులు, వ్యవహార కాండలో మునుగనిక్కాలమందు, అధికారులు అల్పాశ్రయపు గబ్బులంబడి దిబ్బులందిగిన యిక్కాలమందు యే నిరుద్యోగులకు కాకయేమిపట్టె, అధునిక కవిపండితున్ నాదరింప"యని నుడివినారు.

తదుపరి నవ్యసాహిత్య పరిషత్ సభ్యత్వములో సాగినది జీవనయాత్ర.
"పసి హృదయంబు నొచ్చిన ను, భగ్నమనోరథ ప్రేమమైననున్
నసిచెడి దండతాడిత భుజంగమునైనను, పుండరీకమున్
మసలెడు పౌరుషంబు నభిమానము పెల్లుబకంగ రోషమున్,
కసి పగదీర్చుకొందురు విమాతపు జీవులు"...

"పగవలనన్ మఱిన్‌గలుగు పంతము, కోపము, హాని, నాశమున్,
వగచి ప్రయోజనంబు తరువాతను శూన్యము, కార్యశూరులై
మగటిమి లక్ష్యశుద్ధి పరమార్థ మెఱుంగక దీక్షకంకణన్,
సొగసుగ కావ్యమల్లెదరు సొంపుదలిర్పగ...."

అట్టి యీ కవితావ్యాసాంగాని కాధారము. యెవ్వరిని సాధించలేనిది యే విధంగా కరుడుగట్టి గూడుకట్టుకొని, కరగకుండా యుండి యీ పద్యా శ్రవులలో మిళితమై పెల్లుబికినది.

ఈ కావ్య పదార్థము ప్రథమంలో కథా విధానము. తదుపరి ఆధ్యాత్మికాపర దైవతారాధనములు యొక పంచాంగ కాలమున యాచరణీయ సంప్రదాయములు మా యిలవేల్పు శ్రీ వెంకటేశ్వర స్వామివారి తిరుమల వైభవ ప్రసక్తి. దేశ కాల సాంఘిక దురాచార, వైవాహిక దుర్నడతలు. మానసికోద్వేగము- ప్రస్తావింపబడినవి.

నేటి సాహిత్యపరమైన కావ్యకవిత్వపు పోకడలు యెక్కువగా గేయ, గద్యరచన విప్లవాత్మకానికి కాలవాలమైనది. అట్టి తరుణంలో పద్యకావ్యము పాతచింతకాయ పచ్చడియేమో?

అడిగినంతనే తమ అభిప్రాయములు అందజేసిన శ్రీయుతులు వడ్డాది సుబ్రమణ్యం, కావూరి పూర్ణచంద్రరావు, కీ॥ శే॥ దమ్మాలపాటి రామారావు గార్లకు కృతజ్ఞతలు. ఆత్మీయంగా స్వీకరించి, శ్రమకోర్చి అచ్చు వేసిన శ్రీ గాయత్రీ ప్రెస్ అధినేత శ్రీ అడుసుమిల్లి వేణుగోపాలరావు గారికి, వారి సిబ్బందికి ధన్యవాదాలు.

Any Writing & Literature will not flourish without bitter Criticism on it. అన్నారు Jhonson మహాశయులు. యే కవిత్వముగాని రచనగాని సమీక్షతోగాని రాణించదు. కాన విమర్శనాపూర్వక రచనలే, మెరుగు, సానబట్టిన రత్నాలు, ముత్యాలు. ఈ కావ్యకవిత్వ లోపాలకు క్షంతవ్యుడను.

వృద్ధాప్య కారణంగాను అనారోగ్యయుత, దీర్ఘకాలయాపనమైనదీ, కావ్యానికి ప్రచురణ అయినను స్వయంకృషియే లక్ష్యములు లాక్షణికా సాన్నిధ్యముగా యెంచబడినది.

హరిత నివాస్,
23/22/7, హనుమాన్‌వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ-520 011.

చీరాల శ్రీరామశర్మ

# జీవన ప్రవంతి

## ఇష్టదేవతా ప్రార్థన :-

శా॥ శ్రీలక్ష్మీ విభవుండునున్, సురనుతున్, శ్రీకంఠపుత్రుండునున్,
నీలాకారశరీరమోహనుఁడు, విఘ్నేశుండునున్, పూజ్యుఁడున్,
నాళీకాస్యలుపుష్ప వృష్టిఁ గురుపన్, నాగోపవీతుండునున్,
బాలార్కుంబలె తేజసన్ని భప్రభాభాసుండుకున్ మ్రొక్కెదన్. 1

శా॥ శ్రీవిఘ్నేశ్వర, విఘ్నరాజమకుటా! శ్రీశైలవాసా సుతా!
శైవానుగ్రహ తత్పరా! సురమునుల్ సంస్తుత్య లంబోదరా!
సేవించన్ ప్రథముండవై తనరు సంసేవ్యంబు పాదంబులన్,
తావ ద్రూపము మానసోల్లసిత సంధానంబుగా మ్రొక్కెదన్. 2

శా॥ గౌరీపుత్ర నమోస్తుతే! విజయమే కాంక్షించి పూజించితిన్,
కారుణ్యామృత వీక్షణన్ బఱపి నాకామ్యంబు సిద్ధింపగన్,
ప్రారంభించిన కార్యదీక్షతను సాఫల్యంబుఁ గావింపుమా,
ధీరోదాత్త వివేకమున్నొసగి సాధించంగ నే వేడెదన్! 3

మ॥ తొలి పూజాఫల పుష్పమున్ నిడుచు, నేదోచేత నైనంతలో
వలయున్‌రీతి శుభంబుకోరుచును కావ్యంబింత వ్రాయంగ నా
తలపున్, విఘ్నము సేయకుండ తగు సాధ్యంబైన సాయంబునున్
ఫలమున్, కార్యనిమగ్నతన్ వలయు సంప్రాప్తంబు సేయింపుమా! 4

ఉ॥ ఎంతటి సంపదున్నను, గణేశునిముందు తలంప తప్పదో,
సంతతమా విభుండు తగు సంపద సౌఖ్యము సర్వమున్నిడున్,
శాంతి నిడంగ జీవితపు చక్రము సాగగ పొంద కొల్వగన్,
నెంతటి భాగ్యముండనగు? నెందటికీయిల సంభవించునున్? 5

చ॥ చదువులతల్లి వంచనుచు సన్నిధి మ్రొక్కితి నీ పదంబులన్,
చదువును కావ్యమున్ కలము సార్థక మొప్పగఁ జూడుమమ్మ! నా
కెదురను లేనిదానిని నఖేప్పి తసిద్ధిని గూర్చుమమ్మ! నీ
వదనకటాక్షమున్ బఱపువాణి! సరస్వతి! దేవి శారదా! 6

ఉ॥ వ్యాసమహర్షి సంకలితమైనది పుష్కర సైకతంబునన్,
భాసిలె దివ్యరూపమున భారతి భాసుర తేజమొప్పగన్,
భాసర సుప్రసిద్ధ పువిభావమునన్ వెలుగొంద భూమినిన్,
వాసిని గాంచె నాంధ్రమున వన్నెల కెక్కుచు తీర్థరాజమై! 7

ఉ॥ జ్ఞానసరస్వతీ! నిదెప్రణామము! వాఙ్మయ రూపధారిణీ!
కానగవింత సోయగము కన్నులఁగన్పడు తేజపుంజమున్,
వీనులవిందుగన్, వినగ వీణనుమీటు రసామృతంబున
జ్ఞానముఁ బాఱద్రోలి కరుణామృత వీక్షణ కావుమమ్మరో! 8

ఉ॥ నీ కనులన్ వెలుంగునది నీలమణిన్మయ కాంతితేజమున్,
నీ కిరణాల మస్తక మణిన్మయ మౌళిత లంకృతద్యుతుల్,
నీ కరకింకిణీ స్వనమణిన్మయవీణ విపంచికాసుధన్
నా కవితామృతంబున వినంబడు నయ్యదె రాగమాలికల్! 9

ఉ॥ ఇమ్మహిపుణ్యమూర్తులన నీ స్థలమందు నుమామహేశులై,
బమ్మకు జిహ్వయున్, దవిలి భారతి ధాతను సేవఁజేయ, ల
చ్చమ్మయు నిల్చె నానెదలొ శౌరియుధన్యుఁడె, లోకపూజ్య దు
ర్గమ్మయునుండె మూవురు సరస్వతి లక్ష్మియు కాళిరూపముల్! 10

శా॥ నీ రూపంబు పరాక్రమున్, ఘనతయున్, నీకెట్లు గుర్తుండవో?
శ్రీరామాజ్ఞ సముద్రముత్తరణకై జేజేలు నివ్వంగనే
వారాశిన్నవలీల దాటితిగదే! వంద్యుండవీవే గదా?
యారోజే తెలిసెన్పొగడ్తలకు వశ్యంబౌదువౌ సామెతన్. 11

ఉ॥ పావని బాల్యమందెరవిపక్వఫలంబని మ్రింగఁబోవనా
దేవసురాధిపుండ శని దిట్టగ గొట్టగ వాయునందనా
దైవవరంబునన్ హనుమ తద్విధి నామము నందుచున్ చిరం
జీవియనంగ భాసిలెడు చేష్టలరూపము మానసంబునన్, 12

ఉ॥ అట్టి మహానుభావుఁడవు నర్కుని జేరగ విద్యకోసమై
చుట్టితె రశ్మిమండలము! సూర్యు భజించి సమస్త విద్యలన్
పట్టితె తేజమంతుఁడవు! వాసిని గాంచితివో మహాత్మ! చే
పట్టిన ఘంటమున్ విజయ, ప్రాప్తి ఘటింపుము నీకు మ్రొక్కెదన్ 13

ఉ॥ పంచముఖాంజనేయ! భవభక్తులఁ బ్రోవగ నీకు సాటిగన్,
మించిన దైవమింకొకరు మేలు తలంపగలేరటంచు నీ
పంచనుఁజేరితయ్య! నిక పద్యములల్ల కవిత్వమందునన్
కొంచెము సాయమున్ నిడుమ! కోరికఁ దీర్చుమ నీకు మ్రొక్కెదన్! 14

ఉ॥ దాపరికంబులేదు! భవతారక మంత్రజపంబునందునన్
యోపిన భక్తి తత్పరత, యోగ సమాధియు ధ్యానముద్రనున్,
పాపముఁ జేయునోల్ల! చెఱపంగగ పాపినికాను సామి! నా
దాపున నిల్చి కార్యమున ధన్యునొనర్పుమ! నిన్ను వేడెదన్! 15

చం॥ పరమ దయాళువో హనుమ! పావని రుద్రవర ప్రభావ! వే
మరు నుతియించెదన్ కృపయు మాత్రము నుంచుమ! నాంజనేయ నీ
చరణముఁబట్టి వేడెదను! సాయమొకించుకఁ జేయుమయ్య! అ
య్యరె! కరుణామయా! నభయహస్తము నిచ్చితె! జాలునో ప్రభూ! 16

శా॥ నీ రూపంబుఁ దలంపగా తుదుమొదల్నెగాన! నీవైనచో
ప్రారంభింపు మటంచు నాశనిడినే వ్రాయంగ కాంక్షించితే?
నీరమ్మంపుదా! పాలముంచెదవా? నిన్నే నమ్మినాడన్జుమీ!
దారింజూపుమ! పుణ్యముంచుకొనుమా? దాసాంజనేయా ప్రభో! 17

ఉ॥ రాముని బంటువై జనకరాజ సుతన్ కని ముద్రనిచ్చి, చూ
డామణి దెచ్చిరామునకిడి డంబము మీఱఁగఁ జూచి రమ్మనన్
నేమన? కాల్చి వచ్చితివి! యెందఱె కబ్బును? నట్టి భాగ్యమున్,
నీ మహిమంబు చాటగల నేర్పుగదా! యిది రాము కార్యమున్. 18

ఉ॥ పంచముఖాంజనేయ! దశబాహు! వరాహఖగోరువానరా
శ్వాంచిత! నారసింహ! బహుసాయుధ! రుద్రబలుండ! సామికా
ర్యాంచిత భాగ్యమందు మహిరావణుమర్దనఁ సేయ రూపమూ
హించి తలంతునయ్య! విజయీభవయంచని బ్రోవవేడెదన్. 19

ఉ॥ రాము పదాబ్జ సేవలో పరాత్పర రామునిఁ గొల్వగా పరం
ధాముని వాయుసూనుఁడవతార పరంబని యెంచిఁ జూడయా
రామమె భక్తిమార్గమున రాజిలె తారకమంత్రరాజమై
భాములఁ బాఱద్రోలి బహుభంగుల కాచును భక్తకోటినిన్! 20

ఉ॥ శ్రీ విభవంబునన్ భువిని శ్రీగిరి యోయన వెంకటాద్రినిన్,
పావనతీర్థ రాజమయి భక్తుల పాలిటి కల్పవృక్షమై,
శైవము వైష్ణవంబునను శాంతి సముద్రుఁడు వెంకటేశుఁడే
కావగ భక్తులన్ వెలసె కంజదళాక్షునికివ్వె వందనల్! 21

శా॥ శ్రీ వైకుంఠము యెక్కడోయనగ వీక్షింపంగనేమౌనునో?
యా వైకుంఠమె వెంకటాద్రినిలపై నత్యంత శోభాయమై,
శ్రీ విష్ణుండట! వెంకటేశుఁడనుచున్ శ్రీదేవి భూదేవులే
యావక్ష స్థలినుండ కాంచగల భాగ్యంబెంత పుణ్యంబగున్? 22

ఉ॥ స్వామి చతుర్భుజంబులను శంఖము చక్రగదాదిశార్ఙ్గముల్,
నామసహస్రహారము! ననంతుని వజ్రకిరీట కాంతులున్,
నామణి నూపురంబ భయహస్తము పాదములాశ్రయింపుమ
న్నాముఖ మూర్ధ్వ పుండ్రములు నాత్మృతఁగల్గెడు చూడమ్రొక్కెగన్ 23

ఉ॥ నా యిలవేల్పు నీవనుచు నమ్మి భజించితి! జీవితంబునే
వ్రాయగఁ బూనుకొంటి! తుదిపంక్తిలో పద్యము వృత్తమందున
య్యా యమృతంబు నామమును నంత్యగణంబుగ మౌళికంబుగా
ధ్యేయము నిశ్చయింపబడి! తెల్పితివీవట వెంకటేశ్వరా! 24

చం॥ తిరుమల వెంకటేశ్వరుని దివ్యముఖాం బుజదర్శనంబునన్
దొరకునటంచు మేము బహుదూరము నుండియు నేగుదెంచగన్,
కఱవయె! గంటలన్, నిలువగాళ్ళను నుండగఁ బొమ్ము పొమ్మనన్,
తఱచుగనేమనంగలము? దారిని జూపుమ వెంకటేశ్వరా! 25

ఉ॥ ఈశ్వరినిన్ నుతింతును, ననేకవిధంబుల పూజఁ సేతుఁ రా
జేశ్వరినిన్ దయామయి భజింతును! శక్తి నటంచుదేవి మా
హేశ్వరి నిన్ తలంతు! పరమేశ్వరి కొల్చెద! సంస్తుతింతు కా
మేశ్వరినిన్ కృపాళు జగదీశ్వరినిన్ మనసార మ్రొక్కెదన్. 26

ఉ॥ అంబ జగత్రయీ భువనమాలన పాలనఁ జేయు తల్లి! ది
వ్యాంబర వేషధారి! దరహాస ముఖాంబుజ! వ్యాఘ్రచర్మవే
షాంబర నర్ధనారి సతిశాంభవి! దీనులకావ కల్పవృ
క్షంబయి బ్రోచుతల్లి! నను చల్లని చూపుల చూడవేడెదన్. 27

శా॥ శ్రీ దుర్గాలయ మింద్రకీలమున! లక్ష్మీవాణి కాళీయనన్,
యాదేవేరులు నొక్కటై వెలసె! దుర్గాంబంచు భాసిల్లగా
యాదివ్యాద్భుత మూర్తినిన్‌గనగ భాగ్యంబంచు భావించితిన్
గాదా? యీ బెజవాడలో కనకదుర్గాదేవి కిన్ మ్రొక్కెదన్!। 28

ఉ॥ తోయజనేత్రి శ్రీ కనకదుర్గ! ప్రతిష్ఠతమింద్ర కీలమున్,
యామె! కృపాసముద్ర! తనునార్తులఁ గాచెడి తల్లి! పూజలన్
సేయగ దేవితా తనివిఁ జెందెడు నమ్మ! కటాక్ష వీక్షణం
బాయమ!ఁ జూపవేడె దమనంబున కావ్యకవిత్వ సంపదన్, 29

ఉ॥ అమ్మనుకోరగా నిడుననన్నము! పాలును, చేతనైనటుల్,
అమ్మలగన్నయమ్మ జగదాంబయు దుర్గ కృపాంబురాశినిన్
నిమ్మనివేడగా కడుపు నింపును! కోర్కెలు దీర్చుమంచు నా
యమ్మని కొల్చివేడగనునాశ్రయమివ్వగ, కావ్యపోషణన్. 30

శా॥ శ్రీలక్ష్మీన్ ఘనసింధురాజ తనయన్, శ్రీరంగధామేశ్వరిన్
త్రైలోకార్చిత పాదపద్మయుగళిన్, యాధారశక్తిన్, రమన్
మాలావజ్రవిరాజితామణి మయామాలాసలంకాకృతన్,
యాలావణ్యవతీ కృపారసముకై నర్థించెదన్ బ్రోవగన్! 31

ఉ॥ శ్రీరమ తోడునీడయయి సిద్ధి వినాయకుఁ డండనుండగన్!
భారము వారిపై నిడుచు భావకవిత్వము జీవితంబుపై
ప్రేరణఁబూని నా హృదయ వేదన తీరగ పొందుపర్చుచున్
సారరసాత్మకారచన సాగువిధంబునఁ జూడవేడెదన్! 32

మ॥ ధనమున్, ధాన్యము, విద్యయున్, విజయ సంతానంబు ధైర్యంబులా
శను, రాజ్యంబును శౌర్య సాహసముల్షైశ్వర్య భాగ్యంబులై
చన, లక్ష్మీపదమందు నిల్చునను వాస్తవ్యంబు నిత్యంబునున్,
గను ప్రాప్తంబు కవిత్వ సాధనకు నైకాంక్షించుచున్ మ్రొక్కెదన్ 33

ఉ॥ ముందు కవిత్రయంబునకు, పూజ్యులు ఆధునికాకవీంద్రులం
దెందఱొ సాహితీప్రియులు, హేమతలాటపు పెండెరంబులన్
నొందిన పండిత ప్రముఖ యోధులు పెద్దలు కావ్యకర్తలం
దందఱికిన్ నమస్కృతశతంబులనిచ్చుచు గౌరవించెదన్. 34

చం॥ మరువని విద్యకున్ నొదవె! మంత్రపురశ్చరణంబు రీతిగన్
గురువయి సాహచర్యమున గోష్ఠి ప్రసంగము నవ్యసాహితిన్
పరిచయమిచ్చి సాధనకు భావకవిత్వము ప్రోత్సహించెనా
పురుషుని మ్రొక్కెదన్ కవిత పోకడ తెల్పిన కృష్ణశర్మకున్! 35

చం॥ అరయకవిత్వమొక్కపరి నా దరమందెను రాజపోషణన్,
గిరిశిఖరాగ్రమున్వడసె కీర్తిపతాకము వాఙ్మయంబునన్,
కఱవయె నేఁడు నట్టినధికారుల ప్రాపును మొక్కపోవగా,
జరుగునె పూర్వవైభవము సాహితివేత్తల కెప్పుడైననున్! 36

ఉ॥ ఛాందస, భాష గ్రాంధికము సంస్కృత, తత్సమ తద్భవంబు రూ
పొందిన కావ్యమున్ నెఱుగనొప్పునె నల్పుఁడు? దేశ్యమర్థ మా
ఛందము నవ్యసాహితిని సాధనఁ జేయగ నుత్సుకంబయెన్,
అందున వ్రాసెదన్ తెలుఁగు నర్థము నింపాదవంగ కావ్యమున్! 37

చం॥ చదువులనాఁడు నొజ్జనయె! చౌదరి! పండితనోగిరాలయుం
పదపడి నవ్యసాహితిసభా పరిషత్తు ప్రమేయమందునన్
నొదవిన భావనాపటిమ నుద్యమమీరచనా ధురంధురం
బదినిటుసాగె! వారలకు వందన మియ్యదె దక్షిణాకృతిన్! 38

శా॥ ఛందోబద్ధము లక్ష్యమార్చయుతమౌ సాహిత్యమున్, లక్షణం
బందాపాదితమౌ కవిత్వరచనా పారంగతన్, జీవితం
బందే భావకథా ప్రభావమున కావ్యంబున్ నిదేవ్రాయనా
నందో బ్రహ్మయటంచు పూనితిని విజ్ఞానంబునన్ నొప్పగన్! 39

ఉ॥ పండితవర్యులన్, నుభయభాష ప్రవీణులు గద్యపద్యము
ద్దండతఁ జెప్పగా కవివదాన్యులు, భావ కవిత్వమందునన్
ఖండితకావ్యమిచ్చిన నఖండలు నందజ్మ్రోల నంజలిన్
నిండుమనంబు నిచ్చెదను నేనిదె వారికి ముందు ముందుగన్. 40

## ప్రేరణ

శా॥ శ్రీరాంశర్మకు డెబ్బదేట మదితోఁచీ తోఁచనావస్థనున్
శ్రీరామార్చిత పాదపద్మయుగళున్ శ్రీ వెంకటేశాధిపున్
దారింగానక కష్టకాలమనుచున్ దాపయ్యేనంచా ప్రభున్,
కోరన్, నంతట జీవితానుకథ వాక్కుచ్చెన్ రచించంగనున్. 41

## కృతి భర్త

శా॥ శ్రీలక్ష్మీ హృదయేశుఁడున్, సురనుతున్, శ్రీకౌస్తుభాదక్షుఁడున్,
త్రైలోకార్చిత పాదపద్మయుగళున్, దైత్యాంతకామూర్తినున్,
శ్రీలోలున్ కరుణా కటాక్షముల వీక్షించన్ ప్రసారించ నా
మాలాభూషణ భూషితాంబరునకున్ మందార హారుండుకున్. 42

ఉ॥ శ్రీరమయున్ వసుంధరయు చెల్వుగవక్షము నందునుండగన్,
పేరిమిమంగ పద్మలును వేలుపు ప్రక్కన భార్యలుండగన్,
వేలుగ నిత్య జీవితపు వేదన కాకృతి కావ్యకన్నియన్,
యారమణీయ పాదములనంకిత మిచ్చెద భక్తియుక్తులన్. 43

శా॥ శ్రీ కళ్యాణపు వేదికన్ తిరుమలన్ శ్రీలక్ష్మీ భూదేవులున్,
సాకల్యంబుగ ప్రక్కనుండగను నా శాస్త్రోక్త కళ్యాణమున్
నీ కార్తీకము కృష్ణపంచమి తిథిన్ నింపైన మూర్తంబునన్
నా కావ్యంబును నంకితంబడితినన్నా వెంకటేశా ప్రభో! 44

ఉ॥ నీ పదమంటి యానతిని నిచ్చితి పద్యము మాలికాకృతిన్
నేపుగకంఠ హారముగ నేర్పడ! ధన్యుఁడ! నేమికావలెన్,
యోపినరీతి పుష్పములు నొక్కటి నొక్కటి గూర్చి వేసితిన్
యాపయి నీదిభారముప హారము గైకొను! వెంకటేశ్వరా! 45

చం॥ ఇదియె ప్రసాదమంచు మదినేర్పడె భక్తిప్రపత్తులందునన్,
నెద పరిపూర్ణమై రచన నెంచిన పద్యపు కావ్యకన్నికన్
పదములనుంచ నంకితపు భావన నచ్చపు దేశ్యమందు న
య్యదునున దాల్పవయ్యమణిహారముఁ గైకొని వెంకటేశ్వరా! 46

ఉ॥ అందలమందునన్ కవులనందఱివోలెను రాజపోషణన్
పొందగలేనివాఁడ! పరిపూర్ణ కటాక్షము రాజలాంఛనన్
నొంద, నభాగ్యుఁడన్! కృతిని యుంచితి నీ పదపద్మమందునన్
ముందుగ కావ్యకన్నికను ముద్దునుఁజేయుమ వెంకటేశ్వరా! 47

మ॥ పదునాఱేడుల కావ్యకన్నియను దివ్యాలంకృతాభూషితన్,
చిదుమన్ పాలునుగార్చు బుగ్గలపినాఙీహాను స్రావంతినిన్,
నెదురన్ నిల్చిన వెంకటేశుఁడవు నా యిష్టంబు దైవంబుకున్,
పదపద్మంబుల నుంచి మ్రొక్కితిని బ్రోవన్ వెంకటేశా ప్రభో! 48

ఉ॥ యెందఱొ కట్నకానుకల నిత్తురభీప్సిత సిద్ధికోసమై,
యందున సామి దర్శనము నంకితమివ్వ తలంపు కట్నమున్
వందలనేడు నేబది వివాహము ముందుగ నర్పణంబయెన్,
సుందర కావ్యకన్నియను సూత్రముగట్టుమ! వెంకటేశ్వరా! 49

## కృతికర్త

చం॥ హరితసగోత్రమున్ జననమందగవంశము కర్లపాలెమై,
వరుసగ తాతదత్తునయి వంశము నిల్వగ తెచ్చి నన్మునున్,
మఱువగలేనిదా మధనమాత్రము మానసమందు నిల్వగన్,
నరమరికంచులేనటుల నన్వయమందెను జీవితార్థమున్; 50

శా॥ చీరాలాన్వయ వేదయార్యునకు వాంఛించన్ ప్రపౌత్రుండునై,
శ్రీరామయ్యయదత్తుఁడొకతన నాశించంగ పౌత్రుండునై
ధీరుండా హనుమంతరావునకు లబ్ధిన్‌దత్త పుత్రుండనై
శ్రీరాంశర్మను పేర నిల్చితిగదా శ్రీ వెంకటేశా ప్రభో! 51

శా॥ శ్రీ నారాయణ జన్మ తండ్రియయి లక్ష్మీబాయి నా తల్లియై
నానై రాశ్యము యైదువత్సరము లేనాడింది పాడిందిగా
కానన్ యక్కలు మూవురన్ననొకఁడై కార్పణ్యమాపాదనై,
దీనత్వంబున తల్లిపోవగను నుద్దీపించి రాయక్కలున్; 52

శా॥ చీరాలాన్వయ రత్నభూషితుఁడనై శ్రీరామశర్మాఖ్యునై,
శ్రీ రాజీవ పదాబ్జముల్ సతతమున్ సేవింపధన్యుండనై,
శ్రీరమ్యంబగు మోహనాకృతిని నేచిత్తంబునన్ నిల్పితిన్,
శ్రీరామార్చిత పాదపద్మయుగళా శ్రీ వేంకటేశా ప్రభో! 53

## కథా విధానము

మ॥ ఇరు వంశంబుల కీర్తికిన్ గడగి నేనీయత్నమున్ సేసితిన్,
పరమార్థంబుగ భావివంశజులు సంభావింప తప్పొప్పు లె
వ్వరు నెంచంగను రీతి వ్రాయుటకు కావ్యంబున్ నియోగంబునై,
సరసంబౌ కథ సాహితీ రచనయే సాఫల్యమై పర్వెడున్. 54

చం॥ జననము, దత్తతాచరణ సంఘటితంబుల "జీవన స్రవం
తి"ని నొక పద్యకావ్యము మదీయ చరిత్రము వ్రాయఁగన్ గజా
ననుఁడు, సరస్వతిన్ ముదలనానతి నీయఁగ వెంకటేశకున్
తను మకుటాయమానము, గ్రధన్ రచియించితి సామరత్నమున్! 55

శా॥ జన్మస్థానము, దత్తతాచరణ సంస్కారంబు, నుద్యోగమున్,
సన్మిత్రంబు, "రిటైరు" నౌపదవి, విశ్రాంతిన్ ననారోగ్య, జీ
వన్మాధుర్యము, శేషభాగమును, దైవాధీన కార్యంబు వీ
ఙన్మీటంగ విధంబునన్ రచన ప్రజ్ఞన్ సాగె భావోక్తమున్! 56

మ॥ యుగ ధర్మంబు, వసంత మారు ఋతువుల్ యొక్కొక్కటిన్ సూచనన్,
భగవత్ప్రార్థన, నుత్సవంబులును, దేవారాధనా కృత్యముల్,
భగవత్ప్రీతికరంబు సేవలనుచున్ వైకుంఠనే కాదశిన్,
మృగపాణీ శివరాత్రి శోభితపు సామిన్ వ్రాయ సంకల్పమై. 57

శా॥ దేవీపూజల వైభవోన్నతిని కీర్తించంగ నాశ్వీజమున్,
దేవీ, దానవ సంగరంగమున నుద్దీంపించి చెండాడగన్,
దేవీయే మహిషాసురా ప్రముఖు మర్దించంగ చారిత్ర మా
వైవిధ్యంబును పేర్కొనన్ గలిగి తప్పా వెంకటేశా ప్రభో! 58

శా॥ వైకుంఠేశుఁడు విష్ణుగాథలను విష్ణ్వాంశంబు చారిత్రముల్,
సాకల్యంబుగ వెంకటేశ ఘనతన్ సంస్తుత్య మానంబుగా,
లోకాలన్ దసరా మహోత్సవము నాలో కించు దృశ్యంబుగా,
వీకంబోవగ ముచ్చటించితిని శోభించంగ కావ్యంబునన్, 59

శా॥ వైకుంఠంబన చెప్పుకోదగిన తద్వారంబు శోభించగా,
యా కళ్యాణము పచ్చతోరణము నిత్యంబందు చేయించగా,
లోకారాధ్యుని వైభవంబు ఘనతన్ శ్లోకించ నాద్యంతమున్,
నా కావ్యంబు రచించితిన్ పదము విజ్ఞానామృతాస్ఫూర్తినిన్. 60

—:o:—

2)

## ప్రథమ చరణము-జన్మస్థానము - కర్లపాలెమువారి వంశము

ఉ॥ శ్రీవిభవంబునన్ వెలసె శ్రీ నరసింహ జనార్దనాలయం
బావటుఁ డాంజనేయుఁ డొకవంక ప్రసిద్ధిగ రక్ష దక్షుఁడై
దైవము కర్లపాలెమున ధర్మయుతంబుగ నాల్గు పాదముల్
కావగ సౌఖ్య సంపదల గ్రామము బ్రోచిరి వేంకటేశ్వరా! 61

ఉ॥ ఆయన నిత్యనైష్ఠిక శివార్చన ప్రీతిపరుండు! తీర్థ నా
రాయణ రాసక్రీడల తరంగము నృత్యము వ్యాపితుండు! పా
రాయణమే ప్రధానము నిరంతర సుందరకాండ! లక్ష్మి నా
రాయణ మాదు తండ్రియయిరాజిలె నచ్చట వేంకటేశ్వరా! 62

చం॥ తన పురుషార్థ మాలయ విధానము కావగ ధర్మకర్త పా
లనము, జనార్ధనుండు, సతి, లక్ష్మి నృసింహులు నాంజనేయుఁడున్
తనరెను భోగభాగ్యములు; తానును కాశి ప్రయాగ దేవ ద
ర్శనములభించ పుణ్య పురుషార్థము గాంచెను! వెంకటేశ్వరా! 63

ఉ॥ ఆయన కర్లపాలెపు సమాదర బ్రాహ్మణుఁడారువేల సాం
ఖ్యాయన గోత్రజుండు సగు గౌరవ ధార్మికమూర్తి; లక్ష్మి నా
రాయణ నామధేయుఁడు! విరాజిత దానపరుండు! సత్య ధౌ
రేయుఁడు, న్యాయమార్గపు పరీక్షుతుఁ డక్కడ! వెంకటేశ్వరా! 64

### ప్రథమ కళత్రము - తత్సంతతి

ఉ॥ అంతట పెండ్లియాడె పురుషార్థమునన్ వరదమ్మ నౌసతిన్,
సంతతి గాంచె పుత్రుని నచంచల ధీరు నృసింహుఁ డంచనన్,
కాంతయుఁ దీరెబో వయసు కాలము కర్మము ప్రాప్త మింతనన్
యింతి గతించె వంశమున కిచ్చుచు పుత్రుని! వెంకటేశ్వరా! 65

ఉ॥ పోయిన భార్య నిచ్చె నొక పుత్రుని వంశము నిల్ప, లక్ష్మి నా
రాయణు పోషణార్థము పరామరిసించగ, నిత్యనైష్ఠికం
బాయన నిర్వహించగ, గృహంబున కార్యము చక్కదిద్దగన్
దాయల లక్ష్మిబాయి సహధర్మిణిఁ జేకొనె! వెంకటేశ్వరా! 66

ఉ॥ ఆసతి పుణ్యమూర్తి పతి యాదరణంబును పొందుచున్నదై
చేసిన పూజలై సరళ చిత్త! యమాయకురాలు నంచనన్
దాసియు, మంత్రిగాను, సహధర్మిణియై, తన బంధుకోటిలో
భాసిలె మాతయై సవతి బాలుని సాకెను! వెంకటేశ్వరా! 67

చం॥ జనకుఁడు నానతీయ నరసమ్మను పెండ్లి నృసింహుఁ డాడగన్,
కనె హనుమంతు, బ్రహ్మలు నికన్ శివుఁడంచును దక్షిణుండునున్,
చిన వరదమ్మ కృష్ణులను చిట్టి విశాల, కనిష్ఠ పుత్రి య
య్యేనొ శివరాముఁడున్ వరుస నేర్పడె వారికి వెంకటేశ్వరా! 68

ఉ॥ అందు శివుండు కాలగతి నందెను చిన్నతనంబు నందె! కా,
పొందెను నాక లోకమును పుణ్యుఁడు బ్రహ్మయు బ్రహ్మచారిగా,
యందిటె విద్య సంధ్యలును యయ్య నొసంగగ ధర్మమంచు నా
నందము పొందె సంతతికి న్యాయ మొనర్చగ! వెంకటేశ్వరా! 69

ఉ॥ ఆ నరసింహుఁ డాత్మజుల కందటికిన్ నుపవీత కర్మ క
ళ్యాణములన్ నొనర్చె! సుతయౌ వరదమ్మ సదా శివుండుకున్,
పూని వివాహమున్ జరిపె! పుత్రి విశాలను చిన్నదాని ప
త్నీనరసమ్మకిచ్చుచు గతించె ప్రణంబున! వెంకటేశ్వరా ! 70

చం॥ పసి హృదయాలనున్ మఱుగు పర్చుచు పెంచెను నర్సమాంబయున్
నిసుగుల నందటిన్ నొకట, నేర్పుగ సాకెను నొక్కరీతిగా,
యసలది నామెకున్ నమృత హస్తమనంగను పేరుగాంచె బో
నసువులబాయు దాకతను నా విధి దీర్చెను వెంకటేశ్వరా ! 71

మ॥ హనుమంతుండును పెండ్లియైకమల నా ప్యాయంబుగాఁ జూచుచున్
య నపత్నుండయె! చింత నొందననుజుండౌ దక్షిణామూర్తికిన్
వనితా రత్నము రత్నమాంబకునుద్వాహంబుఁ గావించగా,
తనయల్ నిద్దరిఁగాంచి తృప్తిపడె నంతన్! వెంకటేశా ప్రభో! 72

ఉ॥ ఆ సుగుణాల రాశి హృదయంబు సుధామయమూర్తి యౌచు వి
చ్చేసిన బంధు నాశ్రితుల సేవలఁ దన్పుచు హర్ష గాత్రియై
చూసె! నృసింహుకున్ సతిగ శోభనుఁ గూర్చెను ధర్మ మార్గమున్
భాసిలె కర్ణపాలె మను వంశము నందున! వెంకటేశ్వరా ! 73

ఉ॥ చిన్నతనంబు నందె మృతిఁజెందిన తండ్రికి మారుపెద్దయై
యన్నగ కృష్ణమూర్తికిని యత్త కుమార్తెను రేవతిన్, నికన్,
చిన్నది చెల్లి కూతు. తులసిన్ శివరాముని కిచ్చి పెండ్లియున్,
మిన్నగఁజేసి వారలకు మేలనిపించెను! వెంకటేశ్వరా! 74

## ద్వితీయ కళత్రము - సంతతి

ఉ॥ కాంచెను లక్ష్మిబాయి పతి గౌరవ మందగ నిర్వురన్ సుతుల్,
మించిన పుత్రిమూవురను మేలుగ మిన్నగ నార్వు రందఱిన్,
పెంచెను పెద్దఁజేసి మురిపెంబున నందఱి నొక్క రీతిగా
మంచితనంబు నేర్పు తన మామెకు సొమ్మయె! వెంకటేశ్వరా! 75

చం॥ తనయలె పెద్ద! యందు వరదమ్మయు, వర్ధని, ముందు పుట్టగన్,
నను జూఁడు కల్గెనా కమలనాభుఁడు, సుబ్బమ వెంట వెంటనే,
జననము నందిరంత వరుసంగ కనిష్ఠుఁడు రాధ యందు రా,
తనయుని రాధ కృష్ణుఁడని తండ్రియు పిల్చెను! వెంకటేశ్వరా! 76

ఉ॥ ఆ సతి లక్ష్మిబాయికనె నాఖరు బిడ్డగ పుత్రినంత, క
న్మూసెను! బిడ్డకన్న పదమూఁడవ రోజున తల్లిపోయె! తాఁ
జేసిన పెండ్లి మూవురకు జీవిత మందున శోభనంబులన్
చూసిన ధన్యురాలనుచు సుద్దులు పల్కిరి! వెంకటేశ్వరా! 77

చం॥ తనయకు నీడు వచ్చెనని తల్లియుఁ దండ్రిఁదలంచి పెండ్లికిన్
ననువగు, సంప్రదాయమని నన్ని విధంబులఁజూడ ముచ్చటం
బన వరదమ్మ కిష్టమగు భర్తగ వంశము రాచపూడివా
రన వరునిన్ సయోగ్యుఁడన, నర్హుగ నెంచిరి! వెంకటేశ్వరా! 78

ఉ॥ ఆ మనిరాగ పెండ్లి పనులచ్చట ముచ్చటఁ దీరునంత, శ్రీ
రాముని రాచపూడి కులరాయని కౌశిక సంబు గోత్రజున్
కోమలి నిష్టపడ్డ వరుకున్ వరదమ్మకు పెండ్లిఁగాగ నా
నామము "సీత" యంచు ప్రతి నామ మొసంగిరి వెంకటేశ్వరా! 79

మ॥ వరదమ్మంతట కాపురంబు కనుచున్ పంపంగ తా భర్తతో
నరిగెన్, నౌకరి కారణంబుగను; యెన్నాళ్లైన నిస్సంతులై
పరిపూర్ణంబగు యౌవనంబు గడువన్ ప్రాప్తించె దుఃఖంబునున్
జరిగెన్ కాలము! కర్మ తప్పదయె! యీశా వెంకటేశా ప్రభో! 80

మ॥ అనపత్యంబును(బాప సోదరు సుతున్ యాచించి దత్తుంగొనెన్
తన వంశార్థము రామకృష్ణు నుపవీతంబంచు సంస్కారమున్
నొనరించంగ వివాహమున్ జరుప వంశోద్ధారునిన్ పౌత్రు( గాం
చెను! పున్నామను బాట ధన్యు(డనిపించెన్! వెంకటేశా ప్రభో! 81

ఉ॥ వర్ధనియున్ ద్వితీయ సుత! వాంఛిత యయ్యెను పెండ్లికంత, పూ
ర్వార్థము పత్నిపోయె తన వంశము కొక్కని పుత్రు గాంచి! సే
వార్థము జీవితంబునకు భార్యగ నుండగ తోడునీడయై
వ్యర్థపు జీవితంబు గడుపంగగ కోరెను! వెంకటేశ్వరా! 82

శా॥ ఆ యల్లాప్రగ(డా నృసింహు(డు వివాహంబంచు వాంఛించ, వా
రా యత్తంబయె పెండ్లి చూపులకు, భారద్వాజ సంగోత్రు(డై
ప్రాయంబందున నా బదేండ్ల వయసై బాలామణిన్ కోరుటే
ధ్యేయంబై చనె నిశ్చితార్థ మటులయ్యెన్! వెంకటేశాప్రభో! 83

ఉ॥ వర్ధనియున్ ద్వితీయమున వంచితయై గృహిణీత్వ భర్త సే
వార్థ నియోగితంబు గురుపాదులు భారతి సామి చెంతత
త్త్వార్థము సేకరించనయి, భాష్యము తర్కము ధర్మశాస్త్ర భా
వార్థము సంగ్రహించె, పతియానతి నందున! వేంకటేశ్వరా! 84

చం॥ కొమరు వివాహమున్ జరిపె కోమలియౌ నరసమ్మతోడ ! పా
దముల ప్రణంబు చేతను, విధాత లిఖించ నృసింహు(డా సతిన్
కొమరుని కాస్తుపాస్తులను కోడలి నంతట వప్పు(జెప్పి తా
యమ సదనంబుకేగె తన యాయువుతీరగ! వెంకటేశ్వరా ! 85

ఉ॥ వేసిన విస్తరే చినుగవేయ వివాదము వాదతర్కమం
దా సతి భాష్య సంస్కృత సమాన్విత తత్త్వ ప్రశంస పాత్రయై
భాసిలె ! హేమ నాణెములు పండితవర్యులు పారితోషికం
బా సతి దూరదేశముల నందున నిచ్చిరి! వెంకటేశ్వరా! 86

ఉ॥ పెండిలి కీడు వచ్చెనని పిల్చిరి సుబ్బులు నక్కలిద్దఱిన్,
నండగ నిల్చి పెండ్లి పనులచ్చట ముచ్చటలంచు( దీర్పతా
ముండి వివాహమున్ జరిపె! నొక్కరు నొక్క విధంబు సాయమున్
నిండు మనంబునన్ నిడిరి నేర్పున మీఱగ! వెంకటేశ్వరా ! 87

మ॥ అదె యల్లాప్రగడై న వంశమున జేయన్ నిశ్చయంబయ్యె, వా
రది ప్రాయన్ హనుమంతరావు నకు భారద్వాజసుంగోత్రుకున్,
పది రెండేడ్లగు సుబ్బులున్ వయసు యిర్వైదేండ్ల వాఁడౌ వరున్
నొదవెన్, నీడును జోడు నంచనిరి! కాదో? వెంకటేశా ప్రభో! 88

ఉ॥ యుండు వకీలు, వద్ద, తన యోగ్యత కొద్ది గుమాస్త! మూవురే
యుంపు నరుండు సున్ వధువు యొక్కతె అత్తయు కాపురంబునన్,
పెండిలిఁజేయగా చనెను పెన్మిటి తోడ్కొని వెళ్ళిపోవగా
నండలు దండలున్ నతఁడె నౌనని! అందఱు! వెంకటేశ్వరా! 89

ఉ॥ కాంతగు సుబ్బమాంబయును కాంచె సుతాసుతు లిర్వురిర్వురన్,
తంతున నామమయ్యె, లలితాంబయు రేవతి, సుబ్బరావులున్,
యెంతయు లక్ష్మినార మణుఁడెన్నగ పెద్ద సుతుండు నయ్యె! వా
రంతట విద్య సంధ్యలును నర్హత గాంచిరి! వెంకటేశ్వరా! 90

చం॥ లలిత వివాహమైకనె సలక్షణ సంతతి పుత్రులిర్వురన్,
చలపతి, అంజి బాబులను, శారద పుత్రిని; భర్త పోవగా
విలపిత యౌచు మాతనొడి వెచ్చలి నూర్పులఁజేరె! యోర! కాం
తలు పడుపాట్లు లిట్టివె గదా! విధి వ్రాసిన! వెంకటేశ్వరా! 91

ఉ॥ రేవతి కృష్ణమూర్తినివరించ వివాహము నయ్యె! నెంతొ శో
భావహమై తనర్చె! ననపత్యతకారణ పీడితంబునన్
భావనజేసి శారదను భారమునున్ వహియించి పోషణన్
భావి సహాయ సంపదల బాధ్యతఁ గాంచిరి! వెంకటేశ్వరా! 92

ఉ॥ సుందరి సర్వశాంతగుణ సుబ్బమ శాంతిసుఖంబు లేనిదై,
నిందలులేని జీవితము నిండుమనంబున కష్టముల్ మహా
నంద మటంచు నోర్చి, తన యాత్మ పరీక్షకు గీటురాయిగా
నందున పుత్రి పుత్రులకు నండగ నిల్చెను! వెంకటేశ్వరా! 93

మ॥ తన సౌఖ్యంబును ధారవోసి నిజ సంతానంబు నౌన్నత్య మో
పిన రీ[illegible] తను కాయకష్టముల నిర్వేదంబుగా నోర్చె తా
మునులన్ జేయగ, తా, నధర్మము, లపఖ్యాతీ పదంబందునున్
చన దయ్యెన్, తన ప్రాణముండు వరకీశా! వెంకటేశా ప్రభో! 94

మ॥ తన కష్టంబున సాధనాత్ఫలము పంతంబంది సాధించె! వా
చిన సుబ్బమ్మ! సహోదరీ ఘనతయే చెప్పంగ భావ్యంబె? యే
యను మానంబును లేదు నాతికి న సాధ్యంబంచు కార్యోన్నతిన్!
తన దీక్షేతన రక్షయై! నిలచె! కాదా? వెంకటేశా ప్రభో! 95

మ॥ తన కష్టంబుల పాటు మానవతనన్ ధర్మంబు పాటించుచున్
తన కూతుండ్రను నిద్దరిన్ మమతలున్ దైవానుకూల్యంబు గా
పనిచెన్! పుత్రుల పుత్రి సంతతిని సంభావించి పెంచం గనున్
చనె! నుద్యోగము వృద్ధిఁబొంది రటు లీశా ! వెంకటేశా ప్రభో! 96

శా॥ సంతోషం బెపుడేనిగల్గు ! తన కష్టంబందు సాఫల్యతన్
యెంతో చాతురి విద్యలన్ ప్రతిభ యొప్పించంగ నుద్యోగమున్
సంతానంబు గడించ సంపదల యాశాలబ్ధి సుబ్బమ్మదే
పంతంబందున పట్టుపీడనిది! దేవా! వెంకటేశా ప్రభో ! 97

ఉ॥ రేవతి దంపతుల్ నుచిత రీతిని శారద పెంచ, పెద్దదై
యావటు సూర్యనార్యునకు న్ననచ్చట ముచ్చటఁ దీరునట్లు గా
యావర లక్ష్మి మంటపము నందు ఘనంబుగ పెండ్లిఁజేసె! నా
దైవ కటాక్షమున్ వడసె! ధాత లిఖించగ! వెంకటేశ్వరా! 98

ఉ॥ నాదగు యన్నయౌ కమలనాభుఁడు విద్యయె కొద్దిపాటి! సం
పాదన వృత్తికిన్ వలయు వ్యావృతి బాధ్యత సాధ్యమై నటుల్
లేదని బాధ పొందకయె లేమిని గూర్చియు చింత నొందకన్
నాదరణంబుకై మిగుల నట్టులుఁ జాచఁడు! వెంకటేశ్వరా! 99

ఉ॥ జీవిత మందునన్ నొకరు సిద్ధ మొనర్చిన బాటవారలే
భావిని సాధ్యమై నటుల భార్యకు సంతతి, సత్ఫలంబునన్
బ్రోవగఁ జూడఁ గోరెదరు! బుద్ధియె వక్రగతిన్ చరించగన్
దైవమె రక్షకుండగుట తప్పదు! నెప్పుడు! వెంకటేశ్వరా! 100

ఉ॥ నాటక మందునన్ కమలనాభుఁడు పాత్రలపోషణంబునన్,
పాటిమఁ జూడముచ్చటగు! పద్యవిధానము భీమరౌద్రతన్,
మాటల నుచ్చరింప ముఖమందునఁ జూపెడు భీకరంబు, ను
చ్చాటన యందునన్ మరొకసాటి యెరారుగ? వెంకటేశ్వరా ! 101

చం॥ అనుసరణీయమౌ పథము నందిన నాథుఁడు యన్న యానతిన్
నణుకువ యౌ సతిన్ రమను నన్ని విధంబుల యోగ్యతైకనన్
పనితన మందునన్ వలయు పాటవ ముండగ నీడు జోడు దా
నిని తను పెండ్లియాడె రమ నిచ్చెను సౌఖ్యము! వెంకటేశ్వరా! 102

చం॥ కొడుకుల గాంచె నైదుగుర కూతులు ముగ్గురు కల్గగన్, నృసిం
హుఁడు, రవిబాబు, రాములను యుద్ధతి పద్మయు, దుర్గ, సీతలన్
నడచెను విద్యబుద్ధులను, నాటక ధోరణి నుద్ధృతంబునై
గడచె గతించ నిర్వురు విఘాతము లేకయె! వెంకటేశ్వరా! 103

మ॥ చదువున్ సంధ్యలు పాటవంబున ప్రశంసా పాత్రులైఁగాన, పె
ద్దది పద్మావతి దావులూరునకు నుద్వాహంబు గావించె! న
య్యదునున్ జానకి నారసింహులకు కళ్యాణంబు, దుర్గమ్మ చి
న్నది యోగ్యుండు భుజంగరావు కయె నన్నా! వెంకటేశా ప్రభో! 104

ఉ॥ అన్నయు నాటకానుభవ మందున పిల్లల పెంపుఁజూడ వా
రన్ని విధాలచేతి కటు నందిన వారయె! పెండ్లి కార్యముల్
మిన్నగఁజేసి నౌ దలకు మించిన భారముఁ గాగ చింతతో
పన్నిన పోకడన్ నడచె! బంధమునై చన! వెంకటేశ్వరా! 105

మ॥ విధి వక్రించగ తాపమున్ బొగిలె! భావిన్ శూన్యమై కాన దు
ర్విధి నారోగ్యము రాచపుండు కతనన్ పీడించ శయ్యా గతుం
డ ధి దైవంబుల కావు మంచు తపనా యాసంబు హృద్రోగ మ
త్యధికంబై చనె నాక లోకము నకయ్యా! వెంకటేశా ప్రభో! 106

చం॥ వెదకి సుతాసుతుల్ కటుల పెండిలిఁజేయ, గతించె యన్న! మా
వదినె రవీంద్రు సీతల వివాహ మొనర్చి, గతాసువయ్యె! యా
హృదయము రక్తపోటులను నేగె యమాంతికమున్ నృసింహుఁడున్
నెదురనులేదు దుర్విధికి నేమినొనర్చిన! వెంకటేశ్వరా! 107

## కర్త బాల్యము

శా॥ శ్రీ సిద్ధాద్రిని కృష్ణపాడ్యమి తిథిన్ జ్యేష్ఠంబు మాసంబునన్
వాసిం గాంచిన కర్లపాలె మను నా వంశంబునన్ జన్మమై,
భాసిల్లొ హరితాంబరీష యవ నాశ్వాదుల్ ఋషుల్ గోత్రమై,
వ్రాసెన్ సిద్ధులు రాధకృష్ణుఁడని పిల్వన్! వెంకటేశా ప్రభో! 108

శా॥ రాధాకృష్ణుఁడునున్ కనిష్ఠుఁడయి గారాబయ్యె! నారాయణ
ప్రాధీశుండును లక్ష్మిబాయియును నా ప్యాయంబుగా పెంచగన్,
నాధిక్యంబగు మాతృవత్సలత బాల్యంబాది చూపించగన్,
వేధించండట తల్లిదండ్రులటు లొప్పెన్! వెంకటేశా ప్రభో! 109

శా॥ గోక్షీరంబుల గుమ్మపాలు తనిపెన్ గోశాలలో త్రావగా,
యక్షయ్యంబగు యోచనాధృతినినిన్ నాయుస్సు పెంపారగన్,
దీక్షన్ నొజ్జలు నోనమాల నిడి దిద్దించంగ మేధస్సుతో
శిక్షన్ బాలున కిచ్చి చాతురుని పెంచెన్! వేంకటేశా ప్రభో! 110

ఉ॥ అక్కలు నిర్వురున్ వెడలె నత్తల యిండ్లకు, యన్నవృత్తికిన్
నక్కమలయ్య విద్యలకు నాతృతనేగగ, సుబ్బమాంబ చి
న్నక్కయు రాధయున్ మిగిలె నా తలిదండ్రులు సాకిరంత నా
తెక్కలు రానిపక్షులను తెప్పగ కంటికి! వెంకటేశ్వరా! 111

చం॥ మురిపెము పెంపునన్ సవర ముంగురులన్ తినె గోటిముద్దలన్,
పరుగిడు నాతఁడంతటను పల్కుమటంచును నేర్పపల్కగన్,
సరస పరుండబెట్టుకొని చక్కగ జోలల నిద్రపుచ్చగా
వెరవుగ పాడుతల్లియును వేల్పుల గాథలు! వెంకటేశ్వరా! 112

ఉ॥ పంచ వసంతముల్ఁ గడచె పట్టుమనంగను బిడ్డకంతటన్,
గాంచెను లక్ష్మిబాయి తన గర్భము మోయగ మాసముల్ పదిన్,
గాంచెను నాడు బిడ్డ నదికాలముఁ జేసెను పుట్టి పుట్టగన్,
వంచకుఁడా విధాత తన వంతునుఁ దీర్చెను వెంకటేశ్వరా! 113

ఉ॥ అందిన బిడ్డ పోవగ నహర్నిశలేడ్వగ గర్భవాతమై
మందులు మాకులెవ్వియును మాన్పని రోగము నాటు వైద్యుఁడా
సందునవాడ మందులను, శాంతి నొసంగక తీవ్రఘాతి యా
క్రందన చేసె బాధ నధికంబయి నోర్వక, వెంకటేశ్వరా! 114

ఉ॥ ఆ నడురేయి దేవళము నందున పూజలు కాగ రోదనా
ధ్యానము మిన్నుముట్ట విని, తద్దయు దూరమునుండ పంచగన్
గానఁడు దైవమున్ కనుల కార్చెడు నీరు, నకారణంబుగా
రానని మొండికెత్త చనె రాతిరినెట్టులో? వెంకటేశ్వరా! 115

చం॥ ఉదయము మేల్కొనన్ శవము నొక్కటి వాహకు లెత్తఁబోవగా
హృదయము చెక్కలై ( బొగుల నేడ్పుల బొబ్బల మమ్ము గాంచి త
న్నదునున నెత్తుకొంచు మము నక్కలు మూపునవైచు సందడిన్
నిదియని చెప్పలేక మనసెంతయొ క్రుంగెను! వెంకటేశ్వరా! 116

ఉ॥ అమ్మను గాన! నామె నొడియన్నిదురింపమి, గోటిముద్దలన్
కమ్మని గుమ్మపాలును, సిగన్ దుఱుమన్ నెటులౌను? నెవ్వ రీ
బొమ్మనుఁ జూడనేర్తురొకొ? పుణ్యవతీసతి! అమ్మ లక్ష్మి బా
యమ్మను కానరానిదయె నక్కడ! శ్రీపతి వెంకటేశ్వరా! 117

చం॥ దశదివసంబు కార్యములు తల్లికి జర్గెను! పుణ్యమూర్తికిన్
దశవిధ కర్మలన్నియు యధావిధి నాయెను లక్ష్మిబాయికిన్,
శిశిరమునందు నక్కలునుఁ జేరగఁ దీసిరి మాతృహీనులన్,
వశమగునౌనె దాట విధి వ్రాతలు తప్పవు? వెంకటేశ్వరా! 118

ఉ॥ పుట్టితి కర్లపాలెమున పుణ్యవశంబున, తల్లిదండ్రులున్
పెట్టిన ప్రేమలాలసల పెంచిరి, సాకిరి పంచవర్షముల్,
కట్టిన కాలదోషమది! కర్మయె? గొడ్డలిపెట్టు చందమున్
నిట్టులె అమ్మనంత హరియించెను దుర్విధి! వెంకటేశ్వరా! 119

ఉ॥ పంచ వసంతముల్ గడచె! బాల్యము తల్లితొ కర్లపాలెమున్
పంచనుదైవదత్తముగ పాడినపాటగ నాడినట్లు రా
ణించగ తల్లిపాల నికనెచ్చట లభ్యమునౌను గ్రోలగన్?
సంచిత పాపకర్మమును చాలునె పొందగ ? వెంకటేశ్వరా! 120

ఉ॥ పంచగ సుబ్బులక్కలటు వర్దని తోడ్కొనిపోయె!నన్ను నున్(రాధనున్)
పెంచగ పెద్దదౌ వరదవీటిని జేర్చెను! విద్యబుద్ధులున్
కొంచెము పాటగన్ బ్రతుకు కోసము నేర్పిరిఁ చేతనైనటుల్,
వంచనలేక పాడుపడు భంగిమ నయ్యెను! వెంకటేశ్వరా! 121

చం॥ ఋతు మతికాలమంచనుచు యెంచిరి సుబ్బుకు పెండ్లి(జేయగన్,
పతి హనుమంతరావనుచు బాధ్యత నగ్రజు( డక్కలిర్వురున్
నతివ వివాహమున్ జరిపి రంతట నంపిరి కాపురంబుకున్,
సతతము మాతృహీనులకు సౌఖ్యము నబ్బునె? వెంకటేశ్వరా! 122

ఉ॥ పెద్దది అక్కబావలటు పెంచిరి నోర్పుగ రెండు వత్సరాల్,
యొద్దికకొద్ది విద్యయును నొజ్జగ నేర్పుచు తీర్చిదిద్దగన్
"వద్దనె నీదు తమ్ము(‘డిట’ వాదన బావయు నక్కతోడనై
నిద్దఱు తండ్రి, నన్నుకడ నెట్టిరి నంతట! వెంకటేశ్వరా! 123

ఉ॥ అన్నకుమారు దత్తు(గొన నైహితవాంఛ, నపత్యమందునన్
తిన్నగ బావగారు నను దిక్కు దివాణములేని తండ్రికిన్
కొన్ని దినాలపాటు ననుకొన్న విధంబున నుండనివ్వగన్
పన్నుగడన్ విధించిరయె! భావిక నెట్టులొ? వెంకటేశ్వరా! 124

చం॥ తనయుని బాధ్యతన్ తుదకు తండ్రి యుపాయముచే నృసింహు(డున్,
ననుపు మటంచు రాధయను నక్కయ వర్ధని జేర్చిరంతటన్,
పనిచిరి నొక్క వత్సరముపాటుగ! వర్ధని బావ లిర్వురున్
కనికరముంచి నన్నటులగత్యము సాకిరి? వెంకటేశ్వరా! 125

ఉ॥ అన్న నృసింహు(డున్ వదినె లాదరణంబున బావ పంపగన్
చిన్నతనంబటంచనుచు( జేర్చిరి! సంతతి అన్నకుండగన్
కన్న విధాన మెవ్విధిని కాదనలేరొకొ? నెంచిచూడగన్
యున్నది చాలు తండ్రి యని యూరట( జెందెను! వెంకటేశ్వరా!126

ఉ॥ తల్లి గతించినన్ మొదట తప్పదు తండ్రికి సాక సంతతిన్,
యెల్ల విధంబులన్ తరుణ మెంచి కనంగను సోదరుండునౌ,
నెల్లరు-నోర్వ( బోరు? తమకెందుకు కర్మమటంచు తప్పుకో(
జల్లగ జారుకొందురు విశాలమనంబున? వెంకటేశ్వరా! 127

చం॥ వదినె నృసింహు(డున్ తమరి బాధ్యత వంతుగనెంచి పోషణే
కొఱుపయులేక రాధయను కూర్మితొ( జూడగ వత్సరంబయెన్,
హృదయమునందునేమిగల దింతకు? బైటపడంగ( బోరుగా?
పదిలము కాపురంబునకు పత్నియె సఖ్యత! వెంకటేశ్వరా! 128

ఉ॥ అవిధి బాల్యమంతయును నక్కల నిద్దఱివద్ద నుండగన్,
బావలు విద్యకొంతవడి ప్రాప్తమొసంగగ మూఁడు వత్సరాల్
జీవితరేఖ మార్చునతి శీఘ్రముగన్ పరవళ్ళు త్రొక్కె! నా
భావి నిగూఢ సంపదల బంధన మెయ్యదొ? వెంకటేశ్వరా! 129

చం॥ అనయము భార్యభర్త లదుపాజ్ఞల వర్తనమందె నుండనొ?
దినములు నొక్కరీతి చనదెప్పుడు? మాతృవిహీను సంగతిన్
తనయుని బాధ్యతన్ కలదు తండ్రికి! జూడగ నెల్లకాలమున్
చనునొకొ? కోడలందున నిజంబును నారయ? వెంకటేశ్వరా! 130

ఉ॥ శుక్రమహాదశన్ జరిగె శోకము! మాతగతించె! సూర్యునిన్
వక్రత నంతరర్దశ వివాదము లందున నూళ్ళు త్రిప్పగా
సక్రమమైన మార్గమును శాంతియుతంబుగ నిల్వనీయకే
చక్రము వోలె త్రిప్పె నను చంద్రకుజుల్ నిక! వెంకటేశ్వరా! 131

ఉ॥ వచ్చినవారు నన్నడుగ వచ్చిరి! దత్తత పొందఁగోరగన్,
"మచ్చిక మాలిమిన్ బుధుఁడు మాతృవిహీనుఁడె నబ్బునింటికిన్,
నిచ్చమెయిన్ జరించినచొ నిష్ఠమునుండఁడు మాదు పంచనున్,
నిచ్చిన పుచ్చుకొందు"మని నిచ్చను దెల్పిరి! వెంకటేశ్వరా! 132

మ॥ "అది ప్రాప్తంబయి ధర్మబద్ధ మగుచో యాచించగా నొప్పెదున్,
పదికాలాలపుపాటు వర్ధిలగ నావంశోన్నతే ముఖ్యమై
మది కార్యార్థులమైన హెచ్చరిక! సామర్థ్యంబునన్ జెప్పగా
హృదయంబందున వీఁడె ముఖ్యుఁడని"రోయీ!వెంకటేశాప్రభో! 133

ఉ॥ "యెన్న చరిత్రఁదెల్పు విధమెట్టి యనంగను భాగ్యమబ్బుచో
చిన్నతనాన కష్టముల, చింతలపాలగు నట్టివారలే
యెన్నగ నర్హులౌదురన నెందుకు కొందల మందమాకునున్
నున్నది కాకపోదని"నియోగముఁ దెల్పిరి! వెంకటేశ్వరా! 134

ఉ॥ "అట్టి మహామహుల్ చలువ నబ్బునొ? నబ్బదొ? యెంచిచూడగన్
పట్టుదలన్ గ్రహించి తమ భావిపునాదులు విద్య సంస్కృతుల్
గట్టిగ వేయువారె తగు కార్యపుసాధకులౌదు" రంచనెన్,
"నిట్టి వివాదమేల? తమనిష్టమదేమనె"? వెంకటేశ్వరా! 135

ఉ॥ అన్నసుతుండు బ్రహ్మయగు నర్హుఁడటంచును భార్యభర్తలున్
విన్నప మందఁజేయ విని "వీఁడయె మాతృవిహీనుఁ డందుకే
యెన్నడు నెవ్వరున్ తనకు నెక్కడ లేరని వానిబొందగన్
మన్నన బొందు"నంచనిరి మక్కువకొద్దియు! వెంకటేశ్వరా! 136

చం॥ "జనకునికన్న బంధునివిశాంపతికన్నను దేవునిన్ ధరన్
గన" మను నానుడిన్ నిజమె? కానిచొ తండ్రియె దిక్కులేకనే
తనయుని పోషణంబయెను; తండ్రిగ చూడగ చిన్నపిల్లలన్
ననుజుని వాని జూడమనుటన్నది సాధ్యమె? వెంకటేశ్వరా! 137

చం॥ సవతి సహోదరున్ తనదు సంతతి బాటుగఁ జూడ నేర్తురే?
అవసరమైనచో తనకు అర్హతలేనిదె బిడ్డలన్ గనన్,
చివరకు యెవ్వరో నొకని చేర్చుట తప్పదటంచుఁ జూతురే?
అవిటియునైన బిడ్డలను అక్కున జేర్చరె? వెంకటేశ్వరా! 138

మ॥ పది వర్షంబుల ప్రాయమందుననె సంప్రాప్తించె కష్టంబులున్
నెద మార్దవ్యము మాతృప్రేమ యని నూహించంగ తప్పైనచో
మది నోర్వంగని జీవితానుభవ సన్మానంబు కన్పట్టె! న
య్యది నే దారిని దీయునో? తెలియదయ్యా! వెంకటేశాప్రభో! 139

చం॥ అనుజుని, అగ్రజుండు పితలంపిరి, దత్తుకు అన్నభార్యయున్,
కనెనట దత్తు 'తండ్రి'యని గౌరవముంచి నమస్కరించగన్
విని హనుమంతరావుయును "పిల్పుము పిన్నిగకాదు ముందు "భా
ర్యను"నిక యమ్మయే యగును" నంచనె శ్రీపతి వెంకటేశ్వరా! 140

చం॥ వితతము సేయనేల! విధివిత్తిన బీజము నాటకుండునే ?
సతతము పోషణాదులను సవ్యమునౌనని నెంచనోపు? వ
క్రతగని హీనపర్చ తగుకాలము దాపురమైనచో నికన్
చతురతమై మెలంగవలె సామము ముఖ్యము! వెంకటేశ్వరా! 141

చం॥ ఇదియొక మాతృహీను కథ! యిందలి పాత్రలు వాస్తవంబునై
పదిలము మానసంబునను ప్రస్తుత కావ్యకథావిధానమున్
నొదవెడు సూత్రప్రాయముగ నోర్పు వహించి చరించ (బూనగన్
హృదయము తత్తరంపడ సహేతుకమయ్యెను! వెంకటేశ్వరా! 142

—:o:—

## ద్వితీయ చరణము దత్తతస్థానము

ఉ॥ ఆరు శతాబ్దముల్ మునుపు అన్నలు తమ్ములు భాగ పంపిణీ
దారుల లింగరాజు తనదైన విభాగము చేతనంది తా
క్షీరపురీ నివాసుఁడయె! చేసెను నౌకరి ఠాణెదారుగా
నేరుపుమీర తాను కరణీకము తోడను! వెంకటేశ్వరా! 143

శా॥ చీరాలన్ కరణీక మందగను నా శ్రీ లింగరాజుండునున్
చీరాలాన్వయ వంశమై పఱఁగె సుశ్రీలన్ ప్రకాశిల్లగా,
వారంతన్ హరితాంబరీషు యవ నాశ్వాదుల్ ఋషుల్ గోత్రమై
పారం పర్యము సాగె నేటి కటులప్పా! వెంకటేశాప్రభో! 144

శా॥ ఆ వంశీయులు దానధర్మపరులై ఖ్యాతీ పరాకాష్ఠయై,
దైవంబౌ ప్రభు వెంకటేశ్వరుని నే ధ్యానామృతాతత్వమై
సేవంచామరతంపరై మనుగడన్ జీవంబు నిండార యిం
టన్వేల్పుంచును సుప్రతిష్ఠమయె నిష్ఠన్ వెంకటేశా ప్రభో! 145

శా॥ పాతివ్రత్యము స్త్రీల సొమ్మ్మయని సంభావింపగా చేరువై,
స్త్రీతత్వంబున పెన్మిటిన్ తనదు ప్రత్యేకంబుగా స్థానమై,
యాతత్వంబు శరీరమున్ చితినిపై నర్పించ సిద్ధంబునౌ,
యాతృత్వంబును నే మనంగ వలెనయ్యా? వెంకటేశా ప్రభో! 146

చం॥ సహగమనంబు పూర్వమున సాధ్వి పతివ్రత ధర్మబద్ధమై
విహితము నయ్యె పత్ని పతిప్రేమల బంధము త్రెంచరానిదై,
దహనము భర్తతోడ సహధర్మిణి నాచితి దహ్యామానయై,
సహగమనంబు శాంతి సుఖ సంపద వర్జిత సంస్తుతీయమౌ; 147

ఉ॥ మూఁడు తరాల పూరుషుఁడు ముందు గతించెను! రామయార్యుఁడున్,
తోడయి జీవితాంతమును దుఃఖసుఖంబుల తోడు నీడ, కా
పాడిన భర్త పోవగను పత్ని పతివ్రత త్యాగమందునన్
పాడెతో పాటునేగె ననుబంధము మీఱగ! వెంకటేశ్వరా! 148

చం॥ సహగమనా ద్విధుల్, తనుగ సాధ్వి హరిద్రయు, కుంకుమల్ ఫలాల్
బహు సుమ తమ్మలంబులను పంచె సువాసిను కిచ్చి నేగె నా
విహిత పతీ చితిన్నెరఁగ వీడ్కోలు పల్కుచు నెల్లవారికిన్,
దహనము నయ్యె పుణ్యవతి ధర్మపతివ్రత! వెంకటేశ్వరా! 149

శా॥ ఆ ఋల్లాలు మహా పతివ్రతయె! యూహాతీతమై వెల్గగన్,
తా యూరేగె హరిద్రకుంకుమ ఫలాల్ తమ్మాకులున్ పంచుచున్
యాయుత్తంబయె భర్తతో చితిపయిన్ యాత్మార్పణంబంచునున్
జేయంగన్ నది పూర్వజన్మ సుకృతా! శ్రీ వెంకటేశా ప్రభో! 150

ఉ॥ రామయతోపునాబఱగె రమ్యతరన్ చితి భర్తచోటునన్
మామిడి జీడిమామిడులు మంచి రసాలపు వృక్ష సంపదన్
రామ తటాకమున్ నట విరాజిలె యిన్నిదినాల దాకనున్,
రామయ పత్ని కీర్తివిరాజితమయ్యెను! వెంకటేశ్వరా! 151

శా॥ చీరాలాన్వయ వంశమై హరిత సాశ్రేష్ఠంబగున్ గోత్రమై,
శ్రీరామయ్యను దత్తుఁ జేసుకొనె నా శ్రీవేదయామాత్యుఁడున్
ప్రారబ్ధంబు నపత్యుఁడై బొగులుచున్ వంశార్థమై తెచ్చెనా
శ్రీరాముండను కర్లపాలెపు ఘనున్ శ్రీ వెంకటేశాప్రభో! 152

చం॥ ఉపనయనాది కృత్యములు యోగ్యతకై చను కర్మబద్ధుగా,
నుపకరణాది విద్య లుపయుక్తములై చను వ్యావహారమున్,
నుపచయ వాక్య సంఘటితయుక్తుల సాంఘిక న్యాయమార్గ మం
దుపపథమందు నేగు పలుత్రోవలు నేర్పును! వెంకటేశ్వరా! 153

ఉ॥ రామలలామ రామ! యనురాగ విరాజిత ధర్మవర్ధనీ
భామ! కులాంగనా విహిత పావనశాంత! సుశీల! సంపదా
రామ! వివాహబద్ధయయె! రాజ్మణి కావుమ ధర్మపత్ని శ్రీ
రామునకయ్యె! దంపతులు రాజిల శోభను! వెంకటేశ్వరా! 154

మ॥ కనె శ్రీరాములు దంపతుల్ సుతుల, సంస్కారంబునన్ వేదయన్,
హనుమంతుండును, సుబ్బరావు, సుతలా యందాల సుబ్బమ్మనున్,
హనుమప్పా, రమణప్పలన్; జరిపె విద్యాబుద్ధులున్ వారికిన్,
ననుకూలించెను పెండ్లికిన్ సమయమయ్యా! వెంకటేశాప్రభో! 155

ఉ॥ సుందరి రత్నవేదయకు, సుబ్బమ వెంకట సుబ్బయార్యు, కా
నందము నంద వారు రమణప్పను రంగయ కిచ్చె నంతటన్,
అందపు బొమ్మయైన హనుమప్పను రాఘవరావు కీయగా
సందడి పెండిలుల్ఁ జరిగె శాంతియుతంబుగ! వెంకటేశ్వరా! 156

ఉ॥ ఆ హనుమంతరావునకు నయ్యెను సుబ్బమతోడ పెండ్లి, ను
ద్వాహము సుబ్బరావుకయె ధర్మయుతంబుగ నాయరుంధతిన్,
యైహిక వాంఛలన్ వదలి నా జనకుండు గతించె! తప్పదో
దేహమనశ్వరంబను! విధించిన వ్రాతలు! వెంకటేశ్వరా! 157

వేదయవంశము శ్రీరాముల జ్యేష్టపుత్రుఁడు

ఉ॥ ఆ మణి రత్నమాంబకనె నాత్మజ దుర్గను; పుత్రుఁడంచు శ్రీ
రాముని! వియ్యమందగ పరస్పర, మేనరికంబునై జమై
మామ భుజంగరావుకు కుమార్తెను దుర్గను, జానకమ్మ శ్రీ
రాముల కిచ్చిపుచ్చుకొనె రత్నమ కోరిక! వెంకటేశ్వరా! 158

మ॥ వరలక్ష్మమ్మ సరోజనుల్ గలిగె నా వంశంబునన్ దుర్గకున్,
వరు నాగేశ్వరు నీదుమూఁడి ఘనుకున్, వర్లక్ష్మికిన్. జూడ మే
నరికంబంచు, సరోజకున్ వెదకి కన్యాదానమున్ (జేసె న
త్తటి వల్లూరను నాగభూషణము కంతన్! వెంకటేశాప్రభో! 159

ఉ॥ కాంతగు దుర్గమాంబకును కాంతలు పుట్టగ రత్నమాంబయున్,
సంతసమంది పుత్రునకు జానకి నిచ్చెను మేనకోడలిన్,
యంతయెచాలు నాకని, యమాంతకమున్ చనె! వేదయార్యకున్
సంతతి భారమయ్యెను! నిజంబును నారయ! వెంకటేశ్వరా! 160

ఉ॥ వేదయజన్మ ధన్యమనిపించగ పొందెను పౌత్రిపౌత్రులన్,
యాదిగ రత్నమాంబయయె, అక్కగ. రత్నప్రసాదుఁడున్ మరిన్
వేదగిరీశ తమ్ములయె! విద్యల బుద్ధుల పెద్దలయ్యె! నా
వేదయ భాగ్యమయ్యె కనపిల్లల నాటల వెంకటేశ్వరా! 161

ఉ॥ అందిన పౌత్రిపౌత్రులను నాతృతకొద్దియు నాటపాటలన్
సందడనంగ దుర్గయును, సంతతితో చనుదేర తండ్రి నా
నందమునందగా గడిచె నాత్మజు పంచను, వృద్ధుఁడౌచు నా
బొందినివీడి నేగె దివి పుణ్యఫలంబున వెంకటేశ్వరా! 162

ఉ॥ పుత్రికరత్న పెండ్లినయె! బుద్ధుఁడు వాణి కుమారు కివ్వగా
పుత్రిక లిర్వురన్ సుతులు మూవురుఁ గల్గిరి వారికంత! దౌ
హిత్రుల రాము జానకియు నింపుగ నామము లిచ్చె గీత సౌ
మిత్ర యనంగ, గీతనిడె మేనరికంబుకు! వెంకటేశ్వరా! 163

ఉ॥ జానకి, రాములిచ్చెరి ప్రసాదును దత్తత సుబ్బరావుకున్,
కానఁడు పుత్ర సంతతిని గౌరవమున్ నడుగంగ నొప్పెనో
పూనిక "బూచి"యున్ తమకు పుత్రుఁడు నొక్కఁడు చాలనంగనున్
జానకి గీత కోడలిగ సమ్మతమయ్యెను! వెంకటేశ్వరా! 164

ఉ॥ "బూచి"కి పెండ్లియై సుతయు పుట్టెను మాధవినామ మందగన్,
యాచినదాని చూచి ముదమందుచు జానకి కన్నుమూసెనో,
వేచిన కాలమంతయును వేదన పాలయి పక్షవాతమున్
దాచిన ప్రాణముల్ కడకు ధర్మవుఁగ్రైకొనె! వెంకటేశ్వరా! 165

ఉ॥ అంతము జీవితంబునకు యావిధి వ్రాసిన తప్పదంచు నా
వంతని వ్యాధిగ్రస్తయయి బాధతొ గీతయు కుందుచుండె నా
సంతతి, మాధవిన్, పతి విషాదమునొందగ తాతకిచ్చుచున్
శాంతిగ కన్నుమూసి చనె చావునుపోరుచు! వెంకటేశ్వరా! 166

ఉ॥ మాతృవిహీనయై పసిది మాధవి చూచె కుటుంబ బాధ్యతన్,
తాతకు తండ్రికిన్ విధివిధానము సేవలునెల్లఁ జేయుచున్,
పాతకమేమొ? కర్మయమపాశము నెత్తుకుపోయె తండ్రినిన్,
మాతపితా విహీనయయె మాధవి వత్సరకాలమందునన్; 167

చం॥ హృదయము వ్రయ్యలయ్యె గతియించిరి కోడలు కొడుకు ముందుగన్,
యెదిగినవారు పోవగని నేడ్చుచు పౌత్రిని నొంటిఁజేసి తా
వదలెను ప్రాణముల్ ముసలివగ్గు, కుమారుని ముందుపోవ న
య్యది దురదృష్టమయ్యె, పునరావృత మయ్యెను! వెంకటేశ్వరా! 168

ఉ॥ ఆవిధి వంశమంతమయె! నందరి చావు ఘటించె దుర్విధిన్
దైవము! వారసత్వమున తద్దయు మాధవి బొందె నాస్తినిన్,
బ్రోవగ కన్యదానమయె పుణ్యముకొద్దిగ పూరుషుండునౌ
పావన పుణ్యమూర్తి వరు భర్తగ పొందెను! వెంకటేశ్వరా! 169

## శ్రీరాములు స్త్రీ సంతతి జ్యేష్ఠపుత్రి

ఉ॥ చెల్లెలు పుత్రు దత్తుగొన జేరిరి సుబ్బమ సుబ్బయార్యులున్,
పిల్లల నల్గురిన్ నొకని వేడగ రాఘవహన్మమాంబ రం
జిల్ల నొసంగె! నారమణ జెందెను రంగయయందు పుత్రునిన్
తల్లిగ వంశమున్ నిలిపె ధర్మముకొద్దియు! వెంకటేశ్వరా! 170

మ॥ నరసింహుండును దత్తుగా నరిగి పున్నామన్ నివారించగా,
వరుఁడై అక్కకుమార్తై హేమ నటు వైవాహంబయెన్! దుర్విధిన్
మరణించెన్ సతిహేమ, శోకమున నమ్మమ్మంత దౌహిత్రికై
పరలోకంబున కేగె సుబ్బమయు! దేవా వెంకటేశాప్రభో! 171

చం॥ ప్రథమ సతీవియోగము, దివంగత తల్లి విషాదబాధ లం
దధిక విచారమందున సహాయ మొనర్పగ మేనమామయున్
విధిగను నాత్మబందుగుల పిల్లను నివ్వగ నిష్టమై రమా
వధువును పెండ్లియాడి తన పత్నిగఁ గైకొనె! వెంకటేశ్వరా! 172

ఉ॥ సుబ్బులు, లక్ష్మి నాబరగు సూనుని సూన నృసింహు పొందగన్,
సుబ్బులు-శాయి పెండ్లియయి సూనుని క్రాంతుని గాంచె నంతటన్,
సుబ్బయ పౌత్రునిన్ గనుచు శోక మెఱుంగక నంత్యమందునన్,
నబ్బె శివుండనుగ్రహము నైక్యమునయ్యెను! వెంకటేశ్వరా! 173

ఉ॥ అక్క కుమార్తె హైమవతి నాతఁడు పొంద వియోగకారణం
బక్క కుమారు రామునకు నాత్మజ లక్ష్మిని పెండ్లిఁ జేయగా,
మిక్కుటమైన సంతసము మేనరికంబుకు బంధువర్గమున్
దక్కెను బాంధవంబనుచు తమ్మునుతించిరి! వెంకటేశ్వరా! 174

ఉ॥ సంతతిఁ గాంచె లక్ష్మియు వసంతుని బోలిన కొడుకునల్వురిన్,
సంతసమంది తల్లి రమ శాశ్వత నిద్రను జెందె! భర్తయున్,
వింతగ తద్దినాదులను వేదవిధానము కర్మలొక్కటిన్
సుంతయుఁజేయఁబూనఁడయె? చోద్యముగాదొకొ? వెంకటేశ్వరా! 175

మ॥ నరసింహుండును దత్తుఁడై నెఱపె పున్నామంచు శాస్త్రంబు! నా
పరి మేనత్త కుమారుఁడై తగనిదౌ బాంధవ్య స్నేహంబునై
తరువాతం డవసాన కాలమున రాధన్ఁ జూడ కాంక్షింప నె
వ్వరు నాకున్ తెలుపంగరైరిగద! దేవా! వెంకటేశా ప్రభో! 176

## శ్రీరాములు ద్వితీయ కుమార్తె

మ॥ కనె హన్మంతుని నొక్కనిన్ రమణరంగయ్యార్యు వంశంబుకున్
జనియించెన్ సుతయున్ సుతుల్ నిరువురున్ సంతాన మాతండుకున్
పనిచెన్ పెండ్లిఁజేసి కూతునొక సంబంధంబు యౌన్నత్య మ
ల్లుని నాచార్యునిగా ప్రసిద్ధుఁడన జెల్లున్! వెంకటేశాప్రభో! 177

చం॥ కొడుకులు నిర్వురై నొకఁడు గొప్పగ పశ్చిమదేశవాసియై
తడయకనేగె వృత్తిని, నతండొక నున్నత శాస్త్రవేత్తగా,
వడివడి గాంచె వృద్ధినట। బావమరందులు నున్నతోన్నతిన్!
కొడుకులు కన్నతండ్రి కది గొప్పయె నెంచగ? వెంకటేశ్వరా! 178

## శ్రీరాములు తృతీయ కుమార్తె

మ॥ హనుమాయమ్మయు రాఘవయ్య కనిరా హన్మంతు సింహయ్యలన్
వనితల్ సుందరి భాగ్యలన్, సుతలునున్, వైవాహమై వారలన్!
వనిచెన్ నత్తల యిండ్లకేగిరట! సుబ్బాయమ్మకున్ దత్తు న
య్యెన్నసింహుండును పెద్దతల్లికడ పోయెన్! వెంకటేశాప్రభో 179

## శ్రీరాములు కనిష్ఠ కుమారుఁడు

ఉ॥ ఆయన సుబ్బరావు కొక నాత్మజ (గాంచె యరుంధతందునన్,
తాయమ నామమైఁ బరగె! తామరసంబన నొక్క కూతురై,
సోయగమందునన్ తరుణి శోభనుఁ జూడగ యద్వితీయమై
కోయిల కంఠమా స్వరము కోమలి గాత్రము! వెంకటేశ్వరా! 180

చం॥ తలచి వివాహమున్ జరిపె తాయమ నిల్లరికంబు నల్లుతో,
కలిగెడు సంతతిన్ వలన గాంచగ వచ్చని వంశవృద్ధికిన్,
తలపులు భిన్నమై సుతలు తాయమ కన్నది మూవురిన్ నికన్,
ఫలితము దత్తతే శరణు భావ్యమనెంచిరి! వెంకటేశ్వరా! 181

ఉ॥ తాయమ కృష్ణశర్మలకు ధాత లిఖించగ కల్గె భారతీ
బాయియు, పద్మ, కాచియను బాలికలంతట మూవురన్, యెదో
పోయెను భాగ్యమంచు తలపోసిన తాతకు సుబ్బరావు కా
ధ్యేయము వంశవృద్ధికని యెంచెను దత్తత వెంకటేశ్వరా! 182

ఉ॥ యిల్లరికంపు టల్లునికి యిష్టమెఱుంగుచు సుబ్బరావుయున్
పిల్లఁడులేఁడుఁ గాన తను పెంచుకొనెన్ తనయన్న పౌత్రు, నా
తల్లియుఁ దండ్రియున్ తలచె తాతకు రత్నప్రసాదు పుత్రుఁడై
నల్లుని భాగ్యమర్థమున నర్హుఁడు నౌనని! వెంకటేశ్వరా! 183

ఉ॥ అత్రమునన్ ప్రసాదు నట నందిరి పుత్రుగ! పెద్దదైన దౌ
హిత్రిని భారతిన్ సుతున కిష్టమనంగను పెండ్లిఁ జేయగన్
పౌత్రుఁడు పుత్రుఁడై మనియె భారతి కోడలు సుబ్బరావుకున్
పుత్రియు నల్లుఁడున్ శ్వశురుఁబోలె మెలంగిరి! వెంకటేశ్వరా! 184

ఉ॥ తానొకటిన్ దలంచ నది దైవము వేఱొకటిన్ విధించుగా,
మానసమందు తోప దణుమాత్రము కార్యము రూపమందునో?
మానవమాత్రు లా తెలివిమాలిన నైజము తప్పు దిద్దరో?
యీ నిజమున్ గనంగనది నెంతటివారము? వెంకటేశ్వరా! 185

చం॥ తమదగు యోచనాధృతిని తర్జనభర్జనఁ జెంది వారస
త్వము సుతకి దలంచెనన, దత్తుని కిప్పుడుఁ జెందు నర్ధ భా
గము, నిక తాయమే నిపుడు కన్నది పుత్రుని కామరాజునిన్
సమలుపఱంచ భాగమెటు లా స్తినిని నిత్తురొ? వెంకటేశ్వరా! 186

మ॥ వ్యవహారంబున కృష్ణశర్మ తన వ్యాపారంబు విత్తంబునున్,
యవివేకంబున దుష్టమార్గ పథమున్ నర్పించగా నష్టమై,
భవితవ్యంబు నెఱుంగ కాతఁడటు దావా వ్యాజ్యెమున్ నోడగా
వ్యవహారుల్ విజయంబు గాంచిరయె! దేవా! వెంకటేశాప్రభో! 187

ఉ॥ కొన్నితరాల సంపద నకుంఠిత దీక్ష గడించె సుబ్బరా
వన్నచొ భోగభాగ్యముల వర్ధిలె! భావితరంబు వారికిన్
నెన్నికఁజేసి తామనుభవించగ నెంచగ, వ్యాజ్యెమందునన్
నన్నియు కోలుపోయె తన యల్లుని ధర్మము? వెంకటేశ్వరా! 188

మ॥ తన హస్తంబున యన్నదానమిడినో దాతృత్వ మిన్నంటగా?
తన బాంధవ్యము తృప్తిఁజెందగను వాత్సల్యంబునన్ జూచెనో?
తన భాగ్యంబును వృద్ధిఁజేసి తన సంతానంబు కీనెంచగా,
తన పత్నీత్వమ రుంధతీ నెరపె నంతన్ వెంకటేశాప్రభో! 189

మ॥ తను నిర్మించిన సౌధకే పతనమై దౌర్భాగ్యమున్ గాంచుచున్,
తన యల్లుండు విదేశయానమయె సంతోషంబునన్ క్రుంగుచున్,
తన జాడ్యంబొక పక్షవాతమున బాధాతప్తయై నంతటన్
చనె నాకంబునరుంధతీ సతియె! యీశా! వెంకటేశాప్రభో! 190

ఉ॥ సర్వము భ్రాంతియయ్యె, సహచారిణి పత్ని గతించె! దత్తుఁడా
నోర్వఁడు! యా స్తియంతయును యూరివశంవదమయ్యె నప్పుగా!
గర్వమె పోవగా నిపుడు గ్రాసము నల్లునినింటనే నికన్
పర్వము పూర్తిఁజేసి యమపాశము గైకొనె! వెంకటేశ్వరా! 191

మ॥ తన యర్థాంగి గతించె! దత్తుఁడును బాంధవ్యంబు పాటింపఁడే?
తను వాంఛించిన నార్ద్రితాఫలము నింద్యామాత్రమైనుండ, న
ల్లుని నింటంబడి ధర్మమోక్షములు కోల్పోవంగ రోదించుచున్
చనె నాకంబుకు సుబ్బరావు లటులీశా? వెంకటేశాప్రభో! 192

ఉ॥ పాపము పుణ్యమో? కలిగె బాలిక వేదగిరీశ కొక్కతె,
శాపము సుబ్బరావు కొక చానయు కల్గియు దత్తునిన్ గొనెన్,
శ్రీ పరమాఁడు బిడ్డలకు జెల్వుగ సంతతి నుండిలేనటుల్
యేపరమార్థ తద్దినములెవ్వ రెఱుంగరు? వెంకటేశ్వరా! 193

ఉ॥ పుత్రుఁడు కామరాజునకు ముద్దుగ పెండిలొనర్చె సుందరిన్,
పుత్రిక కాచినిన్ నొసఁగె బుద్ధివతంసుఁ డటంచు మూర్ఖుకున్,
పుత్రిక పద్మ బాధ్యతను పోషణ నెంచఁడు? పెండ్లి మాటయే
మాత్రము కృష్ణశర్మ మనమందున తోపదు? వెంకటేశ్వరా! 194

ఉ॥ యెంచి వివాహమున్ జరుప యేగెను కాచియు నత్తయింటికిన్,
చంచల చిత్తుఁడా మగఁడు సంశయమందుచు బాధపెట్టగన్
మంచితనంబు కానమిని మానినిఁ జేరెను తండ్రిపంచకున్,
వంచిత కృష్ణశర్మ యమపాశముపాల్వఁడె! వెంకటేశ్వరా! 195

ఉ॥ తాయమ, తండ్రి భర్తలు గతాసువులై చన పద్మ తోడనున్
ప్రాయముఁ దాటగన్ కొడుకు పంచను నుండి విషాదమూర్తియై
కాయము రుగ్మతన్ వధిత కాలముఁజెల్లగ పుత్రు ముంగిటన్,
పోయెను, ధన్యజీవి! గతభోగమురాదిక? వెంకటేశ్వరా! 196

ఉ॥ రత్నప్రసాదుఁ గాంచె ననురాగమువర్ధిల భారతందునన్,
రత్నము తాసుతల్ సుతులు రాజులు నాగయ, త్యాగయంచనన్,
రత్నమరుంధతీయనగ రాణి యనంగను నాదిలక్ష్మిలా
పత్నికి మాతృపర్వమను బంధము పెర్గెను! వెంకటేశ్వరా! 197

ఉ॥ శాంత యరుంధతీ, పిధప, చక్కని చుక్కను నాదిలక్ష్మికిన్,
నంతట పెండ్లిఁ జేసి తన నల్లుర లాంఛన వైభవంబులన్,
సుంతయులోటుఁ జేయకయె శోభగకావుర మత్తయిండ్లకున్
కాంతల నంపె! భాధ్యతగ గౌరవమొప్పగ! వెంకటేశ్వరా! 198

చం॥ తనయులు నాగరాజుకును, త్యాగయ కంతట పెండ్లిఁ జేయగా
వనితలు కోడలిద్దఱును "బొంకుల" భారత యాజమాన్యమున్
పని కలుగంగ పుత్రులును బాధ్యత తండ్రికి తోడునీడయై
చనిరి! ప్రసాదు భారతియు సౌఖ్యము నుండిరి! వెంకటేశ్వరా! 199

## శ్రీరాములు ద్వితీయ కుమారుఁడు హనుమంతరావు

మం॥ తన వంశంబును నిల్పగోరి ఘను వేదయ్యార్యు చీరాలవం
శనరేంద్రుం డొక కర్లపాలె మను వంశంబందు బాలుండునిన్,
గొనె, శ్రీరాములు నామమై హరితసా గోత్రుండు దత్తుండయెన్,
అనపత్యుండు యపత్యుఁడై తనరెనయ్యా! వెంకటేశాప్రభో! 200

శా॥ చీరాలాన్వయ భూషణుడు ఘనుఁడా శ్రీరాముకున్ పుత్రుఁడై,
గారాబంబున మధ్యముండునయి సత్కార్యాధురీణుండునై,
ధీరుండా హనుమంతరావునకు నుద్దేశించె నొప్పించె సు
బ్బారాజున్ సుత సుబ్బమాంబ వధు విర్వన్ వెంకటేశాప్రభో! 201

శా॥ బందా వంశము సుబ్బరాజు సుత సుబ్బమ్మన్ వధూ లక్ష్మి నా
ప్పందంబై హనుమంతరావు వరునుద్వాహంబు గావింప నా
నందంబై జరిపించ యంతటను కన్యాదాత మూర్తంబునున్
సందేశంబును బంపె క్షీరపురి కీశా వెంకటేశా ప్రభో! 202

మ॥ సుముహూర్తంబున వేటపాలెము వధూ సుబ్బమ్మకున్ నివ్వ నా
సుమనోజ్ఞున్ హనుమంతరావునకునున్ శోభాయమానంబుగా
రమణీయంబగు మంటపంబునను నార్భాటంబు రాణించగన్
అమితోత్సాహ పురస్సరంబుగను కళ్యాణంబు గావించెనున్; 203

మ॥ హనుమంతార్యుఁడు నౌకరీకతన కళ్యాణంబునై వెంటనే
వెనువెంటన్ తలిదండ్రులానుమతి రైల్వే ప్రాంతదేశంబుకున్
చనె, కావమ్మయు కొంతకాల మట సంసారంబునున్ చక్కగా
కనులారన్ సరిదిద్ది చేరె పతివంకన్ వెంకటేశాప్రభో! 204

ఉ॥ నౌకరి కారణాన సతి నమ్మిన నాధుని కాపురంబునన్
చాకిరి కష్టమున్ నెఱిగి సంతతి పొందక యేకజీవితౌ
సాకెను కుక్క నొక్కటిని సాయమునుండగ నొంటినుండకన్
ప్రాకిన తీగవోలె యనురాగము వర్ధిల వెంకటేశ్వరా! 205

చం॥ సమయము రానిదెవ్వరికి సంతతిఁ గల్గదు నెంతఁ జేసినన్
అమృతము సేవనన్ గలుగు ఆయువు వృద్ధియె! పోలిరెడ్డి పా
లేము బదులాయె వారలకు లిల్లియ తోడుగ నేగియుండగన్
భ్రమరమువోలెనై బ్రతుకు బాటలు చేరును! వెంకటేశ్వరా! 206

మ॥ అలవాటున్ హనుమంతరావునకు తా అన్నంబు వడ్డించగన్,
పలికెన్ స్టేషను గంట! రావు చన నాశ్వానంబు వెంటాడ, లో
పలి సుబ్బమ్మయు కుక్కతెచ్చుటకు పోవన్ రైలురా, డీకొనెన్,
బలిగొన్నెన్ శునకంబు సేమమెయి నిల్వన్ వెంకటేశా ప్రభో! 207

ఉ॥ ఆవిధి క్రూరకర్మరుడు అన్నెముపున్నె మెఱుంగనైన దా
జీవిని అల్పప్రాణి శుని సేమము నారయ ప్రాణమంత కో
ల్పోవగ తప్పదయ్యె! తన లోపము లేకయె నోరులేని దా
జీవికి రక్షణం బిడెడు చింతతొ శ్రీపతి వెంకటేశ్వరా! 208

మ॥ అనపత్యుండయి భార్యపోవగను నా హన్మంతురాయుండునున్
తన యుద్యోగము ధర్మమాయనుచు చింతాక్రాంతుఁడై యుండగా,
విని పత్నీ అనుజుండు శంకరుఁడునున్ విజ్ఞాపనన్‌జేసె "నా
యనుగుఁన్ సోదరి రంగనాయకిని, కళ్యాణంబునన్ నెంచితిన్; 209

మ॥ "అనుమానించక నీయకోమనుచునున్ నర్థించ హన్మంతుఁడున్,
తన మాతానుమతిన్ అగ్రజానుజులు బాంధవ్యంబు చెప్పంగనున్,
మనసాఁ గైకొనె రంగనాయకిని సన్మానించె కళ్యాణమై
చనె యుద్యోగము బాధ్యతన్ సతితొనీశా!వెంకటేశాప్రభో! 210

చం॥ ప్రథమసతీ వియోగ మన పత్యుఁడు, భార్యయునై ద్వితీయమున్,
విధి వశ రుగ్మతన్ పదవి వీడుచు చేరెను యింటికంతటన్,
మధన పడంగ సంతతికి మాత్రము నోచదు రంగనాయకిన్
అధమము దత్తతే శరణమంచని యెంచెను! వెంకటేశ్వరా! 211

ఉ॥ క్షీర పురీశమధ్యముఁడు ఖిన్నుఁడపత్యము వాంఛితుండు శా
రీరిక రుగ్మతన్ బొగుల రెండవ భార్యయు వంధ్యయై చనన్
గోరెను దత్తుగా హరిత గోత్రజు పిన్నవయస్కు రాధనున్
చేరిమి మాతృహీను తను పెంచగ నెంచెను! వెంకటేశ్వరా! 212

శా॥ రాధాకృష్ణుఁడు నామధేయుఁడు దశప్రాయుండు నారాయణ
ప్పాధార్మికు కనిష్ఠ పుత్రుఁడును యాపై మాతృహీనుండు నే
యాధారంబును లేనివాని హనుమంతార్యుండు దత్తున్ గొనెన్
తా ధర్మంబని యెంచి చేర్చె తన చెంతన్ వెంకటేశా ప్రభో! 213

ఉ॥ చర్విత చర్వణంబనుట సార్థకమై చనె! తండ్రి అంశమే
పూర్వపు వారసత్వమును బొందుట సవ్యమె? వ్రాసియుండగా
దుర్విధి తల్లిపోయె మును దుఃఖితుఁ డెవ్వరి నండలేని తా
నోర్వక దత్తుగాఁ గొనెను! యుక్తమటంచును వెంకటేశ్వరా! 214

మ॥ క్షయవ్యాధీ ముదురంగ జీవితపు నాశన్ లేక వంశంబు సం
శయ వృద్ధిన్ కనుపింప భార్యయును నిస్సంతై. గతించన్ ద్వితీ
యయు రంగమ్మయు వంధ్యయై మనగ నభ్యర్థించి రాధయ్య రా,
పయనంబై చనె నాకలోకమున కప్పా! వెంకటేశప్రభో! 215

ఉ॥ పుట్టెను కర్లపాలెమును పుణ్యవశంబున పంచవర్షముల్
నెట్టెను మాతృహీనుఁడయి నీ దయయంచు సహోదరిండ్ల నె
ట్టెట్టులో కాలమున్‌గడువ నియ్యది జీవిత భాగ్యమంచనన్
పెట్టగ పాదమున్ పితృఁడు వెంటనెపోయెను! వెంకటేశ్వరా! 216

ఉ॥ పొండనె జన్మభూమి! తలపోయగ మాతృదయామృతంబు లే
కుండగపోయె! సోదరి సహోదరులిండ్లకు దూరమయ్యె! నిం
దుండగవీఁడు, కీడగు! నయోగ్యుఁడు ప్రేమ పరానురాగము
న్నిండని తల్లిబాసె! పితృనెట్లు గతించెను! యేమిచేయుదున్?; 217

ఉ॥ "నా జననీ వియోగమయె! నాదగు సోదరి నిండ్ల చూడనే?
నాజనకుండు కానఁడయ్యె? నాశ్రయమిచ్చిన దత్త తండ్రి దా
భాజన మబ్బదయ్యె? కడుపారగ నోగిరమబ్బదయ్యె? నే
నాజవరాలు రంగమను నమ్మితి అమ్మగ"? వెంకటేశ్వరా! 218

ఉ॥ "నాయన దత్తుతల్లియెయనాదరణీయయు, మాతృవర్గ మా
త్మీయత ప్రేమఁ జూపరయె! మెచ్చరు, అన్నలు నుండనీయరే
ఆయమ చేరదీయదయె! అగ్ని పరీక్షగ నెట్లు నిల్వ నా
ధ్యేయము కాతువో"?యనెను దీనముఖుండయి దత్తుతండ్రియున్;219

మ॥ తన పత్నీవిముఖత్వమో? సతిసబాంధవ్యంబు నిష్ఠూరమో?
తన శారీరిక రుగ్మతో? ముడివడన్ ధర్మంబుగా "విల్లు" నిన్
ననుజున్ పాలకుఁజేసి బాలునకు వ్రాయన్ భార్యపుట్టింటి వా
రనుయాయుల్ పెడమోము పెట్టిరట! నౌరా? వెంకటేశాప్రభో! 220

మ॥ అడుగుల్ వేయుట అమ్మనేర్పె! పలుకన్నాడించ చెప్పించెబో?
వడిపోదత్తుని గోటఁదెచ్చె? తనదౌ వంశాంకురంబబ్బెబో?
చెడిపోకుండ నరుంధతీ ద్వయము కాచెన్ నన్ను రక్షించిరో?
చెడునే భాగ్యపదంబు ధర్మమగుచో? శ్రీ వెంకటేశాప్రభో! 221

ఉ॥ "పుట్టిననాడె పెట్టుకొనె పొట్టను తల్లిని! నిప్పుడందుమో
పెట్టిన పాదమున్ ననిపె పెంపుడుఁదండ్రి! నదృష్టహీనుఁడే?
నిట్టుల మృత్యువాత నితఁడీవిధి నెందటి నంపబోవు? ని
ప్పట్టున నుండఁబోతగఁడు! పాపియనం" చనె! వెంకటేశ్వరా! 222

చం॥ గవదకు గ్రంధు లేర్పడగ గడ్డముక్రిందట "లూటి" కల్గగన్,
వివరము కాంచినమ్మమయు "వీడికినాక్షయవచ్చె! యైననున్
నవసరమేమి? వాఁడిచటనర్హుఁడు నుండతగండు" నంచనెన్,
నవునని అమ్మయేవెడలె నన్నలవద్దకు వెంకటేశ్వరా! 223

ఉ॥ పంచను జేరఁగాంచియు, నభాగ్యుఁడు వచ్చెనటంచు లోన తా
వంచిన మస్తకంబు తలుపడ్డము వైచుకొనంగ, మ్రింగుచున్
మించిన వేదనత్తటిని మెల్లగఁజూచియుఁ జూడనట్లుగా
పంచిరి వేటపాలెపుర ప్రాంతముపీడగ! వెంకటేశ్వరా! 224

ఉ॥ పెంపుడుతల్లి పోషణము విద్యకు పొత్తు పొసంగబోదు! న
న్నంపెను సుబ్బరావు పెదయన్నకడన్ చదువబ్బునంచు తా
నెంపికఁజేసి బత్తెమును నేర్పఁటచెన్, నిక అక్కయింటనే
సొంపుగ సాగె జీవితము చూపిన మార్గము! వెంకటేశ్వరా! 225

మ॥ అటు శ్రీరాములు పాఠశాలకడ విద్యాబోధనన్ జూడగా,
నిట సుబ్బక్క గృహంబునన్ చదువు సాగించంగ, భాతృండునున్
నటు బత్తెంబున నోగిరంబిడగనాహా! సత్రమందన్నమున్
మఠమున్ నిద్రయురీతి సాగెనట సుమ్మా! వెంకటేశాప్రభో! 226

ఉ॥ అక్కయు వర్ధనమ్మపతి నాయువుతీఱ గతించె! రంగమాం
బక్క సుతుండుకున్ "వడుగు"నంచన వెళ్ళితి! "వద్దు" కంత నే
నక్కజమంద దొంగతన మావిధినాకును నంటగట్టగా
మిక్కిలి కుందుచుండ తుది మేలమునాడిరి! వెంకటేశ్వరా! 227

ఉ॥ యే మహనీయురాలు ముఖమెప్పుడుఁ జూడగ ముచ్చటయ్యెడున్?
యే మహిళామతల్లి నిలువెప్పుడు సంపద నోలలాడుసున్?
నే మహిషీలలామ కమనీయ కనుల్ కరుణాంతరంగమో?
యామె నరుంధతీసతియె! నందఱిబంధువె! వెంకటేశ్వరా! 228

చం॥ ఒకసతి మాతృమూర్తి నొడి నుయ్యలలూగగ నెందఱుందురో?
యొక తలి చన్నుబాలకును యోగ్యత త్రాగనదెంత భాగ్యమో?
యొక తలినార్ద్రితా ఫలమునొందగ నోచుకొనంగ నౌనా? నా
సకల గుణాన్వితా మహిళ చారునరుంధతి! వెంకటేశ్వరా! 229

చం॥ ఉపనయనాది కార్యములు యోపినరీతి విధానమార్గమున్
జప నియమాది కృత్యములు సాధనకర్మల కాలవాలమై
నుపకరణీయమౌ వడుగు యోగ్యత భాసిలఁజేసిరంత! భా
విపథము పోషణార్థమున వీలగునట్టుల వెంకటేశ్వరా! 230

ఉ॥ ఆమెది మాతృప్రేమయె! యయాచితమైనది పంచె నాకునున్!
భామిని నొక్కనాఁడది వివస్త్రుగ నన్నము పెట్ట మంగయున్
"నేమది? నవ్వరే? యనగ" నీతఁడుపుత్రుఁడె చిన్న బొట్టె తా
నేమెఱుగున్ సుమీ!" యనుటయేనదిచాలును! వెంకటేశ్వరా! 231

ఉ॥ నా పినతండ్రి భార్యయగు నామెయె సాధ్వియరుంధతీసతీ
యోపినరీతి కూతునను నుల్లమునందున నొక్కరీతిగన్
జూపెను పెట్టుపోతలలఁ జూచెడు భాగ్యము విన్నవారికిన్
నాపని నవ్వులాట యగునౌనని తోచెడు! వెంకటేశ్వరా! 232

ఉ॥ విద్యయు సంస్కృతిన్ పెనగవేయును, మానవుఁడున్నత స్థితిన్,
విద్యయు లేనిచో పశువె! వృత్తిని నమ్ముచు జీవితంబు, నై
వేద్యమిడంగ వచ్చును? అవేగద! సంపద భోగభాగ్యముల్?
ఆద్యము నంతమున్ వఱకు నబ్బును! నిల్చును! వెంకటేశ్వరా! 233

శా॥ ప్రారంభించిన విద్యయై వడుగు సంప్రాప్తించ యాచార సం
స్కారాదుల్ హనుమంతరావునకు సంక్రంబించు కర్మాదు లా
ధారంబై చన పుణ్యలోకములకున్ ధర్మార్థ కళ్యాణమున్
శ్రీరాం శర్మకుఁ జేయ నిశ్చయమయెన్ శ్రీ వెంకటేశా ప్రభో! 234

మ॥ చదువున్ సంధ్యలు పూర్తియయ్యె సికనున్ సంపాదనే ముఖ్యమై
యది నుద్యోగము తండ్రిగారి పరమైయత్నించ రైల్వేలలో
యది లభ్యంబయె! జీవితాశయము సిద్ధ్యర్థంబు గూడూరుకున్
పదిలంగా చనె రామశర్మ కడ కప్పా! వెంకటేశా ప్రభో! 235

శా॥ యే సంస్కారము కోసమై ననుజుకున్ నిచ్చెన్ గదా! నాజ్ఞలన్
నాసంబంధపు దత్తతన్ వడుగునున్ నాచారమైఁ జేయగా,
తా సంసిద్ధుఁడు పూర్తిగా వదినె బాంధవ్యంబు కల్పంగ, తా
నాసంస్కారమె పెండ్లికిన్ గడగెనన్నా! వెంకటేశా ప్రభో! 236

మ॥ అది ధర్మంబని సుబ్బరావు తలచెన్, నాశాలతా లబ్ధియై,
మది ప్రేరేపణజేయ రంగమను సన్మానించ సంబంధమున్!
వదినే కోరగ తప్పదంచు నిక వైవాహంబుకున్ పూనె! న
య్యదునున్ మేనరికంబుకేఁ గడగెనయ్యా! వెంకటేశా ప్రభో! 237

ఉ॥ కాగలకార్యమంతయును కానగపట్టములేకవచ్చె ను
ద్యోగము! రూప్యముల్ నిరువదొక్కటి? జీతము, జీవితంబుకున్
నేగతిచాలు? జాతకము నీగతినుండ డిపార్టుమెంటు రై
ల్వేగలదయ్యె! నేశ్రమయులేక లభించెను! వెంకటేశ్వరా! 238

ఉ॥ చిన్నతనాన పెంచినది చెల్మికతంబున "ముంజె" పీడగన్
పెన్నిధివోలెవచ్చి విడిపించగ సాయమొనర్చె! తోటి వా
రన్న విధాన రాఘవయె నాలిగ నిర్ణయమయ్యె! ముందుగన్
పన్నిన వ్రాతమార్చుటకు పద్మజుకెట్లగు? వెంకటేశ్వరా! 23

ఉ॥ చేరగనాలు మాసములుఁ జెచ్చెరనయ్యె! వివాహవార్తయున్,
సారము మేనమామ సుత శాంతగుణాన్విత! సౌమ్యశీలియున్,
చారువిభూషణాంగియనఁ జాలెడు రాఘవరత్నమున్ వధూ
సౌరభమంచు పేర్కొనిరి చల్లటివార్తగ! వెంకటేశ్వరా! 240

## ఉద్యోగ వివాహ సంస్కారాలు

శా॥ భారద్వాజస గోత్రియై ఘనుఁడు సుబ్బారాజుకున్ పౌత్రియై,
క్షీరాబ్ధిన్ గలనాదిశేషునకు లక్ష్మీదేవిగా పుత్రియై,
పారావార యశోవిశాలమగు నా బంధాన్వయా వంశమై,
యారత్నంబగు రాఘవాంబ వధువయ్యా! వెంకటేశాప్రభో! 241

శా॥ ఆశ్వీజంబున శుక్లపక్ష విదియన్ నారూఢమైనాఁడు జ్యో
త్స్నాశ్వారూఢుఁడు మాసుఖాను భవజ్యోత్స్నా ప్రాప్తికిన్ మొక్కయై,
శశ్వత్కీర్తి కుమార చంద్రముఁడు రాట్సామ్రాట్టు నాశీస్సులన్
నైశ్వర్యంబు యశస్వులై మన వివాహంబట్లు శోభిల్లగన్; 242

ఉ॥ నాతి చరామి యన్న వచనాంతరసత్య పథైక వర్తనం
బేతటి నిల్పుకోవలె సుమీ? మనమైకొనితెచ్చు సంఘ దు
ర్నీతులుగా మతంబును గణింపక సర్వసుఖాను ప్రాప్తి ఖ
ద్యోతములై వెలుంగగ నహో యని లోకులు మెచ్చునట్లుగా; 243

మ॥ పదమూఁడేడుల ప్రాయమున్ చెలియనవ్యాజాను రాగంబుగా
మదిలో జన్మపురాకృతంబనగ సన్మానార్హ భావంబునన్,
మదిరాక్షీ మధురాను రాగయన జన్మాంతాను బంధంబునన్
హృదయాధిష్ఠిత దేవతై విదితమయ్యెన్! వెంకటేశాప్రభో! 244

ఉ॥ విద్యయు వృత్తియున్ నొకటి వెంబడి నొక్కటి నాశ్రయించు, నై
వేద్యము జీవితంబనగ వేల్పులసన్నిధి పెండ్లికాగయున్,
చోద్యముకాని యున్నతిని శోభఁ దలిర్పగ నాచరింప సం
పాద్యము భోగ్యమై వెలయు భావిసుఖించగ! వెంకటేశ్వరా! 245

ఉ॥ పెండిలి మూఁడునిద్రలును, పిల్వ పదాఱవరోజునందు, నా
పండుగ సంప్రదాయమగు వైభవ "మోజులు" నేనెఱుంగ; నా
యండగ వృత్తియుండెగద! ఆసతి పుష్పవతయ్యె, నంచనన్
మెండుగ రాఘవాంబకయె మించినవేడుక! వెంకటేశ్వరా! 246

శా॥ కౌమారీదశ మొగ్గయౌను; ననలాకారంబు పుష్పంబు, శో
భామాధుర్య వితాన సంజనిత ప్రాభాతారుణారాగ తే
జోమోహాకృతి రాఘవమ్మ మనసా సుస్థాపితంబయ్యెనో?
యామాణిక్యము దీప్తివంత మయెనయ్యా! వెంకటేశాప్రభో! 247

చం॥ వరదమ పెద్దయక్కయు వివాహపువేళను సూచితంబుగా
మరదలు పేరు మాత్రము సమంజసమందదు "మో"టనంచు నిం
దిరయని నామముంబిడుచు దీవెన లిచ్చెను! నాతికప్పుడున్
వరుసకు వైశ్యనామమని వాడుకనందెను! వెంకటేశ్వరా! 248

ఉ॥ చేరిన వత్సరాంతమున శిక్షణనిచ్చు నెపంబుమీద గూ
డూరున తాడిపల్లికికడున్ దరిఁజేరగ మార్చిరంత! నా
చేరువ సర్వశిక్షణల శ్రేష్ఠుఁడనంగ సహాయకుల్ ఘనో
ద్దారుఁడనంగ నాటకము తద్దయు వ్రాసితి! వెంకటేశ్వరా! 249

ఉ॥ ఆ దశసాహితీప్రియులు యాంధ్రపదంబున "నవ్య సాహితీ"
వేదిక విశ్వనా ధడవి, వేదుల, నాయని, రాయప్రోలు, శా
స్త్రాదులు, నోరివారి పరిషత్తున భావకవిత్వ పోషణం
బాదిగ కంకణంబయె సభాస్థలియందున! వెంకటేశ్వరా! 250

ఉ॥ ఆదరణానుభూతి, పఠనానుభవంబును గ్రంధమందు భా
వాదుల శర్మ సంకలిత వాదవివాద వితర్క తర్క సం
పాదిత తత్వమున్ తెలుఁగు పండితపూజ్యులు సాహచర్య మా
పాదితమై కవిత్వమున బంధురమయ్యెను! వెంకటేశ్వరా! 251

శా॥ విద్యా సంస్కృతి పాటవంబు బహుధా విఖ్యాత ప్రాచుర్యమై
నుద్యోగంబున యీ విధానమొకచో యుక్తానుసారంబుగా
విద్యార్థుల్ గురు సాహచర్యమున వైవిధ్యంబు సాహిత్యమున్
నుద్యంబించి కవిత్వమల్లనయె, కాదో? వెంకటేశాప్రభో! 252

చం॥ అదియొక సంస్మృతీయ గమనార్హ మనోజ్ఞము సాధనంబుగా
మది భరితంబుఁగాగ, నసమానప్రదర్శన సూచితంబుగా,
మెదిలె తెలుంగు నాంగ్లమున, మిత్రులు కోరగ నాటకంబులన్,
బెదరక "దీక్ష" "షేక్స్పియరు" ప్రీతిగ వ్రాసితి! వెంకటేశ్వరా! 253

ఉ॥ తీయని నూహలన్ మధుర దివ్యమనోహర రూపకల్పనన్
పాయకనిల్చె నా హృదయపద్మముననన్ సతి ముద్దుమోము, శో
భాయతమానయై స్ఫురిత వత్సరకాలవి లంబనంబు, వా
జేయని నేరమైపరగ శిక్ష విధించెను! వెంకటేశ్వరా! 254

మ॥ సతి నాలోకన మత్సుకత్వ మదినాశా ప్రేరితంబై సమం
చిత ప్రేమార్ద్రత సార్థకంబుగ ఫలించెన్, నాసుధాసాగరో
ద్భుత మాణిక్య విరాజితంబుగనొ? యేదోనప్సరోభామ మౌ
ళితలాలంకృత పారిజాతసుమ వోలెన్! వెంకటేశాప్రభో! 255

చం॥ గురుఁడను వాఁడు నొక్కఁ డనుకూల్యత నాదరణీయ గౌరవుం
డరుదుగ లభ్యమౌను గద! యమ్మయె కోడలి కాపురంబుకున్
త్వరితము తేగలందులకు తామొక నిశ్చయమంద పల్కగా
గురుఁడు సుమూర్తమున్ నిడెను, కోడలి రాకకు! వెంకటేశ్వరా! 256

చం॥ ప్రథమ సమాగమంబు పరివర్తన జీవిత భాగ్యరేఖకున్,
మధుర రసానుభూతి రతిమన్మథకేళి వితానమై చనెన్,
విధి యనుకూల్యమై ననుభవింపగవచ్చు సుఖానుభూతినిన్,
నధరితమైనచో నరకయాతన తప్పదు! వెంకటేశ్వరా! 257

చం॥ ప్రథమ సమాగమంబు సముపార్జిత జన్మ వివాహబంధమై,
ప్రథమ దినంబునన్ తెలియపర్చెడు మోహము పెంపుమీరగన్,
మధుర రసానుభూతిగల మానసమందున కాంక్ష యుక్తమై,
వ్యథ నెఱుగంగ తా బ్రతుకు నాశలఁ జూతురు! వెంకటేశ్వరా! 258

చం॥ చెలి దరహాస చంద్రికలు చిప్పిలు శోభ రసానుభూతినిన్
చెలువము మీఱనౌ వినయశీలత ముగ్ధ మనోహరాకృతిన్,
లలితమృణాసుతంతుసు విలాస విరాజిత పాణిపద్మముల్,
నలరెడు మోహభావ హృదయంగమమయ్యెడు! వెంకటేశ్వరా! 259

ఉ॥ నిండుగ మూఁడు రేబవలు నిర్భర ముగ్ధత మొక్కటై, సుధా
భాండము మ్రోలనుండ ప్రతిభావిత చుంబ కపోలచుంబితా
కాండ ప్రకర్షితాభరిత కాలవిచక్షణ శూన్య భావమున్,
పండిన కేళిలోలిత విభాసితులై తిమి! వెంకటేశ్వరా! 260

మ॥ సతి మందారవనాంత లభ్యసుమమో? సౌగంధ పుష్పంబయో?
సతి మందాకిని తీర నప్సరస సంచారార్థ మేతెంచెనో?
అతివాలోకన నాగకన్య నిలవాహ్యాళిన్! కనన్ వచ్చెనో?
పతి సేవార్థమె నేగుదెంచెనొకొ? దేవా! వెంకటేశాప్రభో! 261

ఉ॥ కాలమతిక్రమింప చిరకాంక్షిత వాంఛనుదీర్ప సిద్ధమై
పాలసముద్రమున్ సుధసభాండవ ముద్భవ మోహనాంగి శో
భాలలితాంగి వాఙ్మధుర భావవిలక్షణ భూషితాంగి, ప్రే
మాలత కాపురంబునకు మాలతిమాలగ, వచ్చె నంతటన్! 262

ఉ॥ యే నవమోహనాంగి తన యింటను కాలును మోపనోచెనో?
యే నవనీత మానస మభీష్టపుసిద్ధికి నేగుదెంచెనో?
యే నళినాక్షి వీక్షణ మమేయ కృపా కరుణాంతరంగమో?
యా ననలావిభూషణ సుఖావహమయ్యెమ! వెంకటేశ్వరా! 263

చం॥ గడచెను కొంతకాలము సుఖంబుగ కృష్ణకెనాలునందు, నే
బెడదయులేక భార్యయు నభీప్సిత సిద్ధికి తోడ్పడంగ, తా
కుడియెడ మాభిజాత్యము చిగుర్చగ ప్రేమలతాంగివోలెనున్
నెడనెడయత్త చిత్తమలరింపగ తోడ్పడె! వెంకటేశ్వరా! 264

ఉ॥ క్షీరపురీ నివాసమగు కేంద్రము, చెన్నపురీప ధాది వా
ల్తేరుకు రైలుమార్గ సరళిన్ చరియింపగ యుక్తమైన సం
చారము వృత్తిగాగలది జాతకరీతి నొసంగ నయ్యెనో?
చేరి విధాయకంబు నివసించితి నచ్చట! వెంకటేశ్వరా! 265

ఉ॥ తంతి సుశిక్షకున్ నియమితంబయి నేనటు చెన్నపట్టణం
బంతటనేగు దెంచగ సహాయము ప్రాప్తము నయ్యె నాకునున్,
కొంతకు కొంత మేలనగ కూర్చెను మిత్ర సమాగమంబునున్,
నంత సుఖావహంబయెను! నాదర మందగ! వెంకటేశ్వరా! 266

ఉ॥ మిత్రుఁడు సాంబమూర్తియును మిత్రుఁడు నాతఁడు పద్మనాభుడున్,
నాత్రత సూర్యనార్యుఁడు మహాగ మనంబున హర్షగాత్రులై,
చిత్ర మనంగ నొక్కయెడఁ జేరితి మంతట! పద్మనాభుతో
మాత్రము వాసమయ్యె మదిమంచితనంబున! వెంకటేశ్వరా! 267

ఉ॥ మాసము లాయె మూఁడు, నియమంబుగ తంతికలాప శిక్ష మ
ద్రాసున పూర్తియయ్యె! విహితంబుగ నాలుగు వత్సరంబులున్
వేసినచోట నెప్పుడును వెళ్లుచు మండలమంత తప్పకన్
చేసితి యంత్రమో యనగ జీవిత చక్రము(వృత్తిని)వెంకటేశ్వరా! 268

చ॥ సమయము వచ్చినన్ నెవరు చావును తప్పు కొనంగలేరు! ప్రా
యము నతి వృద్ధయై తనువు నందలి మోహము వీడఁబోరు? న
మ్మమ ముదివగ్గు ప్రాణముయముండు హరించెను! తప్పదంచునో
సముచిత రీతి కర్మల విషాద సుఖాంతమె! వెంకటేశ్వరా! 269

చ॥ అరువదియై దువత్సరములన్న నృసింహుఁడు రాచపుండుతో
కరుణను వీడి నేగెదివి కర్మము మీదియటంచు తండ్రినిన్
నరకపు యాతనన్ మునిచినాదురదృష్టపు జీవి కర్మలన్
జఱుపక ముందు పోయెను! విచారము ముంచుచు వెంకటేశ్వరా!270

ఉ॥ తొంబది యేండ్ల వృద్ధుఁడయి దుఃఖపు మూర్తిగ మారి కొడుక్కు ము
ఖ్యంబుగ పోవగన్ యముని కర్మను దూరుచు నాకమేగె! తా
సాంబశివున్ దలంచుచు! నశౌచపు కర్మలనున్ ద్వితీయుఁడే
వెంబడిఁజేసె ధర్మయుత వేదవిధానము! వెంకటేశ్వరా! 271

చ॥ అయిదున కన్నతల్లి చనె! అస్తగతుండయె దత్తు తండ్రి నా
పయి దశ ప్రాయమందునను! ప్రాణము వీడెను కన్నతండ్రి నా
వయసది యిర్వ దొక్కటిన! పాపమె! యిందఱి చావుకెల్ల నా
కయిదురదృష్టమున్ గనగ కాదొకొ ? శ్రీపతి వెంకటేశ్వరా! 272

చ॥ అది యొకలోతు కాలువ భయానక వేగము, దాట కష్టమౌ,
హృదయము మత్సరంబునను నేగితి మిత్రుఁడు నీదులాడగన్,
కదలెడు వేగమున్ మునుగ కట్టె దురన్చను నావగాంచి నే
నెదురుగ నేగి మున్గితిని నీదగ లేకయె! వెంకటేశ్వరా! 273

చ॥ పడవను జేరఁబోయినొక పట్టున మున్గితి! పైకి లేచినే
తడబడ తీరమున్ గనక తాకుచు మున్గితి రెండుసార్లు! నా
పడు దురవస్థఁ గాంచినను బైటకు లాగగ భగ్నయత్నులై
నడరెడు మానసంబు తుది యత్న ఫలంబయె! వెంకటేశ్వరా! 274

చ॥ మరణము తప్పెనో! సతిసుమంగలి సూత్రముఁ గాచె సన్మునున్,
నెఱుగఁడె దైవమాతులసి నెప్పుడు పూజలు సల్పునాతికిన్
కఱువౌన రించునే? సతులకావదె మంగళగౌరి నెప్పుఁడున్?
వెఱపది యేల నండగను వేల్పులు నుండగ! వెంకటేశ్వరా! 275

చం॥ ప్రథమము మున్గ నావ గడ పట్టును తప్పితి! రెండొసారినున్
విధినను మున్చ నాకు కనిపించెను మంగళసూత్రమున్ స్మృతీ
పథమున! మిత్రుఁడున్ పరులు పాంథులు లాగిరి నొడ్డు పైకి! నా
విధమున కాచె పత్ని తన వేల్పు వరంబున వెంకటేశ్వరా! 276

చం॥ పటుతర బాధ్యతన్ పెనగవైచెను బందుగు లాదరింపగన్,
నటునిటులెట్టులో రవి మహాదశ చంద్రదశాంతరంబునన్
దిటవుగ ఖాయమయ్యెను! విధించిరి మార్పును "రోడ్డువాను" నం
తటనది ప్రాప్తమై తనరె దైవకృతంబుగ! వెంకటేశ్వరా! 277

చం॥ సతతము భర్తదేశమున సంచరణంబున, నత్తయింట నా
యతివయ నొంటినుండ తగదంచును తండ్రితొనేగె యిందుయున్,
హితవుగ మాసముల్ పదియు నిట్టులె సాగెమ! తప్పదంచునున్!
వెతలు పడంగ నోర్పును వివేకము ముఖ్యము! వెంకటేశ్వరా! 278

చం॥ యిరువదియైదు రూప్యములు యింపుగ జీతము కాపురంబుకున్
పరువము నిల్పుకొంచునటు బందు సమాదర పెట్టుపోతలున్,
నెఱుగక కాలమున్ గడపి నిత్యము తృప్తిని బొందితింతకున్,
మఱపుకురాని రోజులవి మానస మందున! వెంకటేశ్వరా! 279

చం॥ మఱుసటి వత్సరంబు "చిన మాస్టరు" శిక్షణ నివ్వనెంచి నం
పిరి నను చెన్నపట్టణము; పిమ్మట నల్వదియైదురోజులై
పరగె పరీక్షకున్ క్రమము పద్ధతి సాగ, జయంబుగాంచి నే
నరిగితి నింటికిన్ విజయునై సతిచెంతకు! వెంకటేశ్వరా! 280

ఉ॥ చెన్నపురీ నివాసమున శిక్షణ కాలము పత్నియిందుయున్
యన్నుల మిన్నయో యనగ నప్సరసంగను బోలు చానినిన్,
మిన్నగ చెల్వుమీఱగను మేను పసిండిది కాంతి దేహమున్
కన్నది పాపనున్ గృహము కాంతి వెలుంగగ! వెంకటేశ్వరా! 281

ఉ॥ రెండవ యుద్ధకాలము పరీక్షగవేసె జపాను బాంబులన్,
దండిగ చెన్నపట్టణము తల్లడిలంగగ; కాలమయ్యె నే
నిండు మనంబునన్ బదిలినేగితి నాజ్ఞల నివ్వగన్నెదో
కొండొక కాలమున్ గడుప కోర్కెమనంబున! వెంకటేశ్వరా! 282

శా॥ తాడేపల్లికి నేగితిన్ మరొక నధ్యాయంబు సాగించగన్,
నీడల్ తేలగ పంచమాసముల ప్రాణిన్, నిందిరాదేవి నా
తోడై రాగనుమాతసున్, కలిసి నుద్యోగార్థమైఁ జేరగా
నాఁడే లక్ష్మిప్రసూన నామమిడిరన్నా! వెంకటేశాప్రభో! 283

చం॥ ఒకరికి నల్గురంబగుట నొద్దిక చాలని జీతమైచనన్,
నికరము జీతమేబదికి నిండని భృత్యము, గడ్డురోజులున్,
వికలమనస్కునై మది, "డిఫెన్సను"నైన పథంబుఁ జేరగా
సకలము సవ్యమై పఱగె! సంతసమందితి! వెంకటేశ్వరా! 284

మ॥ అడుగుల్ వేయగ తొట్రుపాటు గమనీయార్షంబునై, పల్కు సం
దడి నస్పష్టతతోప, నల్లరియు, చెంతన్ జీర నాహ్లాదమై,
గడుపన్ పిల్లల సందడింటికి వెలుంగై కంటికింపై, పరం
గెడు లక్ష్మిమమ పుత్రియయ్యె మహాలక్ష్మి! వెంకటేశాప్రభో! 285

ఉ॥ జీవితమందు మార్పు నతిశీఘ్రతనున్నతిఁ బొంద మార్గమా
దైవముఁజూపగన్ బదిలి తప్పదటంచును రాగ మూఁడు మా
సావధి కాలమున్ గడుప జంపని నేగితి, చిన్న మాష్టరై
యావిధి నిల్లుజేర్చెనట నందల మెక్కగ వెంకటేశ్వరా! 286

ఉ॥ క్షీరపురీ నివాసమది కేంద్రము నింకొకసారినయ్యె! నా
తీరు "ప్రొమోషనున్" గలిగి తిర్గుచు నెప్పుడు మారి మారికిన్
చారము త్రెంచ గాలిపట ధర్మము రెండు వసంతముల్ సదా
భారము మోయుచున్ గడుపు భాగ్యము నందితి! వెంకటేశ్వరా! 287

మః తొలి ప్రేమావధి సుద్ధృతంబగును పుత్రోత్పత్తి నందాకనే,
[illegible] మోహంబును రాగవల్లరులు సామాన్యంబుగా తక్కువై,
వలపున్ మత్సరమివ్వ సంతతికి సౌభాగ్యంబు నా తల్లిదా,
తలపున్ బిడ్డల సౌఖ్యమందిడును కాదా? వెంకటేశాప్రభో! 288

చం॥ మునుపొక నీటిగండమున ముప్పను తప్పెను! భార్య భాగ్యమై,
మగను [illegible] గండమును [illegible] నిని నిందిర కుంకుమంబునై,
చని [illegible] పూజ మనసా [illegible] పులివాత తప్పెనో,
యనయము భర్త రక్షణము నామెకు త[illegible]నె? వెంకటేశ్వరా! 289

మ॥ ప్రతిభావంతము రెండు వత్సరములా పర్యాటనన్ తిర్గగన్!
పతి సంపాదన నార్జనావృతము సౌభాగ్యంబునై పత్ని సం
తతికిన్ జెందును యందురే గద? ప్రమాదాదుల్ నివారింపగన్
సతికేఁజెల్లు! నామమాత్రమగఁ డీశా! వెంకటేశాప్రభో! 290

ఉ॥ భోజన మివ్వనద్ది విషపూరితమయ్యె నటంచు తల్లి నా
రోజున నిందమోప నతిరోషమునంది, నరుంధతీ మదిన్
"వ్యాజముతోడు కోడలిడ నాతఁడు నెట్టులనమ్మెనో? విషం
బీజమువైచె? తెచ్చె చెడు పేరును" నంచనె! వెంకటేశ్వరా! 291

ఉ॥ యిందిర గర్భధాత్రియయినేగెను తండ్రితో పుట్టినింటికిన్,
పొందుచు శాంతి సౌఖ్యముల పుత్రునిఁగాంచెను! ఆదిశేషుఁడున్
"ముందుగ తాతనైతి"నని ముచ్చటతీరగ నుండనంతనా
నందముఁజెందె నెల్లయును నాత్మజుఁ గాంచుచు! వెంకటేశ్వరా! 292

ఉ॥ ఆ దశయిందు గర్భవతియౌట, మహేశ్వరు దర్శనంబు, భా
గ్యాదుల లాభమున్, పదవి యందలి మార్పులచే గడించు సం
పాదన వృద్ధిపొంది ధన భావము సౌఖ్యము, శాంతిఁ గూర్చి పు
త్రోదయ భాగ్యమున్ గలుగ తోడ్పడె నంతట! వెంకటేశ్వరా! 293

ఉ॥ చంద్ర మహర్దశా ఫలము, సంపద, యున్నతి, సౌఖ్యమున్, యశ
శ్చంద్రిక గాంచి జీవితము శాంతిపథంబున బోవుచుండ నా
చంద్రుఁడు లగ్న భావమున సంస్థితుఁడైనచొ జాతకుండుకున్
చంద్రుని చల్లచూపులను సత్ఫలమిచ్చును! వెంకటేశ్వరా! 294

మ॥ హనుమంతార్యుఁడు దత్తపుత్రుని వివాహంబాది కార్యంబులున్
ననుజుండన్నియు నాచరింప తనవంశార్థంబు పున్నామకై,
యనపత్నుండునపత్యుఁడైఁగనుటయున్ యాశాలఁతా పౌత్రుఁడే
జననంబై తనును త్తరింప నయెనీశా! వెంకటేశాప్రభో! 295

శా॥ చీరాలాన్వయ మందువృద్ధి కయి తా శ్రీరామశర్మాఖ్య, స
చ్చారిత్రున్ గొనితెచ్చె! నేటికది వంశాకూరమున్ గాంచగన్
వారాశించిన పుత్ర పౌత్రమును సంప్రాప్తంబు నొందంగ గా,
ఘా రంగమ్మయు సంతసించె నటయౌనా? వెంకటేశాప్రభో! 296

శా॥ పున్నామన్ నరకంబు నుత్తరణకై పుత్రుండు నాశింతురో?
యెన్నో యాశల తండ్రి పుత్రులును నొక్క వంశమున్ జెందగన్
తన్నా కర్మల నుద్ధరింపగను దత్త స్వీకృతంబయ్యె! నే
నున్నానంచు జనించె పౌత్రుఁడిపుడౌనో? వెంకటేశాప్రభో! 297

చం॥ ప్రథమ సతీవియోగమనపత్యత, సార్థక మందెనోయనన్,
విధివశమున్ ద్వితీయమునభీప్సిత సిద్ధినిగాంచఁడయ్యెనే?
నధమము దత్తతే శరణు వంచును రాధయతే నపత్యుఁడ
ద్విధమునయ్యె పౌత్రుగని పెంచగమేలయె! వెంకటేశ్వరా! 298

శా॥ "స్టూవర్టూ" పురమందురాక! దశయున్ శోభిల్లె! పుత్రుండుతో
దైవానుగ్రహ మార్జనన్, ధనము నాదాయంబు రెట్టింపయెన్
వైవాహాదులు యన్న పుత్రికకు నాప్యాయంబుగాఁ జేయగన్
యావంతేని ఫలించదయ్యె? నెటులయ్యా! వెంకటేశా ప్రభో! 299

ఉ॥ పాడియు పంటలున్ గలిగి భాగ్యము నన్వరియించెనంచనన్,
పోడిమకొద్దినే నిడదవోలునకేగితి నాజ్ఞపాలనన్,
మూఁడు వసంతముల్ పిదపముచ్చటఁ దీఱగ కాపురంబుకున్
యాడిన యాటపాటలుగ నందలమెక్కితి! వెంకటేశ్వరా! 300

ఉ॥ పోయినచోట నానిడదవోలునమిత్రులు తోడివారునున్,
సాయ మొనర్పవారటుల, సంపద సౌఖ్యము మూఁడు పూవులున్
కాయలు నాలునై పరగ కాలము శాంతి సుఖంబులన్ సదా
యా, యను భూతి తోఁగడచె నాదరమొందుచు! వెంకటేశ్వరా! 301

ఉ॥ ఇంద్రియ లోలతన్ వెలుగనీయని నాటకరాజమా హరి
శ్చంద్ర యనన్ ప్రదర్శితము, చంద్రమతిన్ సుతులోహితున్, హరి
శ్చంద్రుఁడు విక్రయించె నన సత్యము వాక్పరిపాలనన్ యశ
శ్చంద్రిక వ్యాప్తిఁ గాంచెనని చాటిన గాథయె! వెంకటేశ్వరా! 302

ఉ॥ సుందర నాటకంబున వసూలయె సొమ్మునసుంగు సోదరుం
డందిన యా ధనంబునను నాత్మజ పెండిలి వైభవంబుగా
బంధు సమాగమంబున శుభాక్షిత లివ్వగ చేసిరంతటన్
విందయె చూడ ముచ్చటయె వేడుకమీఱగ! వెంకటేశ్వరా! 303

ఉ॥ మానవుఁ డెప్పుడున్ కలుష మార్గము డబ్బును పొందఁగోరుచో
కానగరాని వక్రగతి కార్యము తీర్చును, తప్పుత్రోవలన్
బానిసయౌచు తుచ్ఛుఁడయి భ్రష్టుఁడు నౌను నధోగతిన్ చనన్
తేనియ పూతకత్తులుగ తేలుదురంతట! వెంకటేశ్వరా! 304

ఉ॥ పూజలకొద్ది పూరుషుఁడు పుణ్యముకొద్దియు కల్గు సంతతిన్,
నాజవరాలు నిందిరయు నాత్మజుఁగాంచె తృతీయ కాన్పునన్
నాజననంబు తాతయన నాతఁడు శంకరు నామధేయుఁడ
వ్యాజపరంపరన్ పెఱిగె బాలుఁడు నంతట! వెంకటేశ్వరా! 305

మ॥ అది ప్రారబ్ధమొ? పూర్వజన్మ కృతశాపార్థంబొ? వైధవ్యమే
పది కాలాలపుపాటు భర్త సుఖమున్ ప్రాప్తంబు లేకుండగన్
విదితంబయ్యె జయప్రదన్ యజుఁడు నిర్వేదంబుపాల్జేసి భ
ర్తదివంగత్యుని పాలుఁజేసెగద నౌరా? వెంకటేశాప్రభో! 306

చం॥ పతిగతియించ పుత్రికలు పాపలు నిర్వుర చిన్నవారితో
సతి, తన తండ్రితో నరిగె! శాంతి సుఖంబులు దూరమైచనన్
వెతలు మిగిల్చె నా విధియు వేదన పాలవ పుట్టినింట, జీ
వితము నిరర్ధకంబుగను విహ్వలితయ్యెను! వెంకటేశ్వరా! 307

ఉ॥ అకమలాక్షి యిందిరయు ఔరసుగాంచె తృతీయపుత్రునిన్
బాకియనంగ శంకరుకు వత్సరమున్ గడువంగ మున్నె? యా
గాక, ఋణానుబంధమనగన్ పశుదార సుతాలయాగదా?
సాకగ సుబ్రమణ్యుఁడనసార్ధకనామమె! వెంకటేశ్వరా! 308

ఉ॥ అప్పయశాస్త్రి నా బరగు నల్పుఁడు దుష్టుఁడు పెద్దమాష్టరై
అప్పనమున్ ధనంబునట అక్కఱకొద్ది గడించ సంపదన్
చెప్పుడు మాటలన్ వినుచు స్నేహితు మధ్య విరోధముంచుచున్
యొప్పెను యున్నతాధిపతులొద్దిక బానిస! వెంకటేశ్వరా! 309

చం॥ చటుల వివాద సంకుచిత శాస్త్రియు నప్పుడు సృష్టిఁజేసెనో
యెటులను తప్పిదంబు తన యిష్టము మీఱ, నవాంఛనీయమౌ
కఠినపు నాజ్ఞలన్ నిడుచు కక్ష్యను సాధన మానసంబునన్
పటిమనునెంచి తానములుపర్చెను చాతురి! వెంకటేశ్వరా! 310

మ॥ తన దుష్కృత్య దురాశలోభగుణ మాత్సర్యంబు పెంపారగా,
తన యుద్యోగులమీద తప్పుల నిరాధారంబుగా మోపగా,
తనయుద్యోగ "రిటైరుమెంటు" దినమున్ దాక్షిణ్యమున్ లేక శా
స్త్రినిభృత్యుల్ నవమానమున్ పఱచిరంతే! వెంకటేశాప్రభో! 311

చం॥ గుణదలకంత మార్చననుకూలపరిస్థితులందుఁ గానకన్,
ననువగు స్వగృహంబునకు నాలిని బిడ్డల నంపివచ్చిపో
వ, నిజ గృహంబు నొక్కటి నివాసమునుండగ కట్టిచేర నా
యెను గద! కంటకంబున, నయిష్టమె తల్లికి! వెంకటేశ్వరా! 312

ఉ॥ యెంతటి జాతకంబు నను యేమియుఁ దెల్పదు భావి! శాస్త్రియున్
కొంత రచించె! పొందు ననుకూలపు వృత్తినినున్నతంబునో?
కొంత ధనంబు "లాటరి"ని గూఢముగన్ నరుదెంచు నంచనన్,
నంతట కాకినాడ విధియైనటు మార్చిరి! వెంకటేశ్వరా! 313

మ॥ అదియానందమె! కాకినాడపురమాహ్లాదంబు సౌజన్య సం
పదయో? సంతత నాట్యగానముల సంప్రాప్తించె వీక్షించగన్
పదవిన్ నున్నతి కోసమై చదువ లభ్యంబైన సాఫల్యమున్,
నొదవెన్ నాకట చెప్పుకోని ఫలమౌనో? వెంకటేశాప్రభో! 314

మ॥ యెపుడో వ్రాయ తిరస్కరింపబడి "నీకేయోగ్యతే లేదనన్"
నపుడద్దానిని విస్మరించితి! పరీక్షార్థంబుకున్ వ్రాయగన్
నిపుడాజ్ఞల్ తగపంప, రాయపురమున్ నేనేగి "కంట్రోలరా"
నపురూపంబగు వృత్తికిన్ గడిగితన్నా! వెంకటేశాప్రభో! 315

ఉ॥ అట్టి పరీక్షలో విజయమందిన ముప్పదిమంది నర్థులన్
గట్టిగ ప్రశ్నలందు సుముఖంబుగ యోగ్యతనొంద నెన్మిదిన్
నెట్టులొ నెంచగన్ ప్రకటనేమరి చూడగ నందొకండనై
పట్టుదలంది నేనొఁకడు బ్రాహ్మణునైతిని! వెంకటేశ్వరా! 316

చం॥ విజయము నన్వరించెనన వింతయె? ముప్పదిమందిలోననున్
నిజముగ నెన్మిదింట తగనిశ్చయ మంచును నిల్చి వచ్చితిన్,
విజయపురీ నివాసమున వేల్పు కృపాంబుధినున్నఁ జాలునో!
నజుఁడు లిఖించ నెన్నొనట, నబ్బకపోవునె? వెంకటేశ్వరా! 317

మ॥ మదరాసందున ద్రావిడుల్ తమిళ సన్మానార్హులై పొందగా,
పదవుల్ మాత్రము వారికీయ, మతమున్ బ్రాహ్మణ్యమున్ హీనప
ర్చు దినాలందును బాపనుండనగు పేరున్ సూచనన్ జేయగా
నదియే దైవము సంఘటించె నటులయ్యా! వెంకటేశాప్రభో! 318

ఉ॥ వ్రాసిన పక్కిశాస్త్రి తన వాదన "జాతకుఁడొందు రెంటిలోన్,
భాసిలు లక్షరూప్యముల భాగ్యము" "లాటరి" పొందు కానిచోన్,
వాసినిగాంచి నున్నతిని వర్ధిలు వృత్తిని తప్పదంచు" యా
శాసనమయ్యె నిక్కముగ శాస్త్రమునట్టిది? వెంకటేశ్వరా! 319

ఉ॥ వచ్చెను నాజ్ఞ నూత్నపదవందున జేరుమటంచు, భార్యయో
వచ్చిన చేతికిన్ నరపువాపున బాధపడంగ తల్లి తా
నిచ్చిననింటినద్దెకని నింటికిపోవగ నిశ్చయింపగా
తెచ్చితి పెద్దయత్తనిక దిక్కయె! మాకును! వెంకటేశ్వరా! 320

ఉ॥ ఆ విధి అంచలంచలుగ నా విధి చూపిన మార్గవర్తినై,
పావన కృష్ణవేణి తట పర్వత రాజమునింద్రకీలమున్
దేవత దుర్గ దర్శనము తీర్చును కోర్కెల నంచుఁగాంచితిన్
భావి సుఖంబునా విజయవాడ లభించెను! వెంకటేశ్వరా! 321

ఉ॥ సంపదకోసమై వలయు సాధన మార్గము నేర్పుకావలెన్,
సంపద ప్రాప్తమున్న సిరి సంభవితంబయి కూడు తానుగన్,
పెంపువహింప విజ్ఞతనభీష్టితసిద్ధికి దోహదంబునై,
సొంపుగనెంచె మార్గమును శోభను కూర్చెను! వెంకటేశ్వరా! 322

## దత్తత స్థానము విజయవాడ నివాసము

మ॥ తన మేనల్లుఁడు రామకృష్ణుఁడును వృత్త్యర్థంబు గూడంగనై
యను బంధంబున మైత్రియున్ నెఱపి నత్యంతాను రాగంబునన్
పెనవేయంగల బంధమై గృహములే వేరే, మనంబొక్కటై
యనిపించంగ మెలంగ నేగితిమి "ఆహా!" వెంకటేశాప్రభో! 323

ఉ॥ సంతతికల్గగా చదువు సంధ్యలొసంగుటపాడి తండ్రికిన్,
నంత ప్రసూన విద్యయయి నామెను దూరము పంపలేక, ర
వ్యంతయు హిందియున్ చదువ వచ్చని తెల్పగ చేరిపొందె నా
కాంత విశారదన్ తనకు కాంక్షితమైనది! వెంకటేశ్వరా! 324

చం॥ వలసిన లక్ష్యసాధన కవశ్యము పొందగ జీవితంబునే
ఫలమును సుస్థిరత్వమును ప్రాప్తమొసంగునటంచుఁజేర, యా
శలు యడియాశలై తుది విచారము తప్పదా? రేఖమార్చనా
నలువకు సాధ్యమౌనె? మరణాంతముదాకను? వెంకటేశ్వరా! 325

చం॥ విజయుని వాటికన్ నడుగువెట్ట నరుంధతి నస్తమించె! పు
త్ర జనసమై చతుర్థుఁడుగ రాముని జన్మము, భారసాలయున్,
స్వజనుల కోర్కెమేఱకు వివాహము పుత్రికి నిశ్చయంబయెన్,
యజుఁడు లిఖించె నోయనగ యన్నియుఁగూడెను! వెంకటేశ్వరా! 326

ఉ॥ ఆమెనరుంధతీ సతియు నాఱవ ప్రాణము సుబ్బరావుకున్,
ప్రేమతొ పిల్వనంపె బహువేదనపాలయి నన్నుఁ జూడ, బా
ధామయ ప్రాణముత్క్రమణతన్ తులసీదళ తీర్థమివ్వ, గం
గామృతపానమై తుదకు అస్తమయంబయె! వెంకటేశ్వరా! 327

## మేనమామ కుదురు

ఉ॥ ఆయన ఆదిశేషుఁడట అమ్మకు అన్నయు, మేనమామయై
ఆయన తల్లి ఆదెమయు, అగ్రజు శంకరరావు, భార్య అన్
సూయమ, నల్వురక్కలును చూడగ చెల్లెలు రంగనాయకై
ఆయన కైదుకూతులును నాత్మజుఁడొక్కఁడు సుబ్బారావునున్; 328

ఉ॥ ఆయన భార్య శాంతగుణ మందున నా వరలక్ష్మి నామమై
ఆయన వేటపాలెము గృహంబున కాపురముండి రెల్లరున్,
చేయగ పెండ్లి అక్కలకు, చెల్లెలు రంగమ, అన్న చేయగా
పాయని ప్రేమవల్లరుల పాలును పంచెను! వెంకటేశ్వరా! 329

ఉ॥ ఆ హనుమంతరావునకు అంతట అక్కను సుబ్బమాంబ వై
వాహము చేయగన్ నసువుబాసెను కుక్కను కావబ్రోవ, సం
దేహము వీడి చెల్లెలు ద్వితీయముకున్ హనుమంతరావుకు
ద్వాహ మొనర్చె తీర్చె తన బాధ్యతమేఱకు వెంకటేశ్వరా! 330

ఉ॥ మేనరికంబుకివ్వగ నిమిత్తము రాఘవ, రామశర్మకున్
మానిని రంగమాంబ నొకమాటను పొందిరి నిశ్చితార్థమై;
యౌనన పెండ్లియాయెనట యందఱికన్నను పెద్దదైన యా
ప్రాణ సమాన శంకరుఁడు భార్యకునిష్టమె! వెంకటేశ్వరా! 331

చం॥ కమలను మేనయల్లునకు, కా, జయయున్, నరసింహరావుకున్,
సమవయసంచు నాల్గవది, శారద లక్ష్మి నృసింహరావుకున్,
క్రమతొ సరోజ కృష్ణలనురాగవివాహము నాదిశేషు, తా
సముచిత రీతిఁ జేసెను విశాల మనంబున; వెంకటేశ్వరా! 332

ఉ॥ ఇందిర సోదరుండునకు నిచ్చిరి మేనరికంబు రాజ్యమున్,
పొందెను కూతు నల్వురను, పుత్రుల మూవురి సుబ్బరావునున్,
సందడిఁగాగ నా గడప శాంతి సుఖంబుల చూడ ముచ్చటా
నంద పయోధినిన్ మునిగె! నైజము కాదొకో! వెంకటేశ్వరా! 333

చం॥ కమలయు పుత్రు లిర్వురను కన్నది, మూవురి పుత్రికల్ నికన్,
యముఁడు హరించె భర్తను జయప్రద కిద్దరు కూతు లిచ్చుచున్,
సముచితమంచు నాల్గవది శారద నొక్కతెఁగాంచె, నంత, పా
పమన, సరోజపోయె, తన భర్త విసర్జిత! వెంకటేశ్వరా! 334

ఉ॥ రాము చతుర్థ పుత్రుఁడుగ రాఘవ కన్నది! తల్లి బిడ్డలున్
సేమమె! పిల్ల లందఱును జేరిరి విద్యకు పాఠశాలలో,
నీమము తప్పకన్ జనుచు నేర్పుగ, ఫస్టుగ వచ్చి రందఱున్,
కామితసిద్ధిఁ గాంచితి, సుఖంబుగ నుండితి? వెంకటేశ్వరా! 335

ఉ॥ పెండిలి చూపులై తన యభీష్టము తెల్పెను రాఘవేంద్రుఁడున్,
నిండు మనంబునన్ తమరి నిర్ణయ మందగఁజేయ, నేనున్,
పెండిలి పిన్నతండ్రి నిక పెండిలి నిశ్చయ సంప్రదింపులన్
యుండి సుమూర్త మున్నిడిరి! యుత్తమమైనది! వెంకటేశ్వరా! 336

శా॥ శ్రీ కౌండిన్యసగోత్రజుండు, వరుఁడా శ్రీ రాఘవేంద్రుండు, వం
శాకూరుండయి, దేశిరాజు, ఘనుశేషారావుకున్ పుత్రుఁడై,
యా కామేశ్వరరావు దంపతుల కాప్యాయంపు దౌహిత్రుఁడై
స్వీకారంబయె, యిచ్చి పుచ్చుకొనగన్ శ్రీ వెంకటేశా ప్రభో! 337

శా॥ చీరాలాన్వయమందునన్, హరిత గోత్రీయై, ప్రసూనాంబయున్,
శ్రీరామయ్యకునున్ ప్రపౌత్రియయె, పౌత్రీగా హనూమంతుకున్,
శ్రీరాంశర్మకు పుత్రిగా వధువు లక్ష్మీయంశ సంభూతియై,
యారామామణి పెండ్లియున్ కుదిరె నయ్యా! వెంకటేశా ప్రభో! 338

ఉ॥ జ్యేష్ఠుఁడు, రాఘవేంద్రుఁడును, శేషగిరీశుని పుత్రుఁడై చనన్,
జ్యేష్ఠయె రామశర్మసుత శ్రీ మహలక్ష్మి ప్రసూనయై చనన్,
యిష్టమునయ్యె నందఱకు, యిట్టి వివాహముఁజేయ నయ్యెడన్,
శిష్ట విశిష్టతన్ జరిగె, శ్రీ విలసిల్లగ! వెంకటేశ్వరా! 339

ఉ॥ బందు సమాగమంబునను, పండిత మిత్రులు కూడియుండ, క
న్యిందుగ శాస్త్రిలున్, వరుఁడు వేదిక యందు నలంకరించగన్,
సందడి వాద్యఘోషలతో శాస్త్రిలు మంత్రము లుచ్చరింప, నా
నందము వేదమంత్రములనన్ చెవి శోకెను; వెంకటేశ్వరా! 340

శా॥ ఆ కళ్యాణము వేదమంత్రముల మధ్యన్, మంగళా ధ్వానముల్
యాకాశంబును మిన్నుముట్టగను, కన్యాదానమున్ జేయ, శో
భాకారంబయె సూత్రధారణ తలంబ్రాలున్ శుభాశీస్సులన్
శ్రీకారంబయె కన్ను పండువయెనో! శ్రీ వేంకటేశా ప్రభో! 341

ఉ॥ ఆవిభు వెంకటేశ్వరుని నానతి దర్శన మందఁ గోరగన్,
భావన యొంటయున్, మొదటి 'ఫస్టు' తరంగతి 'పాసు'నందునన్,
దేవుని జూడనేగితిని దిట్టతనంబున రూప్యముల్ పదిన్
సేవకు చేత నుంచుకొన సిగ్గయె చెప్పగ! వెంకటేశ్వరా! 342

చం॥ ఎఱుగను వెంకటేశ, మునుపెన్నడు కానను? నిప్డు "ఫస్టునౌ"
తరగతి యందునన్ వెడలి దర్శనమందగ రూప్యముల్ పదిన్
మురిపెము తోడ పూజలను ముచ్చట కొద్ది సహస్ర నర్చనల్,
తిరుమలవాసు సేవల యథేచ్ఛగఁ జేసితి! వెంకటేశ్వరా! 343

ఉ॥ కాలము దాట నల్లునకుఁ గల్గెను వృత్తియు "బాంకు"నందునన్,
లాలిత మొప్ప కాపురము లౌక్యమునన్ పినతండ్రి చెంతనే
చాలనిజేరె! నయ్యడల చయ్యన "ఖాయము" నయ్యె! తండ్రియున్
మేలుగ తోడు నీడ యయె! మెప్పుఁ దలిర్పగ! వెంకటేశ్వరా! 344

చం॥ సహజ మహోహలన్ వనిత జాతికి వెంటనె గల్గు నెందుకో?
సహనము రాఘవాంబయునశాంతికి పాలయె! రక్తపోటుతో
విహితము నందదయ్యె! మరి వేదన మాత్రము, మందు మాకులున్
సహితము మాన్పవయ్యె? తన జాడ్యము పోవగ! వెంకటేశ్వరా! 345

ఉ॥ కాలము మాన్పనౌను? నవకాశము వచ్చిన గడ్డు జాడ్యముల్,
యాలికి దర్శనంబు భ్రమరాంబకు పూజలు సేవఁజేయ శ్రీ
శైలము నందునన్ గలిగె శాంతియు, రోగ నివృత్తి నొంది తా
చూలి ధరించె, నంతట శిశోదయ మయ్యెను! వెంకటేశ్వరా! 346

ఉ॥ చేసిన తీర్థయాత్రలును, సేవలవల్లను, దైవ ప్రార్థనన్,
చూసిన యాలయంబులను, సుంత నొసంగెను మానసంబునన్,
యా సుఖశాంతులున్ వడసి యామెకు కూర్చెను సుస్థిరత్వమున్,
వ్రాసిన తప్పునే నొసట వ్రాలును మార్చగ? వెంకటేశ్వరా! 347

ఉ॥ రాహు మహాదశన్, దశమ రాహువు రాజ్యసుఖంబునౌనొ? వై
వాహిక యత్నమో? పదవి బాధ్యత విస్తృత మొందఁ జేయునో?
యేహితమౌనొ? సంపదొ? యధేచ్ఛ విహార మొనర్చుటో? యెదో
యూహకు నందరానిది భయోద్ధిత మయ్యెడు! వెంకటేశ్వరా! 348

ఉ॥ పాలసముద్ర ముద్భవపు పావనలక్ష్మియొ? బాల్యమందు, తా
బాలుని వీడి పోతినని వచ్చిన యమ్మయొ? లక్ష్మిబాయియే,
లాలనజేయ వచ్చినది లక్ష్మిభవానిగ జన్మమందగన్
నాలన పాలనన్ జరుప నాఁటవకాన్పున! వెంకటేశ్వరా! 349

ఉ॥ కొమ్మయు, బిడ్డలున్, ఘటియు, గొడ్డును యింటికి వచ్చువేళ, వే
గమ్మగు భాగ్యముల్, సిరులు, కల్మియు, శాంతిసుఖంబు లందు, పా
దమ్ము మోప కొన్ని యెడతల్లడిలంగగ తారుమారగున్,
బమ్మ లిఖింప మట్టియును బంగరు నౌగద? వెంకటేశ్వరా! 350

ఉ॥ భాగలుపూర్లు "యం.ఏ." నను ప్రాజ్ఞుని జేసెను పట్టభద్రుగా!
యాగిన జీవితాశ పరమార్థపిపు చింతను ప్రోత్సహించగన్,
సాగెను యున్నతిన్, పదవి సత్ఫలమ్మందుచు యేటికేటికిన్!
తేగిన మార్గమే సరిగ నెంచితినీదయ! వెంకటేశ్వరా! 351

ఉ॥ భాగలుపూర్లు పోవగను పంపిరి యత్త గతించె వార్తనున్,
సాగితి గంగ తర్పణము శాంతికి నాత్మకు నీయ విచ్చితిన్,
నా గతి సాగెయున్ బ్రతుకు నాగదు నెంతటి వారికిన్ పతిన్
"నీ గతినీదె" యంచుతమ నేగెను వాకము! వెంకటేశ్వరా! 352

మ॥ నవమాసంబులు మోసి కన్నది ప్రసూనాంబంత సత్పుత్రునిన్,
భవబంధంబుల దేశిరాజు కులమున్ వంశోద్భవంబయ్యె! రా
ఘవు బాంధవ్యులు భారసాల యను సంస్కారంబు నామంబునన్,
ఇవరాలున్ నిడె సుబ్రమణ్యుఁడని నిచ్చన్! వెంకటేశా ప్రభో! 353

చ॥ జరిగె వివాహమా సరళ, సాధు, సుశీలయు, శాంతి సీతకున్,
మరదలు, భర్తృహీనయు కుమారిత కిచ్చెను సారె! నంత కా
పురమున కంపెతల్లి! విధి పుట్టెడు దుఃఖము నంద సీతయున్
మరణము పాలయెన్ ప్రసవమందగ లేకను! వెంకటేశ్వరా ! 354

మ॥ అది "టైం టేబిలు" రూపకల్పనలఁజేయన్ బూన నుద్యోగమై,
మదరాసందున కానమానమున ప్రామాణ్యంబుగా దిద్దగన్,
మొదటన్ వ్రాసిన పట్టికన్ సవరణన్ ముద్రింప నాజ్ఞల్ నిడన్,
యది నారంభము "యేప్రియల్" మొదటనయ్యా! వెంకటేశాప్రభో! 355

ఉ॥ "దక్షిణ మధ్యరైల్వే"యని తద్దయు నూతన మండలంబుగా
యా క్షణమందె నేర్పడెను యాంధ్రము నందు సికంద్రబాదునన్!
రక్షిత రాజధాని నగరంబున కార్యకలాప కేంద్రమై,
పక్షము నాల్గు భాగముల పంపిణిఁజేసిరి ! వెంకటేశ్వరా ! 356

ఉ॥ నూతన "జోను" నేర్పడగ, నొక్క విశేషము, ముఖ్యపాత్ర నా
వాత పడంగ నా విజయవాడను నూతన మండలంబు, నా
చేతనె జేయగన్ మొదటి "శ్రీ"యని చుట్టితి! నా యదృష్టమో?
నే తిలకించనా దినము నెంతటి భాగ్యము? వెంకటేశ్వరా ! 357

ఉ॥ సంచిత పాపకర్మ యన, శాపవిధంబొ? మదగ్రజుండు, జ
న్మాంచితయన్న, యాకమల నాథుఁడు, నార్వురి తండ్రి, దుర్విధిన్
వంచిత జీవితాశకల భ్రష్టుఁడు, వీపున రాచపుండు బా
ధాంచిత మూర్తియై తుదకు తమ్ముని జూడక సోచుకోకయున్, 358

ఉ॥ పొంచిన మృత్యువాత పడిపోయెను నక్కట ! వెంకటేశ్వరా!
కంచెను చేనుమేసెనన, కర్త గతించ, కుటుంబ భారమున్
యుంచె నృసింహు బాహువుల యుంచిన బాధ్యత నెత్తిపై పడన్
యంచలు యంచలన్ బ్రతుకు నప్పుల తీర్చెను! తప్పదయ్యెనో? 359

ఉ॥ అంతటి దుఃఖవార్త మొదలంటగ కూకటివ్రేళ్ళ త్రుంచెనో?
చింతితమానసుండనయి చిత్తము వృత్తినిఁ జొన్పదయ్యె! నా
దెంత నికృష్ట జీవితము? తృప్తిగ కన్నులఁ గాంచనైతినో?
నెంతనదృష్ట హీనుఁడ భరించగ దుఃఖమ్ము వెంకటేశ్వరా! 360

ఉ॥ నా పినతండ్రి సుత్తముఁడు! నన్నొకనింటి కుటుంబ మానిగన్
యోపిన రీతిఁజేయగ మహోన్నత రీతి వెలింగె నంచు తాఁ
జూపిన సంతసంబు నెద శోభిల, నాత్మయు తృప్తి నొందగన్,
తాపయనించి ముక్తిపథ ధామముఁ జేరెను! వెంకటేశ్వరా! 361

చం॥ తనదగు యాస్తి నంతటినిఁ నల్లుని, దత్తుని కిచ్చె దాత! తా
ననుభవమందు, గుడ్డకును, నన్నముకున్ కడుపాటులేక, తా
మనగను కూతుఁజేత తుది మన్నన పొందగ లేకపోయెనో?
వెనుకటి వైభవంబు తన వెంటనె తోడ్కొనె! వెంకటేశ్వరా! 362

ఉ॥ "దక్షిణ మధ్యరైల్వే" నవతారణ మష్టమ నూత్న "జోను," ను
త్ప్రేక్షణ సత్ఫలంబు వినుతింపగ నిర్ణయమందు, పాలనన్,
శిక్షణ నున్నతాధిపతిఁజేరువ కంటకమయ్యె! తోడి వా
ర్దీక్షతొ భంగపాటనగ తెచ్చిరి చేటును! వెంకటేశ్వరా! 363

చం॥ జరిగెను రెండు వర్షములు శాంతియుతంబుగ "టైం టేబులన్,"
పరగితి దూర దేశముల బాధ్యత మేలకు శిక్షణా స్మృతిన్
విరిసిన వెన్నలై పరిఢ విల్లెను, విజ్ఞత వృత్తి యందునన్
నెలపితి నుత్తమోత్తమ వినిమయ పట్టిక! వెంకటేశ్వరా! 364

చం॥ అదియొక కారణంబుగ, పరాన్నపు భుక్తులు, యీర్ష్య కుత్సితుల్,
మది నెపమూని నెట్టు లభిమాన పురస్కృత దోష కల్పనన్,
పదవిని మార్చునన్ విజయవాడకు పూర్వ పథాను వృత్తి, దో
హద మిడిరయ్యె! నెంతటి దయాంబుధివో గద? వెంకటేశ్వరా! 365

ఉ॥ చేసిన సేవకున్ తగిన శిక్ష లభించె! శరీర రుగ్మతన్,
వ్రాసిన హస్తమున్, నడుప పాదములందునవాచె! జాడ్యమే
యా సమయాన ప్రాప్తమయె! ఔషధ సేవయు, విశ్రమించగన్,
మాసము లెన్మిదిన్ గడుపమానని మచ్చయె! వెంకటేశ్వరా! 366

శా॥ గాయత్రీ జపమంత్ర సాధనము రోగార్తుండు జామాతకున్,
పోయెన్ జాడ్యము! పత్ని గర్భవతియై పుత్రీమణిన్ గాంచగన్,
గాయత్రీ యను నామము న్నిడిరి, సాక్షాత్కారమైనట్లుగా!
న్యాయంబైనది సత్ఫలంబుఁగనె! నౌనా? వెంకటేశా ప్రభో! 367

ఉ॥ శాయియు "యం యె" పాసయెను, సర్వవిధంబుల వృత్తి వేటకున్
పాయని శక్తియుక్తులను, భావ్యమనంగను సవ్యసంస్థలన్
జేయగ యత్న సత్ఫలముఁ జెందెను! భృత్యము ప్రాప్తమున్న, నీ
సాయము నున్ననెట్టిది, న సాధ్యముఁగాదుగ? వెంకటేశ్వరా! 368

ఉ॥ వ్యాధి నయంబు సేసి, ఘనవైద్యుఁడు సూచనచేయ చర్మమున్
బాధ నివారణంబునకు భావ్యము మాఱుపు వృత్తి యందనెన్,
"వేధిత కార్యమెల్ల విడిపించగ మార్గమటంచు" పేర్కొనెన్,
యాధృతి నందె నా పదవి యాజ్ఞల నిచ్చిరి! వెంకటేశ్వరా! 369

ఉ॥ యే ఫలమాశయంబయెనో? యీ తనిఖీ యధికారి నైతినే?
"ట్రాఫికు" బాధ్యతాయుత పరంబగు నాజ్ఞల పంపి రంతటన్,
సాఫిగపోవు మార్గము ప్రశాంతిగ కొన్ని దినాలనేగ, యీ
నా ఫల లబ్ధి ప్రాప్తమయె! నాది యదృష్టమొ? వెంకటేశ్వరా! 370

చం॥ తిరుచిరపల్లి శిక్షణతొ తీర్థము దర్శనకాంక్షయున్, మదిన్,
పరిసర దేవళంబులను భక్తితోఁ జూడగ వచ్చునంచు, నే
నిరువుగ పత్ని పుత్రికతొనేగితి! వ్యావృతి కావలెన్ గదా?
మరువగ బాధలన్ నిదియె మార్గము నొగద? వెంకటేశ్వరా! 371

ఉ॥ నా పదవీ ప్రమాణ పరిణామము, ముచ్చట మూఁడునాళ్ళుగా
కాపురమున్న రీతి నధికారము సాగె నిరంకుశంబుగా,
ప్రాపుఁద లిర్వగన్ సరిగ రాజిలె! యోర్వని రీతులందునన్
నా పని జేయుగా వలసె. నాజ్ఞల పాలన! వెంకటేశ్వరా! 372

చం॥ ముగురధికారు లుండిరట పూర్వము వత్సర కాలమందునన్
సగటు జవాను పాలన ముజాగ్రత చూపియు చూడకుండ న
ట్లుగ నటియింపగన్ సరిగ లోపము దిద్దగ, దూయబట్టిరే?
యగణిత సేవకెప్పుడు నర్హతఁ బొందదు! వెంకటేశ్వరా! 373

చం॥ పనిచిరి వృద్ధిఁ జేయుమని, పాలన, వేగము గూడ్చు బండ్లకున్,
నను దొనకుండకున్ మిగుల నవ్యవిధానము త్రొక్కుమంచు! యా
పనిచిన కార్యమెల్లరు "శబాస"నిపించగ, అష్టమాసముల్
కనులను బాష్పముల్ నిడుచు కాలముఁబుచ్చితి! వెంకటేశ్వరా? 374

ఉ॥ ప్రాజ్ఞుఁడనైతి నన్నిటకు పంపిన కార్యము చక్కదిద్దగన్,
"విజ్ఞతఁ జూపెవీఁడు నిక విశ్వసనీయుఁ డటంచు మెచ్చుచున్"
నాజ్ఞల నంపె నా ప్రభువు నర్హుఁడనంగను "సేఫ్టి కౌన్సిలర్,"
ప్రజ్ఞను జూపగా విజయవాడకు రమ్మనె" వెంకటేశ్వరా ! 375

చం॥ తనయ ప్రసూన గర్భమును దాల్చిన తొమ్మిది మాసమందునన్,
జననము నిచ్చె బాలికను, చక్కని రూపము ముద్దుమోమునున్,
పనిచితి వార్త నల్లునకు, బంధువు రాకతొ భారసాలయున్
వినయముమేఱ సంస్కరణ పేరు నొసంగిరి! వెంకటేశ్వరా ! 376

శా॥ శైవాంశంబున సుబ్రమణ్యసుతుగా సంతానమున్ నొక్కఁడై,
దేవీ మంత్రముపాసనా మహిమచే శ్రీమూర్తి గాయత్రియై,
భావం బరదున పార్వతిన్ గొలువ సాఫల్యంబు రాజేశ్వరై
యా వంశంబు పునీతమయ్యెగద, నయ్యా! వెంకటేశా ప్రభో! 377

చం॥ అయితిని "సేఫ్టి కౌన్సిలరు" నందఱి మెప్పువడంగ సూత్రముల్,
నియమ నిబంధ నా విధుల నిత్యము నెల్లరు నాచరింపగన్,
నయము భయంబునందు నధునాతన రీతుల తెల్పు బోధనల్,
చెయిదము నేరమైన తగు శిక్షణ తెల్పితి! వెంకటేశ్వరా! 378

చం॥ ఒడిలొనరించు నొగ్గులకు యోర్మివహింపక, నెగ్గుఁ సేయుటే
తలుచుగ సంభవించుటది ధర్మ పథంబు కానిదయ్యు తా
మెలిగియు "నెద్దునీనెనన నిట్టులె కట్టుఁడు దూడ"నన్నటుల్
పలుగెడు ధూర్తు లేమనగ వచ్చునొ? తెల్పవె? వెంకటేశ్వరా! 379

చం॥ చతురత శక్తియుక్తులతొ సాధ్యముఁజేయగ "సేఫ్టి" నౌకరిన్,
నితరులు ద్రోహచింతనతొ, నీర్ష్య, యనామక లేఖ లంపగన్,
హితవు నపేక్షఁబూనుచు సహింపక నిల్పెను సుబ్రమణ్యుఁడే,
సతతము సామిసేవకు నొసంగెడు భాగ్యము! వెంకటేశ్వరా! 380

చం॥ ఉపనయనాది కార్యమొక టుత్తమ కర్మప్రయోజనంబు! దా
న పురుషుఁ డర్థమున్ వడయు నాలుగు ధర్మము, అర్థ, కామ, మో
క్షపు, పలు సాధనాదికము కర్మని జేయుట పాడియౌను! తా
విపినము లందునైన నుపవీతమొనర్తురు! వెంకటేశ్వరా! 381

ఉ॥ జ్యేష్ఠుఁడు శాయికిన్ వడుగుఁసేసితి హైందవ ధర్మమార్గమున్,
నైష్ఠిక సూత్ర ధర్మముల నాదరణంబున నాచరింపగన్,
నిష్ఠమునైన రీతుల సహేతుక యోగ్యుఁడనంగఁ జెల్లు, క
ర్మిష్ఠుఁ డనంగ వంశకుల శ్రేష్ఠు నొనర్చితి! వెంకటేశ్వరా! 382

శా॥ అ రోజే యుపవీత ధారణము గాయత్రీ మహా మంత్రమున్.
పౌరోహిత్య వశిష్ఠ భూవరునిచే బ్రహ్మోపదేశంబునున్,
వాటాశీస్సు లిడంగ శాయివటుఁడై బ్రాహ్మణ్యమున్ పొందె! నా
శ్రీరామాఖ్యుని వంశ వృద్ధి కలుగన్ శ్రీ వెంకటేశా ప్రభో! 383

ఉ॥ చారు, సుశీల, కౌశికస, సాంబయ పుత్రిక, నాగమల్లికిన్,
కోరి వివాహమున్ హరిత గోత్రజు రామయపుత్రుశాయి, కా
చారము చొప్పునన్ జరిగె శాస్త్రవిధానము యిచ్చిపుచ్చుటల్ఁ,
జేరువలగ్న నిశ్చయముఁజేసిరి పెద్దలు! వెంకటేశ్వరా! 384

ఉ॥ శ్రావణ సస్యవంత ఫలశ్యామల మాసమునందు నిండు శో
భావహమైఁదలిర్ప పదునైదు నగస్టున, భారత స్వతం
త్రావనియైన రోజునను, దాస్యవిమోచన వేళనయ్యె, సం
భావితమై వధూవర వివాహము లగ్నము! వెంకటేశ్వరా! 385

చం॥ తరలెను పెండ్లివారలము దర్పమెలర్పగ, సాంబరాయుఁడున్,
విరిసిన బంధుజాలమును విందుల వేడ్కల తృప్తిఁజేయగన్,
మురిపెమునన్ కరీంనగరు మూఁడు దినాలుగ వియ్యమందగన్
స్ఫురితము పెండ్లి వేదికటు శోభను గూర్చెను! వెంకటేశ్వరా! 386

శా॥ చీరాలాన్వయ వంశమందు వరుఁడా శ్రీరాము పుత్రుండునై,
శ్రీ రాజా హనుమంతరాయనికినున్ చెప్పంగ పౌత్రుండునై,
శ్రీరామయ్యప్రప పౌత్రుకున్ జరిగెనా శ్రీరస్తు కళ్యాణమున్,
గౌరీపుత్రుని పూజ సత్ఫలితమేగా ? వెంకటేశా ప్రభో ! 387

చం॥ అరిగితి మెల్లరున్ తడయ కంతట, రాముసుతుండు రామచం
దురుని వివాహవేళకు, యధోచిత రీతిని కట్నకానుకల్
జరిగె, నరుంధతీ వధువు చక్కని చుక్కయె! రామచంద్రుఁడౌ
వరునకు నీడు జోడునయి వర్ధిలె! శ్రీపతి వెంకటేశ్వరా! 388

ఉ॥ కూడెను లక్ష్మ్యాయానమటు కోరిక తీఱగ 'సేఫ్టి శిక్షణన్'
కోడలురాక తోడ; నటఁగూడిరి మిత్ర సమాగమంబు! నే
వేడితి విశ్వనాధుని నభీప్సిత సిద్ధికి దర్శనంబు! పో
కూడగ తంతిపంపవిని, గూటికిఁ జేరితి! వెంకటేశ్వరా! 389

ఉ॥ కోడలు, రా, గృహంబు ననుకూలత మార్చిరి; ఆసుపత్రియున్
కూడలి యందు సామిగుడి కూడను, ప్రక్కన, నాంజనేయుఁడున్
వేడగ దర్శనంబయెడు వేల్పుల సన్నిధి! రాకపోకలా
నాఁడుగ సాగె, బందుగు, లనారతమందున! వెంకటేశ్వరా! 390

చం॥ వదినయు, జానికమ్మయె, దివంగతురాలయె నన్న వార్త, నా
పదియవ రోజు తర్పణము బాధ్యత మేఱకు నిచ్చి వచ్చితిన్,
ముదుసలి రంగమాంబకును ముఖ్యము తెల్పిన చాలునన్న, నా
కదియును చోద్యమై వినగ నయ్యెను! శ్రీపతి వెంకటేశ్వరా! 391

మ॥ పినతండ్రీ సుతునయ్యు నింటికిని, నే పెద్దైన వాఁడై ననిన్,
అనుజున్ బోలిన వాఁడనై, తుదకు, కర్మాదుల్, తిలోకాదులై
నను, నర్పించగ వేఱుఁజేసెగద, నజ్ఞానంబు శ్రీరాములై
నను దాయాదుఁ డనంచు నెంచఁడయె! నౌనా? వెంకటేశా ప్రభో! 392

ఉ॥ ఇందిర పెద్దతల్లి తన యింటనె నుండుచు, వృద్ధురాలునై,
యెందఱు నున్ననున్, నిపుడు నెవ్వరు లేనటు, లేమి మాత్రమే
హొందుచు, పేదరాలుగను, మోయగ పీనుగు దిక్కులేక తా
నిందిర చెంతనుండ, గతియించెను పాపము! వెంకటేశ్వరా! 393

ఉ॥ ఇందిర చెల్లెలా జయము, నెందువరున్ సుతనాది లక్ష్మికిన్,
హొందగ కాకపోయె, తన పుట్టిన యింటి జనంబు, నత్తవై
పందఱు నుండియున్ నెటు సహాయ పడంగగనోపరైరి! నా
బందువు నారసింహుఁడు వివాహము నీకొనె! వెంకటేశ్వరా! 394

చం॥ జయ, సుత పెండ్లి(జేయ, మనసార, మఱందినివేఁత, కన్యధా
రయయె, అతండు మాధవు, వరంబని యెంచె వివాహకార్యమున్;
ప్రియమున కాపురంబునకు వీడ్కొలు పల్కిరి నత్త యింటికిన్,
జయయును నిచ్చి పంపినది సారెను కూతుకు! వెంకటేశ్వరా! 395

ఉ॥ శాయి వివాహమై నరిగె సాంబయ మామకు వృత్తి యందునన్
సాయపడంగ, వృద్ధి పఱచన్, తగు భాగము నీయ(జూపగా;
పోయెను గర్భమున్ శిశువు పుట్టియు పుట్టకమున్నె భార్యకున్;
నాయజు(డట్లు వ్రాయి సమయంబయె నా విధి! వెంకటేశ్వరా! 396

ఉ॥ జీవిత మాధురీ ప్రణయ సింధువు నీదగు; ప్రాప్తమున్నచో
ద్వైపము సంఘటించు గద! ధర్మమొ? ధర్మము కాదొకో? నదే
యా విధి వ్రాసినన్ జరుగు! యైనచొ నాతిచరామి సత్యమా?
పావులమే గదా బ్రతుకుబాటల యంచున? వెంకటేశ్వరా! 397

చం॥ కుడువగ( బెట్టవచ్చును వృకోదరుకైనను తృప్తి(జెందగన్,
నడిగిన వానికివ్వ(దగు నర్థము నున్నచొ దాతకేతగున్,
కడివెడు దుఃఖమున్న సహకారమునన్ తొలగింప నౌను! కా,
కుడిచియు లేదనన్ నత(డె ఘోరకృతఘ్ను(డు వెంకటేశ్వరా! 398

ఉ॥ పిల్లలు పట్టభద్రులయి వేటకు(బూనిరి వృత్తి కోసమై,
యెల్లవిధంబులన్ నడుగ నెందుకు కానగరైరి నౌకరిన్, ?
కల్లకబుర్లతోడ పని కాలము( బుచ్చిరి వట్టి చేతులన్,
చెల్లెను సుబ్రమణ్య కటు చేతులు( జూపగ! వెంకటేశ్వరా! 399

మ॥ ఉప వీతంబును నా ద్వితీయ సుతుకున్ యుక్తంబు, నా వెంకటే
శ పదంబందు, పురోహితుండునిడె! శాస్త్రోక్తంబు గాయత్రినిన్
నుపదేశంబును జేసె శంకరుకు బ్రహ్మోపాసనా మంత్రమున్!
అపవిత్రుండు పవిత్రు(డై మనగనయ్యా! వెంకటేశా ప్రభో! 400

చం॥ నలువది యేండ్లు( జేసితిని నౌకరి యుక్తిగ రైల్వే యందునన్,
సలిపిన సమ్మె కాలమున చాటిన యోగ్యత కిచ్చు వృత్తినిన్
ఫలమున( జెప్పనయ్యదియు ప్రాప్తమొసంగక పుత్రు శంకరున్
వలసిన దివ్వకన్ జరిపె వ్యర్థము కాలము! వెంకటేశ్వరా! 401

మ॥ కల రూపెన్నడు చెప్పినన్, యడిగినన్, కష్టంబు నీ కాలమున్,
ఫలితం బావిధి దూరమై చనును! నా ప్రారబ్ధమే నింత? యెం
గిలి కాకంబులదే బలంబనుట యంగీకారమౌనా ప్రభో!
కల సామర్థ్యము వారకేమి తెలుసింకన్? వెంకటేశా ప్రభో! 402

మ॥ ఎదురీదంగ ప్రయాసయే మిగులు? 'నేనీ సేఫ్టి' వీడంగ, నా
పదవీ బాధ్యత పూర్వ "డెప్యుటి"గ భావ్యంబంచు నివ్వంగ, చే
రి దినంబొక్క యుగంబుగా మనసు ప్రేరేపింప కాలంబునున్,
పదిలంగా సెలవీకొనన్ వలసె దేవా! వెంకటేశా ప్రభో! 403

ఉ॥ ఆమెయె పెద్దయక్క వరదమ్మయె! చిన్నతనాన సాకెనన్
ప్రేమతొ! మాతృహీనుఁడని! పెద్దది నందఱి కండనయ్యెనో?
తాముదిఁగాదు! యైన యమధర్ముఁడు రుగ్మతలేని నామెకున్
నా మృతపాశమున్ నిడుచు నాయువు తీసెను! వెంకటేశ్వరా! 404

ఉ॥ సోదరి వీడి పోవమును జూడగనైతిని పాప కర్ముఁడన్,
నా దినమందె నేగితిని హైదరబాదుకు; వచ్చినంత నా
బోదెను మాత్రమేఁ గనగ పుణ్యముఁ దక్కెను? మించిపోవగన్,
నా దురదృష్టమే మిగిలె? నాగద? నేడ్వగ! వెంకటేశ్వరా! 405

ఉ॥ ముందుగ, మేనమామయె! పుత్రిక నిచ్చుచు నా దిశేషుఁడా
యిందిర తండ్రి మామయయె! యిప్పుడు నాఁతడు పోయెనన్న వా
ర్తందిన వెంటనే గనగ రక్తపు చారలు వీపునందునన్
కందిన చర్మమున్ దెలిపె కష్టపు చావును! వెంకటేశ్వరా! 406

ఉ॥ ముందె, నెఱింగియున్ నతని మూర్ఛత, నా కడ నుండఁ గోరితిన్,
కొందల మందుచున్ తనకు కొడ్కు గృహంబున యుండ ధర్మ మి
బ్బందులపాలునౌచు, కడుపాఱ భుజింపగలేక నింతలో
బొందిని వీడె ప్రాణములు? పుణ్యుఁడు కాదొకొ? వెంకటేశ్వరా! 407

చం॥ అలయక నిన్ని నాళ్ళు పనియందున దోషము కానరయ్యె! నా
సెలవు దినంబులన్నియు విశేషము మిక్కుటమై కనంగ, కా
వలసె "రిటైరుమెంటు"నకు; భావి కుటుంబపు కార్యభారమున్
క్రొలదిమొ గొప్పగాను సమకూర్చవలెన్ గద! వెంకటేశ్వరా! 408

మ॥ సెలవున్ గైకొని పోతిమాసమని! కాశ్మీర్ చూడ బృందంబుతో,
లలితంబై బహు రమ్యమై వెలయు వైలక్ష్యణ్య సౌందర్యయై,
తలమాణిక్యము భారతావనికినై, తాదాత్మ్యమున్ పొందగన్
నిలయంబైనది పండితావనికి వన్నై! వెంకటేశా ప్రభో! 409

శా॥ నానాసూన వితాన వాసనల నానందాబ్ధి ముంచెత్తగన్
నానా రమ్య ఫలంబులన్ దినగ విఘ్నాయాస సంతృప్తులై,
నానాగంధ, సుగంధ సౌరభములన్ నాఘ్రాణ మేమోహమై
యీ నా దేశ శిరోమణీ మకుట మయ్యెన్! వెంకటేశా ప్రభో! 410

ఉ॥ భారతదేశ మానికము, భారతమాత కిరీటమైన, కా
శ్మీరు, మనోజ్ఞమోహన విశిష్టత ప్రాంతము రామణీయశృం
గారవనాంత భూములు, ప్రకర్షిత కుంకుమ పువ్వు, యాపిలుల్
దోరపు పండ్లు తోటల, యెదో విహరించితి! వెంకటేశ్వరా! 411

చం॥ అనయము నౌకరీ చరితమైన మనంబును నన్యమార్గమున్
వినిమయపర్చఁ జాలగద? విశ్రమ మివ్వ "రిటైరుమెంటు" భా
వన యధికార నిర్ణయము! ప్రాయమెఁ జాతురటన్న యేబదీ
యెనిమిది వత్సరంబులయె! యింతయెఁజాలును! వెంకటేశ్వరా! 412

ఉ॥ ఏబది యెన్మిదేండ్లు నయెనేమొ? నవంబరుముప్ప దవ్వగన్!
నా బహిరంగ వృత్తికిక నయ్యెను కాలము! విశ్రమించ నౌ
నే? బిడియంబునున్ పడగనేలనొ? సర్టిఫికెట్టు నివ్వ, యిం
కే, బులబాటమున్ వదలి యింటికిఁజేరితి! వెంకటేశ్వరా! 413

చం॥ నలువదివత్సరాల్ గడచె! నౌకరి యందు "రిటైరునై తినే?
పలువిధ శాఖలన్ పరగె బాధ్యతమేఱకు తృప్తి నిచ్చితిన్,
పిలిచిన బానిసైతికద! వేలును జూపుచు దోష మివ్వరే?
అలుసున కంటిలో నలుసునైతిని! శ్రీపతి వెంకటేశ్వరా! 414

ఉ॥ "ధామసుయుల్సి" తెల్పె, తన తప్పిదమున్ ప్రభుసేవఁ జేయగన్,
నా మరణాంత శిక్షకును నాతఁడుఁ బాల్పడె!" పూర్తి సేవలో
నేమి సగంబుదైవపర మిచ్చిన ధన్యుఁడ నౌచునుందునే?
స్వామిని సేవలేకయె నశాంతుఁడ" నంచెనె వెంకటేశ్వరా! 415

శా॥ వంశోద్ధారకు పుత్రుఁడున్ కలిగె, నా వంశంబు నిల్వంగనై,
వంశంబున్ హనుమంతరావు కనుచున్ పౌత్రుండు పుట్టంగ, నా
యంశంబందున భారసాల విధులన్, యాశీస్సులన్ నామమున్
యం శన్మంతు, కిశోరుఁ డంచనిరటయ్యా! వెంకటేశా ప్రభో! 416

## తృతీయ చరణము (పదవీ విరమణ, శుభకార్యములు గృహచ్ఛిద్రము కోర్టు వ్యవహారములు)

ఉ॥ వృత్తిని విశ్రమించ, నను పిల్చిరి, నా యదనంపు వృత్తికిన్,
యుత్తమ మార్గమంచనియు, యూరక యుండగ నేల భావనన్,
మొత్తము రెండువత్సరములు మోసితి బాధ్యత శాఖలందులన్,
సత్తువకొద్ది కార్యమును సాధ్యమయెంగద ! వెంకటేశ్వరా! 417

మ॥ నిలువన్నీడ గృహంబు కావలయు, మున్నేనాది చీరాలలో
పలుమారమ్మనడంగ వృద్ధి పలుపన్, "పాపాత్ముఁడా పొమ్మనెన్,"
కలదా పాతది తాను నివ్వననగన్ గత్యంత రంబందగన్,
వెలకున్ నింటిని విల్చిచేకొనగ పర్వెన్! వెంకటేశా ప్రభో! 418

ఉ॥ ముందు బయాన, వేలు పది, మూల్యము నిచ్చితి, వ్రాతకోతలన్,
యందు నదృష్టమేమొ? నతఁడంత "రిజిష్టరు" చేయకుండ, నా
ప్పందము మీద కోర్టునకు పర్విడఁజేసెను, వ్యాజ్యెమాడ, నా
కందెను యైదువత్సరముల కావలసర్వము! వెంకటేశ్వరా! 419

చం॥ యెవరికి ప్రాప్తమో? నెఱుగనెట్లగు? నీశ్వరుఁడేమి చేయునో?
యవధులు మించినన్ ఫలితమందదు, నెంత తపంబుఁసేసినన్,
నవిరళ యత్నమందు పురుషాయత పాత్రము కాకపోవునే?
నవునని, కాదనంగ తుదకాతఁడె దిక్కగు! వెంకటేశ్వరా ! 420

శా॥ మ్రోగెన్ బంగళఘాతవాయు, వలలుప్పొంగంగ, కల్లోలమై,
వేగంబైన సమీరముద్ధృత, మహా భీభత్స సంక్షోభ భూ
భాగంబెల్ల జలాశయంబగుచు నా వర్షంబు ధారాకృతిన్
సాగెన్ నిల్వగ నీడలేకనయె! నీశా! వెంకటేశా ప్రభో ! 421

ఉ॥ పండిన పంటలా మునిగి, పాఱిన నీటిమయంబునయ్యె! నా
రెండు వసంతముల్ దనుక రేగడి భూములు వట్టిపోవ, నే
యండతొ పంటరానిదయె! యాశ్రయ మందక విక్రయింప, రా
కుండగ రైతు లాక్రమణ కోర్కెలు మెండయె! వెంకటేశ్వరా! 422

ఉ॥ చెంపలు పాలు(గారునది, చిన్నది, లక్ష్మిభవాని యెంతయో
సొంపులు మీఱగన్ తనువు శోభను(జెందగ నిమ్మడించు ప్రా
యంపు వయస్సునన్ ఋతుమతయ్యె! ప్రసూనయు, నాత్మబంధుగుల్,
యింపుగ వేడ్క, బంతి జరిపించిరి నంతట! వెంకటేశ్వరా! 423

మ॥ పదవీ త్యాగమనంతరంబు, వివిధంబౌ చిన్న యుద్యోగముల్
ముదమారంగను జేసితిన్; మనసు నామోదింప ధర్మంబుగా,
యదె చన్నీళ్ళకు వేడినీరునయి తోడై రాగసంసారమున్
పదిలంగా( గడుపంగగా వలెసె! దేవా! వెంకటేశా ప్రభో! 424

మ॥ ఉపవీతంబును సుబ్రమణ్యుకిడగన్, యోగ్యంబునౌ మూర్తమున్,
యుపదేశంబును బ్రహ్మమంత్రమును, సర్వోత్కృష్ట గాయత్రినిన్,
జపియింపన్ పరిషేచనాదులను, సంస్కారంబు బోధించగా,
నపుడే బ్రాహ్మణు(డయ్యెనా సుతు(డు! నౌనా? వెంకటేశా ప్రభో! 425

ఉ॥ వచ్చిరి నాప్తబంధువులు, బావయురాజ్యము పిల్వరారయెన్,
తెచ్చిరి కట్నకానుకలు, దీవన లిచ్చిరి సంతసంబుగన్,
వచ్చిన రాఘవేంద్రు(డును వ్యాధి నెఱుంగక భోజనంబునున్,
నిచ్చిన వన్నియున్ తినెను! యిష్టము లేకయె! వెంకటేశ్వరా! 426

శా॥ నాజామాతగు రాఘవేంద్రు( డటులన్ నాహారమున్ గైకొనన్,
నా "జాండీసు"ను సోకి తీవ్రమగుచున్ నాస్పత్రి పాల్జేయగా,
నా జాడ్యంబతి ఘోరమై తుదకు ప్రాణాపాయమై, వెంటనే
యా జీవిన్ బలి తీసుకొన్న దటులయ్యా! వెంకటేశా ప్రభో! 427

మ॥ అతి సామాన్య పురోగమిట్లు జనులా వ్యాధిన్ బలై పోవగా,
గతియించన్, ప్రతిచర్య వైద్యవిధ మిక్కాలంబునన్ నుండ, బా
ధ్యతలేక, పదమూ(డు మార్చినను, వైద్యంబుండియున్ నాత(డా
సతి నాత్మీయుల వీడినేగెదివికిశా! వెంకటేశా ప్రభో! 428

చం॥ దహనము సంచయంబులు, ప్రధాన విధానపు కర్మలయ్యె, నా
సహనములేని తండ్రి సుతుచావుకు వచ్చియు, కర్మకర్తయై,
విహితపు శాస్త్రధర్మమును వీడి దశావహమందు రాక పో
యె! హితవు దూర దయ్యెచెవి! నేమనవచ్చును! వెంకటేశ్వరా! 429

మ॥ దుహితన్ నెక్కడఁజేర నీయకతనన్, దూరంబుపో నొల్లకన్,
గృహమావశ్యక తెంతయో ప్రబలమై గేహంబునున్ విల్చితిన్,
సహవాసంబున శోకముల్, దిగులునున్ చక్కంబడన్ జేయగా,
స్పృహతో వారలు కాచిగూడ కరిగెన్ శ్రీ వెంకటేశా ప్రభో! 430

ఉ॥ పిల్లలు భార్యయున్ నతని ప్రేమకు నోచిరి! మానసంబునన్
తల్లడిలంగ "యం.డి." తన ధర్మము మేలకు వృత్తి నాజ్ఞలన్
తల్లి ప్రసూన కివ్వనది దైవ లిఖిత్వమటంచుఁ జేరగన్,
పిల్లలు పాఠశాలలో ప్రవేశ మొనర్చితి! వెంకటేశ్వరా! 431

## వ్యాజ్యేములు ప్రారంభం

శా॥ నా సంపాదనచే, గృహంబుకొనగా. నా కష్టమే దక్కెనో?
నా సంసారము చక్కదిద్దనదియే న్యాయంబునన్ నిల్చెనో?
వాసంబై, భవనంబునై, మిగుల శోభావంతమై, సుస్థిరా
వాసంబై, నయె యోగ్యతన్ విడిది! దేవా! వెంకటేశా ప్రభో! 432

ఉ॥ శాయియుఁగాంచె పుత్రి నొక చక్కదనాలపు నాగకన్య యే
మోయన, సౌకుమార్యమును, ముద్దుల మోమును, చిన్న మూతియున్,
జేయగ భారసాల యయె? శ్రీకరమైనది నామమంత వ
ల్లీయన నొప్పె, బాలసకలేంద్రియ శోభతా! వెంకటేశ్వరా! 433

చం॥ గృహము ప్రవేశ మా మనసు కెంతయుఁజేకుఱె, శాంతిసౌఖ్యముల్,
అహరహమున్ స్వబంధు జన మాదరణంబు లభించె తృప్తిగన్,
సహితమునయ్యె నల్లుని వసంతపు యాబ్దిక వత్సరీకమున్,
సహచరులెల్ల కోరిరిక శంకరు పెండిలి! వెంకటేశ్వరా! 434

ఉ॥ పెట్టిన డబ్బు నా గృహపు విల్వకు కోమటి కోర్టు కీడ్చె! తా
కట్టునుపెట్టి యమ్మె! తుదకా గృహమున్, ఋణదాత వ్యాజ్యేమున్
నట్టులగెల్చె, నా తగవు న్యాయముచేత జయంబుఁ గాంచితిన్,
కట్టిన పాపమే కుడువ కాల్చెను నాతని! వెంకటేశ్వరా! 435

శా॥ శ్రీవత్సాన్వయ, రామచంద్రుసుత, ఝాన్సీరాణి, మత్పుత్రుకున్,
వైవాహంబయె! వెంకటేశ్వరుని దేవస్థానపున్ వేదికన్,
యావాసిష్ట, పురోహితుల్, బుధులు నున్ యాశీస్సు లందివ్వ, శో
భావంతంబున నొప్పె పెండిలటు దేవా! వెంకటేశా ప్రభో! 436

ఉ॥ మానవుఁడెప్పుడున్ పనిని మానఁడు! జేయగ నూరకుండఁడో?
యా నిజమున్ కనంబడె! ప్రయత్నము లేకనె పెండ్లియైన ద
య్యా నిముసంబు పంచనొక యాకృతిఁ దాల్చగ పైన వాసమై
మానసమందు శాంతియను మందిర మేర్పడె! వెంకటేశ్వరా! 437

ఉ॥ ఖమ్మము వాసమంట ! తమ కార్యము కూతురు పెండ్లికోసమై,
మమ్ములవేడ వచ్చిరట ! మామక పుత్రుఁడు సుబ్రమణ్యకున్,
రమ్మని, పిల్లఁజూడమని, వ్రాసిన నెప్పుడు వత్తురంచు, చూ
తమ్మని, తెల్పుజాలునని, తద్దయువేడిరి? వెంకటేశ్వరా! 438

ఉ॥ తూముబరాన్వయా వధువు, దొడ్డపరాశర గోత్రి, వెంకటే
శామెకు తండ్రి, చూడవరుఁ డామెకు నీడును జోడునై చనన్,
క్షేమమటంచు జాతకము జీవితమందు సుఖానుభూతియున్,
ప్రేమ పరస్పరంబు కనుపించెను జూడగ ! వెంకటేశ్వరా! 439

చం॥ తరలిరి పెండ్లివారలు యథావిధిగన్ నెదురొచ్చినారు! నా
దరణము పెంపుమై విడిది ధామము, విందు నొసంగి రంతటన్,
మఱునుదయంబుఁజేయగల మంగళ కార్యకలాప చర్చలన్
పరగెను! కన్యదాత తన బాధ్యత కొద్దియు! వెంకటేశ్వరా ! 440

ఉ॥ స్నాతక, కాశియాత్రలు వినమ్రతఁ జర్పగఖమ్మ మందునన్,
దాత తెలంగణా క్రమవిధానము గంపల, కన్యదానమున్
చేతునటన్న పల్కుల, వశిష్టులు పీటలమీద నుంచనీ
కూతుకు కన్యదానము నగున్, యని తెల్పెను! వెంకటేశ్వరా! 441

చం॥ అనగను కన్యదాత వధువంతట పీటల కూరుచుండ లాం
ఛనముగ కన్యదానమయె! శాస్త్ర విధానము మంత్ర, తంత్రముల్
పనస పురోహితుల్ పలుక, వాద్యపు ఘోషలు మిన్నుముట్ట, బ్రా
హ్మణులటు మంగళాక్షతల హో"యని చల్లిరి! వెంకటేశ్వరా! 442

ఉ॥ ఇల్లును గట్ట నా గృహము నెన్ని శుభంబులు, మంగళాక్షతల్,
చల్లిరొ? వృద్ధిఁగాంచనది, సంపద, సంతతి, శాంతి, సౌఖ్యముల్,
యెల్ల విధంబులన్ నదియు నింపును, సొంపును గూడె నందునన్,
పిల్లల పెండ్లి యయ్యె! కనుపించెను శోభయు! వెంకటేశ్వరా! 443

మ॥ సతి ఝాన్సీ కనె పుత్రికన్ పదవ మాసంబందునన్, నామనో
గత వాంఛా పరిపూర్తియై, తనకు నా కామేశ్వరీదేవియే
సుత నిచ్చెన్ గదయంచు, నామమును సంస్తుత్యంబునై పర్వనా
పతి చైతన్యయు రేఖ నామమిడె దేవా! వెంకటేశా ప్రభో ! 444

చం॥ మొదట గృహంబు నిర్మితము, ముచ్చట బుజ్జి వివాహమయ్యె! నే
సదనుగ పంచపై నిడగ, నప్పుడె బాజికి పెండ్లియయ్యె! నా
సుదతలు కోడ లిర్వురు ప్రసూతి సుఖంబుగఁ గాంచగన్, శుభా
స్పదమగు కార్యముల్ నెఱుప సంతసమయ్యెను! వెంకటేశ్వరా! 445

ఉ॥ అన్ని విధంబులన్ గురుసుహర్దశ నెంత విశిష్టమైనదో?
నన్నిట రాహువే పదవి నంత మొనర్చెను, కోర్టు పాలునున్
మున్నె నొనర్చె! యిప్పుడిక ముందు గురుండరు దెంచె! యేమిటో?
యన్నియగోచరంబయెను! అపదమ్రొక్కుల వెంకటేశ్వరా ! 446

చం॥ ఇదివఱకే గృహంబొకటి నీడ్చెను వ్యాజ్యము నంతదాకనున్,
పదిలమనంగతోట కథ పాలొనరించెను తల్లి కోర్టుకున్,
ముదమున వచ్చు సొమ్మును ప్రభుత్వము కిమ్మతు తక్కువయ్యె, నా
కొదవెడి దేమినున్నదిక ? నోర్వగ నెట్టుల? వెంకటేశ్వరా ! 447

ఉ॥ కోరెను పాటిబండ్ల తన కోసము బొగ్గును బెంగుళూరునన్
భారి పరిశ్రమల్ కొసగ పంపెను నార్డరు తేవనట్లు! వ్యా
పారముఁ జేయ, పట్టు విడుపన్నది కావలె! కాని యాతఁడా
బేరము సాగనివ్వఁడయె, బేలుఁడు నయ్యెను! వెంకటేశ్వరా! 448

ఉ॥ చేరి వృథా ప్రయాసలకు చింతిలె చిత్తము! యెందు కొచ్చెనో,
దారిన పోవు తద్దినము దాపురమయ్యెడు రీతిఁగాంచ నా
ధారము ఖర్చు మాత్రమును ధర్మపు బిచ్చము నిచ్చెనన్న యా
ధోరణి నెట్టు లుండునిక? తోచదు మార్గము! వెంకటేశ్వరా! 449

ఉ॥ భూములు నిమ్న జాతికిడ, భుక్తి నొనర్పగఁజేయు నాజ్ఞలన్
శ్రీముఖ మిచ్చి నొక్క పరిఁజేర్చెను తోట గవర్నమెంటులో!
"యేమన గిట్టుబాటు ధర నిచ్చితి సొమ్మనె" భాగ మివ్వకన్
నామెయు మాతృమూర్తి తన హక్కును కోరెను! వెంకటేశ్వరా! 450

చం॥ అదియొక సాకుగాను పరిహారము కోసము కోర్టుకీడ్చె; నా
ముదుసలి న్యాయమున్ విడచి, మూర్ఖత, మోసము పొల్పడంగ, దా
వదరెడు తల్లికేగతి నిబద్ధమొ? ధర్మమెఱుంగ మానసం
బొదవెడు దుఃఖ వీచికల నోర్చుచు నుండితి! వెంకటేశ్వరా! 451

మ॥ వ్యవహారంబను కూలమై గృహముకై వ్యాజ్యంబునున్ గెల్వ, నా
ల్గవ పుత్రుండును రాముఁజేరె ననుకూలంబైన నుద్యోగమున్,
భవబంధంబులఁ ద్రెంచి "చిన్న"యము నిన్ పాశంబుకున్ పొల్పడెన్,
నవధుల్లేవయె దుఃఖమాజయకు, అన్నా! వెంకటేశా ప్రభో! 452

## అయ్యప్ప దీక్ష శబరి యాత్ర

ఉ॥ మండలదీక్షఁబూని మణిమాలయు నీలపు వస్త్ర ధారణన్,
పండుకొనంగ భూస్థలియు, భక్తిప్రపత్తుల నేకభుక్తమున్
యుండుచు "నయ్య పాశరణయో శరణన్న"ది ఘోషపాడుచున్
వెండిలి సామి సేవలతొ వెళ్లెను కాలము! వెంకటేశ్వరా ! 453

ఉ॥ వచ్చె ధనంబు నా విజయవాడ గృహంబు వివాద తీర్పుగా,
తెచ్చిన యప్పుగా సుతకుఁ దీర్చితి! వ్యర్థ చికిత్స కంటికిన్,
మచ్చగ చూపు లోటునయె! మత్సుతురాము ప్రభుత్వ కొల్వునన్
వచ్చె ననంగఁజేర నభివందనమే గద? వెంకటేశ్వరా! 454

ఉ॥ జీవిత సత్యమింతె! జయ చీల్చెను బంధము, రాకపోకలన్
భావము త్రెంచెఁబో? జనని వ్యాజ్యము కోర్టును పాలుఁజేసెనో?
భూ విషయంబు న్యాయ పరిపూర్ణ విచారణ కాలయాపనై
పోవగ నెట్లు దారి నిడు పోల్చగ నైతిని! వెంకటేశ్వరా ! 455

ఉ॥ బాజికి పుత్రుఁడున్ గలిగెఁ; వంశము వృద్ధిలఁ జేయువాఁడునై,
"రాజ"ను నామమంద, ననురాగము "నన్ననురాగ కృష్ణుఁడై,"
రాజిలె! భారసాల ననురక్తిగ దానజపాదు లివ్వగన్,
బాజి పురోహితాదులకు పంచెను దానము! వెంకటేశ్వరా ! 456

మ॥ అనుకూలంబుగ నన్నియున్ జరుగు సవ్యంబైన కాలంబునన్,
చనె ఝాన్సీ నట రామగుండమున "టీచర్" నౌకరీ, జేరగన్,
తనదే యాస్తి యటంచు తల్లి మరలన్ దావాను తోద్తోడగా
యెనలేవీ కడగండ్లు నెన్నటికి నయ్యేన్? వెంకటేశా ప్రభో! 457

ఉ॥ రెండవసారి కాంచగ తరించితి నయ్యప దర్శనంబు! నీ
రెండల కాంతులీను "పడి" రెండవ పాదము నెక్కి జేరితిన్,
పండుగ నయ్యె, కన్నులకు బంగరు విగ్రహ మట్లు కాంచగన్,
మండల దీక్షతోడ మణిమంగళ విగ్రహు! వెంకటేశ్వరా! 458

చం॥ దినములు దొర్లుచుండె నతి తీవ్ర గతిన్; మనసా పదే పదే
యనుసరణీయ మార్గము నహర్నిశలున్ పరిశీలనాంత మ
య్యె! నడుమ తల్లి నిష్ఠురత నెక్కువ నయ్యె! విచారణీయమై
చన దగు త్రోవనున్ గనగ సాధ్యము కాదయె! వెంకటేశ్వరా! 459

చం॥ పలువురుఁజేయు యత్నములు వాదవివాదము పెంచఁజూతురే?
తలపరు తల్లి పుత్రులను ధర్మము! నామెయు వాస్తవంబునున్
దలపదు! న్యాయసమ్మతము తావును వీడు, వయస్సు మీఱగన్
నిలుపదు సామరస్యమును నిర్వ్వర మధ్యను! వెంకటేశ్వరా! 460

ఉ॥ నమ్మిన వానికెప్పుడును నమ్మకద్రోహ మొనర్పఁడన్న దై
వమ్మును వేడికొంటి! సమభావముఁ జూపుమటంచు తల్లి వ్యా
జ్యమ్మును సంధికిన్ కలుగఁజేయగ వేడగ తాను "చాలు పో
పొమ్మన!" నవ్వులాటనయె! పొక్కతి నెంతయొ! వెంకటేశ్వరా ! 461

శా॥ భారద్వాజసగోత్ర జాత! ముదిగుండ్వంశీయ! శైలాంబకున్
చీరాల్లాన్వయ వంశజున్ హరితసా శ్రీరాము గోపాలుకున్
పౌరోహిత్యులు వేదమంత్రముల వైవాహంబుఁ జేయించిరా
శ్రీరామాలయమందు దీవనలిడన్! శ్రీ వెంకటేశా ప్రభో! 462

మ॥ ఇవ టూర్వంశజు కాశ్యపాన్వయపు గోత్రీశుండు నారాధ్యుఁడున్
శివదీక్షాపరు రామకృష్ణుఁడును తాఁజేసెన్ వివాహంబునున్,
యవధుల్ మేలక్షు శైలజాఖ్యణిని కన్యాదానమున్ రాముకున్,
భవబంధంబున మేనకోడలిని, దేవా! వెంకటేశా ప్రభో ! 463

ఉ॥ శైలజరాము దంపతులు సాగిరి వెంకటసామి మ్రోలకున్
నాలయ మందు శోభ ప్రభు నాభరణంబు నలంకరించగన్,
మేలుగ లక్ష్మిదేవి నలిమేలును మంగళ దివ్యమూర్తులన్
జాలిగ తమ్ముకావుమని సాగిల మ్రొక్కిరి వెంకటేశ్వరా ! 464

ఉ॥ బాజిని కాకినాడ కని పంపగ మార్చిరి బెంగుళూరుకున్,
యాజవరాలు భార్య విజయన్ ప్రసవంబుకు తండ్రి తోడ్కొనెన్,
మోజుపడంగనో యనగ ముద్దుల కూతురుఁ గాంచె! నామమున్
బాజియు భారసాల కడ వందన పేరిడె! వెంకటేశ్వరా ! 465

మ॥ అది యారంభము కీళ్ళనొప్పులకు, ప్రాయంబంతఁ గాకుండగన్,
ముదిమిన్ పైఁబడు నప్పుడే కలుగునే మోకాళ్ళలో నొప్పి? అ
ర్వది నేడేండ్లకు నీ వయస్సు నను సంప్రాప్తంబయెన్, నెట్టులో
హృదయంబందు భవాని పెండ్లి తలపయ్యెన్! వెంకటేశా ప్రభో! 466

ఉ॥ కాలము కర్మమున్ కలసి కార్యము చక్కబడంగఁ జేయునున్,
పాలనొ నీట ముంచెదవొ? ప్రాప్తము నెట్లు లిఖించియుండెనో?
యేలొకొ పెండ్లి చూపులకు యెన్నగ నొక్కఁడు రాఁడు ముందుకున్,
తాలిమి తప్పుచుండె నొక దారిని కానను! వెంకటేశ్వరా! 467

చం॥ కమల కుమార్తె హేమ "మనకయ్యెడు నుప్పలపాటి వారి వి
య్యము ననుకూలమౌ మనువు" నంచన పెద్దల సంప్రదింపులన్
సమయము నిర్ణయంబగుట సత్వర చర్యగ పెండ్లి చూపులై
కొమరులుఁ జూచి నొప్పె ననుకూలము నౌనని! వెంకటేశ్వరా! 468

చం॥ ఇరువురి జాతకంబులు సహేతుకమై కలియంగ, నావధూ
వరులది నీడు జోడన, వివాహపుయోగము కాలమౌన, నా
గురువుల దీవనల్ వడసి కూతురు పెండిలి నిశ్చయంబునై,
నరిగి సుమూర్తమున్ నిడగ నానతి పొందితి! వెంకటేశ్వరా! 469

శా॥ భారద్వాజస గోత్రుఁడై బుధుఁడు గోపాలార్యుకున్ పౌత్రుఁడై,
నారాయణ్ణను పెద్ద పుత్రుఁడయి ప్రజ్ఞన్ నింజ నీరుండునై,
గౌరవ్యుండు ప్రకాశరావు వరుఁడౌ కళ్యాణ మాడంగనున్,
పేరే నుప్పలపాటి వంశజుగ నొప్పెన్! వెంకటేశా ప్రభో! 470

శా॥ చీరాలాన్వయ గోత్రియాహరితసా శ్రీరాం ప్రపౌత్రీయునై,
ధీరుండౌ హనుమంతరావునకు పౌత్రీరత్నమై, దత్తుఁడౌ
శ్రీరాం శర్మకు పుత్రియై వధువు లక్ష్మీదేవి రూపంబు, చి
న్నారీ లక్ష్మిభవాని నాఁబరగె నన్నా! వెంకటేశా ప్రభో ! 471

శా॥ వైశాఖంబున శుక్లపక్ష దశమిన్ పౌరోహితుల్ రాకతో,
ప్రాశస్త్యంబగు లగ్నమందునను వైవాహంబు గావింపగా
యాశాసిద్ధి వధూవరుల్ శుభముగన్ యాశీస్సులన్ తృప్తిగా,
యాశించన్ తగుదీవనల్ నిడిరటయ్యా! వెంకటేశా ప్రభో! 472

చం॥ అయినది లగ్నశుద్ధి, ఫలితాంశము సర్వవసూహ్యా రీతులన్,
ప్రియసుత లక్ష్మికిన్ కలిగె పీడగ వాంతులు? గ్రీష్మమయ్యెనో,
బయటను తప్తనుష్ణమును పాలగుతాపము నింటిలోననున్
యయినను పెండ్లియయ్యెను ప్రయత్న ఫలంబుగ, వెంకటేశ్వరా! 473

శా॥ యే దుష్టగ్రహ వీక్షణో? పయనమా, యే పాప హోరందునో?
యే దైవంబు దురాగ్రహంబుకతనన్ యీలాంటి చేటొచ్చెనో?
యే దోషంబును కానిపించదు కదే? యే నెంత పాపిష్టినో?
నే దూరంబని లేదు! కర్మఫలమేనే! వెంకటేశా ప్రభో! 474

ఉ॥ సంచలితంబయెన్ మనసు సంక్షుభితంబును పొందెఁ యత్నమా
అంచన మేలుకున్ జరిగె! యన్నియు సవ్యమె? హేతువేది, యో
చించిన మాత్రమే తెలియరాదుగ? యీర్ష్యయు మత్సరంబులున్
యెంచగ తావులేదు? మరి యేమన నయ్యెడు? వెంకటేశ్వరా! 475

మ॥ మనసా పెండిలి వారి వాంఛలను సన్మానార్హ వైవాహికా
క్షన సత్కారము నాద్యమంత మనురాగా శోభితంబై నిడన్,
కన తత్కాల పరీక్షగా వధువు రోగాత్కారణం బెద్దియో?
అనుమానాస్పద రీతితో చెనుకదయ్యా? వెంకటేశా ప్రభో! 47

ఉ॥ "ఔ గద? అన్నియున్ కలవు అల్లుని నోట శనుండు సామెతన్"
వాగిన దుష్ట వాక్పటిమ వాస్తవమై నొనరించె దైవమే?
నేగు తథాస్తు దేవతలు నింగిని వాక్కు తథాస్తు నందురే?
యే గుణ మెట్టిదో పలుక నెప్పుడుఁ గూడదు! వెంకటేశ్వరా! 477

ఉ॥ అ సుముహూర్త మెట్టిదియొ? యందఱు విందును నారగించిరే!
చేసెను సూత్ర ధారణము, జీరక బెల్లము నెత్తి నుంచగన్,
వేసిరి మంగళాక్షతలు వేడుక పట్టిరి మంగళారతుల్,
ఖాసిలె సర్వమంత నపవాదుకు లోబడ! వెంకటేశ్వరా! 478

ఉ॥ ఆ సుముహూర్తమున్ బలము నాత్మజ మంగళసూత్ర ధారణన్,
నా సతికంత సప్తపది నంత సదస్యము, నంపకంబులున్
నా సుత నత్తమామలకు నాత్మవిభుండుకు నాడ పర్చుకున్,
జేసితి! వంగవోలునకు సేమమె చేరిరి? వెంకటేశ్వరా! 479

ఉ॥ ఆ సమయాన మానసము, నాత్మయు ఘోషిలె! బంధుజాలమున్
చేసిన పిండివంటలు, విశేషము పాయసమన్న పానముల్
వాసన గట్టి యుంచెనను భావన తోచగ మేము మాత్రమా
గ్రాసము ముట్టలేదు కద రాతిరి నంతయు? వెంకటేశ్వరా! 480

మ॥ అవలోకించగ వాక్కుశద్ధి గల వేదాభ్యాస సంపన్న రా
ఘవ నారాయణ శాస్త్రిగారు నిడె లగ్నంబున్ సుమూర్తంబు, వ్రా
సె వివాహంబుకు పత్రికన్, గణపతీ సిద్ధాంతి యుక్తంబుగన్,
అవరోధంబులు లేని దాని నటులయ్యా! వెంకటేశా ప్రభో! 481

చం॥ ఒక నిముసంబు కాలమున యూహకు నందని భ్రాంతి లోనుగా,
వికల మనస్కనైతి, పరివేదన పాలవ; కాని మానసం
బిక సరిచేయు నాశయయె! పిచ్చుకపై నిడు బ్రహ్మ అస్త్రమా?
సకల చరాచరుండు నిక సవ్య మొనర్చెడు! వెంకటేశ్వరా! 482

చం॥ అయినను నయ్యెగాక! హృదయంబున గాయము నయ్యె! కాని బా
జియు, చని వంగవోలునకు సేమమె చెల్లెలు నంచు చెప్పగన్,
భయమును వీడి మ్రొక్కితిమి! పావనదుర్గకు, వెంకటేశుకున్,
దయగని కావుమంచు మమతన్ ననురాగము పొంగిపొర్లగన్, 483

చం॥ సుతసుతు భేదమేలనొ? ప్రసూన వరంబిడె చెల్లి పెండ్లికిన్,
సుతుసుత లిర్వురున్ కనులఁ జూడగ రెండుగ కాని పించగన్,
సుతులును యోపినంత తగు శోభను గూర్చిరి సాయమిచ్చుచున్,
మతిగతిలేని మాటలు ప్రమాదమె కాదొకొ ? వెంకటేశ్వరా! 484

ఉ॥ న్యాయము వాదనన్ గెలువ నాదు వకీలును కోర, సత్యనా
రాయణ వాద మెల్లను పరాజయ మొందగ దారితీసె, నా
ధ్యేయము "కోర్టు వ్యాజ్యమును" తీర్పును కూలము నెంచఁబోవ, న
న్యాయత కాలవాలమయె! నా బ్రతుకంతట! వెంకటేశ్వరా! 485

మ॥ అధికామోదము పొందువేళ తుదక న్యాయంబు పాలైతినే?
విధి దూరంబని లేదు, కాని నొసటన్ విక్రీడితంబై చనన్,
వృధ! ఆయాసము తప్ప నేమి మిగులున్? వృద్ధాప్యమౌ వేళ నా
పథకంబెల్లను తారుమారు నయె! దేవా! వెంకటేశా ప్రభో! 486

మ॥ మొదలే వేడితి కావుమంచు శబరిన్ మోకాళ్ళ నొవ్వంగనో?
పిదపన్ వెంకటసామినిన్ గనుచు తృప్తిన్ పూజలన్ సల్పితిన్,
నెది ధర్మంబది దాని నివ్వమని ప్రార్థించంగ భంగంబయెన్,
యిదియే ప్రాప్తము? నిందవేయ పనియేమీ? వెంకటేశా ప్రభో! 487

మ॥ ప్రతిభావంతుఁడు చల్ల పూర్ణయ మహాప్రాజ్ఞుండు వాదంబునన్,
గతి హైకోర్టుకుఁబోవ తప్పదయె! సాంగత్యంబు నారాయణే!
బ్రతిమాలంగను పూర్ణయార్యునకు తీర్పౌ పత్రముల్ఁ జూపగన్,
ప్రతినిన్ దాఖలుచేసె కోర్టుకడ! దేవా వెంకటేశా ప్రభో! 488

చం॥ అతి ముదమాయె, శైలజయు నాత్మజుఁ గాంచె సుఖంబుగన్, యిదే
అతివలు మన్మలన్ గనగ అందల మెక్కగ ధర్మమే గదా?
సతతము తాత నవ్వలను సంతస మివ్వగ బిడ్డలే గదా?
సతియు సుతుండు నామము "విశాల"ను వ్రాసెను! వెంకటేశ్వరా! 489

ఉ॥ పెండిలివేళ తీవ్రమగు వేదన పాలొనరించె! నాతఁడే
వెండిలి మానసంబు మురిపించు విధంబున పుత్రికన్ సుఖం
బుండు మటంచు నిచ్చెనొక పుష్పము లక్ష్మి భవానికంత! వా
డండగ నుండ నిచ్చె కమలాక్షి నలేఖ్యను! వెంకటేశ్వరా! 490

చం॥ అదియునసాధ్యమంచు తుది యత్నముచేత ఫలించు నంచు, నా
హృదయము తెల్ప, అమ్మనిక నెట్టులొ తోడ్కొని కోర్టు కెళ్ళగన్,
మదిముద మందరాజిపడె మంత్ర భుజంగము రీతి తాను, త
ప్పదనుచు నాదు వెంట నిక వచ్చెదనంచనె! వెంకటేశ్వరా! 491

ఉ॥ కత్తులు రెండు నొక్క పొదికంతలొ దూరవు! యైననున్ యెదో
పొత్తు కుదర్చవచ్చని నపోహతొ నిప్పటికైన సాధ్యమం
చత్తను కోడలిన్ నొకట నల్లుకు పోగలరంచు భావనన్,
చిత్తము శుద్ధిగన్ గృహముఁజేర్చితి అమ్మను! వెంకటేశ్వరా! 492

ఉ॥ వచ్చినవేళ యెట్టిదియొ? బాధలు నొక్కట వెంట రెండునై,
తెచ్చెను గుండెపోటు నతి తీవ్రమునై, తుద కానుపత్రినిన్,
జెచ్చెర భార్య నిందిరను జేర్చితి! కొన్ని దినాలు నుండి రా
వచ్చని అమ్మ నంపితి నవశ్యము పుత్రితో! వెంకటేశ్వరా! 493

మ॥ "పని చేయంగల భారమే తగదు నీ భార్యామణీ యిందుకున్,"
యని వైద్యుండన శాయి తోడ్కొని చనెన్, "అమ్మా"యటంచార్తినిన్,
పని విశ్రాంతియు నిచ్చె పుత్రుఁడును సాఫల్యంబుగా కోడలున్,
చనె కాలంబటు నారుమాసములు యీశా! వెంకటేశా ప్రభో ! 494

ఉ॥ అలన భార్యవఁతుయన యామెకు వచ్చెను రోగమీవిధిన్,
పాలన భర్తవంతుయన భావ్యమె, డబ్బును మందు లివ్వగన్,
పాలన ఆలనన్ సుతుల భాగ్యమె! తండ్రి సమర్థుఁడైనచో,
కాలము చక్కదిద్దునది గౌరవ సూచన! వెంకటేశ్వరా! 495

ఉ॥ శైలజ, రాము భార్య, కనె చక్కని పుత్రుని తండ్రి నింటనున్,
పోలిక యన్న రూపమున పుత్రుని నామము భారసాలలో,
బాలుని కిన్ యశస్వియని భావ్యమనంగను నామ మివ్వగన్,
చాలును నిర్వ్యరయ్యెనని సంతసమందిరి! వెంకటేశ్వరా! 496

ఉ॥ నా పని సర్వమున్ జరిగె, నన్నియు సవ్యము నైన దింతకున్,
నోపదుకాలయాపనము, యుక్తమునైనదిఁ జూడ బేబికిన్
చూపులు పెండ్లి వారలను జోడును నీడును నెంచుకోవలెన్,
పాపము తండ్రిలేని పసివారలు కాదొకొ! వెంకటేశ్వరా! 497

ఉ॥ ఎవ్వరు పిల్చినన్ పరుగు లెత్తగ సాయమొసంగ న్యాయమే?
దవ్వననైన తప్పదు గదా? దరిఁజేరగ బిడ్డకోసమై,
త్రవ్వకొనన్ గతంబునిక తల్లియె మమ్ముల నీసడించగన్,
నవ్వనివారు నుండరొకొ ? నాత్మకు శాంతియె? వెంకటేశ్వరా! 498

చం॥ దినములు, మాస, వత్సరము తీవ్రగతిన్ చన, కానదయ్యెనే?
చన నొకదారి సాయమిదు సంతతి వత్తురు తల్లి కోసమై,
జననిని కాదనంగ నది సవ్యమె? భావ్యమె యాపెపంతమే
అనువుగ సాగెనే? వృథ ప్రయత్న మొనర్చిన! వెంకటేశ్వరా! 499

ఉ॥ కాలము దొర్లిపోవ నతి కష్టము నయ్యెను! పుత్రులిండ్ల మా
ర్జాల కిశోర న్యాయమును సాగెడు, నొక్కొకచోట నుండగన్,
నాలన పాలనన్ జరుగు! నాశ్రయ మిచ్చెడు దాతలుండగన్,
చాలదు మానసంబటుల సంచరణంబున! వెంకటేశ్వరా! 500

ఉ॥ పుత్రిక పెద్దదానికడ పూర్వమె తల్లిని నుంచనయ్యె! దౌ
హిత్రుఁడు చిన్నవాఁడగుట నింగిత మెంత నెఱుంగఁబోఁడు, గా
యత్రి వివాహమే కద ! ప్రయత్నము లోపము నుండఁగూడదే
మాత్రము నాల సింపనిక మంచిదిఁగాదుగ ? వెంకటేశ్వరా! 501

శా॥ పుత్రుం డొక్కఁడు చాలు వంశమునకున్ పున్నామ దాటింపగా,
పుత్రాన్వేషణ దత్తతే శరణు కాబోలంచు భావింప, దౌ
హిత్రుల్ నున్నచోఁ జాలునన్న నిజమున్ నేనాఁడొ చాటంగ, నీ
యాత్రంబంతయు యాస్తికోసమె గదయ్యా!. వెంకటేశా ప్రభో! 502

మ॥ అనపత్యుల్ విహితాను రక్తులయి వంశాధారు కోసంబు, ద
త్తుని వాంఛించి యపౌత్యులౌ దురట! పుత్రుండంత పుట్టంగ, ద
త్తు నుపేక్షింతురటన్న సత్యమునునే దోషంబు కాన్పించ ద
న్న నిజంబంతయు రూపు కట్టెకద ! నౌనా ? వెంకటేశా ప్రభో ! 503

ఉ॥ హైందవ వారసత్త్వమున నాస్తికి వారసురాలు భార్యయే?
స్పందన న్యాయశాస్త్రమయె! వంధ్యగ భర్త గతించ భార్యయున్
పొందిన నాస్తియున్ తనకు పుత్రులులేక ననామధేయులన్
నందిన నాదరింపకననాథులఁజేయును! వెంకటేశ్వరా! 504

ఉ॥ న్యాయముచేత సంక్రమిత మాస్తిని పుత్రుని కివ్వ నొప్పదే?
న్యాయ మటంచు పుత్రికకు నల్లుని నిల్లరికంబుఁ జేయ తాఁ
జేయు విచారమే తనకు చేటునుఁదెచ్చును, పుత్రుఁడన్నచో
యాయితమౌను కర్మలకు నాదుకొనంగను ! వెంకటేశ్వరా ! 505

ఉ॥ మోదముచేత సత్త్వగుణ మూర్తులు శీలవతంసుఁ డల్లుఁడౌ,
సాదు ప్రకాశరావు, సతి సాధ్వి భవాని, నలేఖ్యఁగూడి నా
మోదము చేసె సంబరము, పుట్టిన రోజున పెండ్లియైన ద
య్యాదిన మందు మూఁడవది యయ్యె వసంతము! వెంకటేశ్వరా! 506

మ॥ మరణాసన్నము ముక్షువుల్ మహిని ప్రేమాశాధనా కాంక్ష త
త్పరు లాధ్యాత్మిక చింతవీడి మది కాంతామోహ పాశంబునన్,
పరకాంతారతి సౌఖ్యమే తమకు సంప్రాప్తంబుగా స్వర్గమున్
నరచేతన్ కలదంచు నెంతురు కదయ్యా! వెంకటేశా ప్రభో! 507

ఉ॥ దుర్భర జీవితంబనగ దోసిలి యొగ్గి నమస్కరింతు ! నే
గర్భ దరిద్రుకాన్ మొదట! కాంక్షతొ దత్తుకు పెంచుకున్ననే
నర్భకుఁడన్, మనంబునిక నాగదు! వ్యాజ్యెము మీది కోరికన్
నిర్భయమందగా జయము నిచ్చును సత్యము! వెంకటేశ్వరా ! 508

చం॥ గత జలసేతు బంధనము కాదిది, కర్మను దూర లాభమా?
మితముగ పూజఁసేసితి! నిమిత్తపు మాత్రుఁడ! పూర్వజన్మ సం
చిత మదికాక పోవునె? విచిత్రము? జీవితశేష భాగమున్
సతమతమౌచుభారమును చాలువహింపగ! వెంకటేశ్వ!రా ! 509

మ॥ మునుపుద్యోగము కాలమున్ జరిగె నా పుణ్యంబునన్ యాత్రలున్
కని సేవించితి! నిప్పుడో హృదయ రోగంబంచు నడ్డంకి, యో
చన మార్గంబును కాననైతి! సతితో సాధ్యంబు కాబోదుగా?
అనుమానాస్పద పత్ని జీవితము నయ్యా! వెంకటేశా ప్రభో! 510

చం॥ వివిధ పురాణ శాస్త్రములు వీనులవిందొ నరింప, బాష్యముల్
సవిరణంబునన్ నుపనిషత్తులు నర్థము రామకోటిలో
నవిరళ ధారలన్ నుడువ, నాప్తులు మిత్రులు నేగి విందురే?
శ్రవణము నాకు దక్కదయె! సాధ్యము కాదయె! వెంకటేశ్వరా! 511

చం॥ జననము సార్థకంబగుట, శక్తి సమర్థత కాళ్ళు కన్ను లుం
డిన, నడువన్ స్వశక్తియును డీలుపడన్ చన నోపనైతినే?
అనయయు కార్యసిద్ధిగన, అంగవిహీనున కెట్టులౌను? నే
ననిశము నండదండలకు నాశ్రయమౌ గద? వెంకటేశ్వరా! 512

చం॥ గురుదశ రాహువున్ విదశకున్ విపరీతము సంభవించునా?
యెరిగియు శస్త్ర వైద్యము విహీనుఁడ నేత్రుఁడనైతి నంతటన్,
నొరులును వెంట లేక చనసుద్యతి శాస్తి నొసంగె దైవమే?
పరులను నిందవేయగల పాపమునౌ గద? వెంకటేశ్వరా! 513

ఉ॥ కీళ్ళకు నొప్పులంచనగ కీలుకు వాతయె మందు నందురే?
కాళ్లకు సంక్రమింప పడుకష్టము చెప్పగ రానిదయ్యెనే?
యొళ్ళది యెంత యున్ననది నోర్వగ వచ్చును బాధలన్నిటిన్,
కాళ్ళకు వచ్చినన్ నడువ కష్టము నొగద? వెంకటేశ్వరా! 514

చం॥ తెలియదొ? కన్ను, కాలుఁచన దెంతటి వానికినిన్ ప్రధానమే?
వెలితిని పడ్డ వానిగతి, వేఱుగ చెప్పగనేల? యెల్ల వే
ళల పరు నాశ్రయింపనది లౌక్యమె? యాదరణంబు కోరగన్
నలయక సాగునే? మనము నందిది చింతయె? వెంకటేశ్వరా ! 515

ఉ॥ అతని నేత్రముల్ ముఖము అంగములాకృతి, వెండిబంగరున్,
నాతని కిచ్చినన్ నయము నౌనను నానుడి? జాడ్యమంతమౌ
నాతఁడె వెంకటేశ్వరుఁడు, నవ్యయు, వైద్యుఁడు నంచు యెన్నగా
నాతఁడె దిక్కుగా నగు, ననారతమున్ కన! వెంకటేశ్వరా! 516

ఉ॥ చూసిరి దేవునిన్, చదివె సుందరకాండను భక్తితోడనున్,
వ్రాసె పరీక్షలన్ ఫలము వచ్చెను, వారలు రాజ బేబియున్,
పాసయె నంచు నమ్మలును, బాబు కిశోరుని తంతి వార్తనున్
చేసిరి, సంతసం బొదవె శీఘ్ర ఫలంబుకు! వెంకటేశ్వరా! 517

ఉ॥ వారలు "బేబి రాజ" తమ వంతు పరీక్షలు వ్రాసి గెల్వగన్
కోరిన సత్ఫలంబుఁగనె! కూతులు గెల్వగ తల్లి, తాతలున్,
భారము తీరినట్లనిరి బాధ్యత మేలుకు! తండ్రిలేని కా
ధారము తల్లికూర్చెగద? దైవము తోడయె! వెంకటేశ్వరా! 518

చం॥ యొకరిని మించినన్ మరొక రుత్సుకతన్ జయమున్వరించగన్,
వికసిత నాననంబుల వివేకమునుట్టి పడన్ పరీక్షలన్
ప్రకటిత సత్ఫలంబులను వాంఛిత రీతిని పొంది గర్వమున్
నొక పరిఁగాంచి తీరవలెనో గద! శ్రీపతి వెంకటేశ్వరా! 519

చం॥ విదిత పరీక్షలన్ ఫలము వీనుల విందొ నరింప, సప్తమున్,
పదియవ తర్గతిన్ వరుస బాబు కిశోరులు, వల్లి చేరగా,
మదిముదమాయె నందులకు! మన్మలు కిచ్చితి దీవనల్ నికన్,
ఫధుగురు యన్నమాట నది భాసిలె సవ్యము! వెంకటేశ్వరా! 520

ఉ॥ వార్తలునున్ ప్రసారమయె! వానలు, యుప్పెన, భీకరంబుగా,
నర్తన మౌతరంగ పరిణామము, నెత్తగు తాళవృక్షముల్,
పూర్తిగ తీర ప్రాంతముల ముంచు నటంచును హెచ్చరించగన్,
నార్తిగ చెట్టుకొక్కరుగ జనావళి పారిరి! వెంకటేశ్వరా! 521

శా॥ గంభీరార్ణవ పొంగుపోటులతొ మేఘావృత్తమౌ వీచికల్,
నంభోవీధిని నంటుచున్, నెగురుచున్, నాభీల కాలాగ్నినౌ
స్తంభించన్ బడబాగ్నితో చెలియలిన్ సంద్రుండు దాటంగనౌ,
జంభారీ నిలముంచి యెత్తగద! నీశా! వెంకటేశా ప్రభో ! 522

ఉ॥ భోరున వర్షపాతము, నభోస్థలి మేఘము కుండపోతగా,
దారుణ కుంభవృష్టియయె! తల్లడిలన్ ప్రజ, నిల్వనీడయున్,
చారెడు గంజి లేకయును, జానెడు గుడ్డకు నోచుకోకయున్,
పాఱిరి దీనులై బ్రతుకు ప్రాణభయంబున! వెంకటేశ్వరా! 523

ఉ॥ వైకృతమయ్యెనో ప్రకృతి? ప్రాభవ మారుత వైపరీత్యమే.
కాకృతి భూనభోంతరము లాశ్రిత మేఘము కుండపోత ధా
రాకృతి వానవెల్లువ నిరాశ్రయ భూ ప్రజఁ గాంచ వారికిన్
నేకృతమున్ సహాయ మొనరింపగ నౌనౌకొ? వెంకటేశ్వరా! 524

చం॥ తలలును వీడె కొబ్బరులు, ధారుణి కూకటి వేర్లు వెల్వడెన్,
ఫలము తుపాను వాయువు ప్రభావము హెచ్చయి చెట్లు కూల్చుచున్,
అలగు జనావళిన్ గుడిసె హర్మ్యము, కుడ్యము నేలమట్టమై,
విలపిత నార్తనాదములు వీనుల మ్రోగెను! వెంకటేశ్వరా ! 525

చం॥ చెలియలి కట్ట దాటెనట సింధువు! ధర్మవిదూరుఁ డయ్యెనే?
విలయము తాండవించె ననపేచెను గాలులు వేగవంతమై
అలలును నుద్ధృతంబగుచు అంబుధి నంతటి పొంగె, భూస్థలిన్
జలమయమై తనర్చెను, ప్రజల్ విలపించగ! వెంకటేశ్వరా! 526

చం॥ కనికరమున్ ప్రధాని, తను గాంచిన భీషణ గాలివాన, వే
దన, విలపించు ప్రాణితతి, దారుణ మారణకాండ, రోదనల్
ననునయ వాక్యమందు పరిహార సహాయ ధనం బొసంగఁ గాం
చిన ధన మార్తు లెవ్వరికిఁ జెందక పోయెను? వెంకటేశ్వరా! 527

చం॥ కలుషిత మార్గమందు, నధికారులు, నాశ్రిత పక్షపాతులై,
విలపిత నార్తనాదములు, విన్నపముల్ వినిపించుకోక, తా
తెలివిగ సాక్ష్యమెల్ల సరిదిద్దుచు మార్చి యథేచ్ఛ వ్రాసె, కా
వలసిన వారికిన్ మిగుల వంచన బుద్ధితో! వెంకటేశ్వరా! 528

చం॥ నలువురు పుత్రులున్ మరియు నల్వురు కోడలు, పట్టభద్రులై
తెలివిగ కాపురంబులను దిద్దుకొనంగను, నత్త మామలున్,
నలరగ ప్రీతిపాత్రులయి నాశ్రిత కోటికి, బాంధవంబుకున్,
మెలగిరి కీర్తిఁదెచ్చునటు మెట్టిన యింటికి! వెంకటేశ్వరా! 529

చం॥ జరిగెను దెబ్బదేడులును, శాంతిసుఖంబుల మిట్టపల్లముల్,
చెరగిన గాలివానవలె, జీవితనౌకయు కొట్టులాడుచున్,
కరగెను మంచుగడ్డవలె, కర్మకు బద్ధునుజేసి భావినే
పరినిక తీర్చిదిద్దెదవా! భారము నీయదె! వెంకటేశ్వరా! 530

శా॥ ప్రారంభించితి రామకోటియని ముప్పైలక్షలన్ వ్రాసితిన్!
మారీచున్ బలె వచ్చి దూరెనను దుర్మార్గంబునన్ ధూర్తుఁడై,
శారీరంబుకు చేటులేదు! రచనా శక్తిన్ కొఱంతయ్యెనో,
నేరం బేమిటొ? యాగెనే రచనలన్నీ? వెంకటేశా ప్రభో! 531

ఉ॥ యే విధి శాపమో? నిదియు నెందుకు సంభవమయ్యె? నాతఁడున్
దైవము పంపెనో యనగ దాపురమయ్యె? నుపక్రమింపగా,
దేవుఁడు సాగనీయఁడయె? తీరుగ తృప్తిగఁజేయ నీయఁడే ?
జీవితకాలమే గడుప శేషము స్వల్పము! వెంకటేశ్వరా! 532

మ॥ పదునాల్గేడుల నాటి గాథ యిది! సంప్రాప్తించె దుఃఖంబు, నా
మది, సంపూర్ణముఁజేయ నుత్సుకత వమ్మై తోచె! యత్నంబు లె
న్ని దఫాలో విఫలంబు నయ్యె! రచనల్ నీ సన్నిధానంబునన్,
పద పద్మంబుల నుంచి పూజ లొనరింపన్! వెంకటేశా ప్రభో! 533

చం॥ అడిగిన లేదనన్ యనెడి అమ్మను గానము లోకమందునన్!
నడుగనిదైన పెట్టదను నమ్మయు నానుడి సత్యమైనచో,
యడిగిన లేదు పోయనెడు నమ్మలు నెందఱొ? కొందఱుందురో?
యడుగక యుండు కంటె పరిహాసము లేదుగ? వెంకటేశ్వరా! 534

చం॥ అడుగిడె ముందుగన్ సిరియు నా(శిత మిమ్మనికోరి వచ్చెనే?
అడుగులు మూఁడు మా(త్రమును నాతురతన్ నిడి నాగిపోయెనే?
అడిగితి యుండు మంచనుచు నక్కటి కంబుగ మందిరంబునన్
తడయక "నాగు మాగుమని" ధైర్యముఁజెప్పెను! వెంకటేశ్వరా! 535

చం॥ వివిధపు యత్నముల్ సలుప వెక్క సమాయెను రామకోటికిన్,
వివిధ నుపాసనా ఫలము వేష్టను బుట్టెను! వ్రాయఁబోవగన్,
కవిత రచించఁ బూనగను కాదని రాముఁడు నొప్పుకుండునే?
చివరకు నీదు సేవకును సిద్ధమునైతిని! వెంకటేశ్వరా! 536

చం॥ యిదియె మదీయ జన్మదిన మిచ్చిన కానుక! దివ్యబోధనల్,
మదియును మోదమందగ సమంజసమైనటుతోప భావనన్,
మృదువుగ దేశభావలకు మించని మాటలు వ్రాయనయ్యె! నా
చదువులరాణి నానతిగ చక్కని యోచన! వెంకటేశ్వరా! 537

చం॥ విభవము లిచ్చు తల్లియని వేడితి శారద! నానతీయగన్
నభయ మొసంగె కావుమని నాత్మ ప్రబోధ నమయ్యె నేటికిన్,
త్రిభువన మేలు మాతయె పరీక్ష నొనర్పక వాక్కు యందునన్,
శుభముగ నిల్చి బ్రోవమనుచున్ మదిమ్రొక్కితి! వెంకటేశ్వరా! 538

ఉ॥ సంపద కావ్యమై, కవిత సాహితి వ్రాయగ ఘంటమందునన్,
సొంపులు మీఱగన్ రచన శద్ధ తెనుంగున దేశ్యమందునన్,
పెంపు వహింప యూహలలో ప్రేరణ సల్పగ భావ్యమయ్యె! నా
యోపిక ధన్యమైనటుల "యెంచుమనంటిని" వెంకటేశ్వరా! 539

ఉ॥ రాముఁడు వెంకటేశఁ డొకరై కనుపించగ రామకోటినిన్,
నామము వ్రాయలేకను ప్రణామ మొనర్చి త్వదీయ నామ, ము
న్నే మకుటాయ మానముగ నిల్పి కవిత్వము నల్లఁబూనితిన్,
స్వామి, నుపాయ మివ్వ తగు సారధి నౌదువు! వెంకటేశ్వరా! 540

మ॥ ప్రతి సంవత్సర మందు సల్పనగు దైవారాధనా కృత్యముల్,
ప్రతి రోజునేకన నేత్రపర్వమగు శోభావంతమౌ సృష్టినిన్,
ప్రతిభావంత విశేషముల్ఁ జరుగు సంప్రాప్తాను సందర్భముల్,
అతిమోహాకృత వర్ణనల్ కనుదునయ్యా! వెంకటేశా ప్రభో! 541

మ॥ ఒక పంచాంగము కాలమందునను నిత్యోత్పన్నమౌ పండుగల్,
సకలేంద్రియము తృప్తినిన్ బొదవ ప్రాశస్త్యంబగున్ పర్వముల్,
ప్రకృతానందపు పారవశ్యమున సంపన్నంబు సౌందర్యమున్,
సకలంబట్లు మనోగతంబయెడు! నీశా! వెంకటేశా ప్రభో! 542

శా॥ భారద్వాజస గోత్రమున్ కులము నుప్పల్ పాటివాఁడౌ ప్రకా
శారావుండు భవానీ దంపతులకున్ జన్మించె సత్పుత్రుఁడున్,
గౌరీదేవి వరంబునో మరియు భాస్కర్యాంశ సింహంబునన్,
యారాశీమఘ కృష్ణనామమయె! నయ్యా! వెంకటేశా ప్రభో! 543

శా॥ చైతన్యంబగు వేళఁ గాన సుతుఁడా చైతన్య కృష్ణుండయెన్,
నూతాపై తృణుణంబుఁ దీర్చుటకు సన్మానార్హుఁడై పుత్రుఁడై
తాతల్ వంశము నుద్ధరింపగను సత్పౌత్రుండు పుట్టె, ము
త్తాతానంద సుఖాబ్ధి ముంచుచును! కాదా? వెంకటేశా ప్రభో! 544

ప్ర మో ద వ త్స ర ము

చం॥ అదియె ప్రమోదవత్సరము ఆశలు మెండు ఫలించఁబోవగన్,
ముదమున నూత్నవత్సరపు మోజులుఁ జూడగ కాపురంబునన్,
సుదతులు పండుగంచు తగు శోభన లంకరణం బిడంగ, న
య్యదునున విందు వేడుకలు హర్షము నయ్యెడు! వెంకటేశ్వరా! 545

ఉ॥ వేదము చెప్పెనంచు వినిపించె ప్రమోదయనంగవత్సరం
బాదిగ చాంద్రమానమున వత్సర నామము నీ ప్రమోదయే
వాదన చేయ పండితులు భావము తెల్పగ చీకులేక నే
మోదము నందు వత్సరము పొందు శుభంబులు! వెంకటేశ్వరా! 546

ఉ॥ మోదము నంద వచ్చెను ప్రమోదము నూతన వత్సరంబు, నా
మోదము నంద జీవితము, ముగ్ధులుఁగాగ, జనంబు నెంతొ భా
గ్యాదులు కాంక్షితంబగుట నాశలు పెంచుకొనంగ వత్సరం
బాదితలంప భావ్యమగు నందురు! శ్రీపతి! వెంకటేశ్వరా! 547

చం॥ అరువది వత్సరంబులలొ నయ్యది నాల్గవ వత్సరంబు నం
దురన ప్రమోద వత్సరముతోచెడు ధాన్యము దానమివ్వ, వ
త్సర ఫలితంబు నందు రనసత్యమొ? కాదొకొ? దానమన్నచో
జరుగును, మంచిదే యనుట శాస్త్రవిధానము! వెంకటేశ్వరా! 548

శా॥ అంగంబందున పండితుండు తన వ్యాఖ్యానంబు చెప్పంగ, పం
చాంగం బందిదు నామముల్ ద్వివిధ మిష్టంబౌ ప్రమోదూత, వే
దాంగంబున్, నుడువన్ ప్రమోదయన సత్యంబందురో? విజ్ఞులున్
సాంగో పాంగపు రీతులన్ చనుదురీశా! వెంకటేశా ప్రభో! 549

ఉ॥ ఆదియు నంత్యమున్ వరుస నర్వది వత్సరముల్ ప్రభావమే
యాదిలో వచ్చు నా ప్రభవ, నంత్యము నందున నక్షయంబు, ర
వ్యాది నవగ్రహంబు పరివారము, తారక లిచ్చు కాలచ
క్రాది గతుల్ చలించుచు పరంగెడు! నా విధి వెంకటేశ్వరా! 550

మ॥ తొలి సంవత్సర మందునన్ ప్రభవ సంతోషంబు నివ్వంగనున్,
నెలలందున్ తొలి చైత్రమై పరగు వన్నెల్( దెచ్చు వాసంతమున్,
కలకాలంబటు తిర్గుచుండు గద! చక్రంబోలె సృష్ట్యందునన్,
వలయంబౌ ఋతుమాసముల్ దినములాపై! వెంకటేశా ప్రభో! 551

చం॥ అరువది యేడులన్ ప్రభవ నాదిగ వచ్చెడు కాలచక్రమున్,
అరువది యేడులన్ మొదటిదౌ నెల చైత్రము ద్వాదశంబులన్,
అరువది యేడులన్ ప్రథమమౌ దినమౌచు యుగాది పర్వమై,
పఱగెడు సర్వశోభితపు పండగనౌగద? వెంకటేశ్వరా! 552

ఉ॥ వచ్చె ప్రమోద నూతనపు వత్సరమయ్యె యుగాది యంచనన్,
తెచ్చును చైత్రమాసమున తేనెలు సోకి వసంతమప్పుడే
నిచ్చును, నూత్న వస్త్రములు నింబకుసుంబమునౌ ప్రసాదమున్
మచ్చుగ భావిజీవితపు మర్మము( దెల్పుచు! వెంకటేశ్వరా! 553

ఉ॥ చైత్రము తెచ్చె తోడుగ వసంతుని చైత్రరథంబు నందునన్
చిత్రము! చెట్లుచేమలును చేతనమయ్యెడు పచ్చ పచ్చగా
పత్రము పుష్పముల్ ప్రకృతి వన్నెల జీవము పొందె(బోలు, స
ర్వత్రత నేత్రపర్వమయి రాజిలు శ్రీపతి వెంకటేశ్వరా! 554

శా॥ శాంతీ సౌఖ్యము, సర్వతోముఖము, నే సంవత్సరాంతంబుగా,
కాంతల్, బిడ్డల, యోగసేమములనే కాంక్షించుచున్ భూజనుల్
యెంతో కొంతయు దానముల్, నిడుచు సాహిత్యంబు వేదాంగ మా
వంతై కాలము పుచ్చు వత్సరము! దేవా! వెంకటేశా ప్రభో! 555

## చతుర్థ చరణము - ఆధ్యాత్మికము - సంప్రదాయములు

శా॥ జ్యేష్ఠంబందున కృష్ణపాఢ్యమితిథిన్ చీరాల శ్రీరాముకున్
స్పష్టంబైనది అర్వదేండ్ల వయసున్ సాధించె దైవాంశ స్వా
ధిష్ఠానాంబుజ మోహనాకృతులనున్ దేవిన్నుపాసించగన్
యిష్టంబౌవిధి నర్చనాది విధులయ్యేన్ వెంకటేశా ప్రభో! 556

చం॥ యిహపరమైన సాధనమునీశ్వరు చింతన పూజలందునన్,
సహచరి ధర్మపత్ని యిహశాంతి సుఖంబులు పారలౌకికా
స్పృహహిత దేవతాయనపు సేవల తృప్తిని బొందఁగోరుచున్,
విహితపులైన మార్గముల ప్రేరితునైతిని వెంకటేశ్వరా! 557

ఉ॥ డెబ్బదిరెండుదా కనువడిన్ గతియించెను జీవితంబునున్,
నబ్బురమేఁగదా? వయసునందున పెద్దతనంబు నందునన్,
నిబ్బరమైన మానసము నిత్యము కన్పడు మిట్టపల్లముల్,
దెబ్బను తీయకుండగను దీక్షతొసాగితి! వెంకటేశ్వరా! 558

## వత్సరాంత పండుగలు, పబ్బములు:- చైత్రము, వసంతము

మ॥ మనసావాచ నిరంతరంబునగు ప్రామాణ్యంబునౌ పండుగల్,
కనగన్ నిత్యవసంత మాగమన మౌకాలంబు నందుండి ఫా
ల్గుణ పర్యంతము వచ్చు పబ్బములు లోకోన్నాత్య కళ్యాణముల్,
అనిశంబాచరణంబునన్ నిడితినయ్యా! వెంకటేశా ప్రభో! 559

ఉ॥ హైందవ నాగరీకతను హైందవ ధర్మము సాంప్రదాయముల్,
హిందుమతానురక్తి, పరమేశ్వరు, నీశ్వరి, దేవతార్చనల్,
విందొనరింప వ్రాయ, నిటు వేడుక నయ్యెడు, సేవ, పూజలం
దిందుపచారమాచరణ మిచ్చిన సంపుటి! వెంకటేశ్వరా! 560

మ॥ ఋతువారంభము చైత్రమాసముతొ నేటేటన్ వసంతంబునా
తత వైశాఖము రెండునున్, హరితపత్రాచ్ఛాదితం బౌచు, సం
తత మానందము నెల్లెడల్ ప్రకృతి నేత్రానందమై పర్వగన్,
ఋతు సౌందర్య మతీతమౌ రచనకయ్యేన్! వెంకటేశా ప్రభో! 561

ఉ॥ చైత్ర వసంతమున్ ప్రకృతి సంపద శోభను చాటుచుండ, స
ర్వత్రతత రమ్యమౌ హరిత పత్రము పుష్పఫలంబు నెల్లెడల్,
నేత్రపరంబు నొప్పిదము, నిన్నటి ఫాల్గుణ మెండుటాకులన్,
చైత్రము నేఁడు పచ్చ ఫలసార మొసంగెడు! వెంకటేశ్వరా! 562

ఉ॥ చూతము పల్లవారుణపు చోదితకోయిల సొక్కిసోలుచున్,
కూతకుహూకుహూ స్వనము కోమల గాత్రమునన్ ధ్వనింప, వే
పూఁత ప్రసాద భక్షణము, ముంగిట మ్రుగ్గులు చైత్రమాస ప్రా
భాతపువర్ణనల్ తెలుపు భాగ్యమె భాగ్యము! వెంకటేశ్వరా! 563

ఉ॥ చైత్రముతోడ వెంటనె వసంతమువచ్చు యుగాదిరాకనున్,
చైత్రరథంబునన్ నవవసంతుఁడు పల్లవకోమలంబులన్
పత్రము పుష్పముల్ ప్రకృతి పచ్చదనంబున రామణీయమై
చిత్ర విచిత్రమై పఱగు సృష్టికనంబడు నేత్రపర్వమై; 564

చం॥ అదిగొ! శకుంత సంతతి కిలారవముల్ తగఁదెల్పు నామనిన్,
రొదలను, పుష్పమాధురిని గ్రోలుచు ఝుంకృతి లిచ్చుచుండ, ష
ట్పదులు, పికంబు లామ్రమును పల్లవగాదిలి యొూచు సొక్కుచున్
నదలుకొనంగ కూజితములయ్యెడు చైత్రము! వెంకటేశ్వరా! 565

ఉ॥ తూరుపు తెల్లవాఱగను తోయజబాంధవుఁడుద్భవింప సిం
దూరము దిద్దిమోమునట, తొయ్యలి నంతట ధౌతవస్త్రయై,
కోరెను, నూత్నవత్సరము కూర్మిఁదలిర్ప వసంతరాకనున్
కీరమునట్లు స్వాగత సుఖీభవయంచనె! వెంకటేశ్వరా! 566

ఉ॥ అంతట నూత్నవత్సరము నాగమనంబును భావనంబునన్,
కాంతలు, నిండ్లు, వాకిళు, లొకంతట శుభ్రమొనర్చి, తామె సా
యంతనమందె విల్తురు యుగాది సమగ్రి ప్రసాదముంచగన్,
సంతతితోడ పూజపతిసల్ప భుజింతురు! వెంకటేశ్వరా! 567

ఉ॥ మామిడి తోరణంబు శుభమంచు హరిద్రకుంకుమల్నిడన్,
గీమున మండిగంబుల నొకేవిధముండ నలంకరించగా,
ప్రేమతొ ముంగిటన్ మెఱయు, ఁబేర్చిన మ్రుగ్గులు రంగవల్లికల్,
యేమని చెప్పనౌ గృహములెంతయొ శోభిలు! వెంకటేశ్వరా! 568

ఉ॥ మామిడి పిందెలున్ యొగరు, మాసము కాలము లింగమాకృతిన్,
యామిని వచ్చెఁబో, నిక, యుగాదికి బెల్లము తేనెతేటలున్,
వేపను, ప్రావుచేదుయగు వేపపు పూవును తింత్రిణీకమున్,
ప్రేమతొ నివ్వజీవితపు విల్వాలుఁ దెల్పును! వెంకటేశ్వరా! 569

ఉ॥ అంగనలంత వేకువన, అల్లనలేచి తలంటులైన, న
భ్యంగన మాచరించి, కడుభక్తి నివేదనమౌ ప్రసాదముం
చంగ భుజించగన్ మొదట, చయ్యన, నూత్నపు వస్త్రమందు పం
చాంగము శ్రోతలైచను, యుగాది ఫలంబుకు! వెంకటేశ్వరా! 570

ఉ॥ సుంతనలంకృతంబగుచు, శోభతొ నూత్నపు వస్త్రముండునన్,
నెంతయు వేడ్కఁజేయగను, నిత్యమదేవిధ మెల్లకాలమున్
సంతతి పిల్లపాపలతొ, సందడి నుండగ కోరుకుందురా
శాంతిసుఖంబులన్ సిరులు సంపదలందగ! వెంకటేశ్వరా! 571

చం॥ శుభములు, శోభనంబులును జూతురు చైత్రమునందె, లగ్నముల్
విభవముకొద్దిగన్, వడుగు, పెండిలి, వాస్తుపరంబు కార్యముల్,
శుభసుముహూర్తమంచనుచు, శూన్యము యోగ్యమునెంచిఁ జేతురా
విభుఁడు గురుండు సప్తమ నివేశన ముండగ! వెంకటేశ్వరా! 572

శా॥ ప్రాభాతారుణ బింబమే తిలకమై, ఫాలంబునన్ దిద్దగా,
ప్రాభాతారుణ కాంతిపుంజములు, నివ్వాళిన్ సమర్పించగా,
ప్రాభాతంబు శకుంతలారవము నాహ్వానింప చైత్రంబు, ప్రా
దుర్, భావంబుయుగాదినిన్ నదివసంతోద్భూత సంరంభమౌ; 573

మ॥ ప్రతి సంవత్సరమే యుగాది యగుచున్ ప్రారంభమున్, వచ్చు, నా
ప్రతి చైత్రంబున శుక్లపాడ్యమి తిథిన్ ప్రాశస్త్యమున్ పొంద, జీ
విత చక్రంబున శాంతి సౌఖ్యముల వైవిధ్యంబు నందంగ, సం
తతి, సౌఖ్యంబును సంపదల్ నిడును నంతన్ వెంకటేశా ప్రభో! 574

ఉ॥ అంతము లేనిదై యుగము యాగమనంబు వసంతుతోడనున్,
నంతియెకాదు, వత్సరమనాదిగ చైత్రము శుక్ల, పాడ్యమిన్
సంతతిఁగూడియున్ ప్రజల సంపద సౌఖ్యము, వృత్తి భాగ్యముల్
శాంతియుతంబులౌదురు, విశాలమనంబున! వెంకటేశ్వరా! 575

ఉ॥ ద్వాదశ మాసముల్, మొదటవచ్చెడు చైత్ర వసంతమాసమై,
ద్వాదశ రాశులన్ మొదటి దయ్యెడు మేషము కాలచక్ర మిం
పాదిగ తిర్గుచుండు ఋతువాది వసంతము, శోభతోడ, ర
వ్యాది నవగ్రహంబులును ద్వాదశరాశుల కాధిపత్యులౌ! 576

ఉ॥ చైత్రము శుక్లపక్షమున జన్మమునందె పునర్వసందు, స
ర్వత్రత శోభచెందగను, రాముఁడు పుట్టినవేళ నట్టిదౌ,
నా త్రిజగంబులన్ సురలు నాకసమందున పుష్పవృష్టినిన్
నేత్రము పర్వమొఁగురిసె నిండుతనంబున! వెంకటేశ్వరా! 577

శా॥ శ్రీరాముండవతారమూర్తి యనగన్. శ్రీవిష్ణు వంశంబునన్,
యారామామణి లక్ష్మిసీతయన, నాయంశంబునన్ పుట్టె, సీ
తారాముల్ జననంబు లోకము నిమిత్తామాత్ర కళ్యాణమై
యారాధ్యంబయె శిష్టరక్షణకు నయ్యా! వెంకటేశా ప్రభో! 578

శా॥ శ్రీరామాభ్యుదయం బనంతగుణ సుశ్రేయాభిలాషంబునై,
భారతావని మానవాళికది శోభావంత జీవంబునై,
పారావార యశోవిశాల నృపుఁడే పాలించు మార్గంబునై,
చారిత్రాత్మకమూర్తియయ్యెగద! నీశా! వెంకటేశా ప్రభో! 579

మ॥ పదునాల్గేడుల బ్రహ్మచర్య వనమున్ వాసంబు త్యాగంబునై,
పదికాలాలుగ ధర్మకార్యనిరతిన్ పాలించు సందేశమై,
ముదితాసీత పతివ్రతాచరణమున్ ముల్లోక సాదృశ్యమై,
చదువన్ రామకథామృతా మధురబాషా! వెంకటేశా ప్రభో! 580

ఉ॥ ధర్మము న్యాయమంచు తలఁదాల్చిన రామవిభుండు, లోకస
త్కర్మల భాతృబంధురతి ధార్మికుఁడున్, పురుషోత్తముండునై,
నిర్మలనీతి మార్గమున నిత్యము పల్కెడు సత్యభాషనన్,
పేర్మినికీర్తిఁగాంచె నిలవేల్పుగ నీనిల వెంకటేశ్వరా! 581

ఉ॥ యెన్నగ రామనామ మెపుడేని తలంప హరించు కష్టముల్,
కన్నులఁగాంచ సుందర ముఖాబ్జము, వీడును సర్వపాపముల్.
సన్నుతి నాంజనేయుకది సద్విదితంబగు మంత్రరాజమై,
మిన్నగ తారకంబనగ మించిన దెయ్యది? వెంకటేశ్వరా! 582

శా॥ సంతోషంబున మానవుల్ నవమినిన్ చైత్రంబునన్ జేయ, న
త్యాంతానందము మానవాళికగు సీతారాము కళ్యాణమున్,
సంతానంబును, ఆయువున్, సిరులునున్, సౌభాగ్యమున్, వృద్ధినిన్,
శాంతిన్, సౌఖ్యమొసంగు నంచనెదగీశా! వెంకటేశా ప్రభో! 583

శా॥ భారతావని యెల్లరున్ జరుపు వైవాహంబు, ప్రాశస్త్య, సీ
తారామాభిమనోజ్ఞ దంపతుల, నేత్రానందమై పర్వగన్,
శ్రీరామున్ పరిపాలనన్ యశము తెచ్చెన్, రామరాజ్యంబనిన్
శ్రీరామార్చిత పాదపద్మ యుగళా, శ్రీ వెంకటేశా ప్రభో! 584

శా॥ సీతారాము చరిత్రమున్ ప్రజకు యోచించంగ నాదర్శమౌ,
పాతివ్రత్యము, నేకపత్ని, నిరతిన్, పాటించి పిత్రాజ్ఞలన్,
భాతృప్రేమల, సత్యనిష్ఠగరిమన్ భాసిల్లె ధర్మంబుగా
ఖ్యాతిన్ బొందెను, రామరాజ్యరనిరయ్యా! వెంకటేశా ప్రభో! 585

శా॥ సప్తాహంబగు నాంజనేయునకు పూజారాధనల్ జేయగా,
లిప్తన్కాలము కన్నుమూయుచును చాలీసా పఠించంగ, నే
యాప్తుల్, భక్తులు, నెల్లరున్ కపిని నాప్యాయంబుగాఁ గొల్వ, సం
తృప్తిన్ జెందును సామినిన్ బొగడ భక్తిన్! వెంకటేశా ప్రభో! 586

శా॥ కల్యాణాత్మక రాముసీతకథ లాకర్ణించుచున్, ముక్తి వై
కల్యంబెవ్వఁడుఁ గాంచగన్ ప్రభువునిన్ కళ్యాణమున్ జేయ, సా
కల్యంబంది తరించఁగో రఁడొకో? తద్గానామృతాధార, సా
ఫల్యంబంద వినంగ మానఁడొకో? దేవా? వెంకటేశా ప్రభో! 587

వైశాఖము :

మ॥ వడగాడ్పుల్, సుడివారుచున్, చుర, చురన్, వైశాఖమున్ వ్యాప్తమౌ,
వడిఘర్మంబువు నాసికాగ్రమును నాస్వాదించు జిహ్వాంబునున్,
నిడు నిట్టూర్పులు, నుస్సు, నుస్సు, రనుచున్ నిండైన గీష్మంబునున్,
గడురుద్దంబగు కంఠనాళ మొకవంకన్! వెంకటేశా ప్రభో! 588

ఉ॥ నాలుకనెండిపోవ, తడినార్చెడు తీక్ష్ణము, నెండతాపమున్,
కాలువడంక, బొబ్బలతొ, కన్నులు మూతవడంగ, ధూళినిన్,
కాలము దాటిపోవ నతికష్టముఁ దాటగ నెల్లవారికిన్,
చాలదు యెంతవేడిమిని సౌఖ్యమొసంగదు? వెంకటేశ్వరా! 589

శా॥ వైశాఖంబునవచ్చు పర్వములు, దేవారాధనాకృత్యముల్,
యాశైవాంశుఁడు నాంజనేయుఁడు నృసింహా జామదగ్ని సుతుల్,
రాశీభూత జయంతి నుత్సవము లార్భాటంబునన్ జేయగా,
ప్రాశస్త్యంబగు నర్చనల్ జరుగు! దేవా! వెంకటేశా ప్రభో! 590

శా॥ వైశాఖంబున మామిడుల్, రసము, నావాలున్, రుచిన్, కారమున్,
ప్రాశస్త్యంబగు నావకాయ యయి నాస్వాదించ, మాగాయయున్,
దేశంబందున ఖ్యాతిగాంచె, నిది, ప్రత్యేకంబుగా నూరుగల్,
యేశాకంబులు సాటిరానిదనివయ్యెన్! వెంకటేశా ప్రభో! 591

ఉ॥ రోహిణికార్తె యెండలకు రోళ్లను బ్రద్దలు నౌనటంచనన్,
బాహిర తీక్ష్ణతాపముల, పల్లెల పూరిగృహాలు దగ్ధమౌ,
గేహము మంటలార్పగ నొకించుక సాయమునంద దప్పుడున్
వ్యాహృతి నందదా ప్రజల నార్తినినాదము! !వెంకటేశ్వరా! 592

ఉ॥ దాహము దాహమంచనుచు దౌడును తీయుజనంబు కోసమై,
బేహర సాయమంది చలివేంద్రము, చల్లయొ, మంచినీరునున్,
దోహదమిచ్చి పాంథులకు తోయము, త్రావగ పల్లెలందు, న
వ్యాహృతమైనదీ చలువ పందిరులందున! వెంకటేశ్వరా! 593

ఉ॥ పున్నమినాఁడు దేవళము పూజలు సల్పి విశాఖమాసమున్,
గ్రన్నన విప్రులన్, విసనకఱ్ఱల వీచుచు, వేదఘోషలన్,
కన్నులపండువౌపగిది గంధమలందుచు పండితాళికిన్,
మిన్నగ గౌరవింతురట మెచ్చగ విజ్ఞులు! వెంకటేశ్వరా! 594

శా॥ ఆరంభంబగు చైత్రమాసముననున్ నామంబు లింగాకృతిన్,
ప్రారంభింతురు, నావకాయ, రసముల్, రంజౌ, గులాబీ, జలాల్,
నోరూరంగను, తుమ్మిమామిడులు, ఎన్నో, కొన్ని, మాగాయకున్
కారాల్ నుప్పును, ఆవనూనె కలుపంగా, వెంకటేశా ప్రభో! 595

శా॥ వైశాఖంబున సింధుస్నానముననున్ పాటించ, నాచారమౌ,
యాశించన్ నొక సంప్రదాయ పరమౌ యభ్యాస, మొప్పంగ, హా
రాశిన్ముఖ్య నివారణౌ, ననెడు చర్మంబందు వ్యాధుల్, నికన్
యా శాస్త్రంబు విధించ సమ్మతమునయ్యా! వెంకటేశా ప్రభో! 596

ఉ॥ ఆమనిరాక నుద్భవము, ఆంధ్రపదంబున, ఎన్నియో రకాల్,
మామిడి పండ్లు జిహ్వకును, మంచిరసంబు, లిమాంపసందు, నై
నేమి జహంగిరుల్, కరిసె, ఇక్షురసాల్, బనగానపల్లియల్,
యీ మధురంబు లౌఫలములెందునుగానవు! వెంకటేశ్వరా! 597

### గ్రీష్మఋతువు జ్యేష్ఠము :

శా॥ తప్తగ్రీష్మము రెండు మాసములు, నంతన్, జ్యేష్ఠమాషాఢముల్,
వ్యాప్తింజెందుచు, సూర్యరశ్మి, సధికాయాసంబుఁ గావించ, సం
తృప్తిన్ జెందని జీవరాశి, తను, నింద్రియంబు శోషించగా,
సుప్తిన్‌బొందు శరీరమున్ వడఁకుఁజొచ్చున్ వెంకటేశా ప్రభో! 598

మ॥ చెమటల్ గ్రక్కగ యెండవేడిమిని, నా జ్యేష్ఠంబు నాషాఢ, తా
పము నింటన్ బయటన్ వెలార్చు, వివిధంబౌ ప్రక్రియల్‌వాడ, సా
యము, పంకాలను, విద్యుదీకరణమౌ, యంత్రాంగమంతన్, శర
ణ్యము, నావాసములందు బాధలకు! నౌనా? వెంకటేశా ప్రభో! 599

చం॥ అయినను, పుణ్యకార్యములు, నౌను, శుభంబని, మూఁడు మాసముల్,
బయటను వాద్యనాదము వివాహములన్, నుపవీత కార్యముల్,
నయెడు, గృహప్రవేశములు, నచ్చట దీవన మంగళాక్షతల్,
నియమము తప్పకన్ జరుగనిత్తురు! శ్రీపతి వెంకటేశ్వరా! 600

ఉ॥ తాపము, తృష్ణ రెండు వివిధంబగు ఘర్మము మేనిముంచగా,
నాపవనుండు వీవకను, నార్తులు నుస్సురొ! నుస్సురో! యనన్,
తాపము నెట్టులైన రతి ధర్మము దంపతు లందునుండు, కా,
దాపరికంబు, నెక్కడ? యథార్థమునౌగద? వెంకటేశ్వరా! 601

### ఆషాఢము :

శా॥ ఆషాఢంబును శూన్యమాసమగుచున్ "ఆకావవై" చూడగన్,
పాషండుల్‌నిక, నైష్ఠికుల్, జలధినిన్ భాగ్యంబుగా మున్గగన్,
దోషజ్ఞుల్ మరినాచరించెదరు చాతుర్మాసముల్ నిష్ఠతో
వేషంబుల్‌నిక వేయుకొందరిల తృప్తిన్! వెంకటేశా ప్రభో! 602

ఉ॥ అత్తలుకోడలున్, గడపనానెల దాటననర్థమౌననన్,
క్రొత్తగ పెండ్లి నత్తకడ, కూతురు నల్లుఁడు నుండగూడదై
పుత్తడిబొమ్మ దంపతుల ముచ్చట నెట్టుల తీరునోగదా?
యత్తలులేని కాపురము హాయిగ నుండును! వెంకటేశ్వరా! 603

మ॥ కడుచోద్యంబది నూత్నదంపతులు, సౌఖ్యంబుండ నాషాఢమున్,
నడుమన్ వచ్చెడు కోడలల్లురకు యన్యాయంబుగా, యత్తలే
గడపన్ దాటగ నాంక్షలివ్వ, విధి, సంఘంబందు నాచారమై,
విడిగా దంపతులుండ సౌఖ్యమగు తృప్తిన్! వెంకటేశా ప్రభో! 604

శా॥ చాతుర్మాస వ్రతంబు, శుద్ధమున, నాషాఢాది కార్తీకమున్,
ప్రాతిన్నిధ్యము భోజనాదికములన్ పాటించగన్ దీక్షతో,
ప్రీతిన్ జెందును, నిష్ఠతోనిరతి, సర్వేశుండుకున్‌నివ్వ, సే
వాతత్వంబె మహాభిషేకమగు దేవా! వెంకటేశా ప్రభో! 605

శా॥ చాతుర్మాసము పౌర్ణమాదిగను, నాషాఢంబు శాకంబునున్,
ప్రీతిన్‌నౌదధి శ్రావణంబు, సుధవర్తించంగ భాద్రంబు, ని
ర్ణీతం బాశ్వయుజాది సూపమును, కార్తీకంబు దానంబులున్,
యేతత్ భోజ్యము వర్జితంబగుటనయ్యెన్! వెంకటేశా ప్రభో! 606

మ॥ వ్రతమాగేస్తులు, పండితుల్, యతులు, నున్‌పాటించు దీక్షాకృతిన్,
యతి, సన్యాసులు, తీర్థయాత్రలను చేయన్‌జాలు నిర్ణీతమౌ!
అతి కష్టంబగు నాల్గుమాసములు ధర్మార్థంబు నూరేగగా,
హితమాగేస్తులయింటనే జరుగునోయీ! వెంకటేశా ప్రభో! 607

మ॥ శయనించున్, రమ, శౌరి, నేకదశి నాషాఢంబు పాలాబ్ధినిన్,
నియమంబైనవి నాల్గుమాసములు నిర్ణీతంబులౌ సేవలన్,
క్రియతోడన్, నభిషేకముల్ జరుపగన్ క్షీరాబ్ధినౌ ద్వాదశిన్,
దయతోడన్ నభయంబు నిచ్చునట! కాదా! వెంకటేశా ప్రభో! 608

శా॥ "ఆకామావయి" పౌర్ణమిన్ జలధిస్నానారంభ మాషాఢమున్,
శాకంబౌ వ్రతమాచరింప మొదటన్, చాతుర్నెలాషాఢమున్
నేకాగ్రత్తత శిష్యకున్ గురువుతానేర్పంగ, పూజించ, గు
ర్వున్‌కిచ్చే ఫలవ్యాసపౌర్ణమగుటౌప్పున్! వెంకటేశా ప్రభో! 609

ఉ॥ వ్యాసుని పౌర్ణమన్న గురుపౌర్ణమియేగద! శిష్యకోటికిన్,
చేసిన బోధకున్ గురుని శిష్యుఁడు పూజనుసల్పపాడియౌ,
యాసమయాన దక్షిణ ఫలానుమతంబుగ గుర్వుకివ్వగన్,
దాసుని దీవనల్‌నిడుట ధర్మము గుర్వుకు! వెంకటేశ్వరా! 610

శా॥ శూన్యంబౌ, నది మాసమై, శుభములన్ శోభించు వైవాహముల్,
అన్యంబౌ నుపవీతముల్, గృహము లన్నారంభముల్, చేరుటల్,
అన్యాయంబు, నిషిద్ధమున్, వ్రతము, విద్యాభ్యాస, సీమంత, జా
తౌ, వ్యస్తంబులు ధర్మమే జరుగునయ్యా! వెంకటేశా ప్రభో! 611

ఉ॥ శ్రావణ నీలమేఘములు సస్యఫలంబుగ వర్షమివ్వగా,
జీవనదీనదంబులును, చెంత తటాకము పూరితంబులై,
భూవని పాడిపంటలతొ భూములు పండగ, ధాన్యమెల్ల నాం
ధ్రావని సర్వశోభితమునై విలసిల్లెడు! వెంకటేశ్వరా! 612

ఉ॥ మంగళగౌరి నోములను మంగళవారము నోచుకోవ, పు
ణ్యాంగనలాచరింతురు, వ్రతానుఫలంబును బొందఁగౌరి, క
న్యాంగనలున్, వివాహితులు, నైదువసంతము లాచరింపగన్,
మంగళగౌరినిచ్చును సుమంగళి ప్రాప్తము! వెంకటేశ్వరా! 613

ఉ॥ పండుగ పబ్బముల్ పడతిపాలగు, శ్రావణ నోములందునన్,
నిండుగ నోమునోచుకొన, నిత్యసుమంగళి కావపూజలన్,
ధండిగ సంతతిన్ సిరులు, ధాన్యము, భర్తకు శాంతి సౌఖ్యముల్,
నుండగ వేడుకొందురట, నోముఫలంబుగ! వెంకటేశ్వరా! 614

ఉ॥ శ్రావణ శుక్రవారము ప్రశస్త్యము అంగన లెల్లవారికిన్,
శ్రీ వరలక్ష్మి నోముల విశేషము పౌర్ణమిముందువారమై,
యావనితల్ స్వశక్తియుతమైనవి సంపద భర్తకోసమై,
దేవిని పూజఁసేతురు యథేచ్ఛగలక్ష్మిని! వెంకటేశ్వరా! 615

మ॥ వరలక్ష్మీవ్రతమాచరింపఁ గలుగున్ భాగ్యంబు, సంపత్తులున్,
పరఁగన్ స్త్రీలు శుభంబు కోరెదరు యావైవాహికానంతరాం
తర దాంపత్యనురాగ జీవితము సత్సంతాన, సౌభాగ్యముల్,
వరమివ్వంగను నోచుకొందురట దేవా! వెంకటేశా ప్రభో! 616

మ॥ శనగల్, వక్కలు, ఆకుపండ్లు, నొకహస్తంబుంచి, వక్షోపరి
స్తన చేలాంచల సిగ్గుదొంతరల దాచన్ వ్యర్థయత్నంబుగా
తన పాదాంచల చీరయంచులను తందానంచనన్, నందెల
క్వణ శబ్దంబిడు శ్రావణీ నతివ శోభా! వెంకటేశా ప్రభో! 617

ఉ॥ శ్రావణమాస జల్లులకు చానలు వీధుల పేరటంబునన్,
పావడ పట్టుయంచులను, పైకి కనంబడ, పాద, పిక్కలున్,
తా, వడిపర్విడన్, తడియ, తత్తరపాటున పైట (వోణి) జారగన్,
శ్రావణ అందముల్ కనగ చక్కదనాలవి! వెంకటేశ్వరా! 618

ఉ॥ గౌరి వరంబుకై పడుచుకాంతలు నోతురు, సూత్రరక్షణన్,
వారిజనేత్ర లక్ష్మిభృగువాసర నోములపంట సంపదన్
కోరి, చరించనిచ్చును, నకుంఠిత దీక్షతొ సల్పువారికిన్,
భారమునౌనె? దేవికది భాగ్యమునివ్వగ? వెంకటేశ్వరా! 619

ఉ॥ మంగళగౌరి దేవతల మానికమందురు దేవతాళిలో,
మంగళదాయియై పడతి మంగళసూత్రము రక్షణంబు ని
వ్వంగను నోమునోతురట! భర్త సుఖంబుకు కాంక్షతో జగ
న్మంగళదాయినిన్ కొలువమానరు కాంతలు! వెంకటేశ్వరా! 620

ఉ॥ శ్రావణ వర్షధార జవరాండ్రల కోకలు నార్ద్రమై తడిన్,
పావడలడ్డమై నడువ, పాదము తొట్రిల, పైట జారిపోఁ
బోవ. కుచద్వయంబు, నునుపొంగుల, పిక్కల నందచందముల్
కావ ప్రయత్నహీనులగు కాంతల అందమె! వెంకటేశ్వరా! 621

ఉ॥ అంగన లెల్లరున్ కొలుతురాదిమశక్తి నుమామహేశ్వరిన్,
మంగళగౌరి నోముల, నమంగళ దోషనివారణంబు, పు
ణ్యాంగన జీవితంబులను, ఆయువు, సౌఖ్యము, పొందఁగోరుచున్
భంగముపాటులేక తమ భర్తలకావగ! వెంకటేశ్వరా! 622

శా॥ శ్రావణ్మాసము పౌర్ణమిన్ వటువు శాస్త్రార్థంబుపాకర్మనున్,
దైవత్సన్నిధిఁజేయగన్ జరుగు ప్రాధాన్యంబుగా నూతనో
పోవీతంబు పురోహితుండు మునునాముంజన్ విసర్జించి పు
చ్చన్, విధ్యుక్తపుకర్మగానగును! నీశా! వెంకటేశా ప్రభో! 623

ఉ॥ శ్రావణ కృష్ణపక్షము, నిశావధి, లోకము సుప్తినుండగన్,
దేవతలున్ మునుల్ వినతి, దీనుల నార్తరవంబు బ్రోవగన్,
దేవకి గర్భమందు వసుదేవసుతుండు జనించె, విష్ణువే,
భూవని భారమున్ తొలగఁబుచ్చ కృపాబ్ధిని! వెంకటేశ్వరా! 624

ఉ॥ దేవకి కన్నపుత్రు, వసుదేవుఁడుఁజేర్చె యశోదపంకమున్,
త్రోవను నిచ్చెనాయమున తోడ్పడె దారినిడంగ నంతటన్,
బ్రోవగ కాళియున్ ఫణముఁబూనెను ఛత్రమువోలె పుత్రునిన్
కావ యశోదప్రక్కనిడి కార్యముఁ దీర్చెను! వెంకటేశ్వరా! 625

ఉ॥ అష్టమి రోహిణిన్ జననమందెను కృష్ణుఁడు వైష్ణవాంశమున్,
దుష్టుల దైత్యులన్ దునిమిధూర్తుల గర్వమడంచికాచెనో,
శిష్టులరక్షణన్ జనుల చిత్తము, కర్మము, భక్తిమార్గమున్
దృష్టిమరల్పఁజేసె, నుపదేశము గీతతో! వెంకటేశ్వరా! 626

చం॥ జననము దేవకీకడుపు చల్లగనౌ, వసుదేవ పంటయై,
చనిపెరిగెన్ యశోదకడ, సార్ధకజన్ముఁడు కృష్ణమూర్తియై,
పనివిని పాండునందనుల బాధ్యతఁ బ్రోచెను కష్టమందు, భూ
వనియు సుభిక్షమై వెలసె వైష్ణవమాయగ! వెంకటేశ్వరా! 627

మ॥ తన గీతామృత బోధనల్‌వినిచె తత్వంబైన యోగంబునున్,
తనుకౌంతేయుల రక్షణంబ భయహస్తంబిచ్చి కాపాడెబో,
తను గర్వాంధుల కౌరవుల్ చెనగుచున్, ధాత్రీశులన్ బ్రోచెనో,
అనఘంబైనది ప్రేమ, భక్తియనెనయ్యా! వెంకటేశా ప్రభో! 628

శా॥ శ్రీకృష్ణాష్టమి కాలహాండియనగన్ శ్రీకృష్ణుపూజించ, సం
ధ్యాకాలంబున కోవెలన్‌నెదురు దాదాపున్, ప్రజా, భక్తులున్,
నాకోలాహల సందడిన్ మనసులో నానందసందోహమే,
నాకైంకర్యము గోపకుల్ జరుపునౌనా? వెంకటేశా ప్రభో! 629

శా॥ ముంతన్ నీరును రూకలున్ ప్రతిమనున్ మూయించిఁ గట్టంగ, దా
న్నంతన్ యుట్టికి, నడ్డకర్రలను ప్రేలాడంగఁ జేయించగన్,
చెంతన్‌బిందెవసంతముంచి జనులాసించంగ నూగించుచున్,
సంతోషంబున చల్లఁబూనెదరు యీశా! వెంకటేశా ప్రభో! 630

శా॥ ఉట్టిన్ పైకికి క్రిందలాగగను నాయుట్టట్లు నూగించ, యి
ప్పట్టున్ బిందెవసంతమున్ విసురగన్ వారంతపర్వెట్టగా,
పట్టున్‌వీడక చేతఁజిక్కకొను నాపంతంబునున్ గెల్వగా,
యుట్టిన్‌పట్టుట కాలహాండి యగునౌనో? వెంకటేశా ప్రభో! 631

శా॥ వానల్ శ్రావణ భాద్రముల్ కురియగన్ వర్షర్తువున్ నయ్యెనో,
దోనెల్‌పెట్టుచు సేద్యమున్ జరుపగన్ తోయంబునున్ పన్ని, యే
వైనన్ భూముల కర్షకుల్ పదునుచే పండించగా పంటలన్,
ప్రాణాధిక్యత పంటభూమిలవి నౌరా! వెంకటేశా ప్రభో! 632

శా॥ స్వాతంత్ర్యంబు లభించె మాకునపుడా పద్దైదునాగష్టునన్,
నాతండే ఘనసూత్రధారి యయి దివ్యాస్త్రంబు సత్యాగ్రహం
బౌ తంత్రంబున సత్యసాధనమునన్ ప్రాప్తంబొనర్చెన్‌గదా?
నాతండేమన గాంధి జాతిపిత! అన్నా! వెంకటేశా ప్రభో! 633

చం॥ నలువదియైదు వత్సరమునాఁడు స్వతంత్రమువచ్చె మాకునున్,
తలపస్వతంత్రమేమిటది దాపురమైనది నేమినిచ్చెనో?
తెలియదు నేటికిన్ ప్రజల దీన, కథల్ విన, తీర్చలేరుగా?
కలియుగ పండుగై తనరెకష్టమెదుర్కొన! వెంకటేశ్వరా! 634

ఉ॥ పోలికి స్వర్గమిచ్చెనట పూర్వసుకృత్యమునంద, మామెకున్,
నాలలితామణిన్ శివుఁడు, నర్ధశరీరియు, మోక్షమివ్వ, పో
లాలమవాశ్యయై పఱఁగె, యాదినమందున కాంతలెల్లఁ దీ
పాల జలంబులందునిచిపంపెడు వేడుక! వెంకటేశ్వరా! 635

శా॥ చాతుర్మాస ద్వితీయమున్ దధిని బోజ్యంబందు వర్జించ, ని
ర్ణీతంబయ్యెడు శ్రావణంబునను, శాస్త్రీయంబుగా నొప్పెడున్,
యేతత్కాల గృహస్థులున్ యతులునున్ యిండ్లందునున్ యాత్రలున్
ప్రాతినిధ్యమునన్ వ్రతంబున తలంపన్! వెంకటేశా ప్రభో! 636

భాద్రపదము :

ఉ॥ భాద్రపదంబు మాసము శుభాస్పద మంగళకార్యమేమినే
క్షుద్రుఁడుఁజేయఁబూనఁడట శూన్యమనంగను. వర్జితంబునై,
ముద్రనువేయు మాసమది, పూజలునున్ వ్రతమాచరింపగన్,
భద్రత భారసాలలనివార్యమొనర్చగ! వెంకటేశ్వరా! 637

చం॥ ప్రథముఁడు విఘ్నరాజునకు భాద్రపదంబున శుద్ధమందునన్
విధిగ చతుర్థినిన్ వ్రతము ప్రీతిగ పుష్పఫలంబు పత్రినిన్,
నధమము మృత్తినిన్ ప్రతిమ నర్చన సల్పిననంతరంబు, గా
ధ ధృతిగ నక్షతల్ తలను దాల్తురు శ్రీపతి వెంకటేశ్వరా! 638

ఉ॥ ఘోరతపంబునన్ భవుని కుక్షినినిల్పె, గజాసురుండు, నా
గౌరి, పతి స్థితిన్ తెలియకన్ హరికిన్ మొరవెట్ట, నంత, దై
త్యారి, గజాసురుండుదరమందున దాచిన శంకరుండునిన్,
ప్రేరిత నాట్యఘోష వినిపించగనెంచెను! వెంకటేశ్వరా! 639

ఉ॥ పారిషదుల్, విరించి, హరుబంటువు, నందియె గంగిరెద్దుగా,
శౌరియె, సూత్రధారుఁడుగ, శ్రావ్యము, దృశ్యము నాట్యమాడగన్,
హూరుగ సవ్వడిన్ నసురుఁడొద్దిక ప్రీతివరంబునివ్వ, దై
త్యోరుదరంబు శంకరునితోయజనేత్రుఁడుకోరె, నంతటన్! 640

ఉ॥ నందియు, విఘ్నప్రేరితమునన్, దనుజోరుదరంబు చీల్చగన్,
పొందె విముక్తి శంకరుడు మోక్షమొసంగ గజాసురుండుకున్,
నందిగణంబుతోనరిగె, పార్వతి చెంతకు వెండికొండకున్,
తొందరపాటు బాలుతలద్రుంచెను పాపము! వెంకటేశ్వరా! 641

చం॥ సతిపతులా ప్రసంగపువశంబున, ద్వారపుబాలు చావురా,
ప్రతిమను స్నానమున్ నలుగుబాలుని జీవముపోసి తంచనన్,
ప్రతిహతు ప్రాణమున్ గజశిరంబును తెచ్చి ప్రతిష్టఁజేయ, నా
ప్రతిమ గజాన నుండనుచు భాసిలెనంతట! వెంకటేశ్వరా! 642

ఉ॥ పట్టముఁగట్టె నాభవుఁడు పార్వతినందను, విఘ్నరాజు, క
ప్పట్టున, నాట్యమాడెతిని, పాదము తొట్రిల, నవ్వె చంద్రుఁడున్,
పొట్టయుబ్రద్దలై కుడుము భూమిపయిన్బడ, నాగ్రహంబునన్,
తిట్టి, భవాని చంద్రుకు విధించెను శాపము! వెంకటేశ్వరా! 643

ఉ॥ పట్టినినంతటన్ శివుఁడు ప్రాణమిడన్, సతి, చంద్రుఁజూడగన్
పట్టునునింద తప్పగను, పాల్పడువారలకంచు తెల్పగా,
యెట్టులొనిందయున్ హరిహరింపగ నాఁడుపూజలక్షతల్
గట్టిగదాల్చినన్వినఁగ గాధశుభంబనె! వెంకటేశ్వరా! 644

చం॥ ప్రథముఁడు విఘ్ననాయకుని భాద్రపదంబు చతుర్థిపూజనో,
నథమము ధ్యానమందునను, నర్చనసేయనొసంగు, సంపదల్,
విధిగ ప్రయత్నమందు నెఱవేర్చు నభీష్టము, నెప్పుడైననున్,
వ్యధలను బాపు విఘ్నమునివారణొనర్చును! వెంకటేశ్వరా! 645

ఉ॥ ద్వాపరమందు కృష్ణుఁడును, భాద్రపదంబు చతుర్థి శుద్ధమున్,
తా, పొరపాటునన్, కనె, సుధాంశుని బింబముపాల, పాత్రలో,
యాపురమందు మున్నెశశి నాదినమందున చూడరాదనన్,
శ్రీపతిఁగాంచె నింద గురిచెందినవాఁడయె! వెంకటేశ్వరా! 646

మ॥ తపమందున్, వరమున్ శ్యమంతకము సత్రాజిత్తుకున్, అర్కుఁడి
వ్వ, పరామర్శన, నిత్యమున్ మణులు నిర్వ్యేమేల్మి బంగారమున్,
నపురూపంబుగనిచ్చె, "నా ప్రజల కళ్యాణార్థమై నివ్వఁ"గో
రె పరంధాముఁడు సత్యజిత్తును "భళారే నిట్లనన్ పాడియే"? 647

మ॥ ననెభూమీశుఁడు, నేగెరాజ్యముకు; కొన్నాళ్లై, ప్రసేనుండునున్,
చనె, రత్నంబుతొ వేటకున్, నచట, మాసంబంచు సింహంబు, నా
తని జంపెన్, మణిగైకొనెన్, ఎలుఁగునద్దానిన్ వధించంగనున్,
మణిపుత్రీ వినియోగమైనిడెను సుమ్మా! వెంకటేశా ప్రభో! 648

మ॥ తన తమ్మున్ వధియించె కృష్ణుఁడని సత్రాజిత్తు చాటించుచున్,
మణికూడన్ నతఁడే హరించెననె; నమ్మాటన్ నసత్యంబు, మే
ర నిరూపించె; ప్రసేను, సింగము, శరీరంబున్, నెలుంగున్ పదాల్
కనిపోవన్, గుహలోశ్యమంతకమునున్ కన్పించ యుద్ధంబునన్, 649

ఉ॥ జాంబవతున్ జయించి, మణి, జాంబవతీ, సహితంబు పొందగన్,
సంబరమంద సత్రజితు సన్ముఖమందున కృష్ణుఁడంత, స
త్యంబును నిందనున్ తెలిపి, హారముతో మణినిచ్చె, నిందనున్,
నంబుజనాభుబాపుకొనె, నందఱి ముందర! వెంకటేశ్వరా! 650

ఉ॥ "మీరు సమర్థులౌకతన మీకపనింద తొలంగనయ్యె! సా
ధారణమమ్ముబోంట్ల కదితల్చగ సాధ్యమెఁజూడ?" విన్నదై
త్యారి "వినాయకున్ గొలిచియాకధవించును, నక్షతల్, తలన్,
వారలుఁదాల్చ, రాదునపవాదనె" వారితొ! వెంకటేశ్వరా! 651

ఉ॥ నోములనంతటన్ వ్రతము నోతురు శుద్ధచతుర్దశీతిధిన్,
దోముడి నాల్గునిన్ పదియు, తోరము, భక్ష్యములందునుంచి, త
న్నామనసారఁ గొల్వ పదునాల్గువసంతము పాటుతప్పకన్
బాముల పద్మనాభుఁడును బాపును కాచును! వెంకటేశ్వరా! 652

ఉ॥ యెయ్యది శూన్యమాసమొ? నదేజననంబయె, విఘ్నరాజుకున్,
నయ్యదె పైతృకంబునకు యాకరమైనది పిండతర్పణన్,
నయ్యదె కర్షకావళుల కాధరువై, నిడుధాన్యరాసులున్,
నయ్యదె పాడిపంటలకు నర్థవిహిత్యము! వెంకటేశ్వరా! 653

ఉ॥ వచ్చె మహాలయంబునది భాద్రపదంబున కృష్ణపక్షమున్,
నిచ్చిన పిండతర్పణమునేనియు తృప్తులు, "పైతృకంబునున్,
అచ్చహిరణ్యమున్ నిడిన నయ్యదెచాలును తద్దినంబుగా,
మెచ్చుచు వంశవృద్ధియగు, మేలగునందురు!" వెంకటేశ్వరా! 654

ఉ॥ వచ్చును దక్షిణాయనము వానలు వెల్లువ పొంగిపొర్లగా,
నిచ్చును సస్యశ్యామలము నిండుగ పాడియు పంటలెల్లనున్,
హెచ్చుగ దేవపూజలకు నియ్యదెనాందియె, విఘ్నరాజుయే
నిచ్చును సౌఖ్యసంపదల నింకొకతీరున! వెంకటేశ్వరా! 655

చం॥ పితరులు నేతిథిన్ చనిరొ, పిండహిరణ్యము తర్పణాదులున్,
హితవగు పాద్యమాదిగను యిచ్చుటపాడి, నదీనదంబులన్,
హుతవహు బ్రీతిఁజేసినను, యొప్పుపదైదు దినాలలోన, సు
వ్రతుఁడగు నేడ్తరాలకును వర్థిలునందురు! వెంకటేశ్వరా! 656

మ॥ అదియే భాద్రపదంబు కృష్ణము, తృతీయన్ వచ్చు నుండ్రాళ్లత
ద్దె, దినాత్పూర్వమె భోజనంబిడగ, మధ్యాహ్నంబు నాతిధ్యమున్,
కదిలేనుయ్యేలలూపి వస్త్రముల సంస్కారంబు ముత్తైదుకున్,
ముదుకల్ భర్తలభించ కుండగను నోముల్ నోయగా నొప్పునా!657

శరదృతువు, ఆశ్వయుజము :

ఉ॥ మాసములన్నిటన్ ప్రముఖమందురు నాశ్వయుజంబు, దేవతా
వాసము, చేలకున్, ఫలము, పంటల పండును! పండుగల్ సదాఁ
జేసెడు మాసమై ప్రజలు జీవితమార్దవ మాధురీప్రభా
భాసిత శారదాఋతువు పర్వముఁజూతురు! వెంకటేశ్వరా! 658

శా॥ ఆశ్వీజంబున శుద్ధపాడ్యమి తిథిన్నారంభమౌ పూజలన్,
విశ్వాసంబున బమ్మ, విష్ణు, శివదేవేర్లన్ ప్రతిష్ఠించుచున్,
విశ్వంబున్ నవరాత్రి పూజలతొ సేవించంగ కాంక్షించుచున్,
నాశ్వాసింతురు సంపదాదులకు! నౌనా? వెంకటేశా ప్రభో! 659

ఉ॥ వానలు తగ్గి పైరులును పంటకువచ్చిన, విశ్రమింతురా
జానపదంబు, రైతులు ప్రశాంతతనుండగ భక్తియుక్త గ్రా
మీణులు, నాదిశక్తి పరమేశ్వరి నాశ్వయుజంబునందు నా
హ్వానముఁ జేసికొల్తురట! యాశయసిద్ధికి! వెంకటేశ్వరా! 660

ఉ॥ ఆశ్వయుజంబునన్ లలితనాదిమశక్తి యటంచుఁగొల్తురా
విశ్వమునందు, దుర్గయని, వేవిధరూప దశావతారముల్,
యీశ్వరికిన్నిడంగ, పరమేశ్వరి, లక్ష్మియు, వాణి, రాజరా
జేశ్వరి యన్ననామములఁసేతురు పూజలు! వెంకటేశ్వరా! 661

ఉ॥ శారద నీలమేఘము ప్రశాంతత నిర్మలమంబరంబునన్
ధారుణి సస్యశ్యామల కృతార్థత పుష్పఫలానువంతమై,
యారమణీయమౌ ఋతువునందున భూప్రజ దుర్గమాతనున్,
భూరినలంకృతంబులను పూజలుఁ సేతురు! వెంకటేశ్వరా! 662

మ॥ నవరాత్రుల్ దసరామహోత్సవములున్ నారంభమౌ దేవికిన్,
భువిశాక్తేయులుఁ సేవలన్ జరుప దేవ్యోపాసనాగీతులన్
నవిరామంబుగ, కుంకుమన్, కుసుమ గంధాక్షంతహారిద్రమున్,
నవతారంబుల పూజలన్ జరుగునయ్యా! వెంకటేశా ప్రభో! 663

చం॥ దినమొక రూపమున్నిడుచు దేవినలంకరణంబుఁసేయగా
కనగను మోహనాకృతులఁ గాంచగ దేవిని, నిత్యమయ్యెడన్,
వినగ సహస్రనామముల వేవిధరీతుల పూజఁసల్పుచున్
తనువుదురంత, రాయమను, తద్దయు భక్తితా! వెంకటేశ్వరా! 664

చం॥ లలితయెనాదిశక్తియన, లక్ష్మి, సరస్వతి, కాళిరూపులన్
కలయిక దుర్గమాతయయికావగలోకము, శిష్టరక్షణన్,
నిలచెను దుష్టశిక్షణకు, నిత్యమునొక్కొక శక్తియౌచు, తా
నలరె, దశావతారముల, నాపదిరోజులు! వెంకటేశ్వరా! 665

ఉ॥ బాల, కుమారియున్, లలిత, భావన, చండిక, అన్నపూర్ణయై,
శూలము హస్తమున్ త్రిపురసుందరి, లక్ష్మి, సరస్వతీయనన్,
కాళియు, దుర్గమాతయనగన్ మహిషాసురమర్దనంచు, నా
వేలుపుమాత భాసిలెడు విశ్వమునందున! వెంకటేశ్వరా! 666

ఉ॥ ఆదిలోపాడ్యమిన్, నవమివంత్యమునౌను, ననేకమూర్తి, వే
షాదులనేకరూపముల నర్చన, సేవలనిత్యమున్ నిడన్,
నేదురితంబులైనను మహేశ్వరిఁగొల్వగ, రాదటంచునన్,
నీదసరామహోత్సవము నింపుగఁజేతురు! వెంకటేశ్వరా! 667

ఉ॥ దేవినుపాసనల్ తగుప్రతిష్ఠ, నఖండము దీపముంచగన్,
దేవి సహస్రనామముల త్రింశతి ఖడ్గము మాలయందునన్,
నావిధి నూటయెన్మిదిన నర్చన, పూజల, సేవఁజేయుచున్,
కావుమటంచు వేడెదరు కామితసిద్ధికి! వెంకటేశ్వరా! 668

ఉ॥ ఈశ్వరితత్త్వమే భువినినేర్పడె! నాలలితాంబయయ్యె, మా
హేశ్వరనంగపిల్వ, భువనేశ్వరి నామమునింక, రాజరా
జేశ్వరి యంచుకొల్వ పరమేశ్వరి నింకొకపేరునందు, కా
మేశ్వరి రూపమున్ నిలచెనిట్టుల శాంభవి! వెంకటేశ్వరా! 669

శా॥ ఆదిన్ పీఠమునందునన్, ప్రతిమనావాహ్వనంబ ఖండంబునన్,
వేదోక్తంబుగ మంత్ర, యంత్ర, కలశోపేతంబు నారాధనల్,
యాదేవిన్నిక తంత్రయుక్తముగ వామాచార నైపుణ్యమున్,
వైదీకంబుగ పూజలొనునట! దేవా! వెంకటేశా ప్రభో! 670

శా॥ అంతన్ శ్రీలలితాంబ పూజలను వామాచార మార్గంబొ? వే
దాంతార్థంబుగ, శాస్త్రరీతిగను పూర్వాచార యుక్తంబొ? సి
ద్ధాంతార్థాది విశేష మంత్రముల, తంత్రంబందు, సాధింప, సే
వాంతార్థంబున నాచరించెదరు! దేవా వెంకటేశా ప్రభో! 671

చం॥ దినమొక వేషమున్, ముఖము దిద్దగ, దేవిమనోహరాకృతిన్,
కనుల దయార్ద్రి వీక్షణము, కాంతులు, లీనగ కానుపింపగన్,
మణిమ యభూషణాంబరము, మౌళిని రత్నకిరీటమందునన్,
జనులు తరించ చూచెదరు! సార్ధకమొందగ! వెంకటేశ్వరా! 672

ఉ॥ తూరుపు గోమయంబలికి, తోరము, మామిడి, దండలుంచగన్,
భారియలంకరాకృతిని, పద్మదళాయతపీఠముంచి, వే
ర్వేరు హరిద్ర, కుంకుమల, రీతిగ చక్కగ రంగవల్లికల్,
నేరుపుమీఱ దిద్దుదురు నిండుతనంబిడ! వెంకటేశ్వరా! 673

శా॥ ఆ పీఠాన లిఖించ అష్టదళ పద్మాలంకృతాకారమున్,
యాపైె నూత్నపువస్త్రముంచి నటుపైెనంతంత తండూలమున్,
యాపైె, తామ్రపు, పాత్రనున్, జలము, బియ్యంబుంచగన్, పల్లవం
బా పాత్రన్, నిక, నారికేళ సహితంబౌ, కంచుకంబుంచగన్, 674

మ॥ ప్రతిమన్ బంగరొ? తామ్రమొ? రజతమో? పత్రానునిక్షిప్తమై,
ప్రతిమారూపము, తంత్రమాద్విధి నారాధించగా నొప్పునొ,
ప్రతివారున్ ఘనపూజలన్, గృహమునన్ రంజిల్ల, నీరాజనాల్,
స్తుతిధృత్యానుమతిన్ నివేదనము కస్తూరీసహా తమ్మయున్, 675

మ॥ గృహమందా పదిరోజులున్ ప్రతిమ సాక్షీభూతమౌ, జర్పగా
యిహమందున్, పరమందు పుణ్యము:ను, నున్యేకాంత సాధించగన్
స్పృహణీయంబు ననేకరూపములనున్ సేవించ సంతృప్తినిన్,
బహుమానంబుగ పొందెతీరెదరు! అప్పా వెంకటేశా ప్రభో! 676

చం॥ మొదటి దినంబలంకరణమున్కన, ముద్దుల "బాల" రూపమున్,
చిదిమినపాలు(గారు నునుచెక్కిళులందలి కోమలత్వమున్,
మృదుమధురంబుగన్ ముఖముమించిన సోయగ సౌకుమార్యమున్,
నది తిలకింప పల్మఱుమనంబునుకోరెడు! వెంకటేశ్వరా! 677

ఉ॥ "బాల" నుకన్యరూపమున పావడ(గట్టిన కంచుకంబునన్,
యాలలితా మృణాళతతి హస్తము పాదము పల్లవారుణం,
బోలెడు; చంచరీక, కనుబొమ్మలునున్, బహులేత కేశపా
శాలత ముంగురుల్, ప్రభవశాబక, సుందర, నందమౌరుచిన్, 678

చం॥ యెనిమిదియేండ్ల, బాల, హసితేక్షణ, కోమలగాత్రి, మీనలో
చన, కరుణాసముద్ర, ప్రసన్నవదనాంబుజ, మేల్మిదేహమున్,
ప్రణవశివోహమంచనగ, పార్వతి, భాసిలె ఆదిమశక్తియే
తను చనుదెంచె, బాలయవతారమునందున వెంకటేశ్వరా! 679

మ॥ విచెయాలంకృతమౌ "కుమారి" నటి దేవీ రూపలావణ్యమున్,
పదవిన్యాసము ఘల్లు ఘల్లు మన, నాపాంజేబు, పట్టాలతో,
కదలేపట్టు, జరీ, బుటంచులతొ, లంగా, చోలమున్, చూడగన్,
హృదయానందము, తన్మయత్వమగునోయీ! వెంకటేశా ప్రభో! 680

ఉ॥ హారము, నూపురాల్, మణిమ, యాంగద రత్నవిభూషణంబులన్,
శ్రీరమణీయ మౌక్తికము, చిత్రితమై మెరయంగ, చూడ, కే
యూరములందునున్ పర(గు, యుజ్జ్వల ముక్కఱ నీలకాంతి, కౌ
మారి ప్రభాసితంబయె సమంచితమౌ ప్రభ! వెంకటేశ్వరా! 681

శా॥ కౌమారీ ధృతిముగ్ధమోహనము సంకల్పానురాగంబునన్,
యామోదంబున 'బాల' మొగ్గ ముకుళీయారంభ పుష్పంబునౌ,
యామేయా లలితాంగి భావపటిమన్ నయ్యాది మాశ_క్తియే,
క్షేమస్థైర్య వివేకమున్ మదిలోనిల్పెన్! వెంకటేశా ప్రభో! 682

మ॥ లలితాదేవి తృతీయమైనది మహాలంకారమున్ దివ్యమై
విలసిల్లెన్ పరమేశ్వరీ విభవ వైవిధ్యంబుఁ గాన్పించగన్,
కలరూపంబు నిరూపితాప్రతిమ సాకారాంత రూపంబు, క
న్నులకన్పట్టెడు దేవియందమది! యౌనో? వెంకటేశా ప్రభో! 683

ఉ॥ దేవి విశాల ఫాలమును దీప్తివతంసము, కన్నుదోయి, ప్రా
భావిత తేజమున్, ముఖము పద్మము, నాసిక సంపెగంచనన్,
శ్రీవినువీనులన్ చుబుకశ్రీల విరాజిత చెక్కుటద్దముల్,
దావిలు కంబుకంఠ రుచిదంత ప్రకాశము! వెంకటేశ్వరా! 684

చం॥ శిరము కిరీటమందున విశిష్టతభాసిత సూర్యచంద్రులున్,
కర, కమనీయరత్నమణి కంకణభూషణ భూషితంబునై,
శరనిశితాస్త్రఖడ్గ కరచాప కఠారి, త్రిశూలపాణియై,
మఱపుకురానిదై వెలసె మందగజానన! వెంకటేశ్వరా! 685

మ॥ మొల నూల్మొత్యము కట్యభాగము, జరీబుట్టంచు, చీనాంబరం
బులు, మంజీరపు నిస్వనంబుల పదాభోజంబు, కస్తూరికా
తిలకోల్లాస లలాటరేఖ లలితాదేవీ స్వరూపంబునన్,
నలరారంగ ప్రభాసితంబునగు, నయ్యా! వెంకటేశా ప్రభో! 686

చం॥ లలిత, ముఖాంబుజంబును, విలక్షణ లక్షిత సౌమ్యమూర్తియున్,
లలితయె యాదిశ_క్తియన లక్ష్యమునన్ మహదివ్యమూర్తియై,
లలితయె మూఁడు మూర్తులుగ, లక్ష్మి, సరస్వతి, కాళిదేవతల్
విలసిత అంశముల్ వెలసె వేల్పులమాతగ! వెంకటేశ్వరా! 687

ఉ॥ చూడ చతుర్థమౌ త్రిపురసుందరినంత నలంకరింపగా,
వేడుక చూడముచ్చటగు వేల్పులమాత యనంగనీశ్వరిన్,
వేడిరి యన్నపూర్ణయని, వేవిధపూజల, సేవలందు, కా
పాడుమటంచు మ్రొక్కులిడి పాదములంబడి! వెంకటేశ్వరా! 688

ఉ॥ చూసిన రూపమా త్రిపురసుందరి నాల్గవదౌ మహేశ్వరీ
భాసితనామముల్, లలిత, పార్వతి, శాంభవి శాంకరీయనన్,
దోసిలయొగ్గి మ్రొక్కుటకు దూరమయెన్ త్రిపురాంతకంబునన్
వాసినిగాంచె దైవము; ప్రభావమహాత్త్యము! వెంకటేశ్వరా! 689

చం॥ త్రిపురపురాధినేత, త్రిపురేశ్వరి, సుందరి, సార్థకంబుగా
త్రిపురపురంబులన్ లలితదేవియె, పాలన జేసిఁగాచెనో,
త్రిపురపురాంతకంబునను తీక్ష్ణత, దృక్కుల శక్తిరూపిణిన్,
నపకృత చూడదగ్గమగు నానుడిఁగాంచెను! వెంకటేశ్వరా! 690

ఉ॥ ఆ త్రిపురాంతకంబున మహామహిమాన్వితమూర్తి శక్తియే
స్తోత్రమునన్ మహాత్రిపుర సుందరినచ్చటనే ప్రతిష్ఠయై,
నేత్రములందు తీక్ష్ణతను, నిప్పులురాల్చెడు దృష్టిదోషమై,
చిత్రము నిల్వగన్నెదుట చేటగునందురు! వెంకటేశ్వరా! 691

చం॥ జనని ప్రభావమున్ దెలిసి శాంభవిఁగాంచగ దృష్టిముందరన్
జనులును, భక్తులున్, నెదుట సంచరణంబునహాని నొందగా,
కనులను నడ్డమౌవిధము కట్టిరికుడ్యము లాంఛనంబునన్,
తనియగ భక్తులున్ కనిరితల్లినిచాటుగ! వెంకటేశ్వరా! 692

ఉ॥ పంచమరూపమౌ, లలిత, పంచమి నాడవతారమేకనన్,
నెంచగ దుష్టదైత్యులటు నిత్యము చేయుదురాగతంబులన్,
ద్రుంచగ చండియైనిలచె, దుష్టులనిర్భర చండముండులన్
పంచెయమాంతికంబునకు భక్తులుకావగ! వెంకటేశ్వరా! 693

శా॥ చాముండీగిరి యందునన్ నిలచె, సంస్థాపింపగా దేవినిన్,
చాముండేశ్వరి దేవతై వెలసె సంస్థానంబు కర్ణాటకన్,
నామైసూర్ దసరా మహోత్సవము ప్రఖ్యాతంబయెన్ చూడగా
చాముండీసురుఁ గూడఁగొల్తురట! యీశా! వెంకటేశా ప్రభో! 694

ఉ॥ వెండిలి దుష్టశిక్షణము, వేల్పుమొరల్, మునులార్తివించు, చా
ముండి, నిశాచరాధముల మొగ్గరమందున ద్రుంచెనంత, చా
ముండి యనంగ పిల్వబడె, ముష్కరులందఱి రూపమాపగా,
చండికదేవినీ భువిని శాక్తులుఁగొల్చిరి! వెంకటేశ్వరా! 695

ఉ॥ చండప్రచండ ముండుల నిశాచరనాథులభండనంబు, చా
ముండి మహేశ్వరీ ప్రళయమూర్తి భయంకర తాండవంబునన్,
ఖండిత ఖండ ఖండములుగా దనుజేశ్వరు చీల్చిచంపె, నా
భండనమందు లోకము శుభంబుగనుండగ! వెంకటేశ్వరా! 696

ఉ॥ షష్ఠితిథిన్ నలంకృతము, సంపదలిచ్చెడు నాదిలక్ష్మిగా,
యష్టవిధంబులన్ సిరుల కాకరమైనది, యష్టలక్ష్మి, సం
తుష్టిగ పూజసల్పగను, తోయజవాసిని లక్ష్మి తృప్తియై,
పుష్టిగ తీర్చు కోర్కెలను భూరిధనంబుల! వెంకటేశ్వరా! 697

శా॥ శ్రీలక్ష్మి యవతారమున్ కనగ, వాసించంగ పద్మంబునన్,
కేలందున్ కనపద్మమున్, నలర సాక్షిభూతమై నొప్పగా,
మాలాలంకృతయై గజంబులిడు నా, మాలన్ మనోజ్ఞంబునై,
లాలిత్యంబగు నందమయ్యె నిలువెల్లన్! వెంకటేశా ప్రభో! 698

మ॥ శిరమున్ పాపిటచేలు, కర్ణములనో శ్రీకారమున్ నొప్పగన్.
సిరిముంజేతుల రత్నకంకణముకై సేయంగ వంకీలునున్,
మెఱయన్, నాసికనీలరత్న రుచియున్, మీనంబుకన్నోయియున్,
దరహాసంబున, మోవికెంపురుచి నందన్! వెంకటేశా ప్రభో! 699

శా॥ హారంబుల్, ఘనరత్న భూషణము వజ్రాలంకృతంబై కనన్,
చీరన్‌పట్టు, బుటాజరీమయము, కాసెన్‌పోయ దట్టించగా,
తోరంబుల్ సరిముత్యముల్ వరుసమాధుర్యంబుఁ గాన్పింపగా,
కారుణ్యామృత వీక్షణంబు బఱుపంగన్! వెంకటేశా ప్రభో! 700

ఉ॥ అంబుజనాభు వక్షమున యామహాలక్ష్మి ప్రతిష్ఠితంబయెన్,
అంబుధి తండ్రిగా హరిని అల్లునిజేసి తరించెనందుమో?
సంబరమంద సోదరుఁడు చంద్రుతలన్‌నిడ శంభుఁడుండె నో
వెంబడి తామరంబు సుపవిష్టతమయ్యెను? వెంకటేశ్వరా! 701

ఉ॥ ఆదిమశక్తి యెవ్వరన నందఱునేనును, నేనహెూయనన్,
వేదపురాణ శాస్త్రముల వేల్పులుకొల్చెడు నర్థులంచనన్,
కాదగులోకమాతలగు గౌరి, సరస్వతి, లక్ష్మిమూవురున్,
నౌదల భాగ్యమందిరట నర్చనసల్పగ! వెంకటేశ్వరా! 702

చం॥ లలితయె సంపదన్, సిరుల లక్ష్మియునుండెను విష్ణువక్షమున్,
లలితయె, గౌరి, కాళి, నిటలాక్షుని అర్ధము పంచుకోవగన్,
లలితకళామతల్లిగ, విలక్షత, వాణిగ, ధాతజిహ్వనున్,
కలికి త్రిమూర్తిదుర్గయె జగన్నుతశక్తియె! వెంకటేశ్వరా! 703

మ॥ సిరులున్ సంపద, భోగభాగ్యములు, సాక్షీభూతమై నొప్పగా,
కరుణాసింధు కటాక్షవీక్షణము భక్తాభీష్టమున్ బ్రోవగా,
సురగంధర్వులు భూజనుల్ కొలువగా చూడామణిన్ లక్ష్మినిన్,
వరలక్ష్మిగవరంబు లివ్వగను! దేవా! వెంకటేశా ప్రభో! 704

మ॥ భృగువారంబు, త్రిలోకనాయికల, సేవింపంగ, ప్రాశస్త్యమౌ,
ద్విగుణీకృత్యమునన్, విశేషముగ, ప్రార్థించంగ, పూజించగన్,
సగుణాకారమనంత, రూపమునసున్, సౌభాగ్యముల్, నివ్వగా,
నగు, లక్ష్మినిల శుక్రవారమగునయ్యా! వెంకటేశా ప్రభో! 708

చం॥ సహజము శుక్రవాసరము, సంపదలక్ష్మియె, చూడువారికిన్,
విహితమటంచునున్ పసుపువీధుల గుమ్మము కుంకుమంబిడన్,
సహితము రంగురంగులతో, చక్కగ దిద్దగనింట ముంగిటన్,
గృహమున లక్ష్మియుండునని గేహినులందురు! వెంకటేశ్వరా! 706

ఉ॥ నమ్మకమందునన్. వనజనాభుని, పత్నిని, లక్ష్మిదేవినిన్,
రమ్మని యింటికిన్ మనసు రంజిలదిద్ది యలంకరించ, శు
భ్రమ్మగు శోభితంబునగు పాడియు పంటలు నుండనింట, నా
యమ్మను శుక్రవార నిలయంబని నెంతురు! వెంకటేశ్వరా! 707

ఉ॥ అట్టిది, శుక్రవారము, మహాద్భుత దివ్యదినంబు, లక్ష్మికిన్,
నట్టిదినంబె, ముఖ్యమగు నాశ్వయుజంబున శుద్ధషష్ఠినిన్,
పెట్టిన కాలుగీయదని వేయివిధంబుల నాశ్వసింతుర
ప్పట్టున నర్చనల్ నిడ శుభంబులుకోరుచు! వెంకటేశ్వరా! 708

ఉ॥ లక్ష్మిని పూజకున్, ప్రతిమలాంఛన పూర్వమఖండదీపమున్,
లక్ష్మి సహస్రనామము విలక్షణపూర్వక ఖడ్గమాలతో.
లక్ష్మిపదాంబుజంబులను లక్ష్యము శుద్ధిగ పూజసేయగా
లక్ష్మిభవాని తీర్చును, లలాటలిఖిత్వము! వెంకటేశ్వరా! 709

ఉ॥ కుంకుమ, నర్చనాదుల, నకుంఠిత దీక్షతొ. పుష్పగుచ్ఛముల్,
పంకజమల్లియల్, పసుపు, పంటజవాదియు, గంధమక్షతల్,
సంకలితంబుఁ సేసి సహజమ్ముగకస్తురి పూజఁ సేయ, యా
పంకజనాభుపత్నికి, శుభాస్పదమౌచను! వెంకటేశ్వరా! 710

శా॥ శ్రీలక్ష్మి పరమష్టమూర్తియుతమా శ్రీవిష్ణువక్షస్థలిన్,
నాలంకార సువర్ణరత్నమణిభూషాలంకృతా భూషితే,
బాలుండే శశిసోదరీ కమలమున్ వాసించు సంవర్ధినే,
శ్రీలాలిత్యపు ఆదిలక్ష్మియగునా! శ్రీవెంకటేశా ప్రభో! 711

ఉ॥ క్షీరసముద్భవంబు, సురసేవిత పాదపద్మాంబుజంబునై,
వారిజనేత్ర, సర్వగుణభాసిత, శాంతసముద్ర శోభితై,
యారమణీయ, రమ్య, మధురానన, దివ్యమనోజ్ఞమూర్తి, నా
ధారపు, సస్యశ్యామలపు ధాన్యపులక్ష్మియె! వెంకటేశ్వరా! 712

ఉ॥ ధైర్యము సాహసంబును, ప్రధానము జీవనయాత్ర సల్పగన్,
కార్యము సానుకూలమగు గౌరవభాజన యోగ్యతంబు, నా
స్థైర్యము నాలవాలమగు సజ్జన సంస్తుతమానవాళి కా
హార్యము ధైర్యలక్ష్మినిడు నర్చనసల్పగ! వెంకటేశ్వరా! 713

ఉ॥ పంకజమందు వాసితము, పద్మము మాలవిభూషితంబునై,
అంకిత తామరల్ గజము లాయిరువైపుల తొండమెత్తుచున్,
కింకరువోలె నిల్వగను, ఘీంకృతి, సత్వవిధాన చాతురి
ర్వంకల భాసితంబునగు, నాగజలక్ష్మియె! వెంకటేశ్వరా! 714

శా॥ సంతానంబునుపొంది పైతృకము, వంశంబంత నిల్వంగనున్,
సంతోషంబున, భోగభాగ్యములనున్, సౌఖ్యంబు, సంవృద్ధినిన్,
శాంతిన్, గోరుచు, నిత్యమర్చనల, నాసంతానలక్ష్మిన్, సదా
సంతృప్తిన్ పఱుపంగఁ జేతురట పూజల్! వెంకటేశా ప్రభో! 715

మ॥ తనకార్యంబులనున్, ప్రయత్నఫల యుద్ధంబందు వ్యాపారమున్,
తన యుద్యోగపు, వృద్ధి, వ్యాజ్యెములనున్, ధర్మాసనాతీర్పులన్,
తన విద్యన్ విజయంబుఁ గోరుదురు నిత్యంబారమాదేవి గొ
ల్చన, నారాధనజేయగా, విజయలక్ష్మియే నొసంగున్ ప్రభూ! 716

మ॥ చదువన్, విద్యయు, సంస్కృతిన్ తెలియ శాస్త్రభ్యాస మౌశక్తినిన్,
మది ప్రేరేపణ, యున్నతోన్నతపు, ప్రామాణ్యంబు నాశించ, సం
పద, ప్రాధాన్యము, భారతీ, చలువ నావశ్యంబు, కీర్తించ, న
య్యది, దేవీకరుణన్, లభించునట, విద్యాలక్ష్మిచేయూతనున్; 717

మ॥ ధనమే, సర్వవిధంబులన్ వలయు, విద్యాయైక, సంతానమున్,
గన, ధాన్యాదుల, యుద్ధమున్, విజయ, సంకల్పంబు, ధైర్యంబు, జీ
వన సామ్రాజ్యము, నాదిలక్ష్మినిడ సంప్రాప్తంబునౌ నన్నియున్
ననువౌ, నా ధనలక్ష్మి నిచ్చునటనౌనా! వెంకటేశా ప్రభో! 718

మ॥ మహలక్ష్మి, యవతారమెన్మిదియు, ప్రామాణ్యంబునౌ, నొప్పు, ప్ర
త్యహమున్, పూజల సల్పగన్, నిడును అష్టైశ్వర్యముల్ నిండుగా,
స్పృహణీయంబగు వాటినిన్ మనసు నాశించంగ, దారిద్యమున్,
రహితంబయ్యెడు దేవి వీక్షణలు పర్వన్! వెంకటేశా ప్రభో! 719

ఉ॥ సప్తమినాటి రూపమగు, శారద, వాణినలంకరించగన్,
సప్తమయ స్వరంబులకు సాక్షి, సరస్వతి సామగానమున్,
సప్తమియందునన్ గొలిచి, శాస్త్రపురాణము నాధిపత్యయౌ
సప్త నినాదవీణ సుతి సంహితమయ్యెడు! వెంకటేశ్వరా! 720

శా॥ నక్షత్రంబది "మూల"యందునను ప్రాణాయామ గాయత్రినిన్,
యక్షయ్యంబుగ మంత్రరాజమయి, సంధ్యావందనాకృత్యముల్,
లాక్షజ్ఞుల్ కను మంత్రరాజమగు "మూలా"ధారమై నొప్పగన్,
సాక్షీభూతమనంగ సామ్యమగునంశన్! వెంకటేశా ప్రభో! 721

శా॥ నక్షత్రంబిది "మూల" సంకలన నానారూప భావ్యంబు, సా
పేక్షాకార మనంతరూపమగుటన్ వేదాంత సంసేవ్యమై,
యాక్షోణీతల మంత్రరాజమగు గాయత్రీ మహామంత్రమున్,
సాక్షీభూతము నొప్పుచుండును తదంశన్! వెంకటేశా ప్రభో! 722

చం॥ లలిత మనోహరాకృతి, విలక్షణ, దివ్యమనోజ్ఞమూర్తియై
లలితరసానుభూతిగ, కళాపరిపూర్ణమయాధి దేవతై,
లలిత మధుస్వరంబున విలాసముగా పలికించువాణియే,
లలితకవిత్వ సాధనకు లక్షణమైచను! వెంకటేశ్వరా! 723

ఉ॥ శారద విద్యకున్, సకలశాస్త్ర, పురాణము, వేదభావకున్,
సారరసామృతాకలిత, సారసమాధురి గానమందునన్,
భారతి చిత్రలేఖనము, భాసిల శిల్పకళా విశేషమా
ధారము నొప్రమాణికపు దైవము! నొగద! వెంకటేశ్వరా! 724

ఉ॥ వాణి, సుధారసామధుర, వాఙ్మయమందున, నామెయే మహా
రాణి, విరించి సృష్టియది! రమ్యమనోజ్ఞవిలాస, లాస్యయై,
వాణి విపంచిఁబూని నెదపై నిడిమీటెడు వీణతంత్రులన్,
వేణి భరాలసాపిరుదు వేల్లసితానన! వెంకటేశ్వరా! 725

శా॥ వాణీ చేలముపస్థితాంబరమునన్, వక్షోపరీరమ్యతా
వీణానాదతరంగిణుల్ కదలునో? విశ్వంబు చైతన్యమౌ
వాణీప్రస్త కరాంగుళీ న్యసితమై వ్యాపించు మాధుర్యముల్,
వాణీగానసుధారసంబదియె! దెల్పన్! వెంకటేశా ప్రభో! 726

చం॥ మనుజుఁడు పుట్టి నాలుకను మాటల కోసము తత్తరంపడన్,
"ఒనమలు", పల్కుదిద్దగను, నొజ్జ, సరస్వతి ధ్యానముద్రితన్,
ననయము నుత్తరోత్తరము "నక్షర" సంజ్ఞత, కావ్యసృష్టికిన్,
ననవరతంబుకోరనగు, నామెయనుజ్ఞయె! వెంకటేశ్వరా! 727

ఉ॥ ధాతసృజించె శారదను, తన్మయమందుచు భావమందునన్,
నాతని పత్నిగాపఁటగె, నాత్మజయంచును జూడనొల్లఁడే?
నాతఁడు వేదముల్ నిడెను, నామెయె వాక్కనుసారి ణయ్యెనో?
రాతయెఁగాకయేమి? చతురానన సృష్టియె! వెంకటేశ్వరా! 728

ఉ॥ భారతి పూర్ణచందురు నిభానన, సర్వకళామతల్లియౌ,
శారద, సర్వశాస్త్రపు, విశారద, కన్నులఁ గట్టినట్లుగా
యారమణీయమూర్తి నటయచ్చ, సరస్వతి నిల్చినట్లు నా
కారము రూపమందునను కాంచగ ధన్యమె! వెంకటేశ్వరా! 729

ఉ॥ భాసర పీఠమున్ నిలిపె వ్యాసుఁడు, శారద సైకతంబునన్,
భాసిలె "అర్వ" దేశమున, భారతి, శారద, పీఠమందునన్,
వాసిలె, నాదిశంకరులు, ప్రాణముపోయ, ప్రతిష్టితంబయెన్,
భాసురమౌ సరస్వతి ప్రభావముకీర్తిల! వెంకటేశ్వరా! 730

ఉ॥ శారద, శాస్త్రముల్, నుపనిషత్తులు, వేదపురాణ, సాహితీ,
సారరసామృతామధుర షడ్జమ, నాట్యము, వాద్య, గాన, మా
ధారము, శిల్పచిత్రరువు, తంత్రము, యంత్రము, మంత్రమందునన్
భారతి సామగానమున భవ్యసరస్వతి! వెంకటేశ్వరా! 731

శా॥ మంత్రంబన్నిటికిన్ మహామహితమౌ మంత్రంబు గాయత్రియే,
తంత్రంబున్గన మూలమైనదగు నాద్యంతంబు "మూలే"యగున్,
యంత్రంబో, వివిధార్థ, మంత్రముల మూలాధార నక్షత్రమే,
మంత్రంబేఁగద! వెంకటేశ! నదిముమ్మార్లైన సంధింపగన్! 732

మా॥ అతిలోకోత్తర సౌమ్యమూర్తియన గాయత్రీమహాదేవియౌ!
పతి సౌఖ్యంబును, నాయువున్ నొసగు సౌభాగ్యంబు, సావిత్రియే!
ప్రతివారున్, కరుణింప వేడెదరు నావాగ్దేవినిన్ భక్తితో,
సతులీమూవురి, వెంకటేశప్రభువా సంస్తుత్యమానంబగున్! 733

శా॥ గాయత్రీయవతార పంచముఖ మాఖ్యాతంబుగా నొప్పగన్,
యాయాహస్తము, శంఖు, చక్ర, గదదివ్యాస్త్రాయుధాయత్తమై
సాయంసంధ్యుదయాది వందనల ప్రాశస్త్యంబు మంత్రంబునై,
గాయత్రిన్, మనసానలంకరణమేగా! వెంకటేశా ప్రభో! 734

ఉ॥ రక్కసుమూక లాగడము రాయిడికయ్యెడ మిక్కుటంబునై,
మ్రొక్కగ, దేవతల్, మునులు. ముందు నిలంబడి, విన్నవించగన్,
నక్కటికంబునన్, పనిచె, నాదిమశక్తియు వారినంతటన్,
"నుక్కడగింతు" నంచనుచు నూఁఅడగించెను! వెంకటేశ్వరా! 735

ఉ॥ చండుని, ముండునిన్ దునిమె, చండిక నాహవమందు గాంచె, చా
ముండి ప్రసిద్ధి, నంతకడు ముష్కరులైన, నిశుంభ, శుంభు, లు
ద్దండ పరాక్రమంబెసగ దాడియొనర్చిరి, దేవలోకమున్,
దండనలన్ విధించిరతిదారుణ శిక్షగ! వెంకటేశ్వరా! 736

ఉ॥ అష్టమి వేషమున్, తిధియు, అష్టమినాఁడు నలంకరింతురా
యష్టభుజంబులన్కల మహాద్భుతరూపిణి కాళిదేవినిన్,
దుష్టులబీజమున్ నణచ, తోడుగరాగను యష్టశక్తులున్,
దృష్టిని గుద్భుచున్చనెను! దేవిరణంబుకు! వెంకటేశ్వరా! 737

ఉ॥ అష్టమినాఁడు కాళిక భయానక వక్త్రము, వాడికోరలున్,
స్పష్టము విస్ఫులింగమయ పాపలనేత్రము ప్రజ్వలింపగన్,
అష్టమ బాహుపంక్తి వివిధాస్త్రము, శూలము, ఖడ్గముద్గరల్,
దృష్టికి భీకరంబగుచు దేవికనంబడు! వెంకటేశ్వరా! 738

చం॥ వదనకరాళగహ్వరము, వజ్రనఖంబులు, వాడిదంష్ట్రమున్,
కదలు, కపాలమాల, లయకాలపు నృత్యము ప్రేతభూమినిన్,
పదములు ఘట్టనన్, మొలను వర్తులకాలపు ఖండహస్తముల్,
యెదుటున కాళివచ్చెనట యుద్ధపుభూమికి! వెంకటేశ్వరా! 739

ఉ॥ బాలికయై, పదంబిడెను, ప్రాంగణమందున, రామకృష్ణుఁడా
బాలనుకొల్చె, లాలనల, పావనమాతయటంచు నిల్వగా,
కాళి భయంకరాకృతియు, గజ్జెల, మువ్వల, బాలయయ్యె, నా
బాలిక మందహాసరుచి భక్తిపరంబయె! వెంకటేశ్వరా! 740

చం॥ కలకలహంసినీరవము, కాళిముఖాంబుజ మందహాసమున్,
లలితమనోజ్ఞ బంధురము, లాలిత, లక్షణ, లక్షితాంగిగా,
ప్రళయ భయంకరాకృతిని బాసెను కాళిక మందయానగా,
మలసెను, రామకృష్ణ కడమాధురి బాలగ! వెంకటేశ్వరా! 741

ఉ॥ కాళి భయంకరాకృతిని, కాళిఘటంబున, చూడగా, మహం
కాళియనంగ రౌద్రమున కాకరమౌనట! భద్రకాళినే
వేళను దర్శనంబొసగు వేడగ యుజ్జయినీపురంబునం
దాలయమందునన్ నభయహస్తము నందున! వెంకటేశ్వరా! 742

మ॥ ఒక రూపంబు, ననేక భావనలతో, యోచింప, సౌమ్యంబు, వే
ఱొకచో, కాన, జుగుప్సహేతుమయమై యొప్పంగనౌ! కాదువిం
కొక యాకారము, భీకరాకృతిని నిన్కొల్వన్, భయోత్పాతమౌ!
సకల భ్రాంతియుతంబు కాళిగననీశా! వెంకటేశా ప్రభో! 743

ఉ॥ శంభునిరాణి అష్టమయశక్తుల తోడ్కొని యుద్ధభూమికిన్,
జృంభిత శౌర్యసంపదల, సింహికవాహిని నేగుదెంచె! కా,
దంభము ఘీంకగన్ నెదిరిదానవవీరులు హుంకరించి పో
రన్ భుజదార్ఢ్యమున్ నెఱపిరారణ, మందున! వెంకటేశ్వరా! 744

ఉ॥ చండుని, ధూమ్రలోచనుని, శక్తి వధించగ, రక్తబీజునిన్,
దండనచేత, దేవితన, దానినొనర్పగ, శుంభుఁబంప, ను
ద్దండుత నాహవంబునను, దస్యుడుఁ, రాక్షసవీరులందఱిన్,
ఖండనమందునన్ పసుపపాల్పడె నయ్యెడ! వెంకటేశ్వరా! 745

శా॥ రక్తాక్షుండును, రక్తబీజుఁడును పోరాటంబుకై ఁ బోవగా,
యుక్తంబంచును, దేవినంపె, తన మాయోపాయమున్, కాళినిన్,
శక్తుల్, పోరగ, రక్తబిందువులనున్ జన్మించె, నొక్కొక్కరై,
వ్యక్తుల్ నేలను రక్తబీజులయిరయ్యా! వెంకటేశా ప్రభో! 746

ఉ॥ ఒక్కొక బిందువున్, రుధిర మొక్కొకఁడయ్యెను, రక్తజిహ్వగా,
రక్కసు లుద్భవింపగ, కరాళి, యొకింత యోచనాధృతిన్,
నిక్కమెఱింగి, నాలుకనుపర్చెను (జాచెను) చాపవోలెనున్,
రక్కసుఁ జంపగా పడిన రక్తము జుర్రెను! వెంకటేశ్వరా! 747

మ॥ వరమున్, బొందిన రక్తబీజుఁడును, చావన్, శుంభుఁడావేళ, సో
దరుఁడుద్దండ పరాక్రముండు పురుషార్థంబం, దనధ్యుండునున్,
నరివర్గంబుల మార్కొననన్ననిపె, యుద్ధార్థంబు, సైన్యంబుతో,
పరఁగెన్నంత నిశుంభుఁడున్ మదముతోపన్! వెంకటేశాప్రభో! 748

చం॥ అనికి, నిశుంభుసైన్య, నివహంబుతోరాగను, కాళిదేవినిన్
కనగనె హుంకరించి పద, ఘట్టనసేయుచు, నారసంబులన్,
ననిపిన, నొచ్చియాయె, నిశితాస్త్రములేయగ శక్తులొక్కటై,
దునిమెను సేననుగ్గవగ, దోర్బలశక్తితో! వెంకటేశ్వరా! 749

చం॥ అనితెగటార్చ, సేననిచయంబును, కాళి, నిశుంభుఁడంతటన్,
కని, కరవాలముద్గర, నికాయశరంబుల పూనినేగెనో,
తన, పదఘట్టనన్ పుడమి దద్దరిలంగగ, హుంకరించుచున్,
పనిచెను వాడినస్త్రముల భామపయిన్తగ! వెంకటేశ్వరా! 750

మ॥ వరగర్వంబున, నారిచే, తనకుచావన్, వ్రాసియుందన్నదే,
మఱచెన్ నాతఁడు, శుంభుఁడున్, విధియు, వమ్మైపోవునే వ్రాయగన్,
మరణంబట్టుల ప్రాప్తముండ సతిసామ్రాజ్యంబు కాంక్షింతురే?
దురదృష్టంబు? యజుండు వ్రాయనదికాదో? వెంకటేశా ప్రభో! 751

ఉ॥ ఆహవ భూమికిన్, గద, శరాస్త్రము, శూలము విల్లు, ఖడ్గమున్,
బాహుబలంబు, చాతురితొ, భైరవమూర్తి, కరాళిశక్తులున్,
వ్యూహమువన్ని రాక్షసుని యుగ్రరణంబున మార్కొనంగ, నా
వాహనమైన, సింహమున, వచ్చెను శాంభవి! వెంకటేశ్వరా! 752

ఉ॥ అంబ, నిశుంభుఁడేసినవి, నస్త్రము త్రుంచుచు, నట్టహాసమున్,
వెంబడినారసంబులను వింటిని సంధిలఁ జేసినాతనిన్,
నంబరమందు దేవతలు నద్భుతమంద, యమాంతికంబుకున్,
సంబరమంద, నంపెగద, శక్తితొ కాళియు! వెంకటేశ్వరా! 753

శా॥ శంభున్ కంఠము శూలమున్దునిమె వక్షోజంబు చీల్చన్, భుజ
స్తంభంబున్ నఱుకంగ, జుట్టుమనుచున్ రక్తంబెల్ల, జుట్టంగ, నా
కుంభిన్ జీల్చగ రక్తమున్ హరియు త్రాగోలంగ, ముల్లోకముల్,
స్తంభించెన్గద! వెంకటేశ ప్రభువా! దైత్యాంతమున్ జూడగన్, 754

ఉ॥ అంబ, నిశుంభ, శుంభులను నంతముఁసేసెను శక్తియుక్తులన్,
నంబరమందు దేవతలు అష్టమశక్తుల కాళిమాతపై,
సంబరమందుచున్ కొలిచె, చల్లుచు, వారలు, పుష్పవృష్టి, సో
హంబని పూజసల్పిరట! యాదిమశక్తిని! వెంకటేశ్వరా! 755

ఉ॥ దుష్టుల శిక్షణన్జరిగె, ధూర్తులనుక్కడగించె దీక్షతో,
శిష్టుల రక్షణంబునయె, చింతలుఁబాయగ లోకమెల్లరున్,
అష్టమినాఁడు కాళికను, నన్నివిధంబుల పూజ సల్పగా,
కష్టములెల్లబాసె, కలకాలసుఖంబయె! వెంకటేశ్వరా! 756

ఉ॥ అష్టమినాఁడు కాళికను, అష్టభుజంబుల దేవి రూపమున్,
దుష్టులదైత్యులన్ దునుమ! దుర్గనునాదినమందు కొల్వ, దు
ర్గాష్టమలంకృతంబునయె! మహర్నవమిన్ తగదుర్గమాతనున్,
యిష్టముతోడ పూజలను నీయిలఁసేతురు! వెంకటేశ్వరా! 757

చం॥ నవమి దినంబునన్ కనగనమ్రత భక్తులు కొల్తురంత, శాం
భవిని, త్రిలోకనాయికను, పావనమూర్తిని, మూఁడుమూర్తులన్,
యవగత, లక్ష్మి, వాణి, జగదంబగు, కాళియు దుర్గమాతనున్,
యవిరళ భక్తిభావమున నర్చనసేతురు! వెంకటేశ్వరా! 758

చం॥ నవమి నలంకృతంబు, బహు నాయుధముల్ ధరియించు దుర్గకున్,
దివిజుల కాచి బ్రోచెనన, దేవియు సింహము, వాహనంబు, నా
హవము నొనర్చు శక్తి, మహిషాసురమర్దని, రూపమందునన్,
వివిధములైన, సేవ, కనువిందొనరింతురు! వెంకటేశ్వరా! 759

ఉ॥ దానవనాథులైన, మహితాన్విత శంభ, నిశంభు లిర్వురిన్,
మానిని కాళిఁ జంపెనట మారణహోమమునందు నంచనన్!
యానినదంబు, శోక, మహిషాసురుఁడొక్కఁడు క్రోధమూర్తియై,
దానవ సైన్యమున్‌పిలిచె దాడియొనర్పగ! వెంకటేశ్వరా! 760

ఉ॥ ఘోరతపంబునన్ నజుఁడు కోర్కెలుఁదీర్చి వరంబులివ్వగన్,
మారణ యుద్ధమందునను, మంత్రణ, నాకము నాక్రమించెనో?
యారడిపెట్టి, దేవతల నంగనలన్, నవమాన భంగమున్,
దారుణ హింసలన్, మునుల దైత్యుఁడుపెట్టెను! వెంకటేశ్వరా! 761

ఉ॥ ఆదిమశక్తి, దేవతల నార్తినిబ్రోవగ, సిద్ధహస్తయై,
యాదను జాదినాథునను, నంతమొనర్పగ, నాహవంబునన్,
మోదములర్పగన్, ముదిత మూఁడును మూర్తుల, దుర్గదేవి భూ
తాది గణంబుతోడ, నవతారముఁదాల్చెను! వెంకటేశ్వరా! 762

ఉ॥ ఆదనుజాదినాథు మహిషాసురుఁజంపగ శూల, ఖడ్గ, బా
ణాది గదంబు ముద్గర, మహాస్త్రశరంబులు, పట్టికంబులన్,
ఛేదమొనర్చ రాక్షసుల, సింగము వాహనమందునేగె, న
య్యాదిమశక్తి, దుర్గయును, నాహవభూమికి! వెంకటేశ్వరా! 763

చం॥ మహిషము వాహనంబుపయి మార్గముఁజేసెను దైత్యానాథుఁడున్,
విహితము, సింహవాహనము, భీతి యొనర్పగ, గర్జనంబిడన్,
మహిత, శరాస్త్ర, సంతతితో, మారణహోమమొనర్చ, దుర్గయున్,
యహమహమికమున్ నరిగె నారణ భూమికి! వెంకటేశ్వరా! 764

ఉ॥ పోరును ఘోరమయ్యె! రణభూమిని శత్రువు మస్తకంబులున్,
పారిన, రక్తవాహినులు, పంక్తి, కళేబర, హస్తిగుట్టలున్,
వారువముల్ ప్రచండకరవాలపు ఖండిత, దైత్య, హస్తముల్,
కోరులుదీర్చె, గృధ్రములు, భక్షణఁసేయుచు! వెంకటేశ్వరా! 765

ఉ॥ దుర్గచతుర్భుజంబులతొ, దుష్టుల, దైత్యుల, సంహరించగన్,
దుర్గత్రిశూలమున్, దునిమె, ద్రోహియునున్, మహిషాసురుండునున్,
దుర్గమమార్గమున్ సుగమత్రోవను జేసెను, లోకమంతటన్
దుర్గమహేశ్వరిన్ గొలిచె దుర్గను, మాతగ! వెంకటేశ్వరా! 766

చం॥ కరమున సిద్ధచారణులు, గానవిశారద కిన్నరాంగనల్,
సురలును, నంబరంబునను, చోద్యముఁ జూచుచు, పుష్పవృష్టినిన్,
కురిసెను, దానవాంతమునకున్, మహిషాసుర మారణంబుకున్,
విరులును దుర్గమాతయెడ విస్తృతమయ్యెను! వెంకటేశ్వరా! 767

చం॥ అసురనిఘాదనంబు, మహిషాసుర మర్దనమయ్యెనంతటన్,
నసువులుఁగొన్న దేవిమహిషాసుర మర్దనియయ్యెఁ దుర్గయున్,
నసురకులంబు, నాశనము నాయమఁజేసెను! నామమాత్రమే
నసురులునుండగన్ విసరె నాలుగు మూలల! వెంకటేశ్వరా! 768

ఉ॥ అమ్మయనంగ, దుర్గయును, అంబయె, శంకరు వామభాగమై
అమ్మయె, శారదాంబగ పితామహుజిహ్వను నుండె, ముద్దుగన్,
అమ్మయె, లక్ష్మినుండెను మహాత్ముఁడు విష్ణువు వక్షమందునన్,
అమ్మయె, దుర్గమాత ముగురమ్మల మూర్తియె! వెంకటేశ్వరా! 769

ఉ॥ లోకములులేలుతల్లియె, త్రిలోకమహేశ్వరి, కాళికాంబయై,
యాకమలంబు, వాసినియు, యంబుజనాభుని, పత్నిలక్ష్మియై,
యాకమలాసనుండు, సతియైన, సరస్వతి వీణపాణియై,
నొకద! మూవురమ్మల మహాత్య్మపు దుర్గయె! వెంకటేశ్వరా! 770

ఉ॥ అమ్మపురాణ దంపతుల, యంశమునందిన భద్రకాళియై,
బమ్మకుకూర్మిరాణి యనవాణియె, శారద, అంశమంద, ల
చ్చమ్మ శశాంకుసోదరి, యశస్విని వైష్ణవి అంశమంద, దు
ర్గమ్మయె మూవురమ్మల విరాజితయంశము! వెంకటేశ్వరా! 771

ఉ॥ ఈశ్వరి సన్నుతింప, పరమేశ్వరి! రూపమునంధు, రాజరా
జేశ్వరి! అష్టశక్తుల, మహేశ్వరి, భక్తులు గొల్వ, సంప్రదా
యేశ్వరి! సింహ, వాహినియె, నీశ్వరి! హాటకపీఠమధ్య, కా
మేశ్వరి! రాజరాజ, పరమేశ్వరి! గొల్తును! వెంకటేశ్వరా! 772

చం॥ నవమితిథిన్, మహర్నవమినాఁడు, నాయుధ, పూజఁసేయ, నా
హవము, సమాప్తమయ్యెనని, యమ్మలగన్నది, అమ్మదుర్గకున్,
నవిరళభక్తితోడ, మహిషాసురమర్దని దుర్గదేవికిన్,
నవనిని గొల్తురెల్లరు మహాద్భుత నర్చన! వెంకటేశ్వరా! 773

ఉ॥ అమ్మయనంగ బిడ్డలను అక్కునజేర్చును నాదరించునున్,
యమ్మయె, పాలుద్రావనిడు అంకముఁజేర్చును జోలపాడునున్,
యమ్మయెకొట్టుతిట్టునిక, నాగడమందున కోపగించునున్,
యమ్మయెదుర్గ మాతగద, నాలనపాలన! వెంకటేశ్వరా! 774

ఉ॥ అమ్మలుమూవురందు, లలితమ్మయె, భక్తుల కోర్కెఁదీర్చుఁ, ల
చ్చమ్మయు సంపదల్ సిరులు శాంతి సుఖంబుల నిచ్చుదేవియై
బమ్మకు రాణివాణినిడు వాక్కున విద్యకళాస్రవంతి, దు
ర్గమ్మ కవిత్వసంపద కృపాబ్ధి నొసంగును! వెంకటేశ్వరా! 775

చం॥ ద్రుమతల శోభినీ, కనక, దుర్గనివాసము, నింద్రకీలమున్,
సుమధుర మందహాసరుచి శోభిత, మానన, సూర్యచంద్రు, శీ
ర్షమున, వికాశమానయయె, సౌమ్యకటాక్షపు వీక్షణంబు, ర
త్నమణిమయాంబరాది, వసనంబు విరాజిత! వెంకటేశ్వరా! 776

ఉ॥ దుర్గమహేశ్వరీ కనకదుర్గి, మహామహితాన్వియయ్యెనో?
దుర్గత్రిలోకపావనియె దుఃఖవిమోచని, దుష్టశిక్షణన్,
దుర్గమయంబు సర్వమును ద్రోహవినాశన శక్తియౌను, నా
దుర్గసువర్ణ దుర్గయయి ద్యోతనమయ్యెడు వెంకటేశ్వరా! 777

ఉ॥ చేసిన పూజలన్ నవమి సేవయె, యంత్యము, దేవికంతటన్,
యాసుదినంబు షోడశపదార్థ నివేదనమిచ్చినంత ను
ద్వాసన జేతురాయమను, బంధుజనావళి విందొనర్పనం
తా సుఖశాంతులన్ వడసి, ధన్యులునౌదురు! వెంకటేశ్వరా! 778

చం॥ నవమి నలంకృతంబునగు, నామహిషాసురమర్దనంత, నా
హవము ననంతరంబునను, నాయుధపూజలు సల్పి, రోజునన్
యవనిలో శస్త్రమస్త్రముల నాయుధ మెల్లను భద్రపర్చదై
నవిధిగ పాండుపుత్రులును నాశమివృక్షము ప్రాప్తమయ్యెనా! 779

చం॥ నవమితిథిన్, నలంకృతము, నాహవమూర్తిగ, సింహవాహినీ,
వివిధ శరాస్త్రమస్త్రముల, చేర్చ, చతుర్భుజ, దుర్గమాతయై,
నవనిలో, దానవాంతకమునన్, మహిషాసురమర్దనీయనన్,
నవగతమైన రూపమది, యాయమగొల్వగ! వెంకటేశ్వరా! 780

మ॥ విరటున్ గొల్వగ, వత్సరంబునను, నాభేతాళ ప్రార్థించిరా,
శరముల్, నాయుధమెల్లకావగను, భూజానుండు, కౌంతేయులున్,
పర, మజ్ఞాతము, పూర్తియైనతఱి, దివ్యాస్త్రాలనున్ పూజచే,
తరుణంబౌ విజయంబుఁగాంచిరట నంతన్! వెంకటేశా ప్రభో! 781

చం॥ దశమితిథిన్ ప్రశాంతయుత తాండవమొప్పెడునెల్లచోటులన్,
విశదము చేయగన్ విజయవేడుకలెల్లెడ కానుపింప, నం
త, శమని పారువేటగను ధర్మమటంచువేట నాడగన్,
పశుబలి నివ్వఁజూతురట! పాపమొ? పుణ్యమొ? వెంకటేశ్వరా! 782

చం॥ అదియొక, సంప్రదాయ పరమాచరణంబు నసాధ్యమంచు, నే
డదియును, వామచారులును, డాంభికవృత్తిని, మాంసభక్షణన్,
మది, ముదమందఁజేతురట! మంత్రము, తంత్రముశాంకరీవిధం,
బొదవిన పుణ్యమే యనెడు యోచనతోడను! వెంకటేశ్వరా! 783

ఉ॥ వేద, పురాణ, శాస్త్రమున, విస్తృతమైనది, ధర్మమార్గమై,
ఆదిసనాతనత్వమును, నావిధజంతుబలిన్ విమర్శనల్,
కాదగు! చంపకుండగను, కారణమొక్కనహింసయేయనన్,
వాదన, రక్తబొట్టు కనవచ్చిన జాలనె! వెంకటేశ్వరా! 784

ఉ॥ ఆశ్వయుజంబు శుద్ధమున అంతిమసేవలు దేవిరూప, కా
మేశ్వరి, శారదాంబ, పరమేశ్వరి, శాంకరి, కాళికాంబ, మా
హేశ్వరి, దుర్గదేవి, భువనేశ్వరి, యున్లలితాంబ, రాజరా
జేశ్వరి రూపమందున నభీప్సితసిద్ధికి పూజలయ్యెడున్; 785

మ॥ కరుణాపూరిత, లోచనాద్వయి, యనన్కారుణ్యమేపర్వగా,
చరణంబున్ నభయంబు ముద్రనగుచున్, శాంతిన్ ప్రసాదించగా,
చిరునవ్వున్, మృదుమందహాసరుచి, సూచించంగ రాజేశ్వరీ,
పరఁగెన్ అమ్మలయమ్మ సుందరతరంబై! వెంకటేశా ప్రభో! 786

ఉ॥ పంచదశాక్షరీ పరమపావన మంత్రము నాదిశక్తికిన్
నెంచగ మిన్నయౌను! పరమేశ్వరి యాలలితాంబ దేవికిన్
పంచదశీ ప్రపంచమున భాసిలు యోగము, భోగదాయకం
బంచు జపించుచుందురు మహాత్ములు ముక్తికి! వెంకటేశ్వరా! 787

శా॥ ప్రారంభించగ మంత్రరాజమదియే రాజేశ్వరీ ప్రీతియౌ,
శ్రీరూపంబుఁ దలంచినన్ లలిత సాక్షీభూతమై నొప్పెడున్,
నారాధుల్, పరమేశ్వరీ జపము వామాచార శాక్తేయమో?
పారంపర్యము శాస్త్రరీతులగు పూర్వాచారమో! చేయగన్! 788

శా॥ శ్రీచక్రంబున మంత్రబీజములకున్ శ్రీరాజరాజేశ్వరీ
నాహారంబున యంత్రతంత్రమగు! నాహ్వానంబు కావించి, పూ
ర్వాచారంబున, శాస్త్రయుక్తముగ, సేవారాధనల్ఁ సల్పగన్,
శ్రీచక్రాంకితమిచ్చు సంపదల శ్రీశ్రీవెంకటేశా ప్రభో! 789

ఉ॥ యింతటి భావనన్ మనసుకిచ్చిన, వాణి, గణేశ, దుర్గకున్,
చింతయొనర్పగా రచనసేయ, కవిత్వపుధోరణిన్, సదా
చెంతన యున్నటుల్ కవిత చెప్పగ, ఘంటమునన్ రచింప, నా
వంతుగ నేర్చితిన్, నిడెదవందనలియ్యవె! వెంకటేశ్వరా! 790

దీపావళి; నరకాసుర వధ :-

మ॥ నరకుండొక్కఁడు దైత్యనాయకుఁడు నానాహింసలన్ బెట్టగా,
సురలోకంబును, మౌనులున్, నలిగి కృష్ణున్ దానవారీ, హరిన్,
శరణం జొచ్చిరి "కావుకావు" మనగన్, సాత్రాజితీవల్లభుం
డరిగెన్ సత్యసమేతుఁడై రణముకయ్యా! వెంకటేశా ప్రభో! 791

ఉ॥ "సాత్రజితీలలామ, శుక, శారిక, కీరరవంబులందునన్,
క్షేత్రపదంబు నర్తనల చిత్తమునిల్పు రణాంగమందునా
క్షేత్రగజాశ్వ భీకరపు ఘీంకృతులెట్టుల విన్ననౌను? నే
మాత్రముఁ జూడనోపు"నని మాధవుఁడామెతో! వెంకటేశ్వరా! 792

మ॥ "పద, విన్యాస, తరంగ, నర్తనల, సంభావించు వాసంబునై,
మృదు, మాధుర్య, మనోజ్ఞ, గీతికల, సమ్మేళంబునన్ మున్గగన్,
మద, మాతంగ, తురంగ, సైన్య, పదసమర్దంబు నెట్లోర్తునో?
యదికంకాళమునెట్లు చూతు" వనెనయ్యా! వెంకటేశా ప్రభో! 793

చం॥ అను హరిచెంతఁజేరి తమకంబున, "నేర్చితినయ్య విద్యలన్,
రణము విశేషముల్ నెఱిగి, రాణువకెల్లర విన్నవింతునున్,
పనుపున గర్వమయ్యెడు, సపత్నుల ముందర చాటిచెప్పగన్,
నొనరగ వారలున్ మదిని నోర్పు వహింపరు, చూడముచ్చటా?" 794

చం॥ అనవుడు కూర్మితోడ హరినక్కునజేర్చుచు లాలనంబునన్,
"చనుమికరాణ్మణీ! వనిత, సాయముఁసేయగ గొప్పఁగాదుటే?
తనరెడునీదు బీరమును తర్జనభర్జన నేటికమ్మ? క్ర
న్నన నరుగం"చనెన్ కమలనాభుఁడు సత్యతొ! వెంకటేశ్వరా! 795

ఉ॥ ఉగ్రరణంబుసాగె, తన యోధులు మ్రగ్గ నిశాచరుండునున్,
నాగ్రహపూరితుండునయి, నమ్ముల మూర్ఛిలఁజేసె కృష్ణునిన్,
యుగ్రమహోనుదగ్రయయి, యోర్మి నశించగ సత్యభామన
త్యుగ్రశరాస్త్రమందునను నొవ్వగఁజేసెను! వెంకటేశ్వరా! 796

శా॥ కోపోద్రిక్తత నాసికాగ్ర పుట, ముక్కోణంబు కెంపారగన్,
కన్‌పాపల్ కడుచింతనిప్పుకణ రక్తాంతంబులై వెల్గ, బొ
మ్ముల్ పూరించగ, కుంభముల్‌పగిది నుప్పొంగంగ, నుచ్ఛ్వాసముల్
యాపీన స్తనచేలమున్ కటినినాయత్తంబునన్ దోపగన్, 797

మ॥ శరమున్ బాధితబెబ్బులీవిధమునన్, చాపంబు సంధించగా,
కరమున్ గీలిత తీక్ష్ణమౌ ఛురిక నాగాస్త్రంబు శస్త్రంబుగా
గురిచేసెన్, రిపుమస్తకంబునెడలన్, ఘోరాస్త్రమై వెల్వడెన్,
నరకాంతంబయె లోకశాంతిఁగనెనన్నా! వెంకటేశా ప్రభో! 798

మ॥ ముదితల్ నేర్వగరాని విద్యకలదే, ముల్లోకముల్లందునన్,
నదిసాత్రాజితిచేసె సాధ్యమని! నభ్యాసంబునన్ యుద్ధమున్,
కదనంబప్పుడు, నెప్పుడున్, నిపుడునున్ కాంతామణుల్ఁ దూకగన్,
సదనంబున్ కదనంబునన్ సములె నెంచన్! వెంకటేశా ప్రభో! 799

ఉ॥ స్వస్తి జగత్రయంబులకు! శాంతియు చేకురె మానవాళికిన్,
స్వస్తతమౌనులున్, సురలు, సౌఖ్యమునొంది, సుఖాంతమయ్యె! వి
శ్వస్త నిలింప భామినులు, బాధలు నంతములై వెలంగగన్,
ప్రస్తుతిఁజేసిరయ్యెడల పంకజనాభుని! వెంకటేశ్వరా! 800

మ॥ అమితానందమునన్ చతుర్దశిని నేనభ్యంగనా స్నానమున్,
అమవాస్యన్ నరకాంతమై వెలుగ దివ్యంబైన, దీపంబులన్,
కమనీయంబగు కాంతివంతము, నలంకారంబుగా, జ్యోతులన్,
విమలంబై, నరకాంత వేడుకలు పర్వెన్! వెంకటేశా ప్రభో! 801

ఉ॥ పండుగ, కృష్ణపక్షమున, వచ్చును, ఆశ్వయుజంబునందునన్,
దండిగ, బాణసంచులను దగ్ధముఁసేయగ, వేడుకైచనన్.
నిండుగ దీపకాంతులతొ, నింటిని, తోరణ, పంక్తులుంచగన్,
నిండును సంపదల్ సిరులు నింట సమృద్ధిగ! వెంకటేశ్వరా! 802

మ॥ అమవాస్యన్ పగలెల్ల పండుగను నత్యంతానురక్తిన్ నగున్,
అమితంబౌ ఘృతశర్కరాను మిళితంబౌ పిండివంటల్ రుచిన్,
అమృతోత్పాదిత, బజ్జిగారెలును, నల్పాహార చేగోడులున్,
మమతల్ నిండగ వండి, వార్చెదరు, సుమ్మా! వెంకటేశా ప్రభో! 803

శా॥ ఆదీపావళి, పండుగే, మమతలన్, నల్లుళ్ళు, కూతుర్లనున్,
దేదీప్యంబుగ నిల్లువాకిళులునున్, దీపాల వెల్గించ వ
స్త్రాదుల్, యాభరణాదులన్నిడుచు, సత్కారంబులన్ జేయగా,
యాదీపావళియెంత పండుగగునయ్యా! వెంకటేశా ప్రభో! 804

శా॥ గోధూళిన్, ధనలక్ష్మి, పూజలను, కుంకుం, పూల, గంధంబులన్,
ప్రాధాన్యంబుగ విఘ్ననాయకునితో, ప్రారంభమౌ, లక్ష్మి, నా
రాధింపంగను సంపదల్, సుఖము, సంప్రాప్తించు భావంబునన్,
నాధన్యుల్నటకొల్తురా యమను! నౌనా! వెంకటేశా ప్రభో! 805

మ॥ భగినీహస్తపు భోజనంబు తిన, ప్రాప్తంబౌను, నేడాదిపం
డుగ దీపావళి, వెళ్ళగన్, విదియనాడున్ సోదరీసోదరుల్,
స్వగృహంబందున, విందునున్, గుడువనాప్యాయత్తతాతిథ్యమే,
యగు, వస్త్రాదుల యాదరించెదరటయ్యా! వెంకటేశా ప్రభో! 806

మ॥ అది ఆశ్వీజము అట్లతద్దెయన, ముత్తైదుల్ కిడంగనున్,
పదునొక్కండగు అట్లతోఁ జరుప, భావంబందు వృద్ధుండునున్,
ముదుకల్ భర్త, లభించకుండగ, వరంబుల్ పొంద, పూజింతురా
పదికాలాల సుమంగళీత్వమున నొప్పన్! వెంకటేశా ప్రభో! 807

కార్తీకము :-

చం॥ శరదృతువందు, కార్తికము, శంకరుకర్చన ప్రీతిపాత్రమౌ,
యిరువుగన క్తముండనది నీశ్వరు నిత్యము, కంకితంబగున్,
పఱగనుమాసమెల్ల కడుభక్తి ప్రపత్తులఁగొల్చు వారికిన్,
కరము నభీష్టసిద్ధినిడు, కార్తికదేవుఁడు! వెంకటేశ్వరా! 808

శబరియాత్ర - అయ్యప్ప దీక్ష :-

ఉ॥ కార్తికమాసమున్ శబరి కానన, యాత్రకు, భక్తులందఱున్,
మూర్తిని ధర్మశాస్తనును, ముక్తిని మోక్షమొసంగు, నయ్యపన్,
గుర్తుగ, నీలివస్త్రముల కొండకుఁజేరుచు, సామినిన్ మన
స్ఫూర్తిగ యిర్ముడిన్ మరియు పూజలఁసేతురు! వెంకటేశ్వరా! 809

శా॥ కార్తీకంబున, శుద్ధమున్ చవితి విఖ్యాతంబు నాగేంద్రుకున్,
యార్తిన్ దీఱగ, పూజలన్ సలుపగన్యన్నాగు, గోక్షీరముల్,
కర్తవ్యంబుగ చల్మిడిన్, దనుప, భాగ్యాదుల్ సుఖాశాంతులున్,
నార్తత్రాణ పరాయణుండిడుననన్నా! వెంకటేశా ప్రభో! 810

ఉ॥ వృశ్చికమాసమున్ రవిప్రవేశము ముఖ్యము ధర్మదీక్షకున్,
నిశ్చితమార్గమందు, పదునెన్మిది మెట్లను పూజఁసేయగా,
నిశ్చయ నీలివస్త్రముల నిర్ముడి నెత్తిన దాల్చువారికిన్,
వృశ్చికమందె దీక్షకు పవిత్రము నందురు, వెంకటేశ్వరా! 811

మ॥ అరుణుండున్ నుదయింప పూర్వముననే నాచారమౌ స్నానమున్,
గురుఁడివ్వంగను మాలఁదాల్చుచును, యుక్తోక్తంబుగా మంత్రమున్,
"శరణంబయ్యప, సామియే శరణు" ఘోషన్ మండలంబంతయున్
ధరియింపన్ కడు నీలివస్త్రముల, పాదాచారియై, చందనం, 812

చం॥ బునొసట కుంకుమంబిడి, విభూతిని, దాల్చుచు, నేకభుక్తమై,
అనిశముసామి ఘోషయుతనర్చన జేయుచు, దేవళంబు, ద
ర్శనమొనరించుచున్, ధరణి శయ్యను, చాపలోపవ్వశించగన్,
చనునది దీక్షకాలమున సాత్విక భోక్తగ! వెంకటేశ్వరా! 813

చం॥ యెడనెడ నయ్యపన్ జరుగు నీశ్వరపూజల భిక్షపాల్గొన్నన్,
నడుమను తానునివ్వగ, ననాదరణంబును, స్వేయకెవ్వరిన్,
నడచుట మండలంబటుల నాచరణంబునపెట్టు భక్తులే
నడచెడు మార్గమయ్యతియె నమ్మకమందున! వెంకటేశ్వరా! 814

మ॥ పరఁగున్ ముందుగ కన్నెసామియనగన్ ప్రాప్తంబు నౌనయ్యపన్
నిరతిన్ నిర్మలనీతి దక్షతనుగా, నిత్యంబు సేవార్చనల్
జరుపన్ స్వామికటాక్షమందుకొన, చాంచల్యంబు లేకుండగన్,
చరియింపన్ నిజసామి భక్తులగునీశా! వెంకటేశా ప్రభో! 815

ఉ॥ మండలకాల మిప్పగిది మౌనము దీక్షతొ నాచరింపగన్,
పండిత సాహచర్యమున, ప్రార్థన సల్పి, సుమూర్తమందునన్,
నిండుగ నౌదలన్ గురుఁడు నిర్ముడి వెత్తిన నుంచి, యాత్రకున్
పొండన, సాగునయ్యపలు, పూనిన భక్తితొ! వెంకటేశ్వరా! 816

ఉ॥ అండగ నిర్ముడిన్, గురుఁడు, నౌదల నుంచగ, కాచుసాములన్,
వెండిలి భక్తిపూజపడి వృశ్చికమందున జేయ, కొండఆా
మండల పూజకౌనరుగు, మార్గశిరంబున, కొండఉండునా
పండుగ జ్యోతినిన్ మకరి పౌష్యమునన్ కను! వెంకటేశ్వరా! 817

ఉ॥ మండలదీక్షతో గృహము మందిరవేల్పులపూజ సల్పి, తా
మండపమందు దీపమును, మాతయుఁజూడ, గురుండు నిర్ముడిన్,
వెండిలినౌదలన్నిడగ, బిక్షననంతరమందు సాములా
కొండకుఁ జేరఁబోదురట గుంపులు గుంపులు! వెంకటేశ్వరా! 818

చం॥ యిరుముడికట్టి నౌదలకు నెత్తగ, నిత్తురు నారికేళమున్,
గురువుల మార్గమున్ శబరి కొండకు సాగుచు, యాత్రకాలమున్,
"శరణము నయ్యపా శరణు సామియె నయ్యప" యన్న ఘోషతో
తరలెదు సాములున్ గుడుల దర్శనమందుచు! మధ్యమధ్యనన్, 819

చం॥ కతిపయయానముల్ గడచిఁ, గాంచుచు మార్గము నందునందు, దే
వతలను, "పేటతుళ్లి"యును, వావిరి సామికి మ్రొక్కులిచ్చుచున్,
వెతలను నోర్చుచున్, "నళుద" వీడుచు, పంబనుజేరు, సాములా
బ్రతుకుల పాదయాత్రలతో, బాముల నోర్చుచు! వెంకటేశ్వరా! 820

ఉ॥ స్నానమొనర్చి "పంబనది", సద్ది, విశక్కితో, విఘ్నరాజు, రా
జానను సోదరుంగొలిచి, చారువిభూషణ పేటికంబులన్,
గాన, సుదూరమున్ గిరుల కర్పూరజ్యోతిని దర్శనంబునై,
గానశరంబు గుత్తియును, కాంతురు నయ్యప, యాలయంబునున్, 821

మ॥ "పదునెట్టాంబడి నిర్మడీ" సహితసోపానంబు నారోహణై,
నెదురన్, స్వామిప్రదక్షిణాంతరము "శాస్తేశ్వర్లు" దర్శించి, నా
పిదపన్ నెయ్యభిషేక నర్చనల నైవేద్యంబుఁ గావించి, న
య్యదె తీర్థంబు, ప్రసాదమైతనరు, నయ్యా! వెంకటేశా ప్రభో! 822

ఉ॥ ఒక్కొక వత్సరంబునను ఒక్కొకమెట్టును, నిర్మడిన్‌సహా
నెక్కుచు, నారికేళములనిచ్చుచు, జీవిత శేషభాగమున్,
నిక్కువమైన యాపదియునెన్మిది మెట్లతొ పోల్చిచూడగా,
చక్కటి మార్గమేనరయ సార్ధకమయ్యెడు! వెంకటేశ్వరా! 823

ఉ॥ మాలవిసర్జనన్ శివసమక్షమునందు గురుండుఁసేయగా,
నీలదుకూలవర్జితము, నెత్తిన కేశము ముండనంబునున్,
మ్రోలను వెంకటేశ్వరుని మ్రొక్కి, ప్రసాద నివేదనంబునై,
యాలితొపూజ సల్పి, కడుపార భుజింతురు! వెంకటేశ్వరా! 824

ఉ॥ అయ్యప దీక్షయాత్రయును అంత్యము, మాలయు, నీలివస్త్రమున్
చయ్యన కేశపాశము విసర్జితమై, గృహమందు, నర్చనన్,
బియ్యపు, పాయసాఘృత నివేదన పిమ్మట నారగించగా
అయ్యప తీర్చుకోర్కెలు, కృపాబ్ధిని బ్రోచును! వెంకటేశ్వరా! 825

శా॥ చాతుర్మాసము సంద్రస్నానములు, వైశాఖంబు, నాషాఢముల్,
ప్రీతిన్ కార్తిక మాఘముల్, మునుగ, నర్పించంగ, దానంబులన్,
దాతల్ పాత్రలు, వెండి, పానకము, నున్‌ధాన్యంబు వస్త్రంబులన్,
దాతృత్వంబుగచేయ పుణ్యమగుకాదా? వెంకటేశా ప్రభో! 826

శా॥ చాతుర్మాస ఫలంబు పౌర్ణమి సమాప్తంబు కార్తీకమున్,
యేతత్ సూపము వర్జితంబగును; యీయామాస మంత్యంబునన్,
తాతృప్తిన్ గనయాత్రలున్, సలిపి తద్దైవంబులన్ గొల్చియే
యాతర్వాత సుఖంబు నుండెదరు, అయ్యా! వెంకటేశా ప్రభో! 827

శా॥ సాయంసధ్యల, యాలయంబుల ధ్వజస్తంభంబు, నాకాశ, జ్యో
తిన్ యుంచంగను సాంప్రదాయమగు, కార్తీకంబు మాసంబునన్,
యాయాజ్యోతి ప్రకాశవంతమగుచున్ వ్యాపించు నల్దిక్కులన్,
శ్రేయోదాయక దివ్యకాంతులవియే శ్రీవెంకటేశా ప్రభో! 828

చం॥ వనమున, విందుసల్పి, తమబందుగు, మిత్రులు యైనవారితో,
పనుపున పిండివంటలతొ పంక్తి భుజింతురు వేడుకంచునున్
తనియగ నాటపాటల విధంబున కాలము బుచ్చుతీరునన్,
కనవనభోజనంబగును, కార్తికమందున! వెంకటేశ్వరా! 829

మార్గశీర్షము :-

శా॥ హేమంతర్తువు మార్గశీర్షమున, నయ్యెన్ శూన్యపౌష్యంబుతో,
సామాన్యంబుగ, నాల్గుదిక్కులనునున్, సాంద్రంబు హేమంతమై,
ప్రామాణ్యంబది. రశ్మికానదయె. ప్రాభాతంబు, ప్రొద్దెక్కగా,
భూమిన్ దట్టముగా హిమంబు పడనొప్పున్! వెంకటేశా ప్రభో! 830

ఉ॥ మార్గశిరంబు పుష్యములు, మాసము రెండును శీతలంబునై
మార్గశిరంబునంత శుభమందురు శోభనకార్యమందునన్
మార్గమొసంగు లక్ష్మివ్రత మాచరణంబున లక్ష్మివారమున్
స్వర్గసుఖంబు సంపదలు శాంతి లభించును! వెంకటేశ్వరా! 831

ధనుర్మాసము :-

చం॥ "ధనువు" రవిప్రవేశమయి, దర్శనమయ్యెడు విష్ణువాలయం
బున, గృహంబునందు, హరిపూజలునర్చన, సేవలందునన్,
తనిపి, నివాళులివ్వగ విధాయకమైచను, కృష్ణమూర్తికిన్
కనెదరు లౌకికంబులగు కార్యమొనర్చుచు! వెంకటేశ్వరా! 832

చం॥ "ధనువు"ను నాచరింప, తమ ధర్మమునయ్యెడు పుణ్యకార్యమౌ,
యనువుగ తెల్లవాఱ మునుపంతటనర్చన నిష్టమౌను, వె
న్ననికిడ వెన్నపూస సుధనో? దధినో పులియోర యింకనున్
వినిమయ చక్రపొంగలి నివేదనమిత్తురు! వెంకటేశ్వరా! 833

ఉ॥ పండితులైనవారు, హరిభక్తులు, వైష్ణవులర్చనాదులన్,
పండుగ, పర్వమోయనగ పావనమూర్తిని కృష్ణమూర్తినిన్,
నిండుమనంబుతోడ నవనీతము, పాలును, యిక్షుశర్కరీ
ఖండము నిత్తురాధనువుకాలము నందున! వెంకటేశ్వరా! 834

ఉ॥ ఉత్తరగాడ్పువీచునట, యొత్తుగమంచు మునుంగవైచు! యే
నుత్తమకంబళుల్ విలువనున్నిదుకూలము, సాలువుల్, మరే
ప్రత్తిని నేసినన్ వలువభారము తీర్చదు! శీతలంబునున్,
నొత్తుగ నగ్నివేల్పచలి, నూరటనివ్వదు! వెంకటేశ్వరా! 835

మ॥ హరి సంకీర్తన పట్నవీధులనునున్ నారంభమౌ ధన్యునన్,
శిరమున్ కీలిత బిక్షపాత్రలతొ నాజియ్యర్లు నాధ్యాత్మికా
చరణాల్ పాడగ గేస్తురాంధ్రునిడు బిక్షంబందు తండూలముల్,
మరువన్ రానిది శ్రావ్యకీర్తనలు సుమ్మామాసమందీశ్వరా! 836

మ॥ ప్రతి సంవత్సరమందు శూన్యములు సంప్రాప్తించు నాషాఢమున్,
ప్రతి భాద్రంబును, పౌష్యముల్ కనగ, సంక్రాంతిన్ ఘనంబై చనున్,
ప్రతి శూన్యంబొక శుద్ధమైచనెడు నేత్రానందమై కానగన్,
నతిమేలైనవి పర్వమౌదినములయ్యా! వెంకటేశా ప్రభో! 837

మ॥ ధనువారంభము స్త్రీలకున్ గృహము నుత్సాహంబు మీఱంగ ప్రాం
గణముల్ గోమయమున్ నలందియుపయుక్తంబౌనటుల్ ముగ్గులన్,
కనువిందౌనటు రంగవల్లిక, అలంకారంబుగా గొబ్బియుం
చిన గ్రామంబుల సంపదే! మురిపెమౌ శ్రీవెంకటేశా ప్రభో! 838

ఉ॥ స్త్రీలును, వాకిళుల్, నలది, తీఱుగదిద్దుచు గొప్ప ముగ్గులన్,
బాలికలంత పోటిపడి పండుగరోజులు కుంకుమాన్వితం
బౌ, లలితాహరిద్రము, వయారపు సొంపులుఁ గుల్కుచుండగన్,
నేలను రంగవల్లికల నేర్పుగనల్లెడు! వెంకటేశ్వరా! 839

ఉ॥ అగిజిగాఁడు గూళ్లవలె అల్లిక ముగ్గులు చూడముచ్చటౌ,
సాగును ప్రాంగణంబున, విశాలపు వాకిళు, ద్వారబంధముల్,
యోగిరమిచ్చు పాతరల, యుంచిన ధాన్యపురాసులెన్నియో,
యేగృహమందు కాననగు యింపుగ నుండును! వెంకటేశ్వరా! 840

ముక్కోటి - వైకుంఠ యేకాదశి :-

శా॥ వైకుంఠేశుఁడు విష్ణుమూర్తి సిరితో వైకుంఠమందుండగన్,
లోకంబేలుచు భక్తకోటినిని ముల్లోకాలనున్ కావనౌ,
యాకంజాక్షుని దర్శనంబగుట నిత్యంబున్ సదాప్రాప్తమౌ,
శ్రీకాంతున్ గన ధన్యమేనగును! శ్రీశ్రీ వెంకటేశా ప్రభో! 841

మ॥ సురలున్, సిద్ధులు, సాధ్యులున్, గరుఁడు, శుభ్రాషారతిన్, దేవతల్
పరఁగన్ భూసుర, మౌని, తాపసులు, నావైకుంఠవాసిన్ గనన్,
పరమోధర్మము, వత్సరంబుదనుకన్ ప్రాప్తంబునౌచూడ, న
త్తఱివేల్పుల్ నట వేచియుండునది వింతౌ? వెంకటేశా ప్రభో! 842

ఉ॥ ఉత్తమ దర్శనంబు, నదియోగ్యత కొద్దియు, మూర్తికాన లో
కోత్తరు సామిచూడగ, త్రికోటి సురల్ ముని బృందమంతయున్,
నత్తఱి వేచియుందురట, నాకమలాక్షుఁడ, నంతు. వేకనుల్,
తత్తరపాటునన్ తమకు దర్శనకాంక్షతొ! వెంకటేశ్వరా! 843

శా॥ శ్రీవైకుంఠపురంబు, వైభవము, లక్ష్మీవాస యోగ్యంబునై,
దేవాదుల్, సనకాదిమౌనులును, యాదేవేంద్ర దిక్పాలురున్,
శైవుండున్, కమలాసనుండునును, సాక్షాత్కార కాంతారతిన్,
యావేళన్ హరికాంచవేతురటులయ్యా! వెంకటేశా ప్రభో! 844

మ॥ గదయున్, శంఖము, చక్ర, శార్ఙ్గములనున్, కస్తూరికా చందనం
బెదపై కౌస్తుభమౌక్తికాభరణముల్, యింపైన పీతాంబరం
బదికట్యంబున, నీలిమేఘతను, నాయబ్జాభి, నాభుండునున్
వదనంబుల్ దరహాస చంద్రికలు దివ్యంబైన తేజస్సునున్, 845

చం॥ దరిశెన మందవారలటు, దానవవైరిని గాంచినంతనే,
సురగణ, దేవలోకమును. సుందరమూర్తిని, దివ్యసామినిన్,
పరవశమందుచున్, పరమభాగవతోత్తము, విష్ణుమూర్తి, న
త్తఱి తిలకించి జన్మమును ధన్యులునౌదురు! వెంకటేశ్వరా! 846

చం॥ వినగ పఠించినన్ తెలిసె, వేద, పురాణము, కావ్యగ్రంథముల్,
యనునది విష్ణులోక మొకటచ్చట నుండెను, వైభవోన్నతం
బునయి, ప్రశాంతతన్ కలిగి పుణ్యప్రదంబయి, విష్ణుమూర్తినిన్,
ననయము సంస్తుతింపనగు నవ్యయుధామము! వెంకటేశ్వరా! 847

చం॥ మునుపు పురాణకాలమున- మోక్షపదంబును, ముక్తిమార్గమున్,
కనిరట, విష్ణులోకమున, కంజదళాక్షుని, యోగనిద్రనున్,
చనగ, నిజానిజంబులు విచారణ సేయగ సత్యమంచు, తా
మనిశము సంస్మరించగ యదార్థమెఱింగిరి! వెంకటేశ్వరా! 848

శా॥ వైకుంఠంబది, నెచ్చటుండునను, భావంబందు, యూహింపగన్,
సాకల్యంబుగ, గ్రంథవర్ణనల, సంజాతంబగున్ యోచనన్,
సౌకర్యంబున వైష్ణవంబనెడు సంస్కారంబునన్ నొప్పు, నా
యాకారంబును మోహభ్రాంతినగునయ్యా! వెంకటేశా ప్రభో! 849

ఉ॥ పాలసముద్రవాసమయి, పన్నగశేషుఁడు పాన్పునైనదై,
లాలితమై, ప్రశాంతత, నలంకృతమై, శ్రవణీయ, విష్ణుగా
థాలహరిన్ వినంగ సతతంబును, వేదపురాణ శాస్త్రముల్,
కాలవిచారణన్ తెలియఁగానని లోకము! వెంకటేశ్వరా! 850

చం॥ శుకములు, వేదగానమును, సుస్వరమందున వంతపాడగన్,
పికములు, కిన్నరాంగనలు, వేడుక గానము సంభ్రమింపగన్,
నొకయెడ, గానమాధురి, మయూరి పదంబుల నృత్యకేళియున్,
సకలచరాచరంబులట సంస్తుతిఁజేయును! వెంకటేశ్వరా! 851

ఉ॥ కిన్నెర కీర్తనల్, మధురకింపురుషస్వన గీతమాలికల్,
సన్నుతమౌని దేవగణ సంస్తుత కీర్తనలెల్ల వ్యాప్తమై,
యన్నుల, మిన్నలచ్చరల, హావము, భావము, నాట్యభంగిమల్,
వెన్నునివాసమందిరము వేల్పుశరణ్యము! వెంకటేశ్వరా! 852

ఉ॥ పన్నగశేషు పాన్పుపయి, పద్మజ, పాదములొత్తుచుండగా,
సన్నలయండజున్, గరుఁడు, సయ్యన, నచ్చట, వేచియుండగా,
మిన్నగ శంఖు, చక్రములమేషము సామిని కాచియుండగా,
సన్నగపాహి, పాహి, యను సర్వమునచ్చట! వెంకటేశ్వరా! 853

చం॥ జయవిజయుల్ ప్రధాన ముఖసన్నిధి వాకిట కావలుండగన్,
భయమును, భక్తియున్ నెనలు భావనిరీక్షణ సల్పుచుండగన్,
దయయు, కృపారసంబుయుత దర్శనభాగ్యమునున్ లభించగన్
నియమితవేళకై కనగ నిల్తురు భక్తులు! వెంకటేశ్వరా! 854

చం॥ సనక, సనంద, నాదిముని, సంతతి, విష్ణువుఁజూడఁబోవగా,
యునికిని, యన్జయుండు, విజయుండు, ననాదరణంబుఁ సూపగా,
మునులును, శాపమిచ్చెనిక భూమిని దైత్యులు కందనంచనున్,
వినయముతోప, తప్పులను విష్ణువుఁగాచెను! వెంకటేశ్వరా! 855

చం॥ "వరబలమున్ నిశాచరులు, వైరముఁబూనుచు నన్నుదూరుచున్,
పరఁగను మూఁడు జన్మములపాటును తప్పదు! మిత్రతత్వమున్,
పరమ మునీంద్రులై మనుచు, భక్తియుతంబున నారుజన్మముల్
ఫరఁగెడు నంచుశౌరి"యన, వైరమెఁబూనిరి! వెంకటేశ్వరా! 856

దశావతారములు : మత్స్యము :

చం॥ జలమయమై ప్రపంచము, నిశాచరు, సోముఁడు వేదపొత్తులన్,
విలయమునన్ హరించెనట! విష్ణువు మత్స్యవతారమందునన్,
జలనిధిఁజొచ్చి సోమకుని జంపి, సుతుండగు బ్రహ్మకిచ్చుచున్,
బలయుత దైత్యబాధలను బాపెను శ్రీహరి! వెంకటేశ్వరా! 857

కూర్మము :-

ఉ॥ మందర పర్వతంబు, జలమందు, మధించిరి, దేవ, దానవుల్,
మందర కూర్మరూపుఁడయి. మాధవు మ్రోయగ, కాలకూటమున్,
నందె, శశాంక, లక్ష్మియు, హయంబు, గజంబును, కామధేనువుల్,
సుందర కల్పమున్ నమృతశోభ, జనించెను! వెంకటేశ్వరా! 858

ఉ॥ ముందు, హరుండు, మ్రింగె విషమున్, తనకంఠము దాల్చెదానినిన్,
నందు సురాసురుల్ కలహమాడె, సుధామృతకోస మొండొరుల్,
నందఱి పంక్తినిన్ నునిచి, నాహరి, మోహిని రూపధారియై,
ముందుగ దేవతల్కిడెను మ్రొక్కగవారలు! వెంకటేశ్వరా! 859

ఉ॥ కొందలమంది రాక్షసులు క్రోధము, నొందగ, రాహుకేతువుల్,
నుందరినివ్వ త్రాగిరట, చోరులుగన్, సురపంక్తిఁజొచ్చుచున్,
చందురుఁడంశు మంతుఁడును, సైగలుఁజేయగ, విష్ణువార్త్రి, నా
సందున కంఠముల్ దునిమె చక్రము చేతను! వెంకటేశ్వరా! 860

ఉ॥ మోహిని రూపధారి, హరి, ముగ్ధ, మనోహర, రూపసంపదన్,
నాహవమెద్దిఁసేయకయె, నానమృతంబిడె దేవతాళికిన్,
సాహసమందునన్, సహనచాతురి కూర్మవతారుఁడౌచు, నా
శ్రీహరి దైత్యశత్రువయె శ్రీలభియించగ! వెంకటేశ్వరా! 861

చం॥ అమృతపు భాండమున్, సురలు. హాలహలంబును శంకరుండు, నా
కమలనివాసి, మాసిరిని. కంజదళాక్షుఁడు, కామధేను, క
ల్పము, గజ, పారిజాతములు, వారువ, మింద్రునిపాలవంగ, కూ
ర్మము నవతారమున్, హరివిరాజిలె! శ్రీపతి వెంకటేశ్వరా! 862

వరాహము :-

మ॥ అసురుల్, నిద్దఱు, నన్నదమ్ములు, హిరణ్యాక్షుఁడ హంకారియై,
వసుధన్ చాపగ చుట్టెనంత, ప్రతిభావంతంబునన్ దాచగా,
కసిగన్జంపె వరాహరూపమున, శ్రీకాంతుండు భూదేవినిన్,
నసురుల్బారిని వృత్తిఁజేసె నటులయ్యా! వెంకటేశా ప్రభో! 863

నారసింహము :-

మ॥ అనుజున్ జంప, హిరణ్యకశ్యపుఁడు, నత్యంతాగ్రహావేశుఁడై,
వనిలో, ఘోరతపంబొనర్చి, వరగర్వంబంది, తానేవిచ
క్షణ, శూన్యుండయి, పుత్రునిన్ కఠిన శిక్షన్ బాధలన్, పెట్టి, నం
తను ప్రహ్లాదుఁడు, విష్ణుభక్తుఁడును, నిత్యంబాహరిన్నామమున్. 864

మ॥ జపియింపన్, సహనంబువీడి. తుదకాస్తంభంబు, భేదించగా,
యపురూపంబున, నారసింహుఁడట, సాయంసంధ్యనున్, ద్వారమున్,
నుపవిష్టుండు, నఖంబులన్, దనుజు నాయూరూద్వయంబుంచి, చీ
ల్చి, పునీతుండయిచేరె విష్ణుపధమీశా! వెంకటేశా ప్రభో! 865

శా॥ శాపగ్రస్తులు. మూఁడు జన్మములకున్, శత్రుత్వ, మారంభమై,
యాపాపాత్ము, వరాహమౌచును, హిరణ్యాక్షున్ వధించంగనున్,
యాపై, యన్నహిరణ్యకశ్యపు, నృసింహంబౌచు చీల్చంగ, నౌ,
యాపుణ్యాత్ముని ధామమున్ నరిగిరయ్యా! వెంకటేశా ప్రభో! 866

శా॥ క్షేత్రంబయ్యె. వరాహసామికచటన్, శ్రీసప్తశైలంబునన్,
పాత్రౌచిత్యము, వెంకటేశ్వరుఁడు, దైవంబయ్యెనా తీర్థమున్.
యాత్రీకుల్, మును, చూడతప్పదు, వరాహారూపునిన్. పిమ్మటన్,
యాత్రైలోక్య, విభుండు దర్శనము, నయ్యా! వెంకటేశా ప్రభో! 867

వామనుఁడు :-

మ॥ బలిదానంబున, త్యాగశీలి, నిరతిన్ పాటించు. నిత్యంబునున్.
ఫలితంబా, వటు, వేషవామనుఁడు, త్రిపాదంబులన్ నిమ్మనన్.
బలిమూఁడడ్గుల. భూమి, నాకసము నాపైశీర్షమున్ జూపగా,
బలిపాతాళముఁజొచ్చె దానమహిమంబై! వెంకటేశా ప్రభో! 868

ఉ॥ దానము నివ్వబో, గురువదాన్యుఁడు, శుక్రుఁడు, వద్దనంగ, నా
ప్రాణముకన్న మిన్నయవి, వ్యక్తత, తోఁజలంబు, నూత్రమున్,
దానవనాధుఁడివ్వ, జలధారకమండలు కర్ణద్వార, మె
ట్టైన గురుండు నేత్రమును నడ్డమిడంగను, దర్భకోనలన్, 869

ఉ॥ వామనమూర్తి. సూత్రము నిబద్ధిత, నేత్రము, గుచ్చ, ధారదా,
సోమము, హస్తమున్, బడుట, శుక్రుఁడు నేత్రవిహీనుఁడౌటయున్,
భూమియు, నాకసంబు బలిమూర్ధము, మూఁడుపదంబులుంచి, నా
సామి బలిన్రసాతల విశాంపతిఁజేసెను వెంకటేశ్వరా! 870

ఉ॥ వామనుఁడా త్రివిక్రముఁడు పంచమమౌ నవతారమందునన్,
సామమునన్ రసాతలము, శాశ్వతవాసమె దైత్యనాధుకున్,
నామిషమీద నేర్పఱచె. నాబలియంతట దానమివ్వగన్,
ప్రేముడి భక్తుగా తలచి వేల్పువరంబిడె! వెంకటేశ్వరా! 871

పరశురాముఁడు :-

ఉ॥ రాజులు దుష్టులై కడుదురాగతముల్ సలుపంగ, విప్రులన్,
నైజమునందు నోర్మి సహనంబునుబూనుదురంచువారలన్,
వ్యాజముమీద కష్టములఁ బాల్పడఁజేయగ పాడియందుమా?
యేజవసత్వమున్న నరుఁడెవ్వడు సైచునె! వెంకటేశ్వరా! 872

ఉ॥ రేణుక, జామదగ్నిసతి, జెహ్వాకపాటున నాలసించెనం
చా, నది, తీరమున్, మునియు, నాత్మనెఱింగి, వధించ పుత్రులన్,
నానతి, నీయ, వార, లసహాయతఁజూపగ, భార్గవుండు. న
మ్మానిని తల్లిఁజంపి వరమందు సజీవినొనర్చెనీశ్వరా! 873

చం॥ పరశువు నాయుధంబునయి. భార్గవరాముఁడు దుర్నిరీక్షతే
జరిపు భయంకరుండునయి, షష్ఠవతారము వైష్ణవాంశనున్,
అరమరికంచులేక నృపులట్లు వినాశమొనర్చి. తా, తప
శ్చరితమునందె, భూవనియు శాంతి లభించెను! వెంకటేశ్వరా! 874

ఉ॥ రాజగు కార్తవీర్యుఁడును, రాచరికంబున, కామధేనువున్,
నాజమదగ్నిజంపి, నపహార్యుఁడు గైకొనె, యాశ్రమంబునుం
చా జవరాలు నిర్వదొక సారులు నేడ్వగ భార్గవుండు నా
రాజుల నిర్వదొక్కపరి రక్తము ముంచెను! వెంకటేశ్వరా! 875

ఉ॥ రాజులఁజంపెనో? తన పరాక్రమ సంపద దీక్షఁబూనుచున్,
నాజిని శత్రువున్ పరశునాయుధమందున నిర్వదొక్కరిన్,
రాజిలె విష్ణువే పరశురామవతారము, లోకశాంతికిన్,
భాజనమై తనర్చెగద! వైష్ణవయంశము! వెంకటేశ్వరా! 876

ఉ॥ రాజుల పాలనావిధుల రాజ్యమువిక్షత, శాంతిభద్రతల్,
భూజనులెల్లనున్ సుతులవోలెను జూచుచు, దుష్టశిక్షణన్.
నీజగమందు పాలనలొనివ్వగ నాశ్రితరక్షణంబునున్,
రాజుల ధర్మమై చనగరాచరికంబనె! వెంకటేశ్వరా! 877

శ్రీరాముఁడు :-

వం॥ పుడమిని, రావణుం, దనుజు, భూరిపరాక్రమ, కుంభకర్ణులున్,
కడిమి నవగ్రహంబులను, కట్టడిఁజేసిరి, దేవతాళినిన్
నిడుమలపాలుఁజేయ, చనెనింద్రుఁడు, ధాతయు, విష్ణుపాలికిన్,
నుడివిరి పడ్డపాట్లు, వినినూఅడగించెను! వెంకటేశ్వరా! 878

ఉ॥ పుత్రులులేక, వంశమును, భూవిభునిల్పగ, జేసె యజ్ఞమున్,
పుత్రకకామసిద్ధియని; పూర్తియొనర్పగ, వీతిహోత్రుఁడున్,
పాత్రతొ పాయసంబునిడ, పంచెను మువ్వుర భార్యలందు, స
త్పుత్రుల నల్వురిన్ దశరథుండును గాంచెను! వెంకటేశ్వరా! 879

శా॥ సంతానంబును, రామలక్ష్మణ, భరత్శత్రుఘ్నులన్ గల్గగా,
సంతోషంబున, సంస్కృతుల్ఁ జరిపె! విశ్వామిత్రుయాగంబు, దై
త్యాంతంబున్, శిలనాతిగా, మిధిలకళ్యాణంబు, ప్రాప్తంబునై,
యంతన్ భార్గవు భంగపాటునయెనయ్యా! వెంకటేశా ప్రభో! 880

ఉ॥ రాముకు గట్టపట్టమను, రాణులఁదెల్పగ, కైకమంధరల్,
రామునరణ్యవాసమును, రాజ్యమునున్ భరతుండుకివ్వగన్,
యామగనాలికోర, పితృనానతికానన, లక్ష్మణుండు సీ
తామణి తోడుగన్, చనిరి, ధర్మనిబంధన! వెంకటేశ్వరా! 881

వం॥ భరతుఁడు రాముపాదుకల పట్టమునున్, ఖరదూషణాది సం
హరణము, శాస్తిశూర్పణఖ, కంతము బంగరులేడి, జానకీ
హరణము, అంజనేయుని సహాయమునన్ వెదుకంగ సీతనున్,
చెర విడిపించ లంకనికచేరుట వ్యూహము! వెంకటేశ్వరా! 882

ఉ॥ రాముఁడు విష్ణు అంశమున, రావణు జంపంగ, జన్మమెత్తి సీ
తామహిళామణిన్వలచి, ధన్వును ద్రుంచి వివాహమాడి, తం
డ్రీమనమున్ గ్రహించుచు చరించెను, సీతయు లక్ష్మణుండుతో
యామహితాత్ముఁడేగెవని కయ్యరొనానతి! వెంకటేశ్వరా! 883

మ॥ పదునాల్గేడుల వాసమున్వనమునన్ వర్తించగన్నేగె, న
య్యది పూర్వోక్తపుశాపమై దశరథుండార్తిన్ కనుల్మూసెనో,
కదనంబున్ ఖరదూషణాదుల విక్రాంతుండునై ద్రుంచె, న
య్యదియేహేతువు చప్పనాతికథకయ్యా! వెంకటేశా ప్రభో! 884

ఉ॥ దండనజేసె లక్ష్మణుఁడు ధర్మముఁదప్పిన చుప్పనాతికిన్,
మండిపడంగ రావణుఁడు మాయనుపన్నెను మాయలేడితో,
అండగలేని సీతనసహాయను, దోడ్కొనె, దక్షిణాదికిన్,
పండిన పాపమోయనగ, పాఱెను లంకకు! వెంకటేశ్వరా! 885

శా॥ సాహసంబును నాంజనేయుకతనన్, సఖ్యంబు సుగ్రీవుతో,
యావాలిన్ వధియించి తమ్మునకు రాజ్యంబిచ్చె, శోధించె. సు
గ్రీవాజ్ఞన్ కనిసీతనున్. హనుమ, లంకేశుండు పట్నంబునన్,
దావాగ్నిన్ రగిలించె లంకకును నంతన్, వెంకటేశా ప్రభో! 886

మ॥ హనుమంతుండటు రామలక్ష్మణుల స్కంధాసీనులన్‌జేసి, చ
య్యన సుగ్రీవుని మైత్రి, వాలివధ, సీతాన్వేషణనన్, ఆయనే
యుని, లంకాదహనంబు, వారధియు, దైత్యుల్ కుంభకర్ణుండు, రా
వణు, లంతంబు, విముక్తిసీతకయి, నాపట్టాభిషేకంబయెన్; 887

చం॥ అని దశకంఠునిన్ దునిమె, అంత విభీషణురాజుచేసెనో,
పనుపగ హవ్యవాహనుఁడు పావని, సీతపతివ్రతంచనెన్,
చనియె, నయోధ్యకున్, నిజప్రజాహితపాలన రాముఁడంతటన్
తనరగనేలె కోసలను ధర్మముతప్పక! వెంకటేశ్వరా! 888

ఉ॥ రాముఁడు దైవమంచని, పరాత్పరుఁడంచని, గొల్చుచుండ, శ్రీ
రామయనంగ ముందుగను వ్రాయగ, పాడియనంగనౌ, సదా
నామమె నుచ్చరింపగను, నయ్యది తారకమంత్రరాజమై,
కామిత సిద్ధిఁగూర్చు శుభకార్యములైచను! వెంకటేశ్వరా! 889

శా॥ శ్రీరాముండవతారపూరుషుఁడు, శ్రీ సీతామహాదేవి, సా
ధ్వీరత్నంబయె, భాతృవత్సలత ధాత్రిన్ నిండుగన్ సొంపు పెం
పారంగన్ కనుకార్యసాధనమునున్ ప్రాప్తించ, హన్మంతుఁడున్
దారిన్‌జూపగ మార్గదర్శితముకాదా? వెంకటేశా ప్రభో! 890

మ॥ అనురామాయణ గాథయున్, హరియె విష్ణ్వంశంబునన్ రాముఁడై,
జననంబందుచు, దుష్టశిక్షణము, శిష్టవ్రాతమున్, రక్షణనన్,
ధనధాన్యంబుల, శాంతిసౌఖ్యముల నున్‌ధర్మంబు న్యాయంబు, నున్
కనిపాలించెను రామరాజ్యము నసంగన్! వెంకటేశా ప్రభో! 891

ఉ॥ రావణ, కుంభకర్ణులును రాక్షస రెండవ జన్మమందునన్,
పావన విష్ణుదూషణము, వైరముపూనగ రామచంద్రుఁడే,
దైవము సప్తమైన దవతారమునందున సంహరించగన్,
భూవని వీడినేగిరటు పూర్వపుధామము! వెంకటేశ్వరా! 892

శా॥ శ్రీరామున్వలె రాజు, భావితరముఁన్ సీతన్వలెన్ సాధ్వియున్,
నారాధించెడు సోదరుల్వలెను, హన్మంతున్వలెన్ భక్తులున్,
దారింజూపెడు మైత్రినాజ్ఞలతో సంధానంబు సుగ్రీవుఁడున్
వేరే కానగఁబోము వారలనుభావిన్! వెంకటేశా ప్రభో! 893

శ్రీకృష్ణుఁడు :-

ఉ॥ ద్వాపరమందు రాజులును దస్యులు హింసలొనర్ప దేవతల్,
యాపరమాత్ము, వేడిరి, మహాపదలన్, తమరక్షణంబుకై,
"తాపుడమిన్ జనింతు, నవతారము, నెత్తుదు, కృష్ణమూర్తిగా,
పాపుల శిక్షణన్, నిడగ, భారతమందనె" వెంకటేశ్వరా! 894

ఉ॥ అష్టమిరోహిణిన్ జననమందెను కృష్ణుఁడు వైష్ణవాంశనున్,
అష్టమగర్భశక్తియన యావసుదేవుఁడు, దేవకీసుతున్
కష్టముమీదఁజేర్చి, అనుకంపన కావయశోద పాలికిన్,
దుష్టుల శిక్షకై నటయదూద్వహుఁడయ్యెను! వెంకటేశ్వరా! 895

ఉ॥ పూతన, ధేనువున్, శకటమున్, బక, కాక, అహీసురుండునున్
యాతృణవర్తుఁడున్, అసురులందఱి బాల్యమునందె చంపగన్,
ఖ్యాతిని శైలమొక్క చిటికంతట వ్రేలున నెత్తిగోపర
క్షాతతికాచియింద్రు నపహాస్యముపాలొనరించె కృష్ణుఁడున్; 896

చం॥ పసితనమందు, కంసుఁడును, పంపిన దైత్యులరూపుమాపగన్,
కసిగను మేనమామయగు కంసువధించెను, కృష్ణుఁడంతటన్,
ముసలియు యుగ్రసేనుని విమోచనజేసెను, తల్లిఁదండ్రులన్,
ముసిముసి నవ్వులన్ చెఱవిముక్తులఁజేసెను! వెంకటేశ్వరా! 897

మ॥ గురుకట్నంబిడ విద్యయైనతఱి, యాగోపాలుఁడా గుర్వుకున్,
పరలోకంబుననున్న గుర్వుసుతు, యబ్బాలున్ సజీవంబుగా,
కరపద్మంబుల గుర్వుపత్నికిడి, యోగ్యంబైన శిష్యుండయెన్,
పరమాత్ముండు కసాధ్యమేమికలదప్పా? వెంకటేశా ప్రభో! 898

చం॥ ధరణిని రెండు వర్గములు, ధర్మజులాదిగ, పంచపాండవుల్;
కురుకుల ధార్తరాష్ట్రులును, క్రోధమునందిరి. వందమందియున్,
పరఁగిరి శత్రుతత్వమున బాధలిడంగగ, భాగమివ్వకన్.
పరఁగెను యుద్ధభూమి కులపాంసను కౌరవపాండవాళితో; 899

ఉ॥ పాండుమహీశుఁడే మొదట పాలనజేసెను రాజ్యమంతయున్,
నండగనిల్చి గ్రుడ్డియని యన్నను తమ్ముఁడు తోడునీడయై;
వెండియు పాండవుల్‌నడుగ, విజ్ఞతభాగము లేదనంగనున్,
హెండనె కౌరవుల్ తుదకు పోరిరి వారితొ! వెంకటేశ్వరా! 900

మ॥ హరిణీదంపతు శాపమివ్వ, అనపత్యంబందె. నాపాండుభూ
వరుఁడేగెన్ తపమాచరింపగను; దుర్వాసోపదేశంబునన్,
వరముల్‌పొందిన కుంతి, యాయమునినున్, వాయువ్య, దేవేంద్రులం
దరి అంశంబునగాంచె పుత్రులనునంతన్! వెంకటేశా ప్రభో! 901

ఉ॥ కుంతియు, మాద్రికిన్ పతియుకోరగ తానుపదేశమివ్వ, యా
మంతటగాచె నిర్వురను అశ్వను లంశమునందు; భర్తతో
శాంతిగ కుంతిచూడమని, స్వర్గముచేరెను శాపవశ్యమున్,
కుంతియుచేరె హస్తినకు కొడుకులతోడను! వెంకటేశ్వరా! 902

ఉ॥ కౌరవులంపి వైరమున, కాల్చిరి పాండవు లగ్నియింటినిన్,
చేరిహిడంబినావనిలొ చేర్చె, హిడంబువధించి, భీముఁడున్
క్రూరుని యేకచక్రమున కూల్చె బకాసురు భీముఁడంతటన్,
హారమువైచె ద్రౌపదియు అర్జునుచేదన మత్స్యయంత్రమున్. 903

ఉ॥ కోరి ఫలంబు తెచ్చితన, కుంతియునందఱి పంచుకోమనెన్,
వారలు యేగిరంతట, వివాహము కృష్ణను నాడిరందఱున్,
చేరిరి హస్తినాపురము, చిత్తముశుద్ధిగ రాజ్యభాగమున్,
కోరగ పెద్దతండ్రికడ, కోపమునందిరి కౌరవాధముల్; 904

ఉ॥ అవిధి పంచపాండవులు హస్తినకున్ చనిరాజ్యభాగమున్,
దైవసహాయమున్ వడసె, ధర్మజుకృష్ణుని మంతనంబునన్,
భావిపురంబు, పట్టణము, భావ్యమనంగను రాజధానిగా,
బావయు నానతిన్ మయుఁడు పట్నమునిచ్చెను! వెంకటేశ్వరా! 905

శా॥ యింద్రప్రస్థ పురంబు పాండవులకున్ నిచ్చెన్ మయుండంతటన్,
యింద్రున్ లోకము పోలివైభవమునున్ యివ్వంగ, కౌరవ్యరా
జేంద్రుండాడిన జూదమున్, విజయుఁడై నీర్ష్యాళుఁడై, ధర్మరా
జేంద్రున్, తమ్ముల, కృష్ణ, కాననము పంచెన్! వెంకటేశా ప్రభో! 906

చం॥ జరిపెను రాజసూయమును, శత్రుజయంబు నజాతశత్రువై,
పరఁగెను ధర్మనందనుఁడు, భంగముపాలయె కౌరవేంద్రుఁడ
త్తఱి నవమానమానసుఁడు దాసులొనర్పగ పంతమూనుచున్,
నరిగెను జూదపన్నిదము నాడగయత్నము! వెంకటేశ్వరా! 907

ఉ॥ ద్వాదశ వత్సరాలు వనవాసము, నొక్కరహస్యవర్తనన్,
జూదమహాత్యమున్ గడపి శూరులు రాజ్యముకోరె, నంతదా
యాదుల చెంతకున్ హరిని నంపగ, వారలు భాగమివ్వకన్,
కాదని పోరుసల్పి తుదకందఱు నీల్గిరి! వెంకటేశ్వరా! 908

ఉ॥ పాండవరాజసూయమున, పండిత పూజ్యుని గౌరవింప, నా
తండును, భీష్మద్రోణులను, ధర్మము తెల్పుమనంగ, కృష్ణుఁడే
పండిత పూజ్యుఁడన్న, శిశుపాలుఁడు దూషణజేయ వెన్నుఁడున్,
దండనజేసె చక్రమున తప్పులనూఱవ! వెంకటేశ్వరా! 909

శా॥ యాగార్థంబున, శత్రువంతమయె, నయ్యా, జరాసంధు; కా
రాగారంబు విముక్తుఁజేసెనట యారాజన్యబందీలనున్,
వేగంబంపెను రాజ్యపాలనకు, చంపెన్ దంతవక్త్రుండునిన్,
యాగమ్యస్థలి, విష్ణుద్వారమయెనయ్యా! వెంకటేశా ప్రభో! 910

మ॥ అవనిన్ కంసుని దంతవక్త్రి, శిశుపాలాదుల్, జరాసంధు, లా
హవమున్ జంపి విముక్తి రాజులకిడెన్, న్యాయంబుగా రాజ్యముల్
యవధుల్ మేరకు, దుష్టశిక్షణము, యన్యాయంబునున్మాపె, కౌ
రవ వంశంబు నశింపజేసె హరి! ఔరా? వెంకటేశా ప్రభో! 911

ఉ॥ భారత యుద్ధమాద్యమున, పార్థురణంబు నిరాకరించగన్,
శౌరియు విశ్వరూపమున, సంస్కృతి, తత్వము, కర్మభావమున్
యారమణీయ గీతనటు అష్టదశంబుల యోగబోధనన్,
కౌరవులన్ వధించుటకు కారణమయ్యెను! వెంకటేశ్వరా! 912

ఉ॥ అష్టమిరోహిణిన్, జననమందెను, కృష్ణుఁడు, వైష్ణవాంశమున్,
అష్టమభార్యలన్, పరిణయంబయె, సుందరమోహనుండునై,
అష్టమమావతారము, ననంతుఁడు, కర్మము, భక్తి యోగమా
దిష్టత గీతభాష్యముపదేశమొనర్చెను! వెంకటేశ్వరా! 913

చం॥ జయవిజయుల్ తృతీయపుదశన్, శిశుపాలుఁడు దంతవక్త్రులౌ
చు, యిలవిరోధమూని పురుషోత్తము దూరగ, రాజసూయమున్,
నియమముమీఱఁ, జంపె, హరి, నిండుసభందున, శాపముక్తులై
రయమున విష్ణులోకము పరంగిరి శ్రీపతి వెంకటేశ్వరా! 914

మ॥ అవతారంబున కృష్ణలీలలు నసాధ్యంబౌ పనుల్ జేయగా,
యవరోధంబగు దుష్టరాజకుల మాద్యంతంబు ఛేదింపగన్,
దివిజుల్ కానని విశ్వరూపమును ప్రత్యేకించి చూపంగనున్,
భవబంధచ్యుత మోక్షకాములయె! దేవా వెంకటేశా ప్రభో! 915

ఉ॥ జ్ఞాన, విషాద, సాంఖ్యము, గుణత్రయ, కర్మ, విభూతి, భక్తి, వి
జ్ఞానము, నాత్మసంయమననన్, పురుషోత్తమ, విశ్వరూపముల్,
ధ్యానము, మోక్ష, మక్షరపదాదులు, నాపదునెన్మిదిన్ విభా
గానుమతంబు కృష్ణుఁడనె, నయ్యది గీతయె! వెంకటేశ్వరా! 916

ఉ॥ న్యాయము ధర్మమున్ కలసి నాలుగుపాదము లంతరించ, లే
బ్రాయమునన్ వితంతువులు, పాలవ, ధూర్తులు, మానభంగముల్,
జేయగ, పూరుషుండునిల శీఘ్రము దుష్టుల శిక్షణంబు, క
ల్క్యాయవతారుఁడై భువినికాచెను విష్ణువు! వెంకటేశ్వరా! 917

ఉ॥ హింసమయంబునై, జనులు హేయజరామరణంబు, బాధలన్,
పాంసువు నిర్దయాకలిత పాపమొనర్చెడు ప్రాణికోటి, మీ
మాంసము, (జూచి బుద్ధుఁడు నమాయక ప్రాణుల ధర్మమార్గమున్
హింసనువీడగా నిలచె నీయిల దేవుఁడు! వెంకటేశ్వరా! 918

చం॥ జయవిజయుల్ వసుంధరను జన్మములెత్తిరి, మూఁడుసార్లు, నా
త్రయము హిరణ్యకశ్యపులు, రావణు తమ్ముఁడు కుంభకర్ణులా
పయినిక దంతవక్త్ర శిశుపాలురు, కంసుఁడు అంత్యమందగన్,
రయమున జేరిరంతట పరాత్పరుసన్నిధి! వెంకటేశ్వరా! 919

ఉ॥ ఈయవతారముల్ పదియు నెత్తెను విష్ణువు లోకరక్షణన్,
కూయిడు శిష్టరక్షణము, క్రూరుల దుష్టశిక్షణంబుకున్,
న్యాయము ధర్మమున్ కలసి నాల్గు పాదములుద్ధరింపగన్,
"నో"యను భక్తులాశ్రితుల నూఱడగించగ! వెంకటేశ్వరా! 920

ఉ॥ యెందఱు వ్రాసిరో? చదువనెందఱు నేర్చిరో? విష్ణుగాథలన్
నందమునన్ కవిత్వమును నల్లగ, నేర్వగ నెందఱుండిరో?
కొందఱు సంస్కృతాంధ్రములకూర్పు సమాసపదంబు లల్లగన్,
నిందమొనర్ప రీతిగనునేర్చితి దేశ్యము! వెంకటేశ్వరా! 921

ఉ॥ భావప్రధానమై వెలయు భావకవిత్వము, యూహనాకృతిన్,
తావిహరింపగన్, కవిత దర్పణమందున పొందుపర్చగన్,
భావితరంబువారు సులభంబుగ పాఠ్యమొనర్పనేర్వగన్
కావున వ్రాసితిన్ కవిత గ్రాహ్యమనంగను! వెంకటేశ్వరా! 922

ఉ॥ పాలసముద్ర మాతనిదె పానుపు పన్నగశేషుఁడయ్యెనో?
లాలితమౌ పదంబులను లక్ష్మియు నల్లనపట్టుచుండ, వై
తాళిక బృందగానములు దాసులు, శేషుఁడు పాహిపాహనన్,
మేలుకొనంగఁజేతురట మెల్లన శ్రీహరి! వెంకటేశ్వరా! 923

చం॥ సనక సనందలాదులును, స్వర్గసురాధిపు దేవతాళితో,
వినమధురాతి మాధురిమవీణ విపంచిరసామృతంబునన్,
పనివిని సామగానమున పాడగ నారద తుంబురాదులున్,
కననగు నేత్రపర్వముగ కాంతునిధామము! వెంకటేశ్వరా! 924

ఉ॥ జ్ఞానులు, మౌని, తాపసులు, నారద, అప్సరకిన్నరాంగనల్,
ధ్యానముఁజేయుచున్, హరిని దర్శనకాంక్షతొ విష్ణుకీర్తనల్,
గానము సప్తమస్వరము గాత్రమునన్ మధురాతి మాధురిన్,
వీనులవిందొనర్చునట! విష్ణువుధామము, వెంకటేశ్వరా! 925

ఉ॥ సేవలు స్తోత్రముల్ పఱఁగు శ్రీహరి ధామము చెల్వుమీఱగన్,
నావిభు యోగనిద్రయు సహస్ర ఫణాంశుఁడు పాహిపాహనన్,
నావిభు వక్షమున్, మణిమయాంగ దకౌస్తుభహారముండగన్,
పావనమైకనంగనది భక్తులభాగ్యమె! వెంకటేశ్వరా! 926

శా॥ శ్రీ లక్ష్మీనిలయంబునై, సతతమున్ శ్రేయస్కరంబై, సదా
మాలాలంకృత, పారిజాత, సుమముల్, మందార, హారంబులున్
లాలిత్యంబగు వక్షమున్, తులసిమాలాభూషితంబై చనన్,
సౌలభ్యంబగు విష్ణునంత దరిసించన్! వెంకటేశా ప్రభో! 927

మ॥ శుకముల్, శారిక, కీరికల్, కిలకిలన్ శ్రుత్యంబు శ్రావ్యంబునై,
వికసించన్ శిఖిపింఛమున్ నటన శోభిల్లంగ నాహ్లాదమై,
పికముల్ నవ్వడి క్రేంకణంబులను నావిర్భూతమౌ నవ్వడిన్,
సకలారాధ్యుని ధామమున్ వెలసెకాంచన్! వెంకటేశా ప్రభో! 928

శా॥ సప్తాంబోధి పరీవృతంబయి, నివాసంబైన వైకుంఠమున్,
సప్తాశ్వార్కుని కాంతిపుంజముల తేజంబందు భాసించగన్,
సప్తర్షీ పరివేష్టితంబునయి నాసంగీతనాదంబులన్,
సుప్తింజెందుచు శౌరినందు శయనించున్! వెంకటేశా ప్రభో! 929

## తిరుపతి క్షేత్రము- శ్రీ వెంకటేశ్వర స్వామాలయము- వైకుంఠ ద్వారము :-

మ॥ అలవైకుంఠము, విష్ణులోకమయి, యష్టైశ్వర్యముల్, భాసిలన్.
యిల, వైకుంఠము, వెంకటేశ. నిలయంబే వెంకటాద్రీయనన్,
నలరన్, లోకము ధర్మరక్షణము, కళ్యాణార్థమైఁగానగన్,
కలికాలంబున భక్తకోటికది రక్షా! వెంకటేశా ప్రభో! 930

ఉ॥ సప్తగిరీంద్రముల్ నడుమశాంతి, ప్రశాంతత నెల్కొనుండగా
సప్తమయ స్వరంబులను చక్కని గానము శ్రావ్యమైవినన్,
సప్తమయూరుకాంతులతొ సన్నిధిపైన విమానగర్భమున్,
వ్యాప్తిని బొందునీనిలయమౌగద? వెంకటేశ్వరా! 931

ఉ॥ పంచమ వేదముల్ స్వరము వ్యాపితమౌచను, నాలయంబునన్.
కాంచన సన్నిభంబగుచు గర్భము కాంచన సన్నిభంబునై,
మించిన తేజమున్ నధిగమించెడు దీపపు రత్నకాంతులన్
కాంచగ, జీవితార్థమున. గమ్యము, ధామము! వెంకటేశ్వరా! 932

చం॥ తిరుపతి దేవళంబు నతి, దివ్యమనోహర, తీర్థరాజమై,
పరవశమంద, ప్రాంగణము, బంగరు వాకిలి శోభితంబునై,
తిరిపెము వద్దనంచనుచు, తిండియు, విద్యయు నిచ్చుచుండునై,
తిరుపతి వెంకటేశుఁడవు తేజము దివ్యము! చూడముచ్చటా! 933

శా॥ క్షేత్రంబయ్యె, పవిత్రమై, తిరుపతీక్షేత్రంబు సామ్రాజ్యమై,
యాత్రికుల్ నటవేచియుందురట నిత్యంబున్ నిరీక్షించుచున్,
నాత్రంబందున దర్శనార్థమునకై నానందధామంబునన్,
నేత్రానందము నైకనంగనగుదానిన్! వెంకటేశా ప్రభో! 934

ఉ॥ శ్రీహరి నామసంస్మరణ చిత్తమునందునహర్నిశల్ యనన్
యాహరిసేవకై తహతహల్పడు భక్తుల బృందమెల్లెడల్,
పాహియె, పాహియంచనుచు పల్కెడు నాదము మిక్కుటంబునై,
"సోహ"మునైస్వనించునట సోకగవీనుల! వెంకటేశ్వరా! 935

ఉ॥ అన్నమయార్యుకీర్తనలు నాలయమందు ప్రతిధ్వనించగన్,
సన్నగ "ఓం నమో"యనుచు చక్కని నాదము "వెంకటేశ్వరా"
యన్న వెలుంగు శ్రావ్యమయి హర్షమునై పులకింపమేనునున్,
విన్నది తత్వమంచనుచు, విష్ణువు(జూతురు! నీదురూపమున్, 936

ఉ॥ ప్రాంగణమందునన్ జరుగు పండిత సంస్కృతి చర్చనీయవ్యా
సంగ కథామృతంబులును, సామము వేదము, నాలపించగన్,
నింగిని, దాకనాస్వరము నిండునుమానసమెల్ల భక్తులు
పొంగెడు సంతసంబునట పుణ్యకథల్విన! వెంకటేశ్వరా! 937

ఉ॥ క్షేత్రపు పాలకుండు నటసిద్ధి వరాహవమూర్తి, ముందుగన్,
యాత్రకు వచ్చువారు. తను నాలయ పుష్కరిణంచు(గుంకుచున్,
నాత్రిగుణాత్మనిన్ గొలిచి నాలయమందు ప్రవేశమందగన్,
పాత్రులు నౌదురయ్యెడల, ప్రాప్తము కొద్దియు! వెంకటేశ్వరా! 938

మ॥ అదికళ్యాణపుకట్ట యౌతలలనీలాలివ్వ సంసిద్ధులై,
హృదయంబందున సంశయంబను నదిన్, యేమాత్రమున్ నుంచగన్,
"యదిదైవంబున కర్పితంబగును నంచానందమున్, నిత్తుర
య్యది సర్వశ్య శరణ్యమై పఱగునయ్యా వెంకటేశా ప్రభో! 939

మ॥ అభిమానంబును వీడుచున్ తలనునీలాలివ్వ సర్వంబునున్,
"ప్రభువా నీవె శరణ్యమం"చు తుది నారాధించి నర్చించనౌ,
అభినీతంబగు గీతబాష్యమునసున్ యాధ్యాత్మికానందమౌ,
శుభసంపన్నమునై వెలుంగునని తోచున్! వెంకటేశా ప్రభో! 940

ఉ॥ నామము, శంఖు, చక్రము వనంబున నుండగ రెండుప్రక్కలన్,
రాముఁడు లక్ష్మణుండునును, రాజ్ఞియు సీతయు వాయుపుత్రుఁడున్,
మైమరపించు దృశ్యమది మానసమొక్కపరిన్ స్పృశించగన్,
నేమని చెప్పనోపగలదీ మహిమంబును! వెంకటేశ్వరా! 941

ఉ॥ ఆపురి వెంకటాచలమునందు ప్రతిష్ఠితుఁడున్, శిరంబునున్,
తాపిత వజ్రరత్నమణి తాప్రభశీర్షము తేజరిల్లగన్,
చూపరి నూర్ధ్వపుండ్రము విశోభితఫాలము నామముండగన్,
దోపగ కౌస్తుభంబునెద ద్యోతకమయ్యెడు! వెంకటేశ్వరా! 942

ఉ॥ అంబుజ నాభుపీతవసనంబులు మేల్మిజరీబుటంచు, పీ
తాంబర ధారణంబులును, యాపయి చేలము నుత్తరీయ, చీ
నాంబరమున్, కటిస్థలము, నావృతపట్టముయుండ, దివ్యవే
షాంబరధారియై వెలసె శౌరియువీవయె! వెంకటేశ్వరా! 943

ఉ॥ హారములందు తాపితములై నవరత్నములున్ సువర్ణమౌ
తోరమునున్, ధరించ మహితోజ్వలనామము "వెంకటేశ"నన్
పేరు లిఖించదాల్చెనట వేయియునెన్మిది కాసులందునన్,
భారమునౌనె నీకు ధర భారముకంటెను! వెంకటేశ్వరా! 944

శా॥ మందారంబులు, పారిజాతములు, చామంతుల్ గులాబీలునున్,
నందంబౌ కనకాంబరంబు, విరజాదాదుల్, మరిన్ జాజులిం
పొందన్ మాలతి మల్లెలన్, పొగడముల్ పున్నాగ సంపెంగలున్,
వందల్ నాదవనంబునున్ మరువమున్ వాసించ, మాలాదులున్,

చం॥ తులసిదళంబు, ప్రీతియని, తోరములందున మాలలల్లి, చెం
గలువలు మధ్యమధ్య నిడికట్టగ "లిల్లి" కదంబమాలలున్,
నలరగ ముద్దబంతులుతో హారము పేరులు నేత్రపర్వమౌ,
గళమునలంకరించెదరు కాసులపేర్లతో! వెంకటేశ్వరా! 946

ఆ॥ అవిభు వెంకటేశ్వరుని కాశ్రయమందిరి భార్యలంత, భూ
దేవి మహీతలంబు నధిదేవతయై విలసిల్లుచుండ, శ్రీ
దేవియనంత సంపదల దివ్యమహోన్నత వైభవంబు ప్రా
భావితులై వెలంగిరట వక్షమునందున! వెంకటేశ్వరా! 947

ఉ॥ అంతటలంకృతాప్రియుఁడు యాభరణాల్, నవరత్న వజ్రముల్,
కాంతులు లీనుచుండగను, గంధము, కస్తురి చందనాదులున్,
సంతతమున్ విలేపనముఁజార్చుచు నుండగ కప్పురంబునున్
వంతులవారి నిచ్చెదరు వజ్రకిరీటికి! వెంకటేశ్వరా! 948

ఉ॥ అవిభు పూజలన్నియు లనంతములై యుదయాస్తమంబులన్,
నావృతమైన రేఁబవలు యంచువిచక్షణ లేకయుండగన్
సేవలు నిత్యమున్సలుప చిత్రము లోకములేలు నీకునున్,
నేవిధమైన విశ్రమము నేర్పడఁబోదుగ! వెంకటేశ్వరా! 949

శా॥ ప్రారంభంబరుణోదయంబు మునుపే ప్రాభాతమేల్కొల్పులున్,
నోరారంగను సుప్రభాతమట కర్ణోపేయమై విన్కలిన్,
చేరంబోదురు వేచియుండగను వీక్షించంగ నశ్రాంతమున్,
నారంభంబది నీదు దర్శనము కౌనా? వెంకటేశా ప్రభో! 950

చం॥ వరుసలుఁదీరి నిల్తురు ప్రభాతపువేళను సక్రమంబుగన్,
దరిశెనుమౌ నటంచు, తొలి దర్శనకాంక్షతొ మూల్యమౌ ప్రవే
శరుసుమవశ్యమున్ నిడుచు సామిని కాంతురు వేనవేలుగా,
యరమరికేల భక్తతతికయ్యెది లెక్కయె? వెంకటేశ్వరా! 951

చం॥ తదుపరి దర్శనంబు సుచితంబయి సామిని ధర్మదర్శనం
బదియు పదుల్ శతంబులు సహస్రములై పడికాపుఁగాయగా,
యొదవెడు భక్తిభావమున యోర్పున కష్టముతోపదయ్యెడన్,
నెదురుగ సామికిన్ ప్రణుతులిచ్చుటకంటెను? వెంకటేశ్వరా! 952

చం॥ దినమభిషేకముల్ తనివిఁదీఱగఁజేతురు నల్పసంఖ్యకున్,
యనయముఁజేయగా నడియునై దుశతంబుల మూల్యమైనదై,
కనగ, నపూర్వమైబఱఁగు కంజదళాక్షు సమక్షమందునన్,
చనెదరు నెంతయైన, నికసామినిఁజేరగ! వెంకటేశ్వరా! 953

చం॥ కొలువును దీర్చునావిభుఁడు కూర్చునియుండును రత్నపీఠమున్,
నిలయపు, పాలనాధిపతి నిర్వహణంబున, నర్చకోత్తముల్,
పలువిధ నర్చనల్, వివిధ పాలకవర్గపు ఖర్చులందునన్
కలిగిన పత్రికాపఠన కార్యము జర్గును! వెంకటేశ్వరా! 954

మ॥ అభిషేకంబును తైలసంస్కృతమునై, నభ్యంగనాస్నానమై,
విభవంబైనది తీవి దర్పమున నావేషంబలంకారమై,
యభయంబిచ్చెడు హస్తమున్, కనులనున్ నార్ద్రింపు గన్వీక్షణై
ప్రభువేనీవయ చక్రవర్తివయ! దేవా! వెంకటేశా ప్రభో! 955

శా॥ పన్నీటన్ జలకంబులన్ పరిమళంబౌ చందనాలేపనన్,
వెన్నల్, మీగడ, మోడికాయమునునున్ ప్రీతంచు నివ్వంగనున్,
వెన్నున్ నోష్టము కస్తురిన్ కురులముడ్వెట్టంగ చెంగల్వలున్,
నౌన్నత్యంబెసగంగ తీవికననౌనా? వెంకటేశా ప్రభో! 956

మం॥ సభయందుండగ మోకరించుచును, పంచాంగంబు విన్పించగా,
యభిప్రాయంబుల, అర్ధవిత్తములనున్ నాదాయముల్, ఖర్చులున్,
నుభయంబిచ్చెడు దాతలున్ నితర దేవోక్తంబు ధర్మంబులున్,
విభుకుందెల్పెడు కొల్వుకూటమయిపర్వెన్! వెంకటేశా ప్రభో! 957

మ॥ తులసీమాల దళంబులందు నిడగన్ తోమాలసేవైచనున్,
లలనాసౌరభ పుష్పసంచయము మాలాలంకృతున్ జేయగన్,
నిలువెల్లన్, మరువంబునున్, దవనమున్ నిండౌనలంకారమున్,
విలసిల్లున్ నతివైభవంబుగను తృప్తిన్! వెంకటేశా ప్రభో! 958

మ॥ అటుపై నిత్యసహస్రనామముల మధ్యాహ్నార్చనల్ సేతురా,
వటువేషాంబరధారికిన్, తులసి పుష్పంబుల్, సుగంధంబులన్,
పుటలన్ భక్తుల నామగోత్రములకున్, పూజాక్షతల్నుంచ, వం
తట సంతృప్తి నొసంగువారలకు! కాదా! వెంకటేశా ప్రభో! 959

ఉ॥ వేలకువేలు భక్తులట విశ్రమ మందిరమందు నుండి, తా
మాలయ ధర్మదర్శనము నాతృతమీఱగ పోవకాంతురా,
వేలుపు విశ్వరూపమును విస్మయమందుచు నొక్కలిప్తయే,
చాలని తృప్తిచెందెదరు సామి సమక్షము! వెంకటేశ్వరా! 960

ఉ॥ ఆ మహితాత్మ దర్శనము నందగ నొక్కనిమేషమైననున్,
ధామమునందు నిల్చినను, ధన్యతఁబొందును నీశరీరమం
చామనసార చూతురట, సామిప్రసాదము గైకొనంగనున్,
కాములకోర్చి పుణ్యసముపార్జన భావన! వెంకటేశ్వరా! 961

శా॥ నైవేద్యంబు మహానివేదనలునున్, నామార్చనానంతరం
బౌ, వైభోగము, లడ్డు, గారెలును, నున్నప్పంబు, దధ్యాన్నమున్,
సేవించన్ పులియోర, పొంగలులునున్ క్షీరాన్నముల్ దోసెలున్,
దేవారాధన నిత్యమున్ జరుగు తృప్తిన్ వెంకటేశా ప్రభో! 962

శా॥ పూలంగియను వర్జితంబునయినాపుష్పంబులన్ సేవ, నా
మూలాగ్రంబున వెంకటాచలపతిన్ పూజించగా నొప్పెడున్,
మాలాలంకృత భూషణుండు సుమముల్ మాలార్చ నాస్వామివై
యాలోకించగ ధన్యమౌతనువు "నాహా?" వెంకటేశా ప్రభో! 963

శా॥ సాయంకాలము అర్ఘముల్ మహలునన్ సంధ్యారుణాకాంతులన్,
నూయాలందున సామినుంచి నటులన్ నూగించ నిత్యంబునున్,
నాయింపైన మహోత్సవంబుగన డోలారోహణంబంచునా
వేయిద్దీపము బింబదర్శనము సొంపే! వెంకటేశా ప్రభో! 964

శా॥ శ్రీకాంతున్ పవళింపు సేవకయి లక్ష్మీదేవి, భూదేవులున్,
నేకాంతంబున తూగుటుయ్యేలల నూగించంగ శోభిల్లెడున్,
నేకాంతంబగు సేవనయ్యదియెగా నిత్యంబుగా పర్వెడున్
శ్రీకాంతుండు సుషుప్తిలో మునుగునా? శ్రీ వెంకటేశా ప్రభో! 965

మ॥ కలశంబుల్ కమనీయమౌ కనకమున్ కాంతిప్రభావంతమై,
జల, మందున్ నభిమంత్రణంబునగుచున్, సంప్రోక్షణాయుక్తమై,
విలసిల్లంగనదే సహస్రకలశాభిషేకమై నర్చనా
త్ఫల సౌభాగ్యము నిచ్చునయ్యదియనంతన్ వెంకటేశా ప్రభో! 966

మ॥ శ్రవణంబయ్యది వెంకటేశ్వరుని నక్షత్రంబునన్ జన్మమై,
యవిరామంబుగ నాఁడు సేవలధికంబై, నర్చనల్ ముఖ్యమై,
యవధుల్ మేఱకు దర్శనంబుననసాధ్యంబై కనన్, మూల్యముం
చ విరాళాల్ యుభయంబు దాతలిడులక్షల్! వెంకటేశా ప్రభో! 967

చం॥ నిదురకులోనుగాఁడతఁడు, నేలగలోకములెల్ల కావగన్,
మదనునితాపమున్ సతులు మంత్రవిముగ్ధులు, విశ్రమించగా
హృదయము దీనభక్తుల, నభీష్టముఁ దీర్చగ, పాలకుండునై,
పదపడి సేవకున్ మఱలివచ్చు మహాత్ముఁడు! వెంకటేశ్వరా! 968

చం॥ త్రిజగములేలు నావిభుఁడు దీనశరణ్యుఁడు నిద్రనుండునా?
నిజముగ విగ్రహంబునను నిగ్రహరూపుఁడనంగకావఁడే?
భుజముల మోయుభారమును పోషక దాతలుఁ దీర్చువారొ? భ
క్తజనవరేణ్యుఁడో ప్రభువ! ధార్మిక సత్వవు! వెంకటేశ్వరా! 969

చం॥ యిరువదినాల్గు గంటలును యీశ్వరుఁడేవిధి విశ్రమించునో?
పరుగునవచ్చు యాత్రికులు, భక్తులు. దాతలు దర్శనంబుకున్
నిరతము వ్యాప్తుఁడౌననగ నిందుగలండు. ను, నందు లేఁడనన్,
చరణము సత్యమై పఱఁగ సామికసాధ్యమె! వెంకటేశ్వరా! 970

చం॥ నిరతము నన్నదానము ననేకులు భక్తులు దర్శనంబనం
తరము భుజింతురోగిరము. దాతయు దానము లక్షలివ్వగా,
నెఱుగము పూర్వమోగిరము నివ్వగ, నివ్విధిదాతలిచ్చుటన్,
తిరిపెము నెత్తకుండగను తిండి యొసంగితి! వెంకటేశ్వరా! 971

ఉ॥ లక్షలు దాతలిత్తురు విలక్షణ మార్జనపాపవిత్తమున్,
లక్షలసేవలన్ జరుప లాంఛనపూర్వక మాదినంబు, ప్ర
త్యక్షము దైవదర్శనము దత్తతఁజేయగ గాంచి లక్ష్యమున్,
నక్షయమంచు కోట్ల ధనమార్జనమయ్యెడు! వెంకటేశ్వరా! 972

ఉ॥ ఆదినలక్ష్యమున్, నుభయమందగ వేఱుగ వ్యక్తులెవ్వరిన్,
కాదని, దాతమాత్రమునకయ్యెడు ముఖ్యము సేవలన్నియున్,
సాదరపూర్వకంబుగను సవ్యమొనర్తురు నర్చనాదులం
దాదివ మాసభాపతికి! యచ్చెరువేమిటి? వెంకటేశ్వరా! 973

మ॥ గురువారంబున ధౌతవస్త్రమున వైకుంఠేశు చూడంగ, నా
భరణాభూన్యుఁడు హస్తమున్ నభయమౌ వజ్రంపు తేజంబుతో
చరణాద్వంద్వము నాశ్రయింపుమన శీర్షంబున్ కిరీటంబునున్
పరమాత్మన్ తిరుపావడౌ శుభము యింపౌ? వెంకటేశా ప్రభో! 974

మ॥ నిజరూపంబున విశ్వరూపమున కాన్పించంగ శ్రీవారునున్,
భజియించన్ గురువారమున్, కనగ సౌభాగ్యంబు, తేజోనిధిన్,
అజితుండౌ కుడిహస్త యంత్రమును నత్యంతంబు తంత్రంబునన్,
విజయంబౌ శుభసూచకంబయెడు తృప్తిన్! వెంకటేశా ప్రభో! 975

మ॥ భృగువారం బభిషేకముల్ హరికి జర్పించంగ ప్రాముఖ్యమౌ,
సగుణాకారుని సన్నిధిన్ నిలచి ప్రాశస్త్యంబుగా సేవలన్,
నగు, ప్రాభాతపువేళ ముందుగను సాధ్యంబౌను, యెన్నాళ్లకో!
చిగురించన్ కనశాంతిసౌఖ్య సిరులన్ శ్రీవెంకటేశా ప్రభో! 976

శా॥ ప్రాభాతారుణ సేవలందు నిజమౌ పాదాల దర్శించ, పూ
రాభిషేకము కస్తురీయుతము పాత్రాలాభిషేకంబులున్,
శోభాకారము సామిదర్శనము సంస్తుత్యంబు మానంబునై,
శోభిల్లన్ నభిషేకమొక్కపరివచ్చున్! వెంకటేశా ప్రభో 977

ఉ॥ పండుగ పబ్బమందునను వజ్రకిరీటము భూషితుండగున్,
వెండియు, వజ్రమున్ కవచవేషమలంకరణంబు నందమై,
నిండుగ హస్తముల్రతన నీలపుకాంతుల దీధితుల్గనన్,
నుండును భాగ్యవంతులకు నుత్సవముల్గన! వెంకటేశ్వరా! 978

మ॥ ప్రతినిత్యంబభిషేకమార్చనల నారాధించు కృత్యంబులౌ,
వితతంబౌ సమయానుకూలమున నావిష్కృత్యమౌ సేవలన్,
మితమౌ కట్టడి యార్జితంబులకు సమృద్ధుండు చేయంగనౌ,
సతతంబున్ నినుకొల్వ సాధ్యమెటు లెంచన్ వెంకటేశా ప్రభో! 979

శా॥ స్వామిన్ శీర్షకిరీట సంపద సహస్రాదిత్య సంకాశతే
జోమానంబు విరాజితంబు రవితేజోకాంతి దీధుత్యులన్,
సామీప్య ప్రతిబింబ సూచితము విస్ఫారిత్యమై కాంచగన్,
వ్యామోహంబగు మోహనాకృతులొకలిప్తన్! వెంకటేశా ప్రభో! 980

శా॥ అద్దాలన్ ప్రతిబింబ రూపములువేలాదైన యాకారముల్
యుద్దీపించగ విశ్వరూపమని భావోద్రేకమైకాంచ, వి
ద్యుద్దీప్తిన్ మెఱపించగన్ మహలునన్ ద్యోతించునై జన్మతః
నుద్దేశ్యంబగు కోర్కె తీర్చనగునౌనో? వెంకటేశా ప్రభో! 981

ఉ॥ ఆలయ గర్భపృష్ఠమున యజ్వాలు వేదము పాఠమొక్కెడన్,
నాలయ నిత్యమార్జిత ధనంబు గణింపగ, వేఱుచేయగన్,
శాలలు నొక్కెడన్ కలుగ సంచిత సంచులు కోశమందిడన్,
పాలకవర్గ శిక్షమొకప్రక్కన నుండును! వెంకటేశ్వరా! 982

ఉ॥ వేదము పంచఖండములు, వేలుగశాలలనుంచిరంత, ఋ
గ్వేదము, సామవేదమును, కృష్ణము శుక్లమనంగనౌ యజు
ర్వేదము, రెండు భాగములు, వేదమథర్వణ, వేలువేలు పా
ఠ్యాదులు పండితుల్ పఠితమౌను ననర్గళధారలన్ ప్రభో! 983

ఉ॥ అంగనలెల్లెడల్ నిడుదరల్లిక ముగ్గులు నేత్రపర్వమౌ,
యంగన లొక్కరొక్కరు వయారము మీఱగ సొంపులొల్క, నా
భంగిమఁజూడగన్ సమయభంగమటంచును నేగువారలా
హంగులనందమున్ వొలకనౌనుగదాకన! వెంకటేశ్వరా! 984

ఉ॥ ఆగిజిగాడి గూళ్లవలె నల్లిక హొంతన చూడమాచ్చటౌ!
యాగుడి పార్శ్వభాగముల నల్లికముగ్గులు నొక్కతీఱునన్,
సాగును, నొక్కత్రాడువలె జాడకనంగను అంతమొందదై
యేగెడు, దానినిన్కనగ నెంతని చెప్పను! వెంకటేశ్వరా! 985

ఉ॥ అననముల్కనంగ నొక్క అద్దమురీతిగ గచ్చుచేసిరో?
ఆణిమెఱుంగు ముత్తియములందున తాపిరొ? త్రొక్కుటెట్టులో?
"పోనిలె ప్రక్కలందునను పోదమటన్నను దారికానదే?
పూనిక పాదముంచగను "పోరి"యనందరొ? నేమిసేయుటో? 986

ఉ॥ యంచును భక్తురాలయపు నావరణంబున విశ్రమించ, నా
పంచల "ఓం" స్వరంబు విన భక్తియుతంబుగ తత్తరింపగన్,
"మించినదేమిలేదు మనమిచ్చుట నుండుట భావ్యమౌనునా?"
యంచని సాగిపోయెదరు అవ్యయుకానగ! వెంకటేశ్వరా! 987

ఉ॥ మండపమెల్లెడల్, వరుస మామిడితోరణ పంక్తులుండగన్,
నిండుగ ముద్దబంతులును, నేర్పుగ కూర్చుచు నందునందుపూ
దండలు కట్టగన్, నరటు, దాపిన బోదెలు, నుంచకన్నులన్
పండుగనౌ కనంబడెడు ప్రాంతము నంతయు! వెంకటేశ్వరా! 988

ఉ॥ ఉపరితలంబునన్ వలువంచగ, పాదరసంబు బుడ్లనున్
నపరిమితంబుగన్ నిడగనచ్చట తారక, రూపుతోప, నా
కపురి రసాను రమ్యత ప్రకాశవతంసమునై చెలంగ మే
ను పులకరించు నావిధము నొప్పెఁడుజూడగ! వెంకటేశ్వరా! 989

ఉ॥ అణిమెఱుంగు ము త్తియపు నల్లిక(్రముగ్గులు నందమైచనన్,
పూనికరత్నకంబళులు పోలికకన్పడు నేలమంటపం
బానలుమూలలున్ పఱచి భక్తులు, దాతలు కూర్చొనంగక
ళ్యాణపు మండపంబదియె లాలితమైనది! వెంకటేశ్వరా! 990

ఉ॥ వేదిక నొక్కచోటను హవిస్సులు అహావనంబు (వ్రేల్చగన్,
నాదెస మం(త్రతం(త్రముగ యజ్వులు, మంగళవాద్యమొక్కెడన్,
వేదవచో నిబద్ధమయి, విజ్ఞులు, నర్చకు, ఋత్విజోత్తముల్
కాదగు పాత్రలన్ కలశగంధములుంతురు! వెంకటేశ్వరా! 991

శా॥ శ్రీనాథుండగు శ్రీనివాసు(డొకచో చిన్ముద్ర పీఠస్థు(డై
వేణీభార మలంకృతంబగుచు దేవేరుల్ మరోపీఠమున్,
మాణిక్యాంబరరత్నదీధితుల సమ్మానార్హమైయుండ క
ళ్యాణార్థంబగు వేదికయ్యదియె కొల్వున్! వెంకటేశా (ప్రభో! 992

ఉ॥ స్నాతకనుత్సవంబునయి శాస్త్రయుతంబుగ పెండ్లియాడగన్,
మాతవసుంధరన్, సిరిని మాధవుపీఠము (ప్రక్కనుంచ, జా
మాతగు శ్రీనివాసులట మంగళసూత్రము కట్టువేళనున్,
చూతురు వేయికన్నులతో శోభకనంగను! వెంకటేశ్వరా! 993

చం॥ ఉభయము, దాత, భక్తులును నుత్సవమందును కార్యసాధకుల్
విభవముకొద్ది సంపదలవేలుపు, యెదును నేడువందలున్,
నభిరుచిమేలకున్ నిరువదైదు శతంబుల నిచ్చువారునున్,
నభిముఖులై సదస్సును మహత్తునుకాంతురు! వెంకటేశ్వరా! 994

ఉ॥ ఆ నగుమోము సామిదరహాసమునున్, నునుసిగ్గు దొంతరల్,
కానగపత్నులందునను, కాంతునిముందు తలంబరాలు ము
త్యాల్ననలున్, పదంబులను నర్చకపూజ్యులు నుంచనిత్యక
ళ్యాణము పచ్చతోరణమునై విలసిల్లెడు! వెంకటేశ్వరా! 995

శా॥ ఆరంభింతురు అర్చకుల్నుడువ కళ్యాణంబు చేయించగన్
వారల్ పేరును గోత్రముల్; (ప్రభువునిన్ పాదాల నక్షింతలన్
వారంతన్నిడు; సూత్రధారణ తలంబ్రాల్ తంతు నాపిమ్మటన్
(ప్రారంభింతురు వేదమంత్రములు చెప్పన్ వెంకటేశా (ప్రభో! 996

శా॥ వీణావేణు మృదంగ వాద్యములతో వేదాంగ మోంకారమో,
యానాదంబులు నన్నమయ్యపదముల్ వ్యాఖ్యానముల్, కీర్తనల్,
యానాగస్వర మంత్రముగ్ధమగు సన్నాయిన్ వినన్, నిత్యక
ళ్యాణంబైనది పచ్చతోరణము నౌనా? వెంకటేశా ప్రభో! 997

ఉ॥ కాంతలు పెండ్లికూతులయి కంచియొ, కాశియొ, పట్టుచీరలన్,
కాంతిలు వజ్రరత్నమయ కాంతివిభూషణ భూషణంబులన్,
కాంతుని ప్రక్కఁజేర్చగను, కాంచన పీఠములందునుంచ, న
త్యంత శుభావహంబును ముదావహమయ్యెడు! వెంకటేశ్వరా! 998

చం॥ కరచరణంబులన్ కదలు గాజులు, నందెలు ఘల్లుఘల్లనన్,
మరకత మానికంబులతొ మౌళికిరీటము తేజరిల్లగన్,
విరిసిన మల్లెమాలతులు వేణిభరంబున సౌరభంబిడన్,
పఱఁగును పెండ్లిమంటపము ప్రాభవమయ్యది! వెంకటేశ్వరా! 999

ఉ॥ వేణిభరాల సొవధువు విచ్చినమల్లెల జాజు, సంపెగల్,
పాణిని ముత్యరత్నములు పచ్చల, నీలకరాంగుళీయముల్,
శోణపు రత్నవజ్రమయ శోభితహారము, నూపురంబు వ
డ్డాణపు కట్యభాగముకడాని విలక్షణమై చనంగనున్; 1000

ఉ॥ ఫాలము ముంగురుల్, నడుమ పాపట బొట్టును, చంద్రవంకలున్,
శ్రీలగువీనులన్ చెలువు చెంపసరంబులు ముక్కుముక్కెఱల్,
మేలగు గంధచందనము మేనికి నత్తరుకస్తురద్దగన్,
శ్రీలలితాంగు లాననము సిగ్గుల దొంతర! వెంకటేశ్వరా! 1001

మ॥ శిరమున్ పింఛము మౌళిలాస్యయుతమై చిన్ముద్రదోపంగ, నున్,
దరహాసంబును, కంకణంబులనుకై దండల్ విరాజిల్లగన్,
సరికేయూరము బాహుపంక్తి రుచి పంచల్ పట్టు పీతాంబరాల్
వరుఁడై పీఠమలంకరించితివి దేవా! వెంకటేశా ప్రభో! 1002

ఉ॥ శ్రీపతి వెంకటేశ్వరుని శీర్షము వజ్రకిరీట కాంతులన్,
యాపయి కౌస్తుభా భరణుఁడా ననకస్తురి శోభితాంగుఁడై
నూపురమందునన్ మెఱయునుజ్జ్వల సింహతలాట ముండునై
యేపుదలిర్వ శీవొసగ, యింతులు ప్రక్కననుండ పీఠమున్, 1003

శా॥ యానిర్దేశితవేదికన్, గురువులౌ, నాచార్యులున్, నర్చకుల్,
యానాదంబు మృదంగ వాద్యములమధ్యన్ వేదమంత్రంబులన్,
ధ్యానంబందున, తన్మయత్వమున, నాద్యంతంబు వీక్షించక
ళ్యాణంబైనది పచ్చతోరణమునయ్యా, వెంకటేశా ప్రభో! 1004

ఉ॥ హోతహవిస్సు వ్రేల్చగ, నియుక్తపు శిష్యులు నర్చకోత్తముల్,
నూతనజందె మొక్కటను, నుత్తరజందె మలంకరించు, యు
ద్గాత, సుమూర్తమందున యధావిధి శీర్షమునందు నుంచు, త
ర్వాత గుడంబుజీలకఱ రంజితగంధము; వెంకటేశ్వరా! 1005

ఉ॥ తాళియు, నక్షతల్ కలిపి, దాతలు భక్తుల దర్శనీయు, హ
స్తాలతొ తాస్పృసించగను శాస్త్రవిధానము, సంప్రదాయమై
ఫాలమునోక ప్రొక్కులిడు భాగ్యమునంద వివాహమౌ తలం
బ్రాలు సమీప పీఠమున రాజిలు శోభతొ! వెంకటేశ్వరా! 1006

ఉ॥ మంగళసూత్ర ధారణము మానిను కంఠమలంకరించగన్,
మంగళతూర్యరావములు, మధ్యను, మాఱుమ్రోగుచుండగన్,
మంగళమక్షతల్ కరము మంత్రపునశ్చరణంబులందు, సం
పెంగ గులాబి పుష్పములు పెల్లున రాలెడు! వెంకటేశ్వరా! 1007

చం॥ కనకపు పళ్లెరంబుననికన్ తలంబ్రాలు, సుమంబు, ముత్యముల్,
అనువుగపోయ పాదముల, నర్చకులంతట హారతివ్వగన్,
తనువులు ధన్యయైతనర తన్మయమంద, వివాహవేడుకన్,
మునిగెడుదాత భక్తులకు పూర్వపు పుణ్యమె! వెంకటేశ్వరా! 1008

శా॥ వైవాహంబును, సూత్రధారణము, తలంబ్రాలుంచ కర్పూరమున్
యావైయాకరణాదులర్చకులు, మంత్రాక్షింతలన్ నుంచగా,
యావైభోగము చూచితీరవలె నేత్రానందమై పర్వగన్,
వైవిధ్యంబును నేమిచెప్పుదును? దేవా! వెంకటేశా ప్రభో! 1009

శా॥ వైవాహంబయి భక్తులంతట తలంబ్రాలుంచి, వింజామరల్,
వీవంగన్, ఫలమౌ ప్రసాదముల నర్పించంగ, వీడ్కోలుగా,
యావస్త్రంబును, లడ్డు, గారె, అవికెన్, నాచార్యులివ్వంగనున్,
యావిష్ణున్ గుడిగర్భమున్ దరిశెనంబౌ! వెంకటేశా ప్రభో! 1010

శా॥ కళ్యాణాత్మక వెంకటాచలపతిన్ కళ్యాణమున్ జేయగా,
మూల్యంబిర్వదియైదు వందలును, శతంబుల్ యేడు యాభై లు, కై
వల్యప్రాప్తికి మార్గమంచనుచు సంభావించి చెల్లించ, వై
కల్యంబెవ్వఁడు గాదనంగనగునింకన్? వెంకటేశా ప్రభో! 1011

ఉ॥ ధ్యానని మోలితుండనయి యాలయగర్భము మధ్యమందు, నొ
క్కనిముసంబు నిల్వగ, నొకింతయు నుండగ "చాలు చాలనన్",
కానగ దర్శనంబునను కౌస్తుభధారునినట్టి నిత్యక
ళ్యాణము పచ్చతోరణపు నాలయమందున! వెంకటేశ్వరా! 1012

శా॥ ఏకాంతోత్సవసేవ నిత్యమును నయ్యేన్ నూయలన్ శోభతో,
లోకేశుండు సపత్నివైభవముగన్ లోలత్వమందుండ నా
లోకించన్ కనులారమిన్నగను, చాలున్‌బోలునే? యైననున్,
లోకాల్నేలెడుసామి యుండునటులెట్లో? వెంకటేశా ప్రభో! 1013

ఉ॥ ముద్దులభార్య లిర్వురును ముచ్చట తీఱగ పట్టుపాన్పుపై
నొద్దిక సిగ్గుదొంతరల నోష్ఠకపోలపు చుంబనాదులన్,
దిద్దగ వెంకటేశ్వరుఁడు తీర్చునె భక్తుల నార్తనాదముల్?
సద్దుగ రక్షణంబిడునె? చయ్యన లోకము లేలతప్పదో? 1014

ఉ॥ కౌగిళులాపునా హరిని కార్యపరాఙ్ముఖుఁజేయనోపునే?
భోగియు యోగియై కనగమోదమొసంగెడు భర్తకర్త నిం
దేగలఁడంచులేఁడనగ, నెందును నుండును నెల్లవేళలన్,
నాగుడి యడ్డుగోడలు యనంతునినాపునె? వెంకటేశ్వరా! 1015

మ॥ ప్రతి సంవత్సరమందు నుత్సవములన్ బ్రహ్మోత్సవంబొక్కటే,
యతిప్రాధాన్యము సంతరించుకొనుచున్, నత్యంత వైభోగమై,
మితమౌ నాపదిరోజులున్ కనగ స్వామిన్ వైభవోపేతమున్,
నుతియింపన్ తరమౌనె? మాన్యులకు నిన్నున్? వెంకటేశా ప్రభో!

ఉ॥ ఉత్సవమందుమేటి, యని, నొప్పెడు, యాశ్వయుజంబునందు బ్ర
హ్మోత్సవమున్ విశేషమయి, నుత్సవ, విగ్రహరాజరాజు, తీ
ర్థోత్సవమై, పరంగు, పదిరోజులు వాహనమందునుండి, తె
ప్పోత్సవ మంత్యమందు వినియోగమునయ్యెడు! వెంకటేశ్వరా! 1017

మ॥ నవరాత్రుల్ కడువైభవంబు తొడరన్ నానందబ్రహ్మోత్సవా
లవిరామంబుగసాగు నుత్సవముఁనే నాశ్వీజమున్ వచ్చుచున్,
వివశత్వంబున సామిదర్శనమునున్ వీక్షించ కష్టంబు, ను
త్సవమందేగగకాంతురాతని ప్రశంశన్! వెంకటేశా ప్రభో! 1018

చం॥ గరుఁడుని టెక్కెమందునిచి కాగలసేవలు ముందుకొల్వగా
గరుఁడుని నుత్సవంబనుచు, కంజదళాక్షుని, వెంకటేశునిన్,
మురిపెము వాహనంబుపయి మోయగనుంచ భుజంబులందునన్,
తిరుమలవీథులన్ తిరుగు దేవుని వైభవమెంత గొప్పయో? 1019

చం॥ దినమునకొక్క వాహనము దివ్యమలంకృత రూపసంపదన్,
ననయము సేవలన్ దనుప నచ్చపసింది, గరుండు, హంసమున్,
ఫణిమయ పన్నగేంద్రుఁడును, పద్మము, సింహము లశ్వమందు, కాం
చన, రజతంబునన్ రథగజంబులనేగును వెంకటేశ్వరా! 1020

చం॥ ముదితలు సుందరాననము ముచ్చటఁగొల్వగ, కాంతుఁగూడి, రా
ముదమున తెప్పనుత్సవము పుష్కరిణందు విహారమంద, న
య్యదునున పుష్పవృష్టి కురియంగను జూడగ నేత్రపర్వమై,
హృదయము తత్తఱింప తపియించెడు దృశ్యము! వెంకటేశ్వరా! 1021

చం॥ అదియె మహాసుదర్శనమనంబడు చక్రము, పద్మహస్తమున్,
పదిలమెునర్చి నుత్సవము, పావనపుష్కరిణీజలంబు ముం
చెదరట, స్నానమాడగను, శ్రీ, ఘనపద్మము తీర్థమందునన్,
యదిఁగననెంత పుణ్యమొ? మహాద్భుత దృశ్యము! వెంకటేశ్వరా! 1022

చం॥ దొరయగు, వెంకటేశుని రథోత్సవమందునపత్నులుండగన్,
తిరుమల వీథులన్ తిరుగు, తేరునధిష్ఠితుఁడై చనంగనున్,
నరమరికంచులేకయె జనంబులు మ్రోకులలాగ రథంబు, న
ప్పరుగులువార, కాంచగను, పావనమయ్యెడు! వెంకటేశ్వరా! 1023

మ॥ రథమందున్ చనువెంకటేశ్వరుని పారావారముంబోలునా
పథికుల్, యాత్రికబృందమచ్చటను ప్రాప్తంబౌ నదృష్టంబనన్,
నధికంబైన కుతూహలంబుననను, ప్రాణాధిక్యమౌ జీవితా
వధికంబౌనది యాత్రవోలెనగు! దేవా! వెంకటేశా ప్రభో! 1024

సీ॥ ప్రథమము,గరుడు నివాహనంబందునన్, రెండవదినమునూరేగుగజము
వాహనమందునన్, పద్మమౌ తదుపరి, మధ్యాహ్న వాహనమందు వెడలు
మూడవదగు దినమందు శేషశాయినిన్, నాల్గవదినమందు నౌను, హంస,
పంచమదినమందుపంచాస్యమందునన్ మోహినియవతారమొప్పునరయ,

ఆ॥వె॥ షష్టమ, దినమందుసాగును కల్పమున్,హనుమస ప్తమందుయగును,వెడల
అష్టమదినమందుయైరావతంబునన్, వెంకటేశుడరుగువీధులందు. 1025

సీ॥ ఉచ్చైశ్రవంబునన్నూరేగు సామియున్, సూర్యప్రభన్ చనుశోభతోప
చంద్రప్రభయు విలాసంబుగా సాగునున్, రథమునవెడలుపరాత్పరుండు
భక్తులు లాగగన్ పరవశంబందునన్, తిరుమలవీధులన్ తేరుపార,
చక్రస్నానోత్సవ సంస్కారమందునన్, పూర్ణకుంభము పరిపూర్ణమందు,

ఆ॥వె॥ తెప్పయుత్సవంబు దేదీప్యమానమై వెంకటేశ్వరుండు వెడలురీవి,
దశదినంబులట్లు తప్పకన్ జరుగు, బ్రహ్మోత్సవంబుజనులుమోదమంద.

ఉ॥ ఆగిరి, విష్ణులోకము సహస్రశిలందున, రంగరంగవై
భోగములందు కేశవుని, పుణ్యప్రదంబగు తీర్థరాజమై,
పైగల దేవతాళి సలుపంగగ నిత్యము దేవతార్చనల్,
నాగతి కానరానిది వినంగనునానుడి! వెంకటేశ్వరా! 1027

చం॥ తిరుపతి సప్తశైలముల తీర్థము పావన వెంకటాద్రినిన్,
హరి చనుదెంచి తాను వరహావమూర్తి ననుజ్ఞనొందియే,
తిరుమలవాసుడంచును ప్రతిష్ఠితుడయ్యెను, వెంకటేశుగా,
పరిణయమాడి మంగయును పద్మయనంగను భార్యలంతటన్, 1028

చం॥ తిరుమల తీర్థరాజమయి, దివ్యమనోహర, దేవదేవుడై,
పరగెను, వెంకటేశ్వరుడు, ప్రాభవసంపద కోట్లకోట్లకున్
పెరుగుచు, విద్య సంస్కృతుల, వేదవిహిత్యము హైందవోన్నతిన్
వెలుగుచు భారతావనికి శ్రీలులభించెడు పుణ్యమూర్తియై; 1029

ఉ॥ అనగ మాలవాలమయి, యన్నివిధంబుల వైష్ణవోత్సవం
బై, నియమానుకృత్యముల భాసిలు, పూర్వపు వైభవోన్నతిన్
కాననిరంతరంబు సిరికయ్యెడు వడ్డినొసంగు, నిత్యక
ళ్యాణము పచ్చతోరణమునై విలసిల్లెడు! వెంకటేశ్వరా! 1030

మ॥ అదిదేవాలయ గర్భమందిరమునై నానంద ధామంబునై,
అదె వైకుంఠపురంబు ద్వారమయి, నేత్రానందమై పర్వెడున్,
అదె బంగారు విమాన గోపురమునై, నాదిత్యభాసంత, మం
బదె శైలేశుని నాలయంబనుచు చెప్పన్! వెంకటేశా ప్రభో! 1031

ఉ॥ చిత్తరువుల్ లిఖింపబడె, శ్రీహరి లీలలు, కుడ్యభాగమున్,
సుత్తమ చిత్రకారుఁడవి నూర్ధ్వపుభాగమునందు చెక్కెనో?
అత్తటి వెంకటేశ్వరుని, యంబుజనాభు. నుదంతగాథలన్
హత్తుకొనంగ మానసము, అచ్చెరువందగ! వెంకటేశ్వరా! 1032

శా॥ శ్రీనారాయణ, వెంకటాద్రి, గరుఁడున్, శేషాద్రి నీలాద్రియున్
కానన్. నంజనయున్ వృషావృషభ సంఘంబై నొకేదారి ని
వ్వన్, నిత్యంబును వెంకటేశ్వరుని, సర్వాలంకృతున్, జూడగన్,
ప్రాణంబుల్ కడబెట్టి సాగుదురు! ఔరా? వెంకటేశా ప్రభో! 1033

శా॥ స్వామిన్ విష్ణువు కాంచఁగోరెదరు యావైకుంఠ యేకాదశిన్,
ప్రామాణ్యంబగు నుత్తరంపుదిశనున్, ద్వారంబునన్ జూడగా,
నాముక్కోటిగ దేవతల్, మునులు, నానాభక్త సందోహమున్
నాముక్తంబగు వజ్రమందు నినుగానన్! వెంకటేశా ప్రభో! 1034

శా॥ వైకుంఠేశుఁడు విష్ణుమూర్తి, సిరితో వైకుంఠయేకాదశిన్
లోకంబేలుచు భక్తకోటికిని ముల్లోకాలకున్ దర్శనం
బాకంజాక్షుఁడు పుణ్యపర్వదినమున్ ప్రాప్తంబొనర్పంగనున్,
శ్రీకాంతున్గన ధన్యులౌదురట! శ్రీశ్రీ వెంకటేశా ప్రభో! 1035

మ॥ సురలున్. సిద్ధులు సాధ్యులున్, గరుఁడు శబ్రహ్మాసారథిన్ దేవతల్,
పరఁగన్ భూసురమౌని తాపసులు నావైకుంఠవాసున్గనన్,
పరమో ధర్మము వత్సరంబు దనుకన్ ప్రాప్తంబునౌ చూడ ను
త్తరపున్ ద్వారము వేచియుందురట సంతన్! వెంకటేశా ప్రభో! 1036

ఉ॥ ఉత్తరవాకిటన్ నిడెడు నుత్సవదర్శనమూర్తి కానలో
కోత్తరు సామిచూడగ త్రికోటి సురల్ మునిబృంద మంతయున్,
నత్తటి తెల్లవాఱమును పవ్వయు. శౌరిని వేలవేకనుల్
తత్తరపాటు వేతురట దర్శనమౌనని! వెంకటేశ్వరా! 1037

శా॥ శ్రీవైకుంఠపురంబునౌ, తిరుమలన్ శ్రీలక్ష్మీవాసంబునై
దేవాదుల్ సనకాదిమౌనిగణ మాదేవేంద్ర దిక్పాలురున్,
శైషుండున్, చతురాననుండునును, సాక్షాత్కారమున్ పొందగన్
యావేళుత్తరవాకిటన్ నిలుతురయ్యా వెంకటేశా ప్రభో! 1038

మ॥ గద, శార్ఙ్గంబులు, శంఖుచక్రములునున్ కస్తూరికా చందనం
బెదపై కౌస్తుభరత్నమాభరణముల్ యింపైన పీతాంబరం
బది కట్యంబున మౌక్తికంబుపటకా, యాపైసహస్రాంశహా
రదశంబుల్ సుమమాలికాతులసి హారంబుల్ సుతేజస్కనున్, 1039

చం॥ దరిశెనమందువారలటు దైవము శౌరినిద్వారమందు, యు
త్తఅపుదిశన్, వసంతమున దాకను, కానరు వెంకటేశునిన్,
మరిమరి తన్విదీఅగను, మైమరపందున పొందుపొందనన్,
వెరవని వాక్యముల్ పెడచెవిన్నిడి కాంతురు తన్మయత్వమున్1040

శా॥ యేటేటన్ హిమవంతు ఋత్వువునున్ యేకాదశీవచ్చు ము
క్కోటేకాదశి ద్వార దర్శనము, వైకుంఠేశు దర్శించ ము
క్కోటీ దేవతలున్ ప్రజల్ తిరుమలన్ గోవిందు వైకుంఠమె
ప్పాటైనన్కని ధన్యులౌదురటు, లప్పా! వెంకటేశా ప్రభో! 1041

మ॥ కనగన్ నుత్తర ద్వారమున్ గరుభుజాస్కంధంబునా సీనుఁడీ
శుని, దేవేరులు ప్రక్కనుండగను, వజ్రోపేత శోభాంగు, న
వ్వన మాలాభరణుండునిన్కనగ ప్రాభాతారుణో ద్వారద
ర్శన కాంక్షారతి మిక్కుటంబయెడు నౌరా? వెంకటేశా ప్రభో! 1042

చం॥ యిరువది నాల్గుగంటలను, నీశ్వరచింతన మానసంబునన్,
తిరుమల వెంకటేశ్వరుని, దివ్యమనోహర రూపసంపదన్,
తరుణము మించిపోవునని తద్దయు దీక్షతొ ధ్యానమగ్నులై
కరుణను బ్రోవుకావుమని కాంక్షతొఁజూతురు నిల్చుకాళ్లనున్ 1043

శా॥ కొండల్లోపలనున్న యాహరియె, యాకోనేటిరాయుండునై,
కొండల్క్రిందను కూర్మినగ్రజుఁడు నాగోవింద రాజయ్యయై
వండల్దండల నిల్చుదైవమని నత్యంతాశతో పద్మనా
భుండా శ్రీహరి కాంచితీరనగు నొప్పున్! వెంకటేశా ప్రభో! 1044

చం॥ తిరుపతియందునన్ కపిలతీర్థము గ్రుంకులిడంగ నొప్పగన్,
తిరుపతి దేవళంబులొక దివ్యకళాస్మృతి చిహ్నఖండమై,
తిరుపతి హైందవోన్నతికి దీపమునై వెలుగంగ తేజమై,
పరిణతినందె నాఘనత వైభవమందున వెంకటేశ్వరా! 1045

మ॥ గుడిలో పాన్పున పవ్వళించు ప్రభువా గోవిందురాజయ్యగా,
నడుమన్ నిల్చినదేవి బీబియనగన్ నాంచారియై నుండగా,
గుడిలో నిల్చిన దేవతాఘనుఁడు నాకోదండ, రామయ్యగా,
నడిపించన్గల దేవతల్ వెలసిరన్నా! వెంకటేశా ప్రభో! 1046

ఉ॥ గుండెనుఁదన్నెమౌని తన క్రోధవశంబున విష్ణువక్షమున్,
దండితతాడినాగువలె తాపసి చర్యకు విష్ణులోకమున్,
నుండనటంచు వీడిచనె యోర్వకలక్ష్మి దయాంబురాశి, దా
గుండెను పశ్చిమంబునను కొల్హాపురంబున వెంకటేశ్వరా! 1047

మ॥ చెలిపద్మావతి శ్రీనివాసుప్రభు వాంఛించంగ వైవాహమై,
వలచెన్ తావిలపించి, భంగపడినవ్యాజానురాగంబునన్,
నలిమేల్మంగపురంబునన్ వెలసె దైవాంశంబునన్ మంగయై,
యిలపద్మావతి లక్ష్మియై నిలచెనోయీ? వెంకటేశా ప్రభో! 1048

మ॥ తిరుచానూరట, శుక్రవారమహిమన్ దేవిన్ నలంకారమౌ,
సిరులందున్ నవరత్న భూషితమునై శ్రీదేవి శోభించగా,
వఱునాతన్ మొదలౌను, పూజలకు సేవార్థంబు భక్తాళియున్,
వరుసన్ నిల్తురు దర్శనార్థమట! కొల్వన్! వెంకటేశా ప్రభో! 1049

చం॥ తిరుమల వెంకటేశ్వరుఁడు దేవియునౌ నలిమేలు మంగయున్,
సిరులను, సంపదల్, నిలచి శ్రీహరి కోట్లకు నాధిపత్యుఁడై,
ధరిణిలో భోగభాగ్యముల దైవమతండొకఁడేయనంగనై,
పరగెను నిత్యమాతనిది భాగ్యము లక్షలుపైన నుండునున్, 1050

మ॥ అదియేకాదశి విష్ణులోకమున ముఖ్యంబైన ముక్కోటియౌ,
యదె శ్రీరంగము రంగనాయకులునున్ నాసక్తివీక్షించ, నా
డదియే దైవము పద్మనాభు, తిరువేంద్రం బందనంతుండుగా,
యదియేయన్న వరంబునందుగల సామౌసత్యనారాయణై, 1051

ఉ॥ ద్వారము నుత్తరంపుదిశ దర్శనమిత్తురు నాటివేకువన్,
శౌరిని పారవశ్యమున సంతసమందుచుచూడ దివ్యమౌ
యారమణీయ మోహనము నద్భుతరూపము నామమందునన్
పేరుకునొక్కఁడే యనెడు విష్ణువుఁజూతురు! వెంకటేశ్వరా! 1052

మ॥ గుడినిన్, పన్నగశేషశాయినగు నా, గోవిందుఁడో? పద్మనా
భుఁడొ? విష్ణుండును, రంగనాయకులో, శంభున్ బ్రహ్మయింద్రాదులున్
నడుమన్ నారద తుంబురుల్ మహతీనాదంబు గానంబుతో,
వెడదౌవక్షము లక్ష్మిభూమి సతులన్ వీక్షించ ధన్యంబునా! 1053

మ॥ చరితార్థంబగు విష్ణువున్ కొలువు దృశ్యంబట్లుఁగానంగనౌ,
తిరు శ్రీరంగము, రంగనాయకుల మందిర్భాగమున్ నుండగా,
తిరువేంగ్రడంబున పద్మనాభుఁడును, నాదివ్యంపు గోవిందుఁనిన్
దరిశించన్నది ధన్యమే తనువుగాదా? వెంకటేశా ప్రభో! 1054

మ॥ స్థలమాహాత్మ్యము యంత్రమంత్ర మహిమన్ తంత్రార్థమౌ శక్తియున్,
వెలసెన్ శ్రీహరి లక్ష్మిదేవిలటు స్థాపించంగ, నౌనిచ్చటన్
విలసిల్లెన్ గుడిగోపురంబులిటనే విఖ్యాత విద్యాలయాల్.
యిలసాక్షాత్తు మహేంద్ర వైభవమునయ్యెన్, వెంకటేశా ప్రభో! 1055

శా॥ నీసాన్నిధ్యము నందునుండగను నిన్నేకాంత దృశ్యంబు న
య్యే సాధ్యంబన దర్శనావధికినయ్యే మూల్యవిత్తంబునున్,
నీసేవారతి నెట్టులోకద భవన్నీరాజనంబందగన్,
నా సర్వస్వము ధారపోయగను నౌనా? వెంకటేశా ప్రభో! 1056

ఉ॥ పాపవినాశనంబగును, పావనతీర్థము పాపనాశమున్,
తాపమువీడి యాత్రికులు తానమొనర్తురు పుణ్యమంచనన్
నాపురి నీటియెద్దడిక్కి, నాశ్రయమిచ్చుచు పుష్కలంబుగన్,
యేపునపాఱు నీరనుభవేద్యము నయ్యెడు వెంకటేశ్వరా! 1057

శా॥ గోగర్భంబున నీరు వచ్చునట సంకోచంబునున్ వీడుచున్,
త్రాగంగన్నది నారికేళ జలమై తావివ్వదే జాడ్యముల్,
"లోగుట్టే పెరుమాళ్లకే యెరుక" నేలోకంబు గంగామృతం
బోగంగన్ నిటదెచ్చె పుణ్యమననొప్పెన్! వెంకటేశా ప్రభో! 1058

శా॥ ఈ సామ్రాజ్యము చక్రవర్తులిల మున్నేలంగ వారేతగున్,
యాసంయోగము ధర్మమున్ నడిపెనో నాల్గైన పాదంబులన్,
నీ సామ్రాజ్యము వీవుకట్టినదిగానేదైన బిక్షంబునై,
నీ సర్వస్వము దోచుకోబడెనుగా నిత్యాన్నదామోదరా? 1059

## ఉత్తరాయణము : మకర సంక్రాంతి.

చం॥ మకరపురాశి సంక్రమణమయ్యెడు భాస్కరుఁడుత్తరాయణం
బిక నరుదెంచు, మోక్షపదమిచ్చెడు, భాగ్యము, పుణ్యలోకముల్,
నికరపు నుత్తమోత్తమము నిచ్చెడు, మానవకోటి ముక్తిదా
యకమగు కాలమంచు మనసందు తలంతురు; వెంకటేశ్వరా! 1060

మ॥ అది సంక్రాంతి దినంబులో మకరమున్ నాదిత్యుఁడా రాశినిన్,
కదలాడంగల మాసమై, మొదలుగా కర్కాట పర్యంతమున్,
నెదురై(జూచెడు నుత్తరాయణము పున్నెంబంచు, కూష్మాండముల్,
మొదలౌ దానములివ్వ పుణ్యమగు నొప్పన్! వెంకటేశా ప్రభో! 1061

ఉ॥ ఉత్తమ లోకముల్ దొరకు, స్వర్గగతుల్గన నుత్తరాయణం
బుత్తమ కాలమై పరఁగునొప్పు నటంచును, యార్యులత్తఱిన్,
మొత్తముమీద చావునకు, ముక్కును మూయగ, నీటమున్గ, నొ
క్కెత్తున చావుతథ్యమదియేగద పుణ్యము! వెంకటేశ్వరా! 1062

శా॥ సంతోషంబున ముఖ్యపండుగనుచున్ సంక్రాంతి నాడంతటన్,
సంతానంబునుగూడి బంధుగులతో, జామాతకూతుంద్రకున్,
నెంతోకొంతగ కట్నకానుకలు తామివ్వంగ గేస్తుంద్రునున్
సంతృప్తిన్ మనసార బొందురను యాశా! వెంకటేశా ప్రభో! 1063

ఉ॥ పండుగరోజులన్ కనులపండువఁజేసెడు, యింటిముంగిటన్,
నిండుగ ముగ్గులన్ నిడుచు నేర్పు గనంబడ రంగురంగులన్
మండిగమందు, వాకిళుల మంగళమంచు హరిద్ర కుంకుమల్,
దండిగ పూతురా గృహిణు ధర్మముమేలకు! !వెంకటేశ్వరా! 1064

ఉ॥ మామిడి తోరణంబులు అమందముదంబున గట్టియుంతురో?
భూమినిపండు ధాన్యమును పూడ్తురు పాతఱ నుంచనిత్తురో?
గోముగపెంచు గోవులను, గోష్ఠపుశాలలు, యెడ్లు, బఱ్ఱెలున్,
గ్రామము దున్నలన్ కనవిరాజులు సంపద! వెంకటేశ్వరా! 1065

ఉ॥ పచ్చని ముద్దబంతిపువు పంక్తులు వాకిలి తోరణంబులన్,
కుచ్చుగకంకులున్ నిడగ గుమ్మటముల్వలె సంచులందునన్,
ముచ్చటరంగు నల్లికలముగ్గుల గొబ్బియలుంచ ముంగిటన్,
మెచ్చగ గంగిరెద్దులతొ మేళముసాగెడు వెంకటేశ్వరా! 1066

శా॥ ఇంతుల్ బొమ్మలకొల్వు నేర్పఱచగన్ యింపైన పేరంటముల్,
వంతుల్ వారిగఁబిల్చి! వేడుకల నాప్యాయతతన్ జేయగా,
కాంతల్ (గట్టెడు పట్టుచీరలటుపై కాసుల్ల పేర్లుండగా,
నెంతో ముచ్చట గ్రామ సంపదయె నయ్యెన్! వెంకటేశా ప్రభో! 1067

మ॥ హరిదాసుల్, హరినామగానములనున్ యాధ్యాత్మికా కీర్తనల్,
తిరుచూర్ణంబును నూర్ధ్వపుండ్రముల గొంతెత్తించి, సాతానుజి
య్యరుపాడన్, తలపైన పాత్రలలో బియ్యంబుంతురా గేస్తులున్,
కరువాబిచ్చమిడన్ గృహస్తులకు యింకన్? వెంకటేశా ప్రభో! 1068

ఉ॥ గొబ్బియ గోమయంబులతొ గుమ్మడిపూవులలంకరించగన్,
గొబ్బిమతల్లికిన్ పసుపుకుంకుమ పూజలొనర్చి ముందుగన్,
నబ్బురమైన ముగ్గులతొ నావరణంబున, యింటముంగిటన్
గొబ్బియపూజ సల్పుదురు కూర్మితొ కన్యలు! వెంకటేశ్వరా! 1069

ఉ॥ గోవుమయంబుకోసమని గొబ్బియఁగొల్వగ, కన్యకామణుల్,
యావల, యీవలన్ వెదలియందున చాటుగ కూర్చిపేడనున్,
నావఱువాతలేచి తమయంతట తెచ్చుచు గొబ్బెఁజేయగా,
యావిధి ముచ్చటౌను, తమయాత్రతఁజూడగ! వెంకటేశ్వరా! 1070

ఉ॥ గొబ్బియపాటలన్, పడుచుకొమ్మలు పాడుచు, సంజవేళలన్,
గొబ్బెను తల్లిపిల్లలను, కోర్కెలు దీర్చగ పూజసేతురా
నిబ్బరమైన మానసము, నీమము తప్పక కన్యకామణుల్,
దబ్బున పెండ్లి, మంచివరుతామటు పొందగ! వెంకటేశ్వరా! 1071

శా॥ సాయంసంధ్యల మూఁడు నాళ్లగను నా సంక్రాంతి పేరంటముల్,
యేయింటన్‌గన బొమ్మలన్ కొలువు పెట్టించంగ, నానందమున్,
నాయత్తంపడు పంటచేల వరిధాన్యంబింట చేకూర్చగన్,
యాయాగ్రామము భోగభాగ్యమవె, అయ్యా! వెంకటేశా ప్రభో! 1072

ఉ॥ పాడియు పంటలున్ గలిగి భాగ్యము గ్రామము సంపదైకనన్,
కూడిన మిత్రతత్వమును. కూర్మియు, సర్వసమత్వమంతయున్,
తోడయిరాగ, జీవితపు దుందుడుకుల్ కనరానిదైనదై,
వాడనిపూవు గ్రామపు వైభవమయ్యది! వెంకటేశ్వరా! 1073

చం॥ పితరులు, తర్పణన్, తిలలు, పిండి హిరణ్యము సంకురాత్రిన
ర్పితమవ తృప్తిచెందుచు, తరింతురు నామకరంబునందునన్
పితరులు వంశమేడు తరవృద్ధిని బొందగ దీవనల్ నిడన్,
సుతులను శాంతిసౌఖ్యముల చూతురు తండ్రులు! వెంకటేశ్వరా! 1074

మ॥ ధనువారంభము, ముగ్గులల్లికలు, అంతంబౌ రథంబందునన్,
చనునా తేరునుకల్పు వాకిళలలో సంక్రాంతి ముగ్గుల్ నిడన్,
కనగన్ సొంపును యింపులల్లికలు సంక్రాంతీ దినాల్ ముగ్గులన్,
తనివిన్ తీరదు గ్రామసంపద పొగడ్తల్! వెంకటేశా ప్రభో! 1075

ఉ॥ క్షీరసమృద్ధి గ్రామములు కేంద్రమునౌ పశు సంపదయ్యెడున్,
కూరలు కాయపండ్లుయును కూడలి పట్టణవాసువారికిన్,
దారి యొసంగు జీవనము ధాన్యపు రాసులు పంచిపెట్ట భూ
సారము గ్రామసంపదయె చల్లని తల్లిగ! వెంకటేశ్వరా! 1076

## సావిత్రీ నోములు

శా॥ సావిత్రీయను దేవి నోములనుచున్ సంక్రాంతి మూన్నాళ్లకున్
దేవిన్ తొమ్మిది రోజులున్ పగలు రాత్రిళ్లందు పూజింతురా
దేవిన్ నిత్యసహస్రమున్ త్రిశతితో దివ్యార్చనల్ సేయగా
నైవేద్యంబిడి కప్పురంబిడుదురన్నా! వెంకటేశా ప్రభో! 1077

శా॥ యేదేవిన్ పతి ప్రాణరక్షణకునై యిల్లాలు ప్రార్థించెనో?
యేదేవీ కరుణాకటాక్షములనెన్నో వరాలందెనో?
యేదేవీ తన సూత్రరక్షణను తాయింపొంద రక్షించెనో?
యాదేవిన్ మనసార కొల్వగను తృప్తో? వెంకటేశా ప్రభో! 1078

మ॥ పవలున్ రేలునఖండదీపముల దేవ్యారాధనల్ జేయుచున్
నవిరామంబుగ తొమ్మిదీ దినములన్ నైవేద్య భోజ్యంబుల
య్యువిదల్ దేవిని మంత్రతంత్రములలో యుయ్యాల నూగించవై
భవ సంపన్నము భోగలాలసలకింపౌ! వెంకటేశాప్రభో! 1079

శా॥ నోముల్ తొమ్మిదిరోజులై పిదపనున్ నుద్యాపనన్ చెప్పగన్,
నోముల్ తొమ్మిది వత్సరాలదనుకన్ నోయంగ నుద్యాపనన్,
సామగ్రిన్ ప్రతివస్తువున్ నవముగా సాధించి తొమ్మండ్రునౌ
నాము త్తైదువ కివ్వసత్ఫలమునౌనౌ! వెంకటేశా ప్రభో! 1080

మాఘ ఫాల్గుణములు శిశిరఋతువు

ఉ॥ మాఘము ఫాల్గుణంబులను మాసములున్ శిశిరంబు నయ్యెడున్,
మాఘము స్నానమున్ సలిపి మంత్రజపంబు ప్రభాతవేళలన్,
యేఘన కార్యమున్ జరుపనియ్యవి ముఖ్యమటంచుఁజేతురా
ఓఘముఁగూడ నిత్తురట యొజ్జలు నప్పుడు! వెంకటేశ్వరా! 1081

చం॥ శిశిరము వచ్చినంత పెనుశీతలవాయువు వీచునెల్లెడల్
వశమును దప్పి బీదలును వస్త్రము ఁగప్పుకొనంగ లేకయే,
పశువలశాజలన్ పఱఁగి పాన్పుఁగ గడ్డిని కప్పుకొందురా
దశను పరీక్ష బీదలకు తప్పదునెప్పుడు! వెంకటేశ్వరా! 1082

శా॥ వైవాహంబుపవీతముల్ శుభములున్ ప్రాశస్త్య మీమాసముల్,
యావాసంబు గృహప్రవేశ, గృహముల్ నారంభమున్ జర్గునున్,
శైవోపార్చన రుద్రసూక్తములకున్ సంస్తుత్యమాసంబు నౌ
చున్ వాసింగను మాఘమాసమనవచ్చున్! వెంకటేశా ప్రభో! 1083

ఉ॥ చిత్రము పూజకున్ సకల సేవలు విష్ణువు రుద్రులుండ నా
మాత్రము సేవకున్ తగఁడె. మౌనియుధాతయు సృష్టికర్త, యే
క్షేత్రములేని దైవమయె! కీర్తియు, పూజకనర్హుఁడయ్యెనా
శత్రువుగా శపించె భృగుశాపమునట్టిదె- వెంకటేశ్వరా! 1084

మహాశివరాత్రి

ఉ॥ మాసములంత్యమందున, నమావస, ముందటి మాసరాత్రియో,
చేసెడు శైవపూజలభిషేకము శంకరు ప్రీతిపాత్రమో,
భాసితమౌ చతుర్దశి, శివార్చన సల్పగ రుద్రసూక్తమున్,
చేసి తరించు భక్తులకు సేవలె ముఖ్యము! వెంకటేశ్వరా! 1085

చం॥ అదియె శివార్చనల్గల మహాశివరాతిరి మాఘమందునన్,
విదితము శైవభక్తులకు వేల్పులకున్, కడుపూజనీయమై.
నొదవెడు లింగమార్చన "శివోహ"మటంచును సల్పుచుండ బి
ల్వదళ మవశ్యమందురు శివార్చనకున్గద! వెంకటేశ్వరా! 1086

మ॥ శివరాత్రిన్ నభిషేకముల్ జరుగు విశ్వేశ్వర్లుకున్ రేబవల్,
శివలింగంబును పానవట్టమున గోక్షీరంబు, టెంకాయలున్,
నవమేకాదశ, నేకరుద్రము మహాన్యాసంబు పూర్వంబుగా
నవిరామంబున నర్చనల్ జరుగునన్నా! వెంకటేశా ప్రభో! 1087

చం॥ శివునకు ప్రీతిబిల్వదళసేవయు, తుమ్మియు, నాగమల్లిపుష్పల్,
పువులు విలేపనంబులు, విభూతి, సుగంధము, చందనాదులున్,
నవిరళధారలన్ జలము నర్చన గోసుధయందు రాత్రులన్,
భవుడును తృప్తినొందునట భవ్యభవంబగు! వెంకటేశ్వరా! 1088

మ॥ శివలింగార్చన నాలయంబులను సంసేవ్యంబునై సాగగన్,
దివిజుల్ శ్రీరజతాద్రికేగి శివరాత్రిన్ శంభునిన్ గొల్వగా,
భువినిన్ మృత్తికలింగమార్చనము "శంభో శంకరా"యంచన్నన్,
భవబంధంబులవీడ కొల్తురట దేవా! వెంకటేశా ప్రభో! 1089

శా॥ కైలాసంబు నివాసమై మనసు యోగాధ్యానమున్ లగ్నమై,
తాలింగాకృతి, నాలయంబులను, మధ్యాసించు పాషాణమై,
ఫాలాక్షుండు, పరేత భూములను సంభావించు భూతంబునై,
బోళాశంకరు భక్తివశ్యుడన నొప్పున్! వెంకటేశా ప్రభో! 1090

ఉ॥ శాంభవి అర్ధనారి! సిగచంద్రుడు, వాహనమెద్దు, గంగయున్,
సంభృతమౌళి, కంఠము, విషంబును, హారము నాగమైచన్నన్,
డింభకుడంకమున్, మృగముడిండిమఫాలలలాట నేత్రమున్,
జృంభణ వ్యాఘ్రచర్మము విశిష్ట సదాశివుడా త్రిశూలియై, 1091

మ॥ రజతాద్రిన్ లయకాల నృత్యగరిమన్ రాజిల్లుచుండంగ శై
లజ, పుత్రుండుమ విఘ్నరాజు తమవాల్లభ్యంబు పెంపారగన్,
నజుడున్, విష్ణువు, దిక్కధీశులును, నాకాధీశుడున్ గొల్వగన్,
వ్యజనంబుల్ పరివారు పట్టగ శివోహంబై, విరాజిల్లగన్, 1092

మ॥ పరివారంబగు భూతప్రేత గణముల్, పైశాచికా నృత్యముల్,
ధరియింపన్ మొల వ్యాఘ్రచర్మమును వస్త్రాలంకృతున్ జేయు, నా
కరమున్ పుట్టె త్రిశూలమున్ సహిత బిక్షాపాత్రయున్ నొప్పగా,
హరుడొప్పున్ ధవళాద్రినిన్ భట్టులుతోడై! వెంకటేశా ప్రభో! 1093

మ॥ హరివైకుంఠము శేషతల్పమును, పాలాబ్ధిన్ నివాసంబునై,
హరుకైలాసము మంచుకొండలుయగున్ వావాసమై నొప్పగా,
యిరు దైవంబులు యోగనిద్ర ఘనతన్ నేకాగ్రచిత్తంబు నుం
దురు, "ఓంకార"మునన్ స్వరూపులగుకాదో? వెంకటేశా ప్రభో! 1094

మ॥ హరికస్తూరి సుగంధ చందనముద్రవ్యాపేక్ష పీతాంబరా
ధరుఁడై కౌస్తుభహారమందు తులసీధాముండునై నొప్పగా,
హరుఁడో నాగము, వ్యాఘ్రచర్మవసనంబై భస్మమున్ భూషణాం
బరుధారుండు, కపాలహస్తుఁడగు దేవా! వెంకటేశా ప్రభో! 1095

శా॥ కాశీక్షేత్రము, సోమనాథమును, భూకైలాసమారామముల్,
శ్రీశైలంబు చిదంబరంబు మధురన్ శ్రీకాళహస్తిన్ సదా
యీశుండున్ ఘనవైభవోన్నతము రామేశంబునన్ నుండగా
శ్రీశైవార్చనకేమి తక్కువగునో? శ్రీ వెంకటేశా ప్రభో! 1096

శా॥ జ్యోతిర్లింగము వాయులింగ, మనగన్ శోధించి చూడంగనౌ,
నాతేజోమయ రూపమున్‌కనగనున్ నాకాశలింగంబునున్,
భూతంబుల్ గణనాయకుండునయి శంభున్ ద్వాదశాలింగముల్,
చైతన్యంబయి గోచరంబునగు నెంచన్! వెంకటేశా ప్రభో! 1097

శా॥ శైవానుగ్రహ యోచనన్ జపము పంచాక్షర్యమౌ మంత్రమున్,
శైవంబౌ, నమకంబునన్ చమకమున్ సర్వాభిషేకంబులన్,
కైవల్యంబును పొందఁగోరుచును నోంకారాకృతిన్ శంభునిన్,
సేవించన్ నభిషేకముల్ జరుగునో? శ్రీ వెంకటేశా ప్రభో! 1098

చం॥ హరిహరులిర్వురున్ సములు, నాపదలందున బ్రోవకావగన్,
హరుఁడొక నల్పతృప్తిపరుఁడార్తుల రక్షణ దీక్షితుండు, నా
హరి తన భక్తులన్ కఠినమాత్మపరీక్షల పాలుఁజేయు, నీ
తరతమ బేధమున్ ద్వివిధ ధాతువు! లెందుకొ వెంకటేశ్వరా! 1099

శా॥ కైలాసంబు హిమాలయంబుమయమై గంగాధునీ శౌచ్యమై
యాలంబోదరు, నంది భృంగిగణమై, యాహార్యనృత్యంబులై,
ఫాలాక్షున్ లయకాలరుద్రగరిమన్ వ్యాహృత్రియౌ నర్చనల్,
బోళాశంకరుధామమైకనగ నొప్పున్! వెంకటేశా ప్రభో! 1100

శా॥ ఓంకారస్వరలీనమై, నిగమనాదోపాసనాధీనమై,
కైంకర్య ప్రతిపాద్యమై, భువనరక్షాదక్షమై, తాండవా
హంకారస్థిత చంద్రమశ్శకల శ్రౌత్యప్రాప్త సాంతత్వసా
లంకారాకృతి తెల్పునయ్య శివలీలల్! వెంకటేశా ప్రభో! 1101

మ॥ అవతారంబులు దాల్చినా(డు పది అయ్యా! కాలమున్ యోగ్యమై,
దివిజుల్ మౌనులు భక్తరక్షణకునై దీక్షారతిన్ విష్ణువై,
శివు(డో వేషము వేయలేదు`ద, భస్మీభూత చేతస్కు(డై,
యవలీలన్ వరదాతయై పఱ(గెనయ్యా! వెంకటేశా ప్రభో! 1102

చం॥ స్థితిలయ సృష్టిభూతులయి చేతురు మూవురు శక్తిమాయలన్,
నతులిత మాధురీగరిమనా హరిపోషణ కర్తయైచనన్,
గతియని నంత్యమందులయకాలసముద్ధరు(డై హరుండునున్,
వితరణశీలి ధాతయును విశ్వసృజుండయె! వెంకటేశ్వరా! 1103

చం॥ హరిహరులిర్వురున్ నొకటియందురు! బేధమొకింత లేదనన్,
హరుని భజింపగా హరియు హర్షితు(డౌనగు నెంతయున్, కనన్
హరినిమనంబునన్దలప నాహరు(డెంతయు ప్రీతిచిత్తు(డౌ,
హరిహర రూపమే మనసు యన్వయమందదు? వెంకటేశ్వరా! 1104

మ॥ శివదీక్షాపరునంచునే కదలి కాశీక్షేత్ర యాత్రార్థమై,
యవనిన్ గ్రుమ్మరి విశ్వనాథు, దరినత్యంతార్తి పో(జాలనై,
నివసంబున్ కని పుణ్యమంచు ప్రభుసాన్నిధ్యంబు నెంతేని, కాం
తివతం సంబని సమ్మితిన్ మిగుల తృప్తిన్! వెంకటేశా ప్రభో! 1105

మ॥ "నొసటన్ వ్రాసిన వ్రాలుకన్న కలదా నూతేండ్లు చింతించినన్"
పసరంబున్బలె పోయిపోయి తుదకావ్యర్థంబునౌ యాత్రలన్,
ససివాడన్ పయనించి నాలయమునన్ సందర్శనా భాగ్యమున్
కసిదీరన్ కనలేని పాపినయితింకన్? వెంకటేశా ప్రభో! 1106

మ॥ శివునిన్ గాథలనంతమంచనుచునున్ శ్రీకంఠునిన్ స్తుత్యమౌ
అవకాశంబున నాత్మసంయమునమున్, నారాధనల్ నొక్కటే,
అవసానంబునగాదు నిప్పుడిపుడే యాశావకాశంబుకై
యవినాభావము యోగ్యమౌ పఱ(గునయ్యా! వెంకటేశా ప్రభో! 1107

ఉ॥ మాసము శుద్ధసప్తమిన, మాఘమునన్ రథసప్తమీయగున్,
ఆ సమయంబునన్, వ్రతము అర్కునిపూజలు, సేయనొప్పనౌ,
గోసుధ పాయసంబులను కోమలు లిత్తురు, చిక్కుడాకులన్.
వేసిననారథంబున నివేదన చేతురు అంశుమంతుకున్, 1108

ఉ॥ ఆ రథసప్తమిన్, అసువు, లమ్ములపాన్పున, బాసెభీష్ముఁడున్,
పోరికిరీటితో, రణము భూమిపరుండక అంపశయ్యనున్,
అరణభీష్మ శాంతనవుఁడంతటనున్, బిగబట్టి ప్రాణముల్,
కోరెను ఉత్తరాయణము, ఘోరప్రతిజ్ఞగ, వీడెనీశ్వరా! 1109

ఉ॥ ఆ రథసప్తమిన్, వ్రతములన్నియు స్త్రీలునుపక్రమింపగన్,
కోరి సుమంగళీత్వపతికున్, సుఖశాంతులు భాగ్యసంపదల్,
కోరు వివాహమైనతలి; కూడనునున్ శివరాత్రి నాడునున్,
పారలు నాచరింతురట, బాధ్యతమేఱకు, వెంకటేశ్వరా! 1110

ఫాల్గుణము

ఉ॥ వచ్చిన ఫాల్గుణంబు శకవత్సరమంతమునందు, తోడుగా,
తెచ్చును, మాసమున్ ఋతువుఁదీర్చును, నాకులురాలినంతనే
పచ్చదనంబు, పూతనిడి, భాసురమైకన శోభనాకృతుల్
నిచ్చు వసంతమున్ మఱలనేర్పడు చైత్రము! వెంకటేశ్వరా! 1111

చం॥ శిశిరమురాగ పచ్చనగు చెట్లును, నాకులురాల్చి మోడులై,
యశనిగ పాతమంబనుచు యందవిహీనమునై వెలంగగన్,
పశువుల గ్రాసమున్, కసవు పంటల భూములు నెండిపోవగా,
వశమగునేనెదర్చగ? ప్రభావము సృష్టిని! వెంకటేశ్వరా! 1112

చం॥ ఉపనయనాది కార్యములు, యుత్సుకతన్, నగుపెండ్లి కార్యముల్
నపుడు గృహప్రవేశము శుభాస్పదమౌనగు, శోభనాదులున్
విపులముగా జరుంగునట, వేదవిధానము శాస్త్రసమ్మతిన్,
నపరిమితంబు నూతులుకనన్ జలత్రవ్వగ వెంకటేశ్వరా! 1113

మ॥ శకసంవత్సరమంతమైచనును, మాసంబైనదా ఫాల్గుణం
బిక రాబోవును నూత్నవత్సరము, వచ్చే చైత్రమాసంబుతో,
సకలంబైనది సృష్టినిన్ గనగనున్ చక్రంబునన్ త్రిప్పునా
సకలారాధ్యుని వేదసంహితము యీశా వెంకటేశా ప్రభో! 1114

మ॥ ఒక పంచాంగ కాలమున్ జరుగునెన్నో పండుగల్, పబ్బముల్,
సకలారాధ్యుల దైవకార్యములునున్ సాధించగన్ పూనికన్,
సుకరంబైనవి నర్చనల్ నిడుచు శాస్త్రోక్తంబుగాఁ జేసితిన్
సుకృతంబైనది వ్రాయఁగల్గితని తోచున్! వెంకటేశా ప్రభో! 1115

## శేషజీవితము- కర్మపరిపాకము :-

ఉ॥ జీవితశేషమున్‌కనగ చింతమరల్చితి, పూజలందునన్,
దైవముఁగొల్చి నీతనువు ధన్యమునొగల రీతులన్ సదా
శైవమొ? వైష్ణవంబొ? సిరి, శాంభవి శక్తుల సేవఁగొల్చుటో?
భావికి మార్గమున్‌నిడితి భావ్యమటంచును! వెంకటేశ్వరా! 1116

ఉ॥ కావున దొర్లుచుండుగద కాలము, చక్రము గీతినెప్పుడున్,
నేవిధి నాగఁబోదు? విధియించి విరించి నొనర్చు సృష్టినిన్,
దైవముమీద భారమిడి, దాపుల దూరమునున్నదానినిన్,
కావుమటంచు కోరితిని కర్తవువీవయె! వెంకటేశ్వరా! 1117

మ॥ పదవీత్యాగమనంతరంబుమది దైవారాధనాకృత్యమై,
పదునేడేండ్లయి జీవితాశయము సంభావించి పూజించగన్,
మది ప్రేరేపణ భావమే మునుపు జన్మంబందు సంస్కారమై,
పదసాహిత్యము నీవిధిన్‌నమరె! దేవా! వెంకటేశా ప్రభో! 1118

ఉ॥ పండుగ, పబ్బముల్, సకల పర్వదినంబులు, పుణ్యకార్యముల్
మెండుగవచ్చు నోములు నమేషము నాచరణంబుఁబెట్టగన్,
నిండు మనంబునిచ్చు ప్రతినిత్యముఁజేసెడు దైవకార్యముల్,
దండిగ పద్యభావమున ధారణజేసితి! వెంకటేశ్వరా! 1119

మ॥ ఒక పుష్పంబున సౌరభంబునది వాయుద్ధూతమై, వ్యాప్తమై
సకలారాధన పర్వమై పఱఁగుచున్ సమ్మోహన భ్రాంతియున్,
ముకుళైంబైన వితానమై విరియగాఁబూచెన్ నటంచున్, నదే
వికసించెన్ కవనంబు కావ్యమయి నొప్పెన్! వెంకటేశా ప్రభో! 1120

చం॥ సమయము రానిదెద్దియును, సాధ్యముకాదని నందురేమొ? నే
నిముసమునైన వచ్చునది నిర్ణయమైనచొ రాకపోదు? సా
మముగరిడీలు నేలవిడిమాడ్కిని జేయగనమ్మ నౌనె? భా
గ్యము వలదన్న, వచ్చునెడ నాగునెనెచ్చట? వెంకటేశ్వరా! 1121

ఉ॥ జీవితసత్యమింతియె! విశేషము భాగ్యము పొందనైతినే?
యేవిధమైనదే యనుభవింపగ ప్రాకృత కర్మబంధమున్,
దైవము నిచ్చెనన్‌దలచి ధన్యుఁడనంచుమనంబు తోపగన్,
భావకవిత్వమున్ రచన పద్యమయంబయె! వెంకటేశ్వరా! 1122

ఉ॥ దైవమొకండు సర్వజన ధాత్రినినిన్ కరుణింపఁజాలు! యా
దైవము విష్ణువో? శివుఁడా? ధాతయొ? శక్తిమయంబు దుర్గయో?
శైవము, వైష్ణవంబనుచు శాంకరి బేదములన్ తలంచగన్,
భావమునందు నొక్కటి ప్రభావితమయ్యెఁడు! వెంకటేశ్వరా! 1123

మ॥ తన సామ్రాజ్యము భావనాపటిమయందాధారమై నొప్పగన్,
మనసాలోచన నీవటంచు పరమాత్మన్ నైక్యమున్ సేయగా,
ఘనసారధ్యముఁబూని సామిపరమౌ కాంక్షారతిన్ మూగవో
యిన భావంబును వాక్కునన్ నిడితినయ్యెన్! వెంకటేశా ప్రభో! 1124

మ॥ ప్రథమాధ్యాయము బాల్యమై, చదువు భావంబే ద్వితీయార్థమై,
అథనుద్యోగ వివాహమున్కన తృతీయార్థంబునై కానగన్,
విధి సంసారము, సంతతిన్ ధనము నన్వేషింప చాతుర్థ్యమై
పథమాధ్యాత్మిక బోధయైదవది దేవా! వెంకటేశా ప్రభో! 1125

ఉ॥ బాధ్యతకన్న మిన్నయయె భర్తృవిహీన ప్రసూన భారమున్,
సాధ్యమునైన వ్యాజ్యము విచారణ సిగ్గుతో నోడిపోవ, సా
రధ్యమునందు తల్లియు నిరాదరణంబును సేయటెట్టులో?
నధ్యయనంబు మార్గమొకటై కనుపించదు! వెంకటేశ్వరా! 1126

ఉ॥ యిందిర రుగ్మతన్ జరిగె హీనమువత్సర కాలమింతకున్,
పొందివ సాయమున్ మఱల పూర్వపు సంపద రాకపోవునో?
మందులు మాకులున్ తినగ మందగొడిన్ గడుపంగనయ్యెడిన్,
కొందలమందె మానసము కోరెను శాంతిని! వెంకటేశ్వరా! 1127

ఉ॥ పుత్రులు నల్వురున్ పితృని పోషణ బాధ్యతఁగాంచువారలే,
నాత్రుతమేఱ రమ్మనుచు నమ్రతఁజూపెడు వారలౌను! నే
మాత్రమునన్ భరింపనది మాత్రము సాధ్యము నౌనా యెంతకున్?
పుత్రు ఋణంబు కన్ననది పొందగ మేలగు! వెంకటేశ్వరా! 1128

మ॥ దినముల్, మాసము, వత్సరంబులును, నుద్దీపించు నాశాలతన్,
కనుపించన్, వినిపించదో క్షణిక సంకల్పంబు భావంబునన్,
మునుపే నిర్ణయమైన కాలమును సమ్మోహాంత పాశంబు, గై
కొను ప్రాణంబు నిరీక్షణే నయముమాకున్! వెంకటేశా ప్రభో! 1129

శా॥ ప్రక్కీశాస్త్రి లిఖించె జాతకము, నేపంచత్వమున్ బొంద, తా
వక్కాణించె, బుధాంతరంబు గురువున్, ప్రారంభమందంచు, కా
దక్కెన్ ప్రాణము అర్వదెన్మిదిన; తథ్యంబైన చోఁబోవనే?
దిక్కై ప్రోచితివయ్య! నీకు నది తృప్తే? వెంకటేశా ప్రభో! 1130

ఉ॥ పోసిన నారుకున్ జలము పోయఁడొ? నెవ్వరు పెంచకున్నచో,
వేసిన విత్తులన్ పెఱుకవేయునె? నావిధిదాట నెవ్వరున్,
యాసమవర్తియున్ జనఁడు యాయువుఁదీయగ! యైననింతకున్,
యాసమయంబుకై ననుసహాయ మొనర్పుము! వెంకటేశ్వరా! 1131

ఉ॥ ప్రత్యయమంతయున్ నెఱిగి బాధలు పొలగుచుందురెందఱో?
నిత్యముకాని జీవితము నింద్యమయంబు నొనర్చుటెందఱో?
సత్యము నెప్పుడైన యముసన్నిధిఁజేరగ తప్పదోనిలన్?
మృత్యువువాత తప్పదుగ మేరువదాటిన? వెంకటేశ్వరా! 1132

ఉ॥ అంతిమయాత్రకై మనసు అఱ్ఱులుఁసాచెడు! వృద్ధురాలు, యే
మంతయు అమ్మఁగోరదు! యమాంతికమున్ జననేత్రణంబునో?
యెంతయునైన భార్యయగు యిందిర రుగ్మత నమ్మశక్యమే?
అంతగ వ్రాసియున్న నదియయ్యెడు తప్పదు! వెంకటేశ్వరా! 1133

మ॥ హిమశైలంబును మేరుపర్వతము, నేనెట్లైన సాధింపనౌ
శ్రమ దైవంబు వరంబు పొందనగు! వారాశిన్ తరింపంగనౌ
నౌ? మహాగ్నిన్ నఱచేత దాల్చదలమో? నూఱేండ్లు జీవించగా,
యమపాశంబును తప్పకోగలుగు నౌనా? వెంకటేశా ప్రభో! 1134

మ॥ యమపాశం బికకంఠమున్ దగులముందైనన్ గళంబున్ కఫం
బమితంబై పలుకాడ నోపమునుపే, యార్తిన్, భవాద్రృశ్యమా
త్రము దర్శించగ, కన్నులుంచ, నిను నోరారన్ స్మరింపంగ, నా
మము వ్రాయంగను భాగ్యమున్నిడు మహాత్మా! వెంకటేశా ప్రభో!

ఉ॥ నామము నుచ్చరింపగలనయ్య, కరంబుల మ్రొక్కనౌదునో?
నీ మహిమాన్వితంబునగు నీలమయాకృతి కాంచనౌదునో?
నామరణాంతమందనుకనయ్యెడు, కాదిది, మున్నెనాస్మృతిన్
నేమమెనుండ వ్రాయగను శీఘ్రము చూడుమ! వెంకటేశ్వరా! 1136

ఉ॥ ఎప్పుడొ చేయబూని, తరియించుటకంటెను కాలయాపనన్,
నిప్పుడె సేయకుండ ఫలమిప్పుడె నందగ భావ్యమౌనునే?
మెప్పుదలైన కార్యమునిమేషము మాత్రము జాలునయ్య, నే
చప్పునజేసి ధన్యమగు శక్తి యొసంగుము! వెంకటేశ్వరా! 1137

ఉ॥ కాలము నొక్కరీతి జనకష్టము! దానిని దాటనెప్పుడున్
జాలము! నున్నదానిగను చయ్యన భోగ్యమొనర్పనైనచోఁ
జాలును! నెంతయున్ననది సౌఖ్యమొసంగునె? తృప్తికంటెనున్,
మేలగుదాని పొందగలమే? విధిదాటగ? వెంకటేశ్వరా! 1138

చం॥ ప్రథమ పదంబు దాటితిని! వార్ధకమొచ్చెను! నిన్నినాళ్లగా
విధిననుకూలమౌ గతినివేచితి! సత్వర కార్యదీక్షకున్,
కధనము కావ్యసంపుటము కాగలనాజ్ఞ నొసంగుమయ్య! నే
వృధపఱుపంగ బోనికను, విన్నపమియ్యదె! వెంకటేశ్వరా! 1139

ఉ॥ కాదు, వృధాశ్రమంబనుటకంటెను తోచెడి నిన్ను జేరగన్,
నీదయపొంది సప్తగిరినేగి పదంబుల నాశ్రయింతు! రే
వో? దయయున్న మాపొ? ఘనపూజలొనర్చుచు శాంతిఁగాంచగన్
నౌ దలదాల్తు నానతిని! నయ్యదెమిన్నయె! వెంకటేశ్వరా! 1140

కవిత్వ సమీక్ష :-

చం॥ తలచిన నాకవిత్వమును ధన్యమొనర్పగ మానసంబునన్,
వలసిన భావమా పటిమ భారము నీచరణంబు నన్నిడన్,
కలిగెను మధ్యమధ్యను విఘాతము, భార్యయు తల్లి బాధ్యతల్
చలనము చేయుచున్నదది, సవ్యము నెట్లగు? వెంకటేశ్వరా! 1141

చం॥ మనము ప్రబోధితంబయె! ప్రమాణము గైకొనె శారదాంబయున్,
పనిచె కవిత్వసాధనము, పాదములంటగ పీఠమందునన్,
ననువగు శక్తియుక్తులను, నవ్యయునిన్ మకుటాయమైనమై
తనరగఁజేయ పంచెగద! దాచగనెందుకు? వెంకటేశ్వరా! 1142

ఉ॥ భాసరపీఠమున్ పరమపావని భారతి సైకతంబునన్,
వ్యాసమహర్షి నిల్పెనట, పార్వతి లక్ష్మియు ప్రక్కనుండగన్
వాసిగడించె! దర్శనమువాణి ప్రసన్నత భావదృక్కులన్,
భాసితుఁజేసె, మానసము బాధ్యతపైనిడి! వెంకటేశ్వరా! 1143

ఉ॥ శారద నిల్చె భావనలో, సర్వసమర్థుఁడు విఘ్నరాజునున్,
భారమునున్ వహియింపుమనె, బాధ్యతమేఁటకు, కార్యసాధనన్,
కారణభూతమై మెలగె, కష్టపరంపర జీవితంబునన్
సారమనంగ వెల్వడె విచారణ సల్పగ! వెంకటేశ్వరా! 1144

చం॥ కవనము సేయఁబూన శతకంబు, ప్రబంధము, ఖండకావ్యమున్,
నవిరళధారలన్ కురియు నాశుకవిత్వము, చాటు పద్యముల్,
యవి యవధానమో? సభల అష్టశతంబొ? శతావధానమో?
యెవియును చేయలేనిదయె, యేమని తెల్పుదు! వెంకటేశ్వరా! 1145

ఉ॥ నామనసార కోరగను, నౌదలదాల్చితి దైవయానతిన్,
స్వామికి అంకితంబిడగ సాధనఁజూపితి చేతనైనటుల్,
యామహిమాన్వితుండు తనకంకితమివ్వఁగఁజేసె నన్నిటుల్,
కామితసిద్ధికై జరిగె కావ్యమొనర్పగ! వెంకటేశ్వరా! 1146

చం॥ వివిధ పురాణ గాధలను, వీరుల దేశచరిత్ర కల్పనల్,
యవిమహనీయ పూరుషుల నాత్మకథల్ రచనానుబంధముల్,
చివరకు రాజవంశజుల జీవిత సంగ్రహమంచు వ్రాయగన్,
కవితయెనయ్యె పూర్వమున కార్యఫలంబుగ! వెంకటేశ్వరా! 1147

మ॥ అసలీ భావము జీవితార్థమున, కావ్యంబై కవిత్వంబునన్,
పసివానింగను కష్టనష్టముల సంప్రాప్తించగా వాటినిన్,
కసిఁదీఱంగను దత్తునైబొగుల వ్యాఖ్యానించి వ్రాయంగ, మా
నసముద్వేగపురూపు కల్పనయెనన్నా! వెంకటేశా ప్రభో! 1148

ఉ॥ భావకవిత్వమున్ రచన ప్రాపువహించెను నాడునేడునున్,
భావప్రధానమైవఱలు పద్యము నవ్యకవిత్వమందునన్,
కోవిదులైన పండితు, లకుంఠిత దీక్షతొ సూత్రధారులై
ప్రోవను మార్గదర్శులయి రూపొనరించిరి! వెంకటేశ్వరా! 1149

ఉ॥ కావ్యరసానుభూతిగను గ్రంధము వెల్వడ చింతనంబునన్
దివ్యమనోజ్ఞ భావనల దేశ్యపదంబుల తద్భవంబునన్,
భావ్యమనంగ నౌరచన పద్యములందున నవ్యసాహితిన్
నవ్యయమై వెలుంగగను నవ్యయమందెను వెంకటేశ్వరా! 1150

ఉ॥ రాజులు సాహితీప్రియులు రమ్యరసజ్ఞత కావ్యపోషణా
భాజనులైసదా కవుల పండితులాదరణీయ గోష్ఠినిన్,
సాజమునందగన్ వఱలు సంస్కృత విద్యవిశేషకపోషణన్
రాజిలె పూర్వమే, ప్రజల, రాణువనందున వెంకటేశ్వరా! 1151

ఉ॥ కొందఱు జీవితార్థ, కనుగుణ్యము కావ్యము పొట్టకోసమై,
యందగఁజేయ రాజులకు నంకితమిచ్చుచు కామితార్థమున్
పొందుచు మాన్యముల్, మడులు, భూములు, భూషణ, నగ్రహారముల్,
యందిరి పాత్రకంకితమునందు ఫలంబుగ! వెంకటేశ్వరా! 1152

ఉ॥ భావప్రధానమౌ సరళవాఙ్మయమందున రాజవంశమున్
జీవితమాధురీ ప్రణయసింధువు తేలు, చరిత్ర వ్రాయగన్,
భూవరులానతీయ కవిపుంగవులావిధి వ్రాసినంకితం
బావిభుకిచ్చిగైకొనిరి! భాగ్యము సంపద! వెంకటేశ్వరా! 1153

చం॥ పసిహృదయంబు నొచ్చినను, భగ్నమనోరథప్రేమయైనసున్,
నసిచెడి దండితాడిత భుజంగమునైనను పుండరీకమున్,
మసలెడు పౌరుషంబు నభిమానము పెల్లుబుకంగ రోషమున్,
కసి, పగఁదీర్చుకొందురు విఘాతపు జీవులు! వెంకటేశ్వరా! 1154

చం॥ పగవలనన్ మఱిన్ గలుగు పంతము కోపము హానినాశమున్,
వగచి ప్రయోజనంబు తరువాతను శూన్యము, కార్యశూర్యులై,
మగటిమి లక్ష్యసిద్ధి పరమార్థ మెఱుంగక దీక్షకంకణన్,
సొగసుగ కావ్యమల్లెదరు! సొంపుఁదలిర్పగ! వెంకటేశ్వరా! 1155

చం॥ మదినిటు కార్యరూపమున మత్సరమెంతయు తోపకుండగన్,
ముదు యుగమందు సంతతి సమున్నతరీతిని సంప్రదాయమౌ,
పదునుగ యోచనాధృతిని పాడిమెయిన్ నడువంగ వారికిన్,
వదలతి యోగ్యమౌనటుల వర్తనమందగ! వెంకటేశ్వరా! 1156

శా॥ నా సంకల్పము యూహసంజనిత విజ్ఞానంబు రూపంబునన్,
యాసందర్భమునందు భావ్యమనుచున్ వ్యాప్తాత్తమౌ తోచగన్,
నాసాహిత్యము కల్పనాసహిత మౌనౌనాశ కల్పించుచున్,
భాసిల్లన్‌తగు దోహదంబిడును! తప్పా? వెంకటేశా ప్రభో! 1157

ఉ॥ లోకముతీరు, పోకడలు, లోకులొనర్చెడు ఘాతుకంబులన్,
కాకలుఁదీఱినట్టి యతికాయ బలాఢ్యుల నాగడంబులన్,
సాకెడు రాజకీయ బలశక్తుల పోషణనెంచిచూప, నే
కైక ప్రచార సాధనమునౌను కవిత్వము! వెంకటేశ్వరా! 1158

చం॥ సరసకవిత్వ సంపదకు, సాధననేర్పును సాధ్యమైనటుల్,
సరసవిహీనమౌ రచన సల్పగ ఛాందసులన్ నెదుర్కొనన్,
చరిత మొనర్పఁజేయుటది చాతురి రమ్యత పాడియైచనున్,
నరుదుగగాని సాగదది నర్హతనొందగ! వెంకటేశ్వరా! 1159

చం॥ రచనకుపక్రమింపగను, వ్రాయగ, నేర్పును, యోచనాధృతిన్,
పచనముఁసేయు వంటకము ప్రాభవమొప్పగ హస్తివాసియున్,
రుచులనుదెల్పు జిహ్వయును రూపొనరించెడు పూర్వపుణ్యమౌ
చు చరితమందు కాననగు, సూనృత వాక్యము! వెంకటేశ్వరా! 1160

ఉ॥ మంచితనంబుకన్న తలమానికమైనదిలేదు కాంచగన్,
పంచనుజేరి కాపురము భగ్నమొనర్చెడు వారలుండగన్,
త్రుంచను మానసంబులను దోహదమిచ్చెడు కార్యసాధకుల్,
కాంచగ దేశమందు నధికంబయి నొప్పెడు! వెంకటేశ్వరా! 1161

ఉ॥ చల్లనితల్లిఁ గల్గుటకు, జాబిలికైవడి రక్షితంబగున్,
కల్లయునైననున్ నొకనికాపురమున్ సరిదిద్ద యొప్పెడున్,
ప్రల్లదమాడియున్ నొకవివాహమొనర్పగ జాలునన్నచో,
నొల్లదు నీజగంబునది నోర్చుట కష్టము! వెంకటేశ్వరా! 1162

చం॥ వడలిన చర్మమున్ నడక వంకర, పాదము తొట్రుపాటునై
సడలిన కండరాల్ బిగువుఁజారగ, పొట్టయుక్రుంగ లోనికిన్,
ముడుతలు మోమునన్ కనులు మూయగ జెప్పల నీలినీడలున్,
బడలె వయస్సునున్ బ్రతుకు బట్టబయల్పడె! వెంకటేశ్వరా! 1163

ఉ॥ మూపురమొక్క త్రాటిపయి మోయగ భారము, మూల్గుచుండగన్,
పోవగ ముందు వెన్కలను పోరుచు నిత్యము భార్య తల్లియున్,
జీవితసాగరంబునను జీర్ణమునైన వృధాప్రయాసతో,
నావనునెట్లుఁజేర్చెదవో? నావలితీరము! వెంకటేశ్వరా! 1164

చం॥ గడచె దశాబ్ద సప్తమము కాలవిలంబనమౌచు నింతకున్,
తడబిడ పాదముల్ మనసు తత్తరపాటునుజెంద జీవితం
బిడెడు సమస్యలొక్కొలికి నెప్పుడు వచ్చును? వత్సరాంతమున్,
నొడుదుడుకుల్ విచారము ప్రయుక్తమునయ్యెడు! వెంకటేశ్వరా!

ఉ॥ పుత్రులు కల్గినంత యనుభూతిని వారలుబ్రోచు పద్ధతిన్,
నాత్రమునన్ కనంబఱచు వ్యావృతమున్కన, కన్నవారిపై
సూత్రముగా కనంబడును! చోద్యమె? నిక్కలికాలమందు నే
మాత్రము నబ్బురంబనుట మానవ నైజము! వెంకటేశ్వరా! 1166

ఉ॥ రమ్మనిపిల్చుటొక్కటియు రాగనురాగపు నాశ్రయంబునన్,
నిమ్మగ తల్లిదండ్రులకు నిచ్చెడు గౌరవ మొక్కటైనచో,
నమ్మినవారి నమ్మకము న్యాయముఁగూర్చుట పెద్ద మేలగున్,
వమ్మునుచేయ పుత్రులకు పాడియె చూడగ! వెంకటేశ్వరా! 1167

ఉ॥ అంతటి నీచకార్యమపహాస్యముకున్ నొడిగట్టరంచునా
సంతతిఁజేరి గౌరవము సౌఖ్యమునందితి! తృప్తిఁజెంది, ను
న్నంతలోఁ జేర్చితిన్ పురిటికంచును లక్ష్మిని పుట్టినింటికన్,
నంత సుఖప్రసూతియయి హాయిగనుండిరి! వెంకటేశ్వరా! 1168

మ॥ నవమాసంబులు మోసి పుత్రుగనె! పున్నామంబు దాటించగన్,
వివశంబందిరి అత్తమామలును సంప్రీతుండు ముత్తాత, యా
యవకాశంబున తాతనామకరణంబా కృష్ణచైతన్య వై
ష్ణవ నామంబును సువర్ణమున్నిడె తదంశన్! వెంకటేశా ప్రభో! 1169

శా॥ వైశాఖంబున శుక్లపక్ష దశమిన్ బాలుండు జన్మించె! నా
ప్రాశస్త్యంబగు వంశమున్ గలిగె గోపాలున్ ప్రపౌత్రుండుగా,
యాశాజ్యోతిగ వంశముద్ధరణకై హర్షించుచున్ పొంగె, తా
యాశీస్సుల్నిడి మంగపోలు చనిరయ్యా! వెంకటేశా ప్రభో! 1170

ఉ॥ ఒక్కొక కార్యసాధనము యూహకతీతమునౌ పరంగుచున్,
నెక్కువ గ్రాహగహంబు గతులెంచగ రాశిలొ తేటతెల్లమౌ,
చక్కటి మైత్రియో? ప్రతిగ సంకటమార్గము సూచితంబునో?
నక్కఱఁదీర్చి ధర్మయుత నాచరణంబయె! వెంకటేశ్వరా! 1171

ఉ॥ నూతన వత్సరాన్వితమ నోము ఫలించినయట్లు తాత, ము
త్తాతలు జీవితంబునను ధన్యతఁజెందినయట్లు, తండ్రియున్,
మాతయు, సంతసంబుకన మామయు యత్తయు కోర్కఁదీఱిన
ట్లా తలియున్ ప్రజాపతిని నాత్మజుకన్నది! వెంకటేశ్వరా! 1172

జీవిత మొదుదుడుకులు

ఉ॥ బావయు, చెల్లెలో కమలబందుగు లిందిర వారివారు, గో
దావరి పుష్కరంబులను తానముఁగున్కలిడంగ యోచనన్,
యావిధమున్ సుతుండు, గననాశతోఁజేరిరి రాజమండ్రికిన్,
పావన గౌతమిన్మునుగ భాగ్యము కోసము! వెంకటేశ్వరా! 1173

ఉ॥ స్నానముల్తైన రెండవ దినంబున నిందిర గుండెపోటు మెం
డైన ఫలంబునంది "సిటి హాస్పిట"లందునజేర్చ వైద్యసే
వా నియమానుసారముగ వ్యాది నివారణమయ్యె! నంతటన్,
ప్రాణభయంబు లేదనిరి! భావికనెట్టులో! వెంకటేశ్వరా! 1174

ఉ॥ చెల్లెలు బావయున్ చనిరి చెచ్చెరనింటికి వంగవోలుకున్,
నల్లనజాఱు పైటచెఱగంచును నడ్డము పెట్టికుందుచున్,
పిల్ల సుజాతపై మరులు పెంచుకొనంగగ పుష్కరాలపై
పెల్లుబుకంగ కోపమున పెంపరలాడుచు! వెంకటేశ్వరా! 1175

చం॥ పదియవరోజు నిందిరను పంపిరి నింటికి, సర్విప్యాధితో
యెడిగిన బొబ్బలన్ నడువనీయని బాధతో కుందుచుండ, న
య్యెదునున నేగుదెంచె, సుతయంత ప్రసూన సుదీర్ఘ చర్చలన్,
వదలితి గౌతమిన్, విజయవాడకు చేరగ! వెంకటేశ్వరా! 1176

ఉ॥ మేడపయిన్ నివాసమయి, మెట్లనునెక్కుట కష్టమౌనుగా?
వాడుక నీరుయెద్దడియె? వస్త్రములన్ నుతుకంగ చాకలిన్
లేఁడుగదా? వివేకమువలెన్, తగుకష్టము పాలుగాగ, నా
కోడలు పడ్డపాట్లుగని కుందుచు వెళ్లితి! వెంకటేశ్వరా! 1177

ఉ॥ వ్యాధి నయంబుఁగానదయె! యాశయు కన్పడదంతదంతగా,
బాధభరించజాల కనుబంధముఁగూడను త్రెంచరానిదై,
వేధయు మాత్రమే మిగిలె! వేళకు నిద్రయు రాకనెంతకున్,
సాధనజేయ తప్పదయె! శాంతిని పొందగ! వెంకటేశ్వరా! 1178

చం॥ దినములు దొర్లుచుండ నొకదేవత చల్లనిచూపువల్లనో?
కనికరమందెనో? మగఁడుకట్టిన తాళిఫలంబు నందెనో?
యనగ ప్రసూన నింటికిని హైదరబాదుకుఁజేర్చె మమ్ములన్
చనియట వెళ్లబుచ్చితిమి చాలినకాలము! వెంకటేశ్వరా! 1179

చం॥ "యిదియొక శాపమో? తమరి యింటను నుండకపోయిరెందుకో?
యదియను కూతునింటఁ జనహాస్యముఁగాదొకో? లాయఖందుమా?
యెదిగిన పుత్రులుండ తమకేమిటి తక్కువ? కొడ్కునింట, నే
కొదువ యొనర్చిరో? యనిరి కోడలు కొడ్కులు! వెంకటేశ్వరా! 1180

ఉ॥ "నాయన మిమ్ము తెచ్చితిని, నాదొక విన్నపమయ్య! బేబికిన్;
ప్రాయమువచ్చె! గావున వివాహపు యత్నముఁజేయగావలెన్,
యాయనలేరు! పెద్దరికమల్లుని తేగలభారమింక మీ
దే" యను కూతుమాటల విధేయుఁడనైతిని! వెంకటేశ్వరా! 1181

ఉ॥ కాదనలేని బాధ్యతను, కార్యము నిర్వహణంబునందునన్,
నౌదలదాల్చి నేగగ ప్రయత్నఫలోన్ముఖమౌట, హైదరా
బాదుననుండగా వలసివచ్చె సహాయమునందఁజేయగన్,
నాదరణీయమౌనొకనినల్లుని గాంచిరి! వెంకటేశ్వరా! 1182

దత్తుతల్లి ప్రతీకారము :

ఉ॥ "తానొకటిన్ తలంచనది దైవమునింకొక రీతిఁజేయు! నా?"
పూనె ప్రసూన "బొమ్మ"యని పోషణభారము రంగనాయకిన్,
"నైనది రెండు వత్సరములైన" వటంచును నేగెనింటి కే
మౌనొకొ? జీవితంబునను నంత్యమునందున! వెంకటేశ్వరా! 1183

చం॥ "తనకిక యోపికెక్కడిది? తక్కువయే మొనరించెనంట? తా
యెనుబదియారు వత్సరములెన్నగనౌ ముదివగ్గు? వంటకున్,
కనులును కానిపించవయె? కాలుకదల్చను జాలదయ్యె? తా
ననుసరణీయ జీవితమొకంతట కావలె తోడునీడగన్!" 1184

చం॥ "ముదిమిపయింబడంగనతి మూర్ఖత, ఛాందస లోభితత్వమున్,
పనిలమొనర్పగన్ ధనము పాత్రలొ దాచెడుబుద్ధి! ఆస్తి సం
పదలకు నంగలార్చు తనపంతముకాక మరేమి? తైన మొం
డిది? బ్రతుకంగలేదు? సుతుఁడేమి యొనర్చెనొ? రంగనాయకిన్!

ఉ॥ ఆలనపాలనన్ మనుమరాలి గృహంబున సాగుచుండ, చీ
రాలకునేగె యాస్తికని! రచ్చకునీడ్చు తలంపు పుత్రునిన్,
తాలిమిలేనిదా బ్రతుకు ధర్మమె? తప్పదు నేటికెంత పో
గాలము దాపురించె విధికైన తలొగ్గదె? యన్నవారునై. 1186

ఉ॥ అంత గృహంబుకేగ, నొకరైనను, అద్దెకురాకపోవ, నా
పంతులు పాఠశాల కనిపంచను బాడుగలేకపోవగన్,
యింతికి సాయమివ్వచనరెవ్వరు! కానిచొ నెల్లకాలమున్,
పంతముకాక మేమిటది వంతలపాలవ! వెంకటేశ్వరా! 1187

ఉ॥ యెంతటి అంగముల్ పనులు యేమియు చేయవు! డబ్బుయుండి తా
స్వంత మనుష్యులంబలె నవశ్యము చెంతకురారువారు! ర
వ్వంతయు బుద్ధిలేదు(గద? వట్టిభ్రమన్ తను పాకులాడగన్
చింత మిగిల్చె నామెకటు చేతులుకాలగ! వెంకటేశ్వరా! 1188

మ॥ "తిని కూర్చుండగలేక మమ్ములను సాధించంగ తానేగెనో?
తనకాకోడలు కొడ్కు గిట్టరయె! బాంధవ్యంబునున్ నుండి, యే
మని యారాటమొ? డబ్బుకోసమొకొ? నమ్మన్‌బోదు తానెవ్వరిన్,
యనుచున్ ప్రాణము కొట్టులాడెనుగదయ్యా! వెంకటేశా ప్రభో! 1189

చం॥ "కడచెను నాల్గునెల్లు నతికష్టముమీదను, జీవితంబికన్,
గడవగ(బోదు, ముందునిక కాలము(జేయువయయ్యె, (గావునన్,
వడినను తోడ్కొనంగవలె, వ్యర్థపుమాటలు వేయినేలకో,
పిడికిలి అన్నమివ్వమని" పేర్కొని వ్రాసెను తల్లియంతటన్,

చం॥ "అడిగిన నాధు(డే కఱవు అయ్యెను, అద్దెకు రాకపోయిరే?
యడుగులు వేయ(జాలనిక యాయువు చేరువనయ్యె! మట్టిచే
యు(డు! ముడివెట్టనింటిగతి! యోపినరీతిని పోషణంబిడన్,
అడిగితిచాలు నిచ్చినచొ" అంచు లిఖించెను! వెంకటేశ్వరా! 1191

మ॥ అనుకొన్నంతయునైనదమ్మయును నత్యాశన్ ప్రబోధంబునై
చని సాధించ(దలంచె, కాని తనకా సామర్థ్యమున్ చాలదం
చని యూహించకపోయె? తప్పనిసరిన్ సంకోచమున్ వీడివ
చ్చెను! నారంతర్యము గ్రాహ్యమౌనటుల(జేసెన్! వెంకటేశా ప్రభో!

ఉ॥ ఆవిధి మాతృమూర్తి మునుపాశ్రయమిచ్చిన పౌత్రినింటికిన్,
పోవగ తప్పదయ్యె! తలపోయుచు గూటికిఁజేరె పక్షియున్.
"దైవమువోలె నాదుకొన తప్పదు నీకనె!" బాష్పరుద్ధయై,
"బావికనెట్టులుండునొ, అభాసౌనవద్దనె"! వెంకటేశ్వరా! 1193

ఉ॥ ప్రాణముకన్న తీపి ధనరాసులు యెంతురు లుబ్ధులంత! సా
తానునికిచ్చె అద్దెకని, తల్లి గృహంబును కాంక్షతో! పదే
శైనను నిల్లువీడమనిరన్న విధంబున విక్రయంబు మే
లౌనని తోచె! కాలము విలంబన యోచన! వెంకటేశ్వరా! 1194

చం॥ క్రయమును సంప్రదింపులయె, కార్యఫలోన్ముఖమందు తేది ని
శ్చయమయె! వ్రాతకోతలును సాగెను! ముప్పదివేలు ముందు ని
ర్ణయమయె! నివ్వలక్షయును నాలుగుమాసములందు తీర్చ సా
మియనె "బయాన" ముందు ధనమిచ్చిరి! నంతట! వెంకటేశ్వరా!

## గాయత్రి వివాహము సంప్రదాయములు, పురుషాధిక్యత

ఉ॥ బాబు ప్రధాన భూమికతొ పాత్రను నిర్వహణంబు సోదరీ
"బేబి" వివాహయత్నమునభీప్సితసిద్ధిని పొందె! తప్పెనా
కాబరువైననున్, వరునికన్ గల జాతక చక్రమందు రా
శిబల మైత్రియున్ కలియఁజేసె విధాతయు! వెంకటేశ్వరా! 1196

చం॥ వరునకు నచ్చెనన్న, వధువంతట సిగ్గులమొగ్గ దొంతరల్
బరణియు నయ్యె, పెద్దలు శుభంబనుచున్ కబురంపె నిష్ఠతన్,
నిరువురు సంప్రదింపులకు నిచ్చమెయిన్ తుదినిర్ణయంబునున్,
దొరకొనజేసె పెండ్లికది దోహదమిచ్చెను! వెంకటేశ్వరా! 1197

చం॥ వరుఁడట కామరాజు ఘనవంశము, కాశ్యపసంబు గోత్రుఁడై
పరఁగెను శ్రీనివాసుఁడని పల్కఁగ చూడ్కులు సౌమ్యవంతమై,
యరుదు ప్రలాపనంబు, దరహాసము మాత్రము సుందరంబునై,
నరమరికంచులేదతని నాననమందున! వెంకటేశ్వరా! 1198

చం॥ అడిగినవన్నియున్ నమరె! యల్లుని కుంగరమిచ్చు కోర్కెతో,
తడయక మూర్తమున్ వరుని తల్లియు, దండ్రియు వారెనన్నునున్,
నిడుమన చైత్రశుద్ధమున నింద్యములేనిది శాస్త్రవేత్తలన్,
నడుగగ శ్రేష్ఠమైబఱగు నంచని జెప్పిరి! వెంకటేశ్వరా! 1199

ఉ॥ పెండిలిఁజేయగా, వసతి, విందును, వియ్యము నందువారికిన్,
నుండ విశాలమౌవిడిది, యోగ్యమునై, చతురస్రమైనదై,
మండపమందు వేదిక నమర్చి, గదుల్ తమరాక్రమించగన్,
నిండగు దీపపుకాంతులతొ నిచ్చుట దర్మము! వెంకటేశ్వరా! 1200

ఉ॥ కాన విశాలమైనదియు, కంటికినింపగు దొడ్డదైన, క
ళ్యాణమొనర్చ వేదికయు, యన్నివిధంబులఁజేరువైన, మే
లైనది వేలువేలు గదులందున, చావడు లొక్కతీలు, "క
మ్యూనిటిహాలు" లభ్యమవ యొప్పితి, తెల్పితి! వారికంతటన్; 1201

ఉ॥ "హాలు ముహూర్తమున్ కుదిరె" యంచన "నెవ్వరనుజ్ఞ నిచ్చిరో?
హాలునుమీరె యేలుకొన మానతిపొందగ లేకపోయిరో?
చాలు! ముహూర్తమైనదని శాస్త్రిలు చెప్పగ మాకులేరొకో?
యేలని" పెండ్లివారుకడు యీసునబల్కిరి! వెంకటేశ్వరా! 1202

చం॥ మొదట ముహూర్త నిశ్చయము ముందుగజెప్పగ పెండ్లివారలే,
యదిసరి, సంప్రదింపులలొ యయ్యది మీరికపెట్టుమన్న వా
రది యొక తప్పిదంబనిరి, "హాలును మూర్తము తోడఁజూడ మా
కదియె ప్రధానమంచు" కబురంపితి వెంటనె! వెంకటేశ్వరా! 1203

చం॥ తెలియనివారికైన కడుతృప్తిగ నచ్చగఁ జెప్పవచ్చుబో?
తెలియనివారి కర్థమగు తేటతెనుంగనఁ జెప్పవచ్చునే?
తెలిసియు తెల్వదంచనెడు తెంపరులేమన? మీదుమిక్కిలిన్,
విలువలు లేనివారికడ వెళ్లుట నీచము! వెంకటేశ్వరా! 1204

చం॥ మొదట వివాహయత్నమున, ముఖ్యము చూపులు, సంప్రదింపులున్,
తదుపరి మూర్త నిశ్చయము, ధర్మమునౌ మగపెండ్లివారికిన్,
అది యనుకూలమౌ విడిదియందు వివాహపు మండపంబునున్,
యదినిక కన్యదానమును యాఖరివిందును, నప్పగింతలున్, 1205

చం॥ యనునవి కన్యదాతలకు యర్హతకొద్దియు నిచ్చిపుచ్చుకో
లును, తమ గౌరవంబెసగ లోపమొనర్చెఁడు, కార్యమున్ తగన్,
కనుబడనీయకన్, తగవు కచ్చియమిర్చురు సాగనీయకున్,
ననునయ వాక్యముల్ నతిశుభావహమయ్యెడు! వెంకటేశ్వరా! 120‸

ఉ॥ వియ్యమునందగన్ పరువు పేరును నొఁసరి వారిమధ్యనున్,
నెయ్యము పెంచుకోవలెను, నిందలొనర్చుచు మాటిమాటికిన్,
కయ్యము కోరువారలకు గౌరవమబ్బునె? కార్యసాధకుల్
చయ్యన కూడివత్తురట సౌమ్యవతంసులు! వెంకటేశ్వరా! 1207

చం॥ "ముదుసలి పంపకండి మొగమోటమెఱుంగఁడు నెంతచెప్పినన్,
వదలఁడు పట్టువీడఁడొకొ? వానిదెపంతమటంచు" పల్కిరా
మదమున కుఱ్ఱకుంకలు సమంజసమెంచరు! పెద్దపిన్నలే
దదియును మంచిదేయనుచు నాత్మలొమ్రగ్గితి! వెంకటేశ్వరా! 1208

ఉ॥ "కాంతయు నాప్రసూన సుతకై పడి భర్తృవిహీనురాలినిన్
నెంతగ నాదరించితిని, నిన్నిది నాలుగ పల్కనాడకన్,
సంతతి మెన్నిసారులో విచార వివాదపరంబు వాటినిన్,
నెంతయుకావ, నిప్పుడవి నిష్ఠురశూలపు పల్కులయ్యెనో? 1209

ఉ॥ పెండిలి సంప్రదింపులలో "విందునిడంగగ రెండుపూటలున్,
పెండిలి యంపకంబులన, వియ్యపురాలును నీకొసంగ", బా
గుండు "రిసెప్షను"నిచ్చుటకుగూడను నింకొకపూటమైనచో?
వండుట మీకు తప్పదని హాదనలాడిరి! వెంకటేశ్వరా! 1210

మ॥ అని భీష్మించె వరుండు తల్లి; సుతవియ్యాల్వారి కయ్యాలకున్,
మనసున్ భీతిలి సామరస్యమున సన్మానించ వాక్యంబులన్,
కినుకన్ యాపెడమోమునందున, ననంగీకారమోనన్న, నే
ప్రణతుండైతిని నాపెకున్ కరుణ నైరాశ్యంబునన్ దప్పకన్, 1211

మ॥ "అది తప్పా" వధు తాత పెద్దనిటుచేయన్ నొప్పునే? నంచునున్
మెదపన్ నోరునులేరు నొక్కరును! "మమ్మోమాత్రమున్ గౌరవిం
పదగున్జాలును మొక్కగన్ యతఁడు తప్పా? పెండ్లికూతుండ్రకి
య్యదియున్ తెల్పదె!" బెట్టిదంపు పలుకయ్యా! వెంకటేశా ప్రభో!

మ॥ తనముందే తన తండ్రి గౌరవమునున్ దౌర్భాగ్యమున్ గాంచుచున్,
తెనవైనెన్ నొకమాటనాడదయె! తందానరెంచు మూర్ఖుండగా;
మనసా చేయునదేమిలేక సుతప్రామాణిక వాక్యంబుకున్,
యనుబంధంబున నుండిపోవలసెనయ్యా! వెంకటేశా ప్రభో 1213

ఉ॥ నేడు వివాహతంతు నతినింద్యమునౌ మగపెండ్లివారునున్,
కోడలు కట్నకాశపడి కూయగ కూతును జూచురీతులన్,
పాడియె? యైనతప్పదు! వివాహము పుత్రినినివ్వనట్లు, కా
పాడగ లేరువెవ్వరును! స్వానుభవంబిది! వెంకటేశ్వరా! 1214

ఉ॥ వచ్చిన కార్యమున్ గడచె! వాక్కు ఫలించె! ప్రసూన పుత్రికన్,
నచ్చిన పూరుషుండు తగునందముగా గలవానిపొందె! నే
నిచ్చినమాట కట్టుబడి నిల్చితి! అప్పు సగంబు తీర్చగా
చెచ్చెరవీడుకున్ వెడల సిద్ధమునైతిని! వెంకటేశ్వరా! 1215

శివలింగాగమనము :

చం॥ గురుని మహార్దశా ఫలము కొంచెమొ? గొప్పయొ? పొందగోర నీ
శ్వరునమకంబున్ చమక సంహితమౌ నభిషేకముల్ సదా
జరుప మనస్సునందు తలచన్, స్ఫటికంబున లింగప్రాప్తమై
గురుడయె నాగమయ్యయను కోవిదుడివ్వగ! వెంకటేశ్వరా! 1216

ఉ॥ దాతయు నాగమయ్య తను దానమొనర్చెను లింగమొక్కటిన్,
సైతము, వస్త్రదానమును, సంతసమందుచు నారికేళమున్,
నూతన వత్సరంబు తన నోమును నోచిన నిచ్చుకైవడిన్,
దాతగ తగ్గదానమును ధర్మమొనర్చెను! వెంకటేశ్వరా! 1217

చం॥ గురుడు నొసంగె లింగమ్ము, నిగూఢముగా బదులివ్వనోపగన్,
మఱువగలేక తత్ఫలము మన్ననజేయగ కానుకిచ్చితిన్,
యరయ ప్రతిగ్రహీత బదులన్నదికాకను దానమిచ్చుచో
మురిపెము దక్షిణంబిదియె ముచ్చటగొల్పగ! వెంకటేశ్వరా! 1218

ఉ॥ సంధియమేల మత్పిత్రుడు సైతము సేసెను లింగపూజనున్,
సుందరకాండ నిత్యమును సుస్వరమున్ పఠియించె, పుత్రుకున్
జెందెను వారసత్వమున జేస్తితినిన్ నభిషేకమర్చనా
సందున లింగమున్ గృహము సంతన సంతసమయ్యెనో ప్రభూ!

చం॥ హరి మనయింటి దైవమయె, అర్చనలందెను నిన్నినాళ్లగా,
హరుడు తనంతా వలచి నాశ్రితుడయ్యెను నెందుచేతనో?
హరిహర భేదమేవిధము నర్థరహిత్యమనర్థహేతువా?
యరమరికేల నిందుపరమార్థము నేమిటొ? వెంకటేశ్వరా! 1220

## షిరిడి సాయిబాబా దర్శనము : ప్రథమము

ఉ॥ రాజమహేంద్ర రైల్ బడికి, రాజను, వందన పంపయత్నమున్,
బాజిగడంగుమంచనగ, బాధ్యుఁడునైనటు మండలాధిపున్,
వ్యాజము పుట్టు పూర్వములు నర్హత తెల్పగఁజేర్చ నాజ్ఞయై,
నేజని జేర్చ, సాయికృపనే ఫలితంబయె వెంకటేశ్వరా! 1221

చం॥ షిరిడి ప్రయాణమై వెడలి చిన్మయరూపుని సాయినాథునిన్,
దరిశెనమంది సేవలను ధన్యుఁడనైతి! ప్రసాదమూదినిన్,
తలుచు లభింపబోదనెడు తార్కిక భావన కొంతపంచగన్,
తిరిగి గృహంబు ఁజేరితిని తీయని నూహల! వెంకటేశ్వరా! 1222

శా॥ "సాయీ నిన్ను దలంచి కార్యమునునే సాధించగా పూనితిన్
నాయుల్లంబున నిల్చిఁజేయుమయ, విన్నాణంబుగా బ్రోవుమా!
సాయంబించుక తోడ్పడంగకనుమా! సంకల్ప సిద్ధంబుగా,
నీయాశీస్సులు నందజేయుమయ నిన్నేనమ్మితిన్ పూర్తిగా!" 1223

ఉ॥ 'సాయి పవిత్రనామమును సంస్మరణంబున నెల్లవేళలన్,
బాయు దురంతముల్ననుచు భారము నీపయి కార్యసిద్ధికిన్
వేయగఁ బూనుకుంటినయ! విజ్ఞుఁడు నందగనుండ జాలునున్
పాయని భక్తితోడను ప్రపన్నుఁడ'నైతిని! సాయి దైవమా! 1224

ఉ॥ స్నానమొనర్చి తీర్థవిధి చయ్యన తీర్చగ భార్యతోడి కృ
ష్ణానది పుష్కరాలకు సశాస్త్రయుతంబుగ, నేగుఁదెంచ, న
ద్దానిని కన్యదాత తగదంచును పెండ్లివారుఁజెప్ప నే
పూనగనైతి తీర్థవిధి! మున్గితి నీటను తానమాడితిన్, 1225

ఉ॥ స్నానమొనర్చుచున్ యుదయసంధ్యల నర్కున కర్ఘ్యమిచ్చి కృ
ష్ణానదిమాత పూజలను సల్పుచు గాథవినంగ శాస్త్రికిన్,
దానము నాదిగాగలది తమ్ముల దక్షిణనివ్వ తృప్తిగా
మానసమందు శాంతినయె! మాన్యుఁడనైతిని వెంకటేశ్వరా! 1226

మ॥ దసరాపండుగ వచ్చెరమ్మనితి, నా దౌహిత్రినిన్ భర్తనున్,
నిసుగున్ గూడి భవాని భర్తనిటకున్ నేతెంచనానందమై
వసనంబుల్ నిక కట్నకానుకలు నాప్యాయంబుగానిచ్చి మా
నసమున్ తృప్తినిబొందె దేవికరుణన్నా! వెంకటేశా ప్రభో! 1227

# పంచమ చరణము

## తురియాయవస్థ, నిర్వేదము

ఉ॥ మండపమైనగాదు! నికమట్టితోఁగట్టిరి మంచువాయె, తా
ముండ నొకేకుటుంబమన, మూఁడుతరాల ముందువారు, నా
డుండుగ, నేడు పంచుకొని రొక్కొక భాగము మూవురున్‌తగన్,
పండని భూములన్, గృహము, వంతులవారిగ! వెంకటేశ్వరా! 1228

చం॥ చదరముకానిదయ్యు సువిశాలములైనవి, యిండ్లు, దొడ్లునున్,
పదిలమొనర్చి యిర్వురకు పంచిరి, యన్నకు, తమ్మునకున్ తగన్,
వదలిరి చీలికన్, "కునులు" పార్శ్వమునందది మధ్యవానికిన్,
పెదవి కదల్పరాదు, మరిపెద్దల తీరుపు! వెంకటేశ్వరా! 1229

ఉ॥ అన్నయు తమ్ముఁడున్ వరుస నమ్మిరి భాగము వారివారివిన్,
చిన్నతనంబుగాన, నివసించగ, తండ్రి యనంతరంబునన్,
యెన్నగ తల్లికిన్ సుతునకిచ్చిరి, అర్ధసగంబు భాగమా
కున్నదిగాన, తల్లిపరముంచిరి తప్పక! వెంకటేశ్వరా! 1230

ఉ॥ యెన్నడొ, అమ్మ ఆస్తులను నేగిరి పెద్దలు పొట్టనిండగన్,
యున్నది మాకు నిర్వురకు, యూరిలొ నుండక వృత్తి కోసమ
న్నన్న విధంబు, నేగ, తలి హక్కును పెంచుకొనంగనయ్యె! నా
కున్నది కాకమానదని నూరకయుంటిని! వెంకటేశ్వరా! 1231

ఉ॥ యిన్నిదినాలనంతరము, యింటిని వీడివచ్చె, నిచ్ఛమై,
పెన్నిధివోలె తప్పదని, విక్రయమున్ తనునిచ్చఁజూపె! నా
మన్ననజేసి పిల్లలను మాత్రము అడ్డము చెప్పకుండ నా
విన్నపమంది సంతకము వెంటనె జేసిరి! వెంకటేశ్వరా! 1232

ఉ॥ ముప్పదివేలు లక్షయును, పుత్రులు పుత్రి ప్రసూన బాకినిన్
అప్పును తీర్చియివ్వ, సగమర్థము తల్లికి పోషణార్థమై,
యొప్ప ప్రసూన బాంకులలొ యుంచితి, బాజి గృహంబు కట్టగన్,
తప్పక శాయి బుజ్జియును తమ్మునకిచ్చిరి డబ్బు అప్పుగా! 1233

ఉ॥ బాజి గృహంబు కట్టినది, బాధ్యత మేఱకు నేగిచూడగా,
రాజమహేంద్రమున్ నటవిరాజిలె, చక్కగ సక్రమంబుగన్,
నాజనసాంద్రతన్‌కనని నాపపుచేలలొ, నీరు నిల్వగా
పోజనరాదు, దారియును పూడుకపోవును! వెంకటేశ్వరా! 1234

చం॥ మకరము, సంక్రమించ రవిమాసమునయ్యెడు సంకురాత్రియై,
నొకపరి పండుగంచు తమ యూరికి రమ్మనె శాయి! వెళ్లగా
వికలమనస్కులై నచట వెళ్లినవారము శోకమూర్తులై
నికనట నుండలేక మనసింటికిఁజేర్చెను! వెంకటేశ్వరా! 1235

ఉ॥ ఈశ్వరిఁగొల్చెనామె! పరమేశ్వరి రూపమునందు రాజరా
జేశ్వరి చక్రమున్ తనకు నిచ్ఛమెయిన్ భజియించె! సల్పె మా
హేశ్వరి పూజలన్ తనిపె! యింటికి దీపము సాంబుభార్య రా
జేశ్వరినేగె నాకమునకీశ్వరి సన్నిధి! వెంకటేశ్వరా! 1236

ఉ॥ కోరిన పౌత్రులున్ గలిగె, కోడలు గర్భఫలంబనంగ, నా
చారుసుశీల రాజు రథసప్తమినాఁడు గతించె, శోకమా
కారపుమూర్తులై బొగుల కాలముఁజెందె సువర్ణతల్లి నా
కారు నిశీథమున్ పదునొకండవ రోజున! వెంకటేశ్వరా! 1237

ఉ॥ చేరితిమింటికిన్ కడకు! చేడియచేరెను వంటకత్తెగా,
భారమునొగదా! సతికి వంటకు చాకిరి చేయఁగూడదే?
యూరక తించు కూర్చొనగ యూడిగముల్ తముఁజేయనివ్వ, రె
వ్వారికినైన తప్పవాకొ! బాధ్యతలెప్పుడు! వెంకటేశ్వరా! 1238

ఉ॥ అంత యుగాది వచ్చునని యాశలు పెంచుకొనంగ నెల్లరున్,
చింతతొ జాతకంబులను శ్రీముఖ వత్సరమందు పుస్తకం
బంతట విల్చుచున్ నుదయభానుని రాకతొ చైత్రమాసమున్,
యంతలొవచ్చె రేపనగయామిని, పండుగ! వెంకటేశ్వరా! 1239

ఉ॥ తద్దిన పైతృకంబులు యథావిధి దత్తత తండ్రి, పత్నికిన్,
కొద్దియొ? గొప్పయో? కలుగ కూర్చితిమిన్ని దినాలనుండియున్,
వద్దనలేదు పిండమును వాయసముల్ తినిపోవుచుండగా,
నద్దియచాలు తృప్తిపడె నాబ్దికమందున! వెంకటేశ్వరా! 1240

చం॥ పితరులు తృప్తి పొందుటకు పిండములిచ్చుచు, చీర, చోళి, దో
వతులును చాపులున్ నెపుడు వైనముబట్టి సమర్థనీయమో,
సతతము, కాకపోయినను శ్రాద్ధదినంబు నొసంగ పాడియో,
మితముగ నిచ్చితిన్ తలకు మించని భారము! వెంకటేశ్వరా! 1241

ఉ॥ నీరసమన్న జబ్బు గణనీయముగా ననునావరించె, నే
దూరముపోవ, మెట్టులను త్రొక్కి గృహంబున పైకిపోవగన్,
భారమునయ్యె, నింక పనిపాటలయందున మందునైతినే,
"మారకముందమన్న" యనుమానము తోచెడు! వెంకటేశ్వరా! 1242

ఉ॥ ఎప్పుడు "కాయిలా" పడను, యింతటి నీరసమావహించెనే?
గుప్పెడు తిన్నరోజులను కూరుచు నూరక నుండలేనుగా?
ముప్పును తెచ్చిపెట్టె, గళమో, హొడిదగ్గున నూపిరాడదే?
తప్పను పట్టలేను నినుతల్చుట తప్పక వెంకటేశ్వరా! 1243

ఉ॥ పెట్టితివంట కత్తెమునుపే ననుకొన్న విధంబు తప్పదై,
తట్టుకొనంగఁజాలదని, దర్పముఁగాదని, పత్నికావగన్,
కట్టడిలేదుగా? ధనము, ఖర్చు భరించగ తప్పదౌనుగా?
పట్టిన ధర్మపత్నికగు భారము తీర్చుట! వెంకటేశ్వరా! 1244

ఉ॥ బాధలు నెప్పుడుండును విపత్కరముల్ కనుపించుచుండునో!
సాధనచేయగా నగువిషాదమునున్ మరపింపఁజేయగన్,
మాధవసేవయే కడు సమంజసమైనది జీవితంబునన్,
వేధకు మార్గమందురు వివేకవతంసులు! వెంకటేశ్వరా! 1245

ఉ॥ న్యాయముఁగూర్చి వ్యాజ్యెమును నాడగ హైదరబాదునందునన్,
నాయెను యైదువత్సరము, లైనను నొక్కట తీరుతెన్నునున్,
బాయదు? నెంతకాలము సభాస్థలి న్యాయవిచారణంబునున్
సేయరు? కాలయాపనముఁ జేయుటతప్పక! వెంకటేశ్వరా! 1246

ఉ॥ కాలము మాన్పగానగును గాయము నెట్టిదినైననంచు, నే
జాలముసేయగా తగునె? సాక్ష్యము పూర్వవిచారణంబయెన్,
వీలగుచో వకీలుకడ విన్నపమున్ పడవేయుమందు! పో
గాలము దాపురించనది కర్మము మాన్చునె? వెంకటేశ్వరా! 1247

ఉ॥ ప్రాయము డెబ్బదైదు తిథి పాడ్యమి నాటికి కృష్ణపక్షమున్,
నాయెను! మిట్టపల్లములు, ఆశనిరాశల, మధ్యనూగుచున్,
మ్రోయగ భారమౌ బ్రతుకు, రోయగ నయ్యెడు! జీవితావధిన్
నాయువు నుండుదాక నెటులైన భరింతును! వెంకటేశ్వరా! 1248

చం॥ గతమును సంస్మరింపగ నొకప్పుడు, నుండిన యున్కి, నేఁడు సం
తతి, సకుటుంబమున్, గృహము, దైవముఁ గొల్చెడు భాగ్యమందగన్,
సతతము తిండి బట్టలకు చాలన నిచ్చితివంతె! చాలునా
మితమును దాటలేను! మితిమీఱనులేనును! వెంకటేశ్వరా! 1249

చం॥ అయినను జంతువోలె బ్రతుకంతయు తిండియె ముఖ్యమందుమా?
పయనము, జీవితాశయపు, బాటల, నాశల, వృద్ధిపొందఁగో
ర, యనిశమున్ వృథాపఱుఁపరంగను మానిసికొప్పునౌనె? వా
యియు మనుజుండుకున్ పశువుకిచ్చు విధానముఁ నొక్కటౌనునా?

ఉ॥ న్యాయము ధర్మమున్ నడుపనయ్యెడు, ఁజూచును మానవుండు! గా
నీయిల, యుత్తమోత్తమము నెయ్యదియంచును యోచనాధృతిన్,
జేయసమర్థుఁడౌననగ చింతయె! తిండికి పొట్టకూటికిన్,
ప్రాయము వప్పఁజెప్పుట అపాయముగాదొకొ? వెంకటేశ్వరా! 1251

ఉ॥ కాలము తీర్పునిచ్చె! నుపకారమొనర్చెను దత్తుఁజేసి చీ
రాలకు! మాతృప్రేమ, కనురాగముకున్ కఱువాయె! పెండ్లియై
యాలితో వృత్తి, కోర్కెలకు అర్పణమైతిని! వృద్ధునైన నీ
వేళకు సత్ఫలంబుఁగన వేడుకనౌగద? వెంకటేశ్వరా! 1252

చం॥ ధనమును, ధాన్యమాన్యములు, దత్తునకందవు! పైతృకంబునౌ
ఋణమును, కర్మకాండల వహించి తిలోదక, తద్దినంబు, త
ప్పనిసరిఁజేయుమంచు తమ వంశము వృద్ధి నొనర్పఁబూనగా,
మనుగడయందురే? పనికిమాలిన ధర్మము! వెంకటేశ్వరా! 1253

ఉ॥ ధర్మము వల్లెవేయుటది శాస్త్రుల లక్షణమీయుగంబునన్,
కర్మలొనర్చుటే పురుషకారము, బిడ్డలవంతు? దానికా
మర్మము యాస్తికోసమని మాత్రము కర్మనిబద్ధమైనిడన్,
నిర్మలమౌ మనస్సునకు నీచముకాదొకొ? వెంకటేశ్వరా! 1254

శా॥ యే దైవంబు కృపాంతరంగుఁడయి, తానిచ్చెన్ వరంబింతకున్?
యే దీక్షాపరతంత్ర సాధనము చేయించెన్ ఫలోన్వంతమై
యేదో పూర్వకృతంబు జన్మఫల మిన్నైనైన సాఫల్యమే?
కాదేనిన్ బ్రతుకిట్లు సాగునా? కనంగన్! వెంకటేశా ప్రభో! 1255

శా॥ దౌహిత్రుండగు సుబ్రమణ్యునకునున్, తాంబూలముల్నివ్వ, వై
వాహంబౌ కృతనిశ్చితార్థమయె, సంబంధంబు రేపల్లెదై,
సాహాయంబుగ వ్యాజ్యెమున్ మొదటనే చర్చించ పూర్ణయ్య, న
న్నాహుతుండునుజేసె! సంశయము నొందన్! వెంకటేశా ప్రభో! 1256

## హైకోర్టు తీర్పు - తత్ వ్యాసంగము

ఉ॥ హైదరబాదునందు విజయంబును గాంచితి కోర్టు వ్యాజ్యెమున్,
యైదువసంత్రముల్ గడచె! నాటికి జడ్జియు పాండురంగడౌ,
ఖాదన తీర్పునిచ్చె, ప్రతివాదికి సంశయమాత్ర మొక్కటిన్,
తాదలయొగ్గె! తీర్పుప్రతి దాఖలునాయెను! వెంకటేశ్వరా! 1257

శా॥ ఆశారేఖయె! దైవమిచ్చె! నిజమౌ న్యాయంబు వ్యాజ్యెంబునన్,
యాశల్ వీడగలేదు. నాకనుభవేంద్యంబందగా తోచె! స
ర్వేశుండిచ్చు ధనంబు సంపదయునేవేళన్ ఫలంబందునో?
యాశాపాశము నెంత చెడ్డదౌ? కదయ్యా! వెంకటేశా ప్రభో! 1258

చం॥ మునుపు ప్రయాణమున్ షిరిడి ముందుగ వత్తును భార్యతోననన్,
వినగను తీర్పువచ్చెగద! వెళ్లితిమంతట సాయినాథునిన్,
మనసున సామికాంచగను మాటను నిల్పుకొనంగ బద్ధునై,
చని మనసార కొల్చితిని, సన్నిధియందున! వెంకటేశ్వరా! 1259

చం॥ పలువురు పేర్కొనన్ షిరిడి పావన గౌతమి తీరమందునన్,
నెలకొనియుండ, సాయి మహనీయు సమాధి! జనంగ కోర్కెలన్,
తలపులతీర్చు సామియన శ్రద్ధయు భక్తితొనేగి కాంచితిన్,
సలిపితి పూజలన్ ప్రబల శాంతమనస్కుడ! వెంకటేశ్వరా! 1260

ఉ॥ నాటికి నేటికిన్ నభిమనారతమున్కన దైవమొక్కడై,
చాటె! మనః ప్రబోధమున సంధిల పూజల వెంకటేశకున్,
సాటి ప్రధాన దేవతల సామ్యసమక్షము విగ్రహంబులన్,
పాటుగ సాయినిన్ నిలుపభాగ్యము నబ్బెను! వెంకటేశ్వరా! 1261

ఉ॥ యెందఱు దేవతల్కలరు హిందుమతంబున పేర్కొనంగనై,
యందఱి రూపముల్ కలసి నయ్యనఘుండు, పరాత్పరుండు, వా
డిందుగలండు లేడనగ నీశ్వరుతత్వము చాటిచెప్పగా,
యందఱు పూజలన్ సలుప నక్కజ మందెడు! వెంకటేశ్వరా! 1262

ఉ॥ సాయియనంగ నామమున చయ్యనపల్కెడు వెచ్చటుండినన్,
భాయియనన్ తురుష్కులకు బ్రహ్మయనంగను హైందవంబుకున్,
"ఓం" యనజాలు రూపమున యూహలనాతఁడె రామ, కృష్ణు, లై
యాయన సర్వమున్ వెలయు నౌనట! శ్రీపతి వెంకటేశ్వరా! 1263

ఉ॥ తానొక యోగియో? తలప దైవమొ? కా, యవతారమందుమో?
ధ్యాననిమగ్నుఁడై తనరు నాశ్రితుపాలిటి కల్పవృక్షమై,
కాన, త్రికాలవేదియయి కష్టపరంపర నాదు"కొంచుసున్,
ప్రాణప్రదాతయై వెలసె భక్తులపాలిట! వెంకటేశ్వరా! 1264

ఉ॥ "నామము నుచ్చరించి శరణాగతి వేడగ నాదు"కొందనెన్,
నామహనీయు రూపమున నాత్మకథా పఠనంబుసేయ, శ్రీ
రామమహోత్సవంబున, సరా, గురుపౌర్ణమి, గోకులాష్టమిన్,
యామహితాత్మసిద్ధి దినమందున కోరును! వెంకటేశ్వరా! 1265

ఉ॥ ఆ దయనీయుఁడేమతమొ? హైందవుఁడౌనొ? మహమ్మదీయుఁడో?
వేదపురాణ శాస్త్రముల విజ్ఞుఁడు! గీత, ఖురాను భాష్యమున్,
వాదనయందు దిట్టయగు, పండితులోటమిపాలుఁజేయ, నా
సాదు త్రికాలవేదియయె, సాయిమహాత్ముఁడు! వెంకటేశ్వరా! 1266

మ॥ కృతకృత్యుండను! జీవితావసర మింకేముండు? యోచింప, సం
తతి పూర్వీకుల భాగ్యమై దొరయ ప్రాప్తంబయ్యె! నేనింక, నున్,
సతతంబావిభుసేవకై పొగలు మత్స్వాంతంబు కావ్యంబు, నే
కృతమౌనో గద? పూర్తికై నిడుమశక్తిన్! వెంకటేశా ప్రభో! 1267

శా॥ యే నామంబు ప్రతిష్ఠితంబయెనొ? నిందే వెంకటేశుండుగా?
యేనాఁడో గృహపంపకంబులను నయ్యెన్ మాకు భాగంబుగా?
యేనాఁడో హనుమంతరావునకు యీయీ మందువాలోగి, లై
యానాఁడివ్వగ మాపరంబయె గదయ్యా! వెంకటేశా ప్రభో! 1268

శా॥ యే నామంబు నిహంబుకున్ పరముకున్ యేకైకమార్గంబయెన్?
యేనామంబిల భోగభాగ్యముల కోటీశుండుగా నెంచిరో?
యేనామా కృతపావనంబగుచు మాయింటన్ ప్రవేశించెనో?
యానామంబిపుడీ గృహంబు ప్రభువయ్యా! వెంకటేశా ప్రభో! 1269

శా॥ యేనామంబు మహీతలంబునను సర్వేశుండుగా నెంచిరో?
యేనామంబు ప్రతిధ్వనించునట యీయియ్యేడు కొండల్లోనున్?
యేనామంబు మహాపరాధములకున్ యిచ్చెన్ క్షమాశక్తినిన్?
యానామంబు తరాలదాకనగు, అధ్యాసంబునన్ నయ్యేడున్! 1270

ఉ॥ క్షీరపురిన్ గృహంబునటు జియ్యరు కమ్మగ, వెంకటేశునిన్,
క్షీరభిషేకముల్ కడిగి గీమునమందిర, మందునుంచి, శ్రీ
వారిని నిత్యపూజల నవశ్యము తృప్తిపఱచ భాగ్యమున్
భారము పుచ్చుకొంటి బెజవాడ గృహంబున! వెంకటేశ్వరా! 1271

ఉ॥ యైదువసంతముల్ గడచె న్యాయసభాంగణమందు హైదరా
బాదున వ్యాజ్యమాడి, ప్రతిభాపరిపూర్ణుఁడు పున్నయార్యుఁడే,
వాదనసల్పి తీర్పు మన పక్షమునన్ జయమందఁజేసె! యా
వేదన తీరె కొంతవఱి! భీతి తొలంగెను! వెంకటేశ్వరా! 1272

చం॥ గురుని మహర్దశాధిపతిఁగూడిన కాలము, మంచిదైన, నం
తరు దశచంద్రుఁడైనయధి దైవము రుద్రుఁడు దుర్గ యుండగన్
నిరతము నర్చనావిధుల నీమము తప్పక! జేయుచుండగన్,
జరుగదె సత్ఫలంబు కనజాలదె నీదయ! వెంకటేశ్వరా! 1273

చం॥ రవి బుధ కూడలిన్ మిధునరాశిని జన్మముకాలమందునన్,
వ్యవహిత యోగమున్ గలుగునందురు! జాతక భావమందునన్,
నవునను కాదనన్ తెలియదయ్యె, నదెప్పటి భాగ్యమౌనో? నా
యువు పరిపూర్ణమైన తఱియోగమునబ్బునో? వెంకటేశ్వరా! 1274

శా॥ భారద్వాజస జాతయౌవధువు, సుబ్రహ్మణ్య కుద్వాహమున్,
యారేపల్లె వివాహవేదికను నత్యంతాను వైభోగమున్,
పౌరోహిత్యుల దీవనల్ నిడగ వైవాహంబు శోభిల్లెనో,
గౌరీదేవి యనుగ్రహంబు కలుగంగన్! వెంకటేశా ప్రభో! 1275

ఉ॥ మామగు భాస్కరుండు తగుమాత్రము కట్నమునిచ్చి పుత్రినిన్
క్షేమము నల్లునిన్ గృహముఁజేర్చెను సారెతొ నత్తయింటికిన్,
సామము వాక్యముల్ పలికి సౌఖ్యమొసంగగ పల్కునీతులన్,
నీమముతోడనంపె కరణీకము తోడ్పడ! వెంకటేశ్వరా! 1276

ఉ॥ పుత్రి ప్రసూన కార్యములు పూర్తినయెన్ గద! నొక్కటుండె! గా
యత్రి వివాహమున్ జరిగె యాపయి నయ్యెను సుబ్రమణ్యు, దౌ
హిత్రి, యెరాజయేమిగిలె! యింకను సోదరుడుండెయండ, యే
మాత్రము డిగ్రిలేనిదయె, మంచి పరున్ గన! వెంకటేశ్వరా! 1277

ఉ॥ ఆదరణంబు మెండునయె, అల్లునికంతట అత్తయింటిలో,
సోదరుఁడున్ సుజాతను, ప్రసూతికి తోడ్కొనివెళ్లి, కాన్పుయై
సాదు సుశీల పుత్రికనె! సంతస మందుచు భారసాలలో
యాదినమందు "మానస" నియామకనామ మొనర్చిరంతటన్, 1278

శా॥ వైవాహంబు తదాదియున్, హృదయ దౌర్బల్యంబు, నాయాసమున్,
యావంతైన కదల్చగన్ నడువలేనొ. కారణంబంతటన్
యావైద్యుల్ రుధిరంబు నివ్వమన నత్యంతార్తి, బాబ్జీయు, శా
యీవంతై యసువుల్ పునర్భవమునయ్యెన్! వెంకటేశా ప్రభో! 1279

కోర్టు డిక్రీ అమలు

మ॥ అది నా కర్మమె! గుండెపోటునయె భార్యా యిందిరాదేవికిన్,
నదియున్ స్వస్థతఁగాంచ కోడలునునొ, నాగేశ్వరిన్ సుబ్బసం
బుదయించెన్ గద! నాసుపుత్రులను నేనుంచంగ బాగయ్యెగా,
పదమంచున్ సుతుశాయి తోడ్కొనె గృహంబౌ నాజగిత్యాలకున్!

శా॥ అయ్యెన్ కాలము యేడు మాసములు న్యాయాధీశు తీర్పివ్వగన్,
అయ్యెన్ డిక్రియు, నేటిదాక తుదమొదల్ యావంతు కాన్పించదే?
వియ్యంకుండు సహాయమున్ నొసగనే విజ్ఞాపనన్ పంపితిన్,
కయ్యంబౌనొకొ? కోర్టునుండెగద నింకన్! వెంకటేశా ప్రభో! 1281

ఉ॥ పంచను మేడపైనినిడ, ప్రాప్తమె! పెంకులు రాలుచుండె, యా
శించిన మేలకున్ తనివిఁజెందగ వానలు లోనగారగా,
పంచ సిమెంటు శ్లాబు నదియున్ సఫలంబు కనంగనైతి! నే
కొంచెము రానిదయ్యెగద కోర్టు ధనంబును! వెంకటేశ్వరా! 1282

మ॥ "ధనమే మూలమిదం జగత్తె"నెడు వాదంబింతకున్ సవ్యమే!
పనిచేయంగల కార్యమెద్దియును, 'రూపాయే' నగత్యంబునౌ,
కనుమూసే వ్యవధిన్ ధనంబునది నా కష్టార్జితంబైనచో,
అను భుక్తంబగు సర్వమున్ నిజమునయ్యా వెంకటేశా ప్రభో! 1283

శా॥ పూర్వీకుల్ తమ యాస్తినిన్ ననుభవోద్యుక్తంబునై పంచగా
నిర్వాహంబున వంశజుల్ పదవి సాన్నిధ్యంబునన్ కోరుచున్
పర్వెన్ విక్రయమున్ క్రయంబులకు! నా భాగంబు వాంఛించి, రా
సర్వార్థంబుగ నిమ్నజాతులకు పంచన్! వెంకటేశా ప్రభో! 1284

చం॥ అటుల ప్రభుత్వమెంత పరిహారము "మార్కెటురేటు" నివ్వకన్,
కఠినుఁడు, ధూర్తుఁడై, కడకు "కాష్టపువిల్వతొ" నెంచిపంపె, కో
రుటుకును మండలాధిపుఁడు, రొక్కము చేతికి నందకుండగన్,
చటుల వివాద హేతువయి సాగెను ద్వాదశవత్సరంబులున్, 1285

చం॥ పటుతర కార్యనిర్వహణపై పదిరెండు వసంతముల్ నయెన్,
నెటులనొ వ్యాజ్యమున్ గెలిచి నింతకు మాసము లాదశంబయెన్,
నటునిటుఁ గొట్టులాడుచును న్యాయ సభాంగణమే శరణ్యమై,
నిటు "యి.పి" వేయగన్ కడకునిల్చితి కోర్టున! వెంకటేశ్వరా! 1286

మ॥ ధనమాన్యాయ నిరూపణన్ తుదకు నేద్ధర్మంబునన్ వచ్చు! నై
నను సంతానముకివ్వ హక్కుఁగలదై న్యానాఁడె నేనెంచితిన్,
మనకాయిల్లును "పెన్షనున్" గలదు మ్మామానంబునన్ పోనగా,
యనుమానించగలేను! ముందుగతికయ్యా వెంకటేశా ప్రభో! 1287

ఉ॥ కానిచొ నొక్కరీతిగను కాలము సాగదు! నేఁడురేపటో?
యేనిముసంబునందునను నీశ్వరునాజ్ఞ, యముండు తీర్పు! సం
తానముకేమి చెప్పవలె? దాతృతఁగాదుగ ధర్మమేఁగదా!
ప్రాణము నిల్వఁబోదు, నెటు పాల్పడదించుక! వెంకటేశ్వరా! 1288

మ॥ "నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్న కలదా నూతంద్లు చింతించివన్"
నెదురై నిల్చిన ధర్మపాశమును న్నేనెట్లెన్న తప్పించ, నా
గదు! అందాకను నెందుపోవలయు? నా కర్మంబిదే తీర్పు! త
ప్పదు! యత్నంబున లోపమెందులకు నివ్వన్! వెంకటేశా ప్రభో!1289

శా॥ ఔనా? కోర్టు ధనంబు నిత్తురనుచున్ నంబారు నెక్కించిరే?
దానన్ ముప్పదివేలునై ఋణము ప్రాప్తంబయ్యె! నాకింత ల
క్ష్మీనారాయణు నిచ్చుశాపమది! దాక్షిణ్యంబు లేకుండ దే
వా నట్టేటను ముంచగన్ తగునటప్పా? వెంకటేశా ప్రభో! 1290

ఉ॥ శాంతిసుఖంబులన్ బ్రతుకు సాధనజేయగ నెంచి, నా
కింతియచాలు వచ్చునది నెప్పటికైనను వచ్చు నాశతో,
సంతతమున్ స్మరించ మనసారగఁ గోరగ నీవు నన్ను వే
దాంతియుఁ బోలెనన్ ఋణము తత్పరుఁ జేసితె! వెంకటేశ్వరా! 1291

ఉ॥ పాపము సొమ్ముకాదు! ప్రతి "పైసయు కోర్టునగెల్చినట్టిదే"
నా పరువున్ ప్రతిష్ఠయు పణంబిడిరాగల డబ్బుకైనదే?
శాపముఁ గాక యేమగును? జాలమునయ్యేడు సొమ్మునివ్వరే?
తోపదు మార్గమొండు? నిక దూరను నేఁటిని? వెంకటేశ్వరా! 1292

ఉ॥ "ఆపదనాఁడె బాధలకు అందును దేవుఁడు! సౌఖ్యమందుచో,
తోపఁడటన్న" సత్యమగు! దుఃఖము సంతసమందు వేళనున్,
నీ పదపూజ సల్పితిని నిత్యమవశ్యము నిన్నినాళ్లుగా,
నాపయి నల్గకే కమలనాథ, దయామయ! వెంకటేశ్వరా! 1293

ఉ॥ "వడ్డికి సొమ్ము తెచ్చుచు వివాహముఁ జేసుకొనంగ, నా
దుడ్డును తీర్చగన్ నసలు దోచుకుతిందువు! భక్తులందఱున్,
నడ్డమునైన పాట్లుపడి "నాపదమ్రొక్కులవాఁడ"నంగ నీ
యెడ్డితనంబు తెలెగద? యేమి మహాత్యము? వెంకటేశ్వరా! 1294

ఉ॥ "నడ్డినితన్ని నాతనిని నాకడకంపుడు వైద్యసేవకై,
దుడ్డును చేకొనంగనగు. దోసిలివేతురు హుండిలోననున్,
అడ్డములేదు నాకసలు యార్జన సల్పగ నీవిధంబు నే
వడ్డికి కాసులివ్వగల వాఁడననంగను! వెంకటేశ్వరా! 1295

శా॥ "బాలానాం కడురోదనంబలమనే" వాక్కున్ వినన్ తల్లియే
బాలున్ గిచ్చుచు స్తన్యమున్ కుడుపన్నా స్వాభావమున్, నీవయే
లీలామానుష విగ్రహుండవు భవల్లీలా మృతంబాపదల్
పాలున్ జేయుచు బ్రోతువేమనగ? చెప్పన్! వెంకటేశా ప్రభో! 1296

శా॥ ఈ నిర్వేదనమేల? కాల్గమెట్టులనౌ తీర్పిచ్చునేగదా? జూడగన్
కానైనున్నది కాకమానదుగదా? కష్టించి శోధించ న
న్నేనాఁడో లిఖియించె ధాత బ్రతుకన్ యేర్పాటుగా వెంకటే
శా! నీ నామమె పూజలే శరణు! నాశాజ్యోతివో ప్రభూ! 1297

కర్మ పరిపక్వము : దుఃఖవిదగ్ధము

ఉ॥ జింకను చర్మమున్ క్రయముఁజేసితి ముప్పది రూప్యముల్ నిడన్,
శంకయె తెల్లమచ్చలది సవ్యమొ? పూజ జపంబులౌనొ? నా
వంకను తీర్చె శాస్త్రిలు శుభంబని పేర్కొనె! మానసంబునా
శంకరుపైన భారమిడసాగె జపంబును! వెంకటేశ్వరా! 1298

చం॥ శుభదినమందు చర్మమును శుభ్రమొనర్చుచు మందిరంబునం
దభిముఖమందు పీఠమున ధౌతపు వస్త్రము పైన నుంచి, నా
విభు మనమందు నిల్పినుపవిష్టుఁడనై జపసంధ్యలాదిగా
త్రిభువన దైవమంత్ర ముపదేశములైనవి! వెంకటేశ్వరా! 1299

చం॥ పదియునొకండు "జూను" నెల ప్రాప్తమునయ్యెను జింకచర్మమున్,
పదిలమొనర్చి వాడితి శుభంబని విజ్ఞులు చెప్పనంతటన్,
అదియును శాబకంబనగ యన్వయమ్మందదు నాల్గు నడ్గులిం
పొదవగ కష్టమైచనెడు ముద్వగ్న చర్మము! వెంకటేశ్వరా! 1300

ఉ॥ ఇందిర చెల్లెలౌ జయయు యింటిలో రోగము తీవ్రమంచు నా
కందిన తంతివార్త చని, యంతటఁజూడగ వేటపాలెమున్,
సందియమంది నాపెనట చయ్యనజేర్చిరి వైద్యశాలలో
బొందిలో నాస్పృహన్ కలిగి మూత్రము మాత్రము రానిబాధతో!

ఉ॥ యుందని వైద్యులాగడువు నుంచిరి యిర్వదినాల్గు గంటలున్,
ముందనుమానమే కలిగె మూత్రపు పిండము పాడునయ్యెనన్,
కొందలమంది వారటుల గుంటురు పొందని జెప్పిపంపగా
యందెను తంతివార్త అసహాయులమేగద? వెంకటేశ్వరా! 1302

ఉ॥ యేనిముసంబు నెయ్యదియు నేవిధి వచ్చునొ చెప్పలేముగా?
కానిచొ తంతిరా జయకు కల్గిన నాపదకష్టకాలమున్
కాన, జయన్ పరామరిక కాంచి ప్రయాణము తిర్గిరాగ నా
ట్రైనులో చౌర్యమున్ జరిగె టక్కరి చేసెను! వెంకటేశ్వరా! 1303

చం॥ పదియునొకండునున్ గడచె! పట్టుమన్నంగను మాసమయ్యె, నేఁ
డది యొక కారణంబున జయప్రద వ్యాధితొనుండ చూచిపో
వుదమని రాకయున్ తిరిగిపోవగ బండిలో భార్యయందు తా
? ధొరకబుచ్చుకున్ పరుగులెత్తెను చోరుఁడు! వెంకటేశ్వరా! 1304

చం॥ వగచి ప్రయోజనంబె? భగవంతుఁడొసంగిన దానికన్నయే
మగు? సుఖదుఃఖముల్ సరిసమంబుగ నెంచుట విజ్ఞులందురే?
మగువల రక్షణౌనదియు మంగళసూత్రము దోచుకోఁబడెన్;
మగఁడొకఁడుండెనో దురభిమానుఁడు మాన్యుఁడు! వెంకటేశ్వరా!

శా॥ ప్రాయంబాయెను! వెంకటేశ ప్రభువా! వ్యాజ్యంబునన్ డబ్బునున్
వ్యాయంబౌ గతి కోరతప్పదమె? చౌర్యంబందు సూత్రంబునున్
యేయింగిత్యము దోచుకోఁబడె? ఋణంబీపాటికిన్ ముంచె, నీ
ధ్యేయంబేమిటొ? కాలరాచెదవొగా? దేవానినున్ నమ్మగన్? 1306

ఉ॥ "పాపిచిరాయు వందురట!" పాపములెన్నిటిఁజేసితోగదా?
శాపమహాత్మ్యమే రచన సాహితిమాలగ పుస్తకంబుగా
యాపితి విన్నిరోజులుగ? అచ్చునువేయక తప్పులొప్పులన్
నా పరిపాటి దిద్దగనునయ్యెను నింతకు! వెంకటేశ్వరా! 1307

చం॥ దినము యుగంబుగా దొరలె? దిక్కును తోచదు! వ్యాజ్యమాడ, కా
రణ పరిభూత సంపదలు రావయె? మానసమున్ ద్వివిధీకృతం
బున పరిహాస భాజనమె పూర్వకృతంబుగ చౌర్యదోషమై
చనదిక జీవితాశయము సంధిలఁదోచదు? వెంకటేశ్వరా! 1308

చం॥ పరువిడఁజేయ న్యాయమనివార్యము నెంచగ నీకుతోచెనా?
మరువగ సాధ్యమా? మనసు మన్ననబొందుట మానవోన్నతా?
తరుణము వేచిచూడవలె! తప్పదు! దుర్విధినెందుకిట్టులన్
పరితపియింపఁజేయు భవబంధమునందున! వెంకటేశ్వరా! 1309

ఉ॥ ముందుకు నయ్యె! వెన్కఁజనవో, నదిగొయ్యిగనయ్యె, నింతకే
మందును? యైన నీ బ్రతుకు మంటిని పాలొనరింప నిచ్ఛయే?
విందుగఁదోచెనా? ఋణమే వెంబడి, చౌర్యము, వ్యాజ్యభారమున్,
యెందులకీ అభాసుమవనీకృతి తాపము? వెంకటేశ్వరా! 1310

మ॥ పితతండ్రి మతునయ్యె నింటికిని నే పెద్దైనవాడైననిన్,
వనుజున్ బోలినవాడనై తుదకు కర్మాదుల్ కనన్, పాల్గొనన్,
నన్ను శ్రీరాములు వేఁడుఁజేసెగద? వద్దానంబునన్ తాను చే
సెను తప్పున్? యికనేమి చెప్పవలెనో శ్రీ వెంకటేశా ప్రభో! 1311

ఉ॥ తప్పులు(జేయు టెప్పుడును తప్పదు మానవనై జమందునన్,
తప్పు సమర్ధనన్ తనకుతానపరాధిగ( గన్పడున్ గదా?
తప్పులు నెన్నువారు తమతప్పు లెఱుంగరు లోకమందునన్,
తప్పును నొప్పుకున్నయది ధర్మము యుక్తము! వెంకటేశ్వరా! 1312

చం॥ వనిత తనంతతా వలచివచ్చిన ప్రేమరసైకమూర్తియా!
మనసున నొక్కరిన్ మగువమానము నింకొకనిన్ నిడంగనొ
ప్పునె? మనుధర్మశాస్త్రములు పూర్వమె న్యాయము నాతికిచ్చిరా?
మనుగడ నీతివర్తనము మానవతౌగద? వెంకటేశ్వరా! 1313

శా॥ ప్రక్కీశాస్త్రి యనెన్ ద్వితీయమునకున్ ప్రాప్తంబుగానోపునా?
వక్కాణించెను కాముకత్వమున నాపాదింప దోషంబునున్
స్రుక్కన్‌జెందు నివారణంబునగు శాస్త్రోక్తంబుగా నొప్పుడున్,
దక్కన్ నాయువు శాంతిసౌఖ్యమ నిరంతన్ వెంకటేశా ప్రభో! 1314

ఉ॥ కాముక లోలతత్వమున కాంతను గాంచిన దోసమేగదా?
యామనుజుండు నావనిత నందము సంస్తుతి(జేయ నొప్పునే?
తామనసార హొందుకన తప్పగు! కాని కవిత్వమున్ కవీ
శల్ ముఖమున్ స్తుతిన్ రచన శోభిలు, సాయిమహాత్మ్య(డంచనెన్!

మ॥ జయమున్ చేరువనయ్యె, గానగను, యాశాలబ్ధినై హొందితిన్,
క్రియయున్ కార్యము సాధ్యమై తుదకు సంకేతాను సారంబుగా
చెయిదంబుల్‌వలె, భోగ్యమై వెలయు! దూషించంగనున్ పాడియే?
వ్యయ సంభృత్య విచారణీయమయెనయ్యా వెంకటేశా ప్రభో! 1316

చం॥ జనవరినాటి నుండియు విచారణ సల్పిన కోర్టు వ్యాజ్యెమా
ధనమును కోరుచుండ పడదయ్యెను వారికి నివ్వనెంచగన్,
అనువుగ బాధ్యతారహితమైన విధానము నాచరింపగా,
చనునె ప్రభుత్వ పాలనకు జాలమొనర్పగ! వెంకటేశ్వరా! 1317

చం॥ సుతయు భవానియయ్యెను, ప్రసూతి సుఖంబుగ, యన్దపై అమ్మలున్
బుతుమతియయ్యె! బొమ్మ తన యిష్టమునన్ "దరియంబు"పర్చి బం
తి, తదితరంబు చిమ్మిరియు తెచ్చుచు పౌత్రికి అంగుళీయమున్,
సతి మనసారనిచ్చె! తన సంతత ప్రీతిల వెంకటేశ్వరా! 1318

ఉ॥ ప్రాయమునంది "రేఖ"యను పౌత్రియు పుష్పవతయ్యెనంచనన్,
యాయనురాగమున్ కనకమౌక్తిక చంపసరాలు నిచ్చితిన్,
శాయి మదీయపుత్రుఁడు విషజ్వర పీడితుఁడైన వేళనున్,
సాయమొనర్చి కాంచితిని! శాంతిలె వ్యాధియు! వెంకటేశ్వరా! 1319

ఉ॥ అందని మ్రానిపండ్లకయి అల్లులుఁజాచు విధంబునయ్యెనే?
చెందును లక్ష్మియున్, ధనము, శీఘ్రమునిమ్మని కోర్టుతీర్పునన్
యందగఁజేయవారికది యొదలఁదాల్చుట నవ్వులాటయై,
మందగొడిన్ తిరస్కరణ మాత్రమొనర్చిరి! వెంకటేశ్వరా! 1320

చం॥ ధనమును నబ్బగా నదియు ధర్మయుతంబుగ వ్రాసిపెట్టినన్,
తినదగియుండనోపుగద! తేఁగవచ్చు విధంబు ప్రాకులా
డనదియు రాకపోవు! యెపుడైనను రాకతప్పదంచు నా
మనసున నమ్మియుంటి! మతిమాలిన బుద్ధియె? వెంకటేశ్వరా! 1321

చం॥ సిరియె యనుగ్రహించనటఁ జేరుగృహంబు తనంత తానుగా,
తరుణము వచ్చినన్ వెడలు దానిని నాపగ శక్యమౌనునో?
యెరిగియు దుఃఖితుండనగుటేమి వివేకము? వ్రాసియున్నచో
జరుగును రాకతప్పదది సత్యము, తథ్యము! వెంకటేశ్వరా! 1322

చం॥ మనసున నుండబట్టకయె మాటలు ప్రేలుచు వ్రాయుచుంటినే?
మనుజులు సాటివాని కవమానముపాలవ నవ్వుచుందురే?
కనసహనంబుకున్ పరిధికద్దుకదా నెటువంటివారికిన్?
నణకువ తప్పినన్ తగులునౌను ప్రతీకము! వెంకటేశ్వరా! 1323

ఉ॥ తాతలనాటి యాస్తులను దత్తునకివ్వగ నొక్కటొక్కటిన్
నాతఁడు విక్రయించె తన యాత్మజులెవ్వరి కివ్వకుండగన్!
పైతృకమిల్లు తోటలను పంచగ వచ్చెడు చెక్కముక్కలే?
పాతరలాడనబ్బు నతిస్వల్పపు భాగము! వెంకటేశ్వరా! 1324

శా॥ దైవానుగ్రహ తత్పరున్ గృహము నాదాయంబు శూన్యంబునై,
యావిస్తీర్ణత తోటయే నరయగన్ నాధారమయ్యెన్‌గదా!
భావిన్ లక్షల కాటపట్టునగు నాపండంటి తోటుండగా
భావింపన్ విధి నందఁజేయవలె నివ్వన్! వెంకటేశా ప్రభో! 1325

శా॥ కశ్చిత్ దోషము తప్పలేయగును! శిక్షార్హంబుగానెంచ, ప్రా
యశ్చిత్తంబు సమానమౌనుగద? న్యాయంబంచు శిక్షాస్మృతిన్
పశ్చాత్తాపము మించినన్ గలదె? సంభావింప శిక్షింపగా,
దుశ్చారిత్రముకంటె మేలగునుకాదో? వెంకటేశా ప్రభో! 1326

మ॥ పునరావృత్తము సేయఁబోదగదు! మా పూర్వీకులేత్రోవనే
గిన చందంబున చక్కముక్కలుగ భాగించన్ నభావ్యంబు, కా
దని సంపూర్ణము నాస్తిపాస్తులను సంతానంబు కివ్వంగ నెం
చ నదే గైకొనె నాప్రభుత్వమిటు లెంచన్! వెంకటేశా ప్రభో! 1327

చం॥ విలువ పదింతలై పెరిగె, విక్రయమందిడ చిన్నచూపునై
తలవనిరీతిగా పఱఁగె ధర్మవిధానము రిత్తఁబోవునే?
ఫలితము సంచితంబునయి ప్రాప్తఫలంబయె! చింత యెందుకో?
కలిగెను సంతసంబు మదికష్టము తీఱెను! వెంకటేశ్వరా! 1328

### న్యాయమార్జితము, సద్వినియోగము :-

ఉ॥ తొంబదియైదురా, గడచె తొంబది నాల్గువసంతమెంతలో?
తుంబురు వీణమీటుచును దోసిలి యొగ్గుచు, దిక్కుదిక్కులన్
నంబరవీధినిన్ గనుచు, యాపద కావుమటంచువేడగా,
సంబరమంద లభ్యమయె సంపదనేటికి! వెంకటేశ్వరా! 1329

శా॥ ప్రారబ్ధంబని యెంచబోనుసుమి! సంప్రాప్తంబు కానున్నచో,
యారణ్యంబుల డాగినన్ దొఱకునౌనయ్యాచితంబౌను! కా
గా రూప్యంబులు యెన్మిదిన్నరగ లక్షల్ చెక్కునిప్పించె! ఔ
రౌరా? దాతలు లంచముందినగ, రాదా? వెంకటేశా ప్రభో! 1330

శా॥ ఔనా? తొంబదియైదు జన్యువరి దివ్యంబైన తారీఖు, ల
క్ష్మీనారాయణు షిర్డిశాయిప్రభు దర్శించంగ, సంతృప్తుఁడై
నేనర్థించగ "అర్‌డివో" కలిసి తానిప్పించె చెక్కంతటన్,
నీనామామృత చింతయే ఫలమివన్నీ వెంకటేశా ప్రభో! 1331

ఉ॥ శాయిని సంప్రదించితిని సంక్రమణంబగు సంకురాతిరిన్,
సేయగ భాగముల్ ధనము చిత్తము హర్షితుకాగ, సత్యనా
రాయణకున్ వ్రతంబయె! బిరానను కట్నము కూతువల్లుకున్
నీయగ సంతసంబయెను! యెప్పటికియ్యదొ? వెంకటేశ్వరా! 1332

మ॥ గృహ పైభాగము కట్టి పూర్తియయె! నాకెన్నొన్నొ మ్రొక్కుంబడుల్
స్పృహతో అంజనిపుత్రు విఘ్నపతి, లక్ష్మీనారసింహుండునున్
బహుధా దుర్గను పూజలన్ దనిపి ప్రాప్తంబైన సంపత్తునున్,
సహధర్మిన్ సహతీర్చుకొంటి ఫలమెంచన్! వెంకటేశా ప్రభో! 1333

షిరిడీ తృతీయ సందర్శనము: సాయి సన్నిధి చౌర్యము

మ॥ షిరిడీసాయిని సన్నిధానమున నర్చించన్ సుతున్ పత్నితో
దరిశించంగను ద్వారకావతి నమందానంద సౌందర్య మం
దిరమున్, పాదుకలన్ సమాధికని వీధిన్ చేర కన్పించదా
సరి ముప్పై మరి రెండువందలును, యెంచన్! వెంకటేశా ప్రభో!

శా॥ నా యుద్విగ్నతనేమి చెప్పను! ప్రమాణంబైన రూప్యంబులె
ట్లో యుండెన్ గద చెక్కురూపమున యాలోచించ నర్పించగన్,
నేయుండంగను భోజనంబునకు నన్నీఖర్చులన్ చాలవే?
నాయుత్సాహము నీరుగారె గదరన్నా! వెంకటేశా ప్రభో! 1335

శా॥ కన్నీళ్లాగవు! "వాయిమూడటిక" చీత్కారంబు పుత్రుండిడెన్,
యన్నీయున్నను నల్లునోటశని నన్నట్లయ్యె! జీవంబునున్
యెన్నాళ్లైనను మూఁడువేలు పయిగా యిర్వైశతంబుల్ కనన్,
యెన్నన్ సాధ్యమె? యేమిచేయగలదయ్యెన్! వెంకటేశా ప్రభో! 1336

మ॥ మొదలే చౌర్యము మూఁడువేలకయె! చెప్పుల్ పోయె, వాటంతటన్,
పదివేల్ రూప్యము చెక్కురూపమున నివ్వన్ కార్యమయ్యెన్ గదా?
అదనున్ నర్చన చేయలేకనయె! మధ్యస్తంబుగానయ్యెనే?
హృదయం బీటలు వారిపోయె నటులయ్యెన్! వెంకటేశా ప్రభో! 1337

ఉ॥ హైదరబాదునన్ సుతులకందగఁజేయ ధనంబు లెక్కలన్,
కాదనె బుజ్జి, నంతనటగాదని వచ్చితి మేము నింటికిన్,
సోదరు రాముఁగూడి తమ సొమ్మును నిమ్మని శాయిరాగనున్,
నాదినమందె చెక్కులను అందగ పంచితి! వెంకటేశ్వరా! 1338

చం॥ అడిగితి రెండుసార్లు తమకక్కఱయుండునటంచు డబ్బునున్,
తడబడకుండ కాదనుచు, తప్పుకుపోయిరి! నెందుచేతనో
అడుగులో అడ్డువేయుచును యాత్రముతోడను రాగనిచ్చితిన్,
నడవడి కుట్టుకుంకలకు నమ్రతనబ్బునె? వెంకటేశ్వరా! 1339

ఉ॥ సాయియు పుట్టపర్తి చనెజూడ్యముకోసము సంప్రదించగన్,
సేయగ పుత్రుకున్ వడుగు సిద్ధమొనర్చగ, జర్పెనంతటన్,
హాయిగ బందుగుల్ నిటకు నందఱురాగను సంతసంబయెన్
చేయగలేను ముందునిక? చెప్పనులేనుగ? వెంకటేశ్వరా! 1340

ఉ॥ సర్వము సిద్ధమై తనరె, శాంతిసుఖంబులు చేకురంగ, నే
పర్వెడనోప(జాల! నికబాధ్యతమేఱకు తల్లిపత్నినిన్
నిర్వహణంబు కాంచుచును నిత్యము పూజలు సల్పుచుండి, నే
గర్వముగన్ ప్రశాంతతొ కాలము పుచ్చగ! వెంకటేశ్వరా! 1341

ఉ॥ పుత్రి ప్రసూన బావ, మును, పోయెను దత్తత; బావమర్దికిన్
పుత్రుడు రామమోహనుడు, పొందగనొ వరుడంచు కోరె, త
త్పుత్రిని "రాజ" నివ్వగను పోయినదుంగగ సంప్రదించగన్
నాత్రుత యిష్టమున్ తెలిపిరంతట పెండ్లికి! వెంకటేశ్వరా! 1342

శా॥ తాడేపల్లియ రామమోహనుడు బాంధవ్యంబునన్ దగ్గఱై
యీడౌ రాజకు; జాతకంబులును నేనివ్వంగ నాతండ్రికిన్,
చూడన్ వచ్చిరి, సంప్రదింపులయె, ప్రశ్నోదంత ప్రామాణ్యమై,
తోడన్ మూర్తము, హాలు నిశ్చయము సంతోషింపగానయ్యెనో!

చం॥ యెనిమిదియైదువేలు తమకివ్వగ, కట్నము, రైసుమిల్లు నం
దున యతిథుల్ సహస్రము, యితోధిక లాంఛనమిచ్చి పుచ్చుకో
వను, వరుకట్నమాపయిని, వస్త్రము పాంటులు, షర్టులంచు వా
రనగను నాడుబిడ్డలకు, అర్పణ లాంఛన మాదినివ్వగన్, 1344

ఉ॥ జాతకమివ్వ పంపెనది శాస్త్రిలు బొంబయి పండితుండు నా
జ్యోతిషమున్ గ్రహంబు పరిశోధన సల్పుచు, సవ్యమంచు, మై
త్రిన్ తనరెన్ గ్రహంబులొకరీతి వధూవరు లానుకూల్యతన్
నాతడు తెల్పె పెండిలికి నానతి నిచ్చుచు! వెంకటేశ్వరా! 1345

ఉ॥ కోరెను వెంకటేశ్వరుడు గొంతిమ కోర్కెల, దోసపప్పునున్,
కారెటుహల్వ పాకములొకంతట యిర్వదిపైననుండ, గోం
గూరతొ, పిండివంటలును, "కూర్మపలావు, బ్రియానితోడ, క
ర్పూరపు దండలున్ మరియు పూవులహారము, వెంకటేశ్వరా! 1346

ఉ॥ పెండిలి వారమంచనుచు పెద్దరికంబున విఱ్ఱవీగుచున్,
పెండిలి సూటుపోటులను పెంపరలాడుచు తూలనాడగన్,
పండిత బృందమున్ నగరె? పామరుకై వడి చూడనెంచపో
పోరడన అడబిడ్డయును ఘోరున యేడ్చెను! వెంకటేశ్వరా! 1347

చం॥ అదివిని రామమోహనుఁడు అల్పపుబుద్ధితొ అక్కలేడ్పులన్
మదికలహంబుపూనె, ననుమానమురాదయె నాకు నెట్టులన్
విదితము "రాజ" చెప్పగను విస్తునుపోతిమి మన్ననందకన్,
హృదయము గాయమై యదియు యీవిధి శత్రువునైతి నీశ్వరా! 1348

ఉ॥ బాలతొడుంగునున్ వధు వివాహపువేళనుంచ పద్ధతౌ,
బాలకు "రాజ" హారమును భావ్యము, రాణియు "మార్చి దానినిన్
తాళికి సూత్రతాడుగను తప్పకనివ్వ"మనంగ "మీరలే
లీలను చేతురో తమకు లెస్సగు" నంటిని వెంకటేశ్వరా! 1349

ఉ॥ "బాలతొడుంగు నాభరణ పద్ధతి నుంచగ పెండ్లికూతుకా
వేళను కన్యాదానమున, పెండిలిపీటలనుంచపాడి, స
మ్మేళన పాతలోహమని మిట్టిపడంగగ, రూఢిచేయుమీ
హేళను తప్పుదిద్దుకొన యెంతయొ నొప్పని" మందలించితిన్, 1350

శా॥ కార్తీకంబున కృష్ణపక్ష విదియన్ కర్కాటలగ్నంబునన్,
కర్తవ్యంబుగ రామమోహనుఁడు యాకళ్యాణి రాజేశ్వరిన్
మూర్తబందున సూత్రబంధమగుటన్ పూజ్యాల్ పురోహిత్యులా
వర్తించెన్ తగువేదదీవనల నివ్వన్! వెంకటేశా ప్రభో! 1351

ఉ॥ పెండిలి మూఁడునిద్రలయి వెంటనె "రాజను" కాపురంబుకున్,
యుండగ వెంకటేశ్వరుని అక్కయు, కూతురు చెల్లెలుండగన్,
వండిగ వార్చిదిద్దగను వారలు శిక్షణ నిత్తురంచు వా
రుండగ వెంటతోడ్కొనెను, యుక్తిగ, నాతఁడు వెంకటేశ్వరా! 1352

ఉ॥ అత్తకుచాటు కోడలగు, అందుఱు పెద్దలు కాపురంబునన్,
అత్తలు తీర్చిదిద్దెదరు యాగృహమందున సంప్రదాయముల్
అత్తలు కొందఱుండెదరు అగ్నిరగిల్చెడు యిట్టికాలమున్,
అత్తల ఘాతుకంబులకు యాహుతినయ్యెడు కోడలెందఱో? 1353

ఉ॥ అత్తలులేని కోడలు గృహంబున యుత్తమురాలు నందురే?
అత్తకు కోడలే కఱవునైనచొన్నా గుణవంతు రాలగున్,
అత్తలులేని కాపురము యారడినౌనగు యెంచిచూడగన్,
అత్తకుచాటు కోడలును హద్దగు, నందుఱు వెంకటేశ్వరా! 1354

మ॥ మనసాఁజేయ వివాహముల్ పఱఁగె సమ్మానార్హ నిందార్హచిం
తన బుద్ధిన్నను దూషణార్హునిగ నాద్యంతంబు దౌహిత్యుత
జ్జనముల్ దూరగ రెండుచోట్లను శాస్త్రంబెల్ల ధర్మంబు దు
ర్వినియోగంబయె! దుఃఖభాజనము పర్వెన్! వెంకటేశా ప్రభో! 1355

ఉ॥ దోషములెన్నుటన్ పరులదూరుటయేపని జీవితాశ్రమై,
దూషణ పందియే కసవుత్తుడ్చును జిహ్వతో శుద్ధిజేయు వా
క్దూషణ సూకరంబులకు దుర్మతులొక్కటిన్నంచు సాయిబా
బాషిరిడీ నివాసియనె బాష్యము చెప్పుచు! వెంకటేశ్వరా! 1356

శా॥ మాతృస్థానము చిన్ననాటననె వమ్మైపోయెనే? దత్తుగా
మాతృన్మూర్తిని సేవఁజేయగను, సన్మానించ నెంచంగ, నా
జ్యోతే ద్యోతకమయ్యెనిప్పుడును నాశోకంబు మాన్పంగనౌ,
మాతన్ రంగమ తెచ్చితిన్ ముదుక అమ్మన్! వెంకటేశా ప్రభో! 1357

ఉ॥ పుట్టిన పొద్దుబుద్ధి నదిపుడ్కలకాల్లిన గానిపోదుగా?
పట్టినపట్టు వీడదయె, పాపమొ? పుణ్యమొ? నెంచదయ్యె? న
ప్పట్టున బాధిసేయమని ప్రార్థన సల్పిన యమ్మనిప్పుడో
తిట్టుల దూషణంబులను దీవనలిచ్చెడు! వెంకటేశ్వరా! 1358

ఉ॥ తల్లి గతిల్లచెన్నాఁడు ననుదత్తునిగా హనుమంతరావు, తా
నల్లనతెచ్చె వంశమును నంతముఁగాకను నుద్ధగోరెనన్,
"పిల్లడి తల్లిగా ముసల్ది పెండ్లము నిమ్మపతంగదాయె, నా
తల్లిగ నెప్పుడున్ దయనుతల్చు" మటంచనె! వెంకటేశ్వరా! 1359

ఉ॥ అట్టి మహాత్ము వాక్యముల నాశయసిద్ధికి తోడ్పడంగమన్,
పెట్టిన బాధలన్ మఱచి, విజ్ఞతమేలకు మాతృమూర్తి ని
ప్పట్టున పోషణాదరణ భారము నెత్తిన వైచుకుంటి, కా
నిట్టుల నేడిపింపతగునే? చెడుకాలము! వెంకటేశ్వరా! 1360

షష్టమ చరణము : శాంతిపథము :

శా॥ ఆశ్వీజంబున శుక్లపక్ష విదియన్ అక్టోబరూ రెండునన్,
విశ్వంబందు మనోహరంబునగు దేవీపూజ లారంభమౌ,
యాశ్వాపించిన జీవితార్పణము షష్ట్యబ్దవత్సరాలై కనన్,
యైశ్వర్యంబును ప్రాప్తియై యనుభవేద్యంబయ్యెనో నేటికిన్, 1361

చం॥ అరువది వత్సరంబులును ఆశ్వయుజంబు ద్వితీయ శుద్ధమున్,
పరిణయమైన దాదిగను బంధము పెంచగ షష్ఠిపూర్తి, యా
చరణము, వంశవృద్ధియయె, సంతతి నార్వురు కల్గెనంతటన్
తరుణము చేరువయ్యెనిక ధన్యము జీవిత లక్ష్యసాధనన్, 1362

శా॥ షష్ఠి పూర్తియయెన్ వివాహమయి, షష్ఠాబ్దంబులై నేఁడు, వా
సిష్టల్ మూర్తము నిశ్చయింపనది పంచేష్టి ప్రియంబయ్యె, నా
యిష్టాచార పరంబు వర్ధిలెను నాకిన్నాళ్లగా సౌఖ్యమా
ధిష్టంబైనది జీవితంబు పరమిందే శాంతి చేకూర్చగన్, 1363

మ॥ చెలియై భాసిలెనో? విధేయతయు పంచేంద్రియ మాధిష్టతై,
విలసిల్లెన్ యెదోపూర్వపుణ్యమున భావించంగ సంసారమున్,
తలపున్ కార్యము నొక్కటై తన పరార్థాయత్న లోపంబునున్,
కలుగన్నీయక రాఘవాంబమనియెన్ కష్టంబు రానీయకన్! 1364

చం॥ సుధ కలశంబుతో మనసు చూరగొనంగల భావనాకృతిన్,
మధుర మనోజ్ఞమూర్తి సుమమాలగ వ్రాలెను వక్షమందునన్,
అధరసుధా ప్రపూర్ణ హృదయాస్థలి నెంతగ నాక్రమించె! నా
కథ యికమీద వ్రాయమని గాఢముగా తను హత్తుకోవగా, 1365

ఉ॥ నాఁడటు మోహనాకృతి మనంబుననిల్చెను యౌవనాధృతిన్,
నేఁడొక వృద్ధ దంపతులు విండిన కుంభము జీవయాత్రకున్,
తోడుగ నీడగా గడపదూర మదెంతగనున్నదో కదా?
యాడిన యాటరాదికను అన్వయమందదు! ముందుముందుగా! 1366

ఉ॥ జీవనసారమున్ తెలిసి చిత్తము సంక్షుభితంబు నొందగా,
దైవముమీద భారమిడి ధర్మప్రవృత్తితో నుండనెంచగా,
యావిధి కాలచక్ర గతియంచనవేయగ జాలకుంటినే
సేవలుచేత వంచనను సేయగ వద్దిక వెంకటేశ్వరా! 1367

శా॥ వానప్రస్థము నాశ్రయించు గతిపోవన్ "నీ గృహస్థాశ్రమం
దే నుండయ్య"మటంచు పల్కులను మాతృమ్మూర్తి సేవించుచున్
ప్రాణంబుల్ కడదాక నుండగను కర్తవ్యంబు న్యాయంబుయే
దైనన్ నేగిన ధన్యమౌ పఱఁగుగాదా? వెంకటేశా ప్రభో! 1368

ఉ॥ మాతగు రంగనాయకమ మాసము చైత్రము మూర్ఛవ్యాధినిన్
నూతన వత్సరంబునను నొచ్చుచు, నా, బహు, ధాన్యమందు నెం
తో తపియించుచున్ స్పృహను తొందర తొందర కోలుపోవగా
భీతిలి వైద్యసేవనిడ వెంటనె స్వస్థత నందెనీశ్వరా! 1969

ఉ॥ ఆ విధి నాల్గుమాసములు అన్నమెఱుంగక, కాళ్లరాకయున్,
దైవమునున్ తలంచుచు విధాత, యముండును తిట్టిపోయుచున్,
శ్రావణ శుద్ధమున్ నవమి శాశ్వతనిద్రనుజెందె! చూచిపోఁ
బోవగ మన్మలన్ తెలుపబోదెను చూచిరి! వెంకటేశ్వరా! 1370

చం॥ నిదురలో నుండునట్లు తలినెట్టులోఁ జేర్చితి కాటికాపురిన్,
మదిమఱువంగఁబో వ్యధను, మాతకునున్ తలకొర్వి పెట్టగా
విదళిత దుఃఖదగ్ధ పరివీచిక తట్టుకొనంగజాల న
య్యదనునకోరె మానసము అమ్మవొడిన్ త్రుటి! వెంకటేశ్వరా! 1371

మ॥ జరిగెన్ కర్మ యధావిధిన్ పఱఁగె, కృష్ణా గౌతమీ గంగలన్
అరితిన్ అస్తి నిమజ్జనల్, గుడివిశాలాక్షమ్మ, విశ్వేశ్వరుల్,
మరి వారాహిని, అన్నపూర్ణ మహిమాత్మాదుంఠి విఘ్నేశులన్,
దరిశించంగను కాలభైరవుల తృప్తై! వెంకటేశా ప్రభో! 1372

ఉ॥ ఆమె అదృష్టమేయగును అన్నియు సవ్యమె నాచరించగా
ఆమెవి కాకిపిండములనంటెను ముద్దలు కర్మరోజులన్,
ఆమె నిదర్శనంబనుట అంతట తృప్తినిబొందె బోయనన్,
తామమతల్ నిగుడ్చినటు తాదృశమందెను వెంకటేశ్వరా! 1373

మా॥ చిరుప్రాయంబున కోలుపోయితిని వంచించంగ అమ్మేగెనో?
మఱుప్రాయంబున దత్తతల్లి కడ వమ్మైపోయె వాత్సల్యమున్,
మరువంబోని అరుంధతిన్ మనసు అమ్మాయంచు నాప్యాయతన్
శరణంబున్నిక మాతృప్రేమ కనరాదా? వెంకటేశా ప్రభో! 1374

ఉ॥ కాలమె తీర్పునివ్వ ననుకంపన దైవమె తోడునౌను! నా
వేళకదే సమస్యలను వీడనుమాట సమంజసంబగున్,
గాలిలొ దీపముంచి వెలుగన్ భవదీయ మహాత్మ్యమన్న దౌ
తైలములేకనే వెలుగునన్నది నీ ప్రభ! వెంకటేశ్వరా! 1375

శా॥ ఆశాభావము జీవితాశయము సిద్ధ్యర్థంబు లేదంతమున్,
ప్రాశస్త్యంబగు పారమార్థికమునున్ భాగ్యోపలబ్ధిన్‌కనన్,
యాశించన్ పురుషార్థ సాధనము సాయంబెల్ల కాకుండనే,
నౌ శోభించును మానవాళికెటులైనన్! వెంకటేశా ప్రభో! 1376

శా॥ ఆశాజీవియె కానిచో మనుగడే వ్యర్థంబు భావింపగన్,
గ్రాశింబొంది పురోగమంబు భవితత్కార్యార్థ భాగార్థమున్,
లేశంబైన చతుర్విధార్థములు తల్లీలన్ యశోభాసురం
బౌ శోభించ పురాకృతంబను కృతంబౌ? వెంకటేశా ప్రభో! 1377

మ॥ అదియే భాగ్యము జీవితార్థమున కత్యాశక్తి సంపాదనన్
యది యుల్లేఖ్యసమాస తద్ధితము సన్మానార్హ ప్రాప్తంబునై
యుదయార్కుండను కైవడిన్ బ్రతుకు యుద్యోతించి అస్తగతం
బుదయాస్తంబుల భాసురంజగుట నొప్పున్ వెంకటేశా ప్రభో! 1378

ఉ॥ అంతటి యున్నతాశ శిఖరాగ్రము చేరగ లక్ష్యసాధనన్,
పంతము కార్యదీక్షయు నవశ్యము. కర్మల నీతిమార్గమున్
స్వాంతము చిత్తశుద్ధియును సంస్తుతి కావ్యకవిత్వమల్లుచున్,
శాంతిసుఖంబు సంపదలు సంతసమందుటయె వెంకటేశ్వరా! 1379

ఉ॥ "ఆపదనాఁడె బాధలకు అందును దైవము, సర్వమందుచో
తోపఁడటన్న" సత్యమగు! దోయిలి యొగ్గుచు మానసంబునన్
నాపరమాత్మనే నెపుడు నమ్ముచు కీర్తన లుచ్చరించుచున్,
నీపదమందు జీవితము నిల్పఁగ నిమ్ముము! వెంకటేశ్వరా! 1380

చం॥ అయినది నింతదాకనది యయ్యెడు కాలము మారుచుండగా,
పయనము నెప్పుడో తెలియ వచ్చెడు మార్గములేదు జాతకం
బు యెపుడొ నిర్ణయించనది పూర్వమెకాకనుపోయె? నిప్పుడో
నియమితమైన వేళకది నిర్ణయమయ్యెడు! వెంకటేశ్వరా! 1381

శా॥ క్షీరంబున్ మధియింపగా దధియు, చిల్కించన్ నదేవెన్నసం
స్కారింపన్ ఘృతమై పవిత్రమగునా సర్వార్థ కార్యంబులా
ధారంబై వెలయింప మానసము బాధాత ప్తమై పుణ్యమౌ?
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీ వెంకటేశా ప్రభో! 1382

శా॥ యే రూపంబు కులాలు మృత్తికను త్రొక్కించన్ ఘటంబాది యా
కారంబుల్ మలయింప నేర్పడును! సంస్కారావృతంబట్లు నా
దారింబోవుచు జీవితంబు పరమార్థంబైన త్రోవేచనున్
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీ వెంకటేశా ప్రభో! 1383

మ॥ చరమావస్థ నెఱింగి జీవుఁడును సంసారాంబుధిన్ నీదుచున్,
పరమార్థంబగు చింతనున్ తనదు జీవాత్మానుసంధాయియై,
పరమాత్మైక్యము చేయగన్ గురువచో నాజ్ఞానుసారంబుగా
శరణంబయ్యెడు ధన్యమై పఱఁగునిచ్చున్! వెంకటేశా ప్రభో! 1384

మ॥ చరితార్థంబగు నాత్మనున్ తనకు సాక్షాత్కారమున్ జేయగన్,
గురువా జ్ఞానునువర్తియై పఱఁగు సాంగోపాంగ పారీణతన్,
పరమో ధర్మమనంగ జీవితము సవ్యంబైన మార్గంబునే
శరణంబౌ భవబంధమోచనము ఆశౌ? వెంకటేశా ప్రభో! 1385

మ॥ సృజనాత్మాపర విశ్వమందునను భాసించంగ నాత్మార్పణన్,
భజియింపన్ పరమాత్మనున్ సగుణ విశ్వాకార సాయుజ్యమున్,
విజిగీషుండయి భాజనంబునయు సంప్రీతిన్ నియోగంబగున్,
యజితున్‌జేరగ సాధనంబదియెనయ్యా వెంకటేశా ప్రభో! 1386

శా॥ "జాతస్యః మరణంధ్రువంబ"నగనున్, సన్యాసులున్ యోగులున్
ప్రీతిన్‌సిద్ధి, సమాధిఁజెందగను, కుంభించంగ ప్రాణంబులా
యాతత్వంబు కపాలకుండలిని ప్రాణాయామమున్ జేయ సం
కేతంబౌనది మృత్యువౌ పఱఁగు ముక్తే? వెంకటేశా ప్రభో! 1387

చత॥ చరమదశాంతరస్థగిత చావును తప్పకొనంగలేరు? త
న్మరణ సమానసిద్ధియు, సమాధియు, యోగకపాలమోక్షమున్,
నరయగ నొక్కటౌను? అవినశ్యము నాత్మయు జీవివీడుచున్
పరఁగుశరీర మవ్విధి నివర్తిలుచుండును! వెంకటేశ్వరా! 1388

శా॥ ప్రాధాన్యంబగు సంఘ దుర్నడతలున్ గ్రామీణ సౌభాగ్యముల్,
నాధారంబగు హైందవా పరము దేవారాధనాచారముల్,
సాధించంగనె సంప్రదాయపు కుసంస్కారాయుతా సంస్కృతిన్,
ఛేధించెన్ విపులంబు నీరచనయే శ్రీ వెంకటేశా ప్రభో! 1389

చం॥ పరమపవిత్ర భాజనుఁడు భాసుర వజ్రకిరీటు వెంకటే
శ్వరు మకుటాయమాన మనసార రచించిన జీవన్ స్రవం
తిరవ సమాప్తమౌ కృతిని తృప్తిగ తచ్చరణారవిందముల్,
శిరమభివాదనంబగుచు చేర్చితి శ్రీపతి! వెంకటేశ్వరా! 1390

శా॥ చీరాలాన్వయ, గోత్రమాహరితసై శ్రీరామ శర్మాఖ్యుఁడన్,
ప్రారంభించిన కావ్యరత్నము సమాప్తంబు జీవన్ స్రవం
తై రాజిల్ల కవిత్వలోకమున సంధానంబు ప్రాచుర్యమై,
చారిత్రాత్మకమై వెలుంగదగు నాశా! వెంకటేశా ప్రభో! 1391

చరణాద్యంతము

కం॥ శ్రీ వైకుంఠ విరక్తుఁడు,
శ్రీవత్సాంకితుఁడు, శ్రీపరిచ్యుతుఁడునునౌ,
శ్రీ వెంకటాచలపతీ,
శ్రీవాసా, శ్రీనివాస, శేషగిరీశా! 1392

కం॥ విష్ణు, ర్జిష్ణు, భరిష్ణు, స
హిష్ణున్, వర్ధిష్ణు, యుత్సహిష్ణు, గ్రసిష్ణున్
కృష్ణున్, వర్తిష్ణున్, భ్రా
జిష్ణును, నినుగొల్తునయ్య చిన్మయరూపా! 1393

—o—

శ్రీ కర్లపాలెము లక్ష్మీనారాయణప్ప, లక్ష్మీబాయి దంపతుల
యిష్టపుత్రుండు
చీరాల హనుమంతరావు రంగనాయకమ్మలకు
దత్తపుత్రుండు- హరితస గోత్రీశుఁడు చీరాల శ్రీరామశర్మ
ప్రణీతము యితి జీవనస్రవంతి-

—సర్వము సమాప్తము—

# తప్పొప్పుల పట్టిక

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 6 | 3 | భీప్సిత | భీప్సిత |
| 2 | 13 | 4 | టిపుమ | టింపుమ |
| 10 | 64 | 2 | సగు | నగు |
| 11 | 68 | 3 | కనిష్ఠు | కనిష్ఠ |
| 12 | 77 | 1 | బిడ్డగ వుత్రిగంత | బిడ్డను పుత్రియంత |
| 14 | 89 | 2 | రుండుసున్ | రుండునున్ |
| 18 | 115 | 2 | ధ్యానము | ధ్యానము |
| 19 | 123 | 4 | నెట్టం | నెట్టిరి |
| 25 | 170 | 2 | హనుమాంబ | హన్మతాంబ |
| 29 | 197 | 2 | తాసుతున్ | లౌసుతుల్ |
| 38 | 255 | 1 | మత్పు | నుత్పు |
| 39 | 263 | 4 | మయ్యెము | మయ్యెను |
| 50 | 340 | 3 | షలతో | షలతొ |
| 50 | 341 | 3 | శిన్ను | శీన్ను |
| 52 | 350 | 1 | రెల్వే | రై ల్వే |
| 53 | 360 | 4 | దుఃఖమ్ము | దుఃఖము |
| 53 | 362 | 1 | నల్లుని దత్తుని | దత్తుని నల్లుని |
| 53 | 364 | 1 | టైం టీ | టైము టీ |
| 54 | 373 | 4 | కెప్పుడు | కెప్పుడును |
| 56 | 383 | 1 | అరోజే | ఆరోజే |
| 59 | 406 | 1 | మామయె | మామయయె |
| 65 | 445 | 2 | సదను | నదను |
| 74 | 511 | 2 | సవిర | సవివర |
| 76 | 521 | 4 | కొక్కరుగ | కొక్కొరు |
| 77 | 528 | 4 | బుద్ధితో | బుద్ధితొ |
| 82 | 568 | 1 | హరిద్ర | హరిద్రపు |
| 82 | 569 | 2 | యామిని | యామని |
| 83 | 570 | 3 | మొదట | పతియు |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 83 | 574 | 1 | వత్వర | వత్సర |
| 85 | 585 | 4 | రాజ్యర | రాజ్యమ |
| 98 | 679 | 2 | ముద్రప్రసన్న వదనాం | ముద్రయు, ప్రసన్నముఖాం |
| 98 | 679 | 3 | అదిమ | ఆది |
| 100 | 695 | 3 | రూప | రూపు |
| 102 | 704 | 4 | గను | నగు |
| 108 | 747 | 3 | నాలుకను పర్చెను | నాలుకను నేలను పర్చెను |
| 112 | 773 | 4 | లెల్లరు | రెల్లరు |
| 114 | 793 | 3 | ర్తునో? | ర్తువో? |
| 116 | 804 | 3 | స్త్రోదుల్ | స్త్రాదుల్ |
| 120 | 832 | 2 | బునగ్గ | బుననుగ్గ |
| 122 | 845 | 1 | శార్ఙ్ఞ | శార్ఙ్గ |
| 122 | 845 | 4 | నంబుల్ | నంబున్ |
| 125 | 869 | 2 | సూత్ర | సూత్ర |
| 130 | 902 | 2 | గాచె | గాంచె |
| 131 | 910 | 3 | బంబెను | బంచెను |
| 134 | 931 | 3 | మయారు | మయార్కు |
| 136 | 938 | 2 | ణలచు | ణందు |
| 140 | 973 | 4 | డాదివ | దాదిన |
| 141 | 979 | 2 | సేప | సేవ |
| 142 | 985 | 1 | మచ్చటొ | ముచ్చటొ |
| 142 | 986 | 1 | నొక్క | నొక |
| 142 | 989 | 1 | ఉ॥ | చం॥ |
| 142 | 989 | 1 | వంచగ | వలుంచగ |
| 143 | 990 | 4 | ణ్యాణ | ళ్యాణ |
| 144 | 997 | 2,3 | ర్తనకయా | ర్తన, న్నా |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 145 | 1008 | 3 | య్యై | మ్మై |
| 154 | 1073 | 4 | గామవు | గ్రామముల |
| 159 | 1102 | 3 | దుద | దుగద |
| 160 | 1115 | 1 | పంచాంగకా | పంచాంగముకా |
| 165 | 1144 | 2 | హాయింపు | హింపు |
| 166 | 1154 | 1 | య్యైనసున్ | య్యైనసున్ |
| 167 | 1160 | 2 | హ స్తి | హ స్త |
| 167 | 1160 | 4 | దనో ? | దవో ? |
| 169 | 1174 | 3 | వ్యాది | వ్యాధి |
| 175 | 1215 | 1 | వచ్చిస | వచ్చిన |
| 177 | 1228 | 2 | రాలముం | రాలవుముం |
| 177 | 1232 | 1 | వీడివచ్చె | వీడిటువచ్చె |
| 177 | 1234 | 4 | పోపును | పోవును |
| 179 | 1242 | 1 | ముంద మన్న | ముంది యన్న |
| 181 | 1256 | 4 | న్నాహు | న్నాహూ |
| 181 | 1262 | 1 | దేభతల్ | దేవతల్ |
| 186 | 1291 | 1 | నెంచి నా | నెంచనా(డనా |
| 186 | 1294 | 1 | వంగ నా | వంగనయ్యెనా |
| 186 | 1297 | 4 | మెట్లులనో | మెటు |
| 188 | 1308 | 2 | మున్ ద్వివిథీ | మెందుకీ |
| 188 | 1309 | 2 | మనను | మనను |
| 189 | 1314 | 3 | నొప్పుడున్ | నొప్పెడున్ |
| 191 | 1327 | 3 | పొస్తుల | పొస్తుల |
| 194 | 1348 | 2 | పూవె | పూనె |
| 197 | 1372 | 2 | అస్తి | అద్ధి |

# కృతికర్త



చీరాల శ్రీరామశర్మ M.A.,

| | | |
|---|---|---|
| జననం | : | 14-6-1919 – కర్లపాలెము. |
| జననీజనకులు | : | కర్లపాలెము లక్ష్మీబాయమ్మ, లక్ష్మీనారాయణప్ప. |
| దత్తత | : | 1929 అక్టోబరు. |
| దత్తత తల్లిదండ్రులు | : | చీరాల రంగనాయకమ్మ, హనుమంతరావు. |
| విద్య | : | M. A.. |
| వివాహము | : | ధర్మపత్ని ఇందిరాదేవి, 2-10-37. |
| వృత్తి | : | Chief Controller S. C. Rly. Vijayawada. |
| వృత్తి విరమణ | : | 30 - 11 - 76. |
| అభిరుచి | : | ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యము....<br>AIR - విజయవాడలో Safety గురించి<br>Railway Magazine లో<br>ఆంగ్లములో పద్యాలు ప్రచురణ. |